# విషయసూచిక

# చిత్రములు



గొల్లపిల్ల (ఉత్తరహిందూస్థానము)

చిత్రకారిణి: శ్రీ దామెర సత్యవాణిగారు, రాజమండ్రి.

# భారతి చందాదారుల కొఱకు ముఖ్యమైన విజ్ఞప్తి

ఈ దిగువ నమోదు పఱచిన సంఖ్యలుగల చందాదారుల చందాలు ఈ శుక్ల మార్గశిర సంచికతో ముగియుచున్నవి. ఆయా సంఖ్యల చందాదారులు దయచేసి తిరుగ తమ తమ చందా సొమ్మును మణియార్డరు ద్వారా పంపుట గాని, వి. పి. పంప ననుజ్ఞ ఇచ్చుట గాని కావింప ప్రార్థించుచున్నాము. అట్లు జనవరి ౧౫-వ తేదీ లోగా మాకు మణియార్డరు గాని, వి. పి. అనుమతి గాని రాకున్నచో రాబోవు సంచిక వి. పి. ద్వారా పంపగలము. చందాదారులు ఆ వి. పి. ని త్రిప్పివేయక దయతో స్వీకరింప ప్రార్థితులు.

చిరునామా మార్పులు 1-వ తేదిలోపల తెలుపఁ ప్రార్థితులు.

1001, 1007, 1008, 1010, 1011, 1013, 1016, 1017, 1022, 1025, 1027, 1034,
1036, 1038, 1039, 1040, 1042, 1043, 1046, 1048, 1050, 1054, 1056, 1059,
1062, 1066, 1067, 1073, 1076, 1079, 1083, 1084, 1093, 1099, 1106, 1111,
1113, 1117 1119, 1136, 1142, 1168, 1170, 1173, 1177, 1180, 1183, 1192,
1198, 1199, 1202, 1210, 1211, 1213, 1215, 1218, 1223, 1237, 1244, 1254,
1260, 1265, 1270, 1279, 1282, 1287, 1292, 1297, 1302, 1314, 1330, 1336,
1339, 1341, 1353, 1369, 1372, 1377, 1378, 1381, 1382, 1383, 1384, 1391,
1397, 1403, 1411, 1420, 1469, 1471, 1473, 1475, 1549, 1551, 1553, 1566,
1592, 1608, 1609, 1610, 1617, 1625, 1627, 1629, 1650, 1652, 1658, 1660,
1675, 1676, 1677, 1683, 1695, 1716, 1720, 1769, 1819, 1832, 1840, 1856,
1883, 1924, 1927, 1940, 2015, 2067, 2071, 2095, 2171, 2190, 2191, 2193,
2202, 2203, 2210, 2218, 2222, 2233, 2236, 2249, 2257, 2263, 2283, 2295,
2301, 2303, 2305, 2307, 2308, 2309, 2325, 2326, 2334, 2366, 2369, 2370,
2403, 2417, 2448, 2491, 2521, 2531, 2534, 2537, 2543, 2550, 2567, 2577,
2583, 2585, 2604, 2676, 2747, 2751, 2825, 2866, 2878, 2887, 2897, 2908,
2917, 2925, 2929, 2932, 2935, 2938, 2946, 2948, 2951, 2954, 2958, 2965,
2968, 2969, 2971, 2973, 2978, 2980, 2981, 2983, 2991, 2994, 3002, 3006,
3007, 3014, 3038, 3040, 3043, 3047, 3048, 3049, 3057, 3058, 3069, 3070,
3072, 3073, 3080, 3084, 3086, 3087, 3098, 3103, 3104, 3108, 3113, 3119,
3126, 3147, 3155, 3173, 3174, 3176, 3177, 3178, 3179, 3182, 3190, 3196,
3201, 3203, 3208, 3209, 3211, 3213, 3216, 3220, 3234, 3243, 3255, 3256,
3277, 3283, 3284, 3294, 3296, 3360, 3430, 3512, 3524, 3648, 3657, 3661,

3671, 3673, 3674, 3688, 3689, 3692, 3693, 3697, 3702, 3703, 3707, 3720, 3732, 3734, 3739, 3747, 3748, 3751, 3755, 3758, 3759, 3764, 3768, 3772, 3773, 3774, 3782, 3783, 3787, 3790, 3792, 3795, 3798, 3799, 3807, 3813, 3815, 3818, 3823, 3826, 3829, 3835, 3839, 3840, 3845, 3852, 3855, 3859, 3862, 3863, 3865, 3875, 3877, 3879, 3880, 3882, 3888, 3890, 3891, 3892, 3895, 3897, 3899, 3902, 3904, 3909, 3922, 3929, 3934, 3940, 3983, 3986, 4001, 4038, 4056, 4067, 4077, 4113, 4120, 4138, 4155, 4173, 4182, 4184, 4192, 4290, 4291, 4312, 4331, 4416, 4440, 4453, 4468, 4469, 4471, 4473, 4482, 4485, 4494, 4499, 4503, 4504, 4508, 4512, 4518, 4526, 4527, 4529, 4537, 4538, 4539, 4543, 4554, 4558, 4559, 4568, 4570, 4575, 4579, 4583, 4589, 4591, 4597, 4603, 4610, 4612, 4613, 4628, 4630, 4635, 4648, 4649, 4654, 4661, 4668, 4669, 4670, 4671, 4681, 4700, 4720, 4723, 4742, 4746, 4751, 4763, 4794, 4795, 4825, 4829, 4837, 4864, 4869, 4873, 4887, 4888, 4900, 4932, 4936, 4958, 4967, 4970, 4987, 4992, 4995, 5043, 5064, 5181, 5196, 5199, 5207, 5219, 5220, 5229, 5233, 5234, 5235, 5239, 5241, 5251, 5253, 5255, 5256, 5262, 5263, 5264, 5266, 5267, 5268, 5271, 5272, 5276, 5277, 5278, 5280, 5281, 5283, 5285, 5287, 5288, 5289, 5290, 5291, 5293, 5295, 5296, 5297, 5298, 5299, 5300, 5301, 5302, 5303, 5305, 5306, 5307, 5308, 5309, 5311, 5310, 5315, 5316, 5318, 5319, 5322, 5323, 5325, 5327, 5329, 5331, 5332, 5333, 5335, 5337, 5339, 5341, 5345, 5347, 5350, 5351, 5352, 5355, 5357, 5359, 5360, 5363, 5364, 5366, 5367, 5369, 5373, 5377, 5379, 5380, 5381, 5382, 5383, 5385, 5395, 5397, 5398, 5400, 5403, 5405, 5407, 5408, 5411, 5412, 5413, 5415, 5416, 5418, 5419, 5420, 5421, 5422, 5423, 5424, 5425, 5426, 5429, 5430, 5432, 5434, 5437, 5438, 5441, 5444, 5445, 5446, 5448, 5449, 5453, 5459, 5462, 5470, 5479, 5481, 5484, 5487, 5497, 5531, 5632, 5663, 5667, 5678, 5679, 5680, 5681, 5682, 5683, 5688, 5689, 5694, 5695, 5696, 5697, 5700, 5701, 5702, 5705, 5706, 5707, 5708, 5709, 5712, 5714, 5717, 5723, 5732, 5735, 5736, 5753, 5755, 5762, 5770, 5772, 5786, 5792, 5819.

మేనేజరు 'భారతి'




చెన్నపట్టణము, డిసెంబరు ౧౯౨౯

సంపుటము ౬ శుక్ల సంవత్సరము మార్గశిరమాసము సంఖ్య ౧౨


# అట్లతదియ


కాళూరి వెంకటనరసింగరావు గారు (కవితాసమితి)


పరువిడి పొమ్ము సంజ! పొలపంబుగ పశ్చిమవార్ధి వీచికా
శిరముల పాటల ప్రభల జిందుచు ఛిందులుద్రొక్కె; నావ్యాదీ
శ్వరి చరణప్రవాళ విలసన్నవ రేఖల బూయులొత్తె నీ
యరుణిమ కాల దన్ను, క్షణ మాగిన తజ్జలదాంచలమ్ములన్.

ఇది నాప్రేయసి నోమునోచుకొను వేళీ పూర్వదిక్కామినీ
మృదుగండస్థల పాండుదీధితి సమున్మేషోజ్జ్వలంబౌ నిశా
వదనం బెంతయు పావనంబు; భరియింపంజాల నావేగముల్,
పదిలం బో హృదయంబ! భ్రాంతుల జలింపంబోక ధ్యానింపుమా.

ఇంకను శోభ లీను చుదయింప వదేమి శశాంక! దీటు నా
పంకజగంధి భక్తి విరబారెడు చూపుల మెల్లమెల్ల నీ
వంకకు చల్లగా బరుప, వత్సలతన్ మెయినిండ నూత్నపు
ల్కాంకుర మాలికల్ నిగుడగా వరుదేర, వదేమి జాడ్యమో!

తొలుతటి మూడునిద్దురల తోరపు తీయము లేరికొంచు తో
య్యాలియును నేను, ఒక్కనెలనైన గతింపగలేదు నేటికిన్;
వలపుకవుంగిటన్ గరుగ వచ్చి తలిర్చిన యీనికుంజ మా
కుల చిరునాల్కలన్ బిలుచు కోమలిపై దయ నిన్ సుధాకరా!

కలుముల నీను నిండు తెలిగన్నులు కాయలు కాచనేమొ, నె
చ్చెలి సుకుమారి వేచిన శశీ! వలవంతల నేచివేచు నీ
తొలి విరహంపుకేసెగలతో నినుజూచుట కెట్టు లోర్చునో,
తలపవు చిత్తమందు గల తత్తర, మేచెద విల్లె క్రొత్తడిన్.

నాననబోడి చారువదనంపు సిరిన్ తలయెత్తి చూడ లే,
కానిబిడాంబుదాంతరమునం దటు తారెదు, నిర్గమించి శా
లీనత నామె పాదయుగళిన్ గిరణాళి స్పృశించి గౌరిక
స్నాన మొనర్పు, పద్యచరణమ్ముల నొత్తెద మేని రక్తిమన్.

అనునయ శీల, బాల, కరుణార్ద్రిమనమ్మున నీ కరావళిన్
చనవున బుజ్జగించి, సరసమ్మగు పాయసభోజనమ్ము క
మ్మని నునువ్రేళులన్ గుడిపి, మాధురులన్ మరపించు జుమ్మ, నీ
యనుపమ దుగ్ధవార్ధి జనితామృత సారరుచి ప్రపూరముల్.

అభ్యంగనము నేసి యారనైచిన సొగకురుల క్రొన్నిగనిగల్ గునిసియాడ,
భావనమోహనమైన ముద్దుమొగమ్మున తిలకదీప్తులు కలకలల నీన,
పస లీను దేశీయవసనంపు మాటున నంగసౌష్ఠవము సయ్యాటలాడ,
భావాలతావుల పరిమళించు విశాలలోచనమ్ముల రాగపీచు లూగ,

విరహా మింత భక్త్యావేశభర మొకింత అంద మొడలంత నొలుకగ నల్లనల్ల
నీదురాక నిరీక్షించు నెలతమూర్తి నరసి చల్లగ ధన్యుడ వైతి చంద్ర!

అందపు చందమామ! వినుమా మనలో మనమాట, నీవు నీ
కందున నన్ను దాచుకొన గల్గెదవేని, సుధాప్రహాదాన, నా
యందు కటాక్షముంచి, తనివారగ మోహనమైన నేటి నా
సుందరి రూప మానుచును చొక్కి రసమ్మయి రాలిపోవుదుఁ.

ఎలగోరింట దళమ్మునై వనములో నే బుట్టియున్నఁ, వధూ
విల సత్పాదపవిత్ర దేశముల నువ్విళ్లూరు గోరింట చు
క్కలలో నొక్కతెనై, చలించు నఖయుం గాలంటు ముంగొంగుగా
లుల పీచోపుల తూగుటుయ్యెలల బొల్తుఁ గాదె భోగమ్ములన్ ?

నీ వింకఁ మహారాజ వయ్యెదవు, తన్వీహస్త సేవాంజలీ
పావిత్ర్యోజ్జ్వల పట్టభద్రపదవీ ప్రాప్తుండవై ; ప్రాజ్యతే
జోవిఖ్యాతి నెలర్చు నీ శుభయశోజ్యోత్స్నాపగఁ దేలి, ప్రే
మావేశంబున వ్రాసికొందు శరదాశాభిత్తులఁ గీతముల్.

నవధాన్యంబుల ముద్దుదోసిళుల నిండఁ బట్టి, పాలిండ్ల గా
రవ మూపఁ, మహాలక్ష్మీపీఠమున ధారఁ బోసి మున్మారు, "తఁ
ధవు వారల్, తనవారు, నాథుడును నిత్యం బేలుగా" కంచు మ
క్కువ వాంఛించెడు భారతీయసతి తోఁగుఁ ప్రేమవారాశిలోఁ.

---

# నక్షత్రమాల

మయిలవరపు వీరరాఘవయ్య గారు, బి. ఏ., బి. ఇడి.

'నక్షత్రమాల' శ్రీయుత దువ్వూరి రామిరెడ్డిగారిచే రచింపబడినకొన్ని ఖండకావ్యముల (Minor Poems) కూర్పు. ఇందలి ప్రతి కావ్యమును నక్షత్రమువలె సొగసైన కాంతిని వెదజల్లుచుండుటచే రెడ్డిగారీకూర్పునకు "నక్షత్రమాల"యని పేర్వెట్టిరి కాబోలు! ఇందు ప్రణయగీతలు, ప్రబోధములు, ఏలపాటలు మున్నగు పలువిధములైన కావ్యములు చేర్పబడియున్నవి. పెక్కు ఖండకావ్యములు కవియొక్క భావోద్రేకమును, ప్రకృతి సౌందర్యవర్ణనశక్తిని వెల్లడించుచున్నవి వీనిలో కొన్నిటింగూర్చి నాకుం దోచిన యభిప్రాయముల వెలివుచ్చుచున్నాను.

'కవిమనోరథము'—

ఇందు కవి, ఈశ్వరుడు తన్ను ప్రకృతిజనితములగు మేఘముగనో, కమలముగనో, మలయమారుతకాల్వగనో, మంచుబిందువుగనో, నక్షత్రంబుగనో సృజింపనందులకు విచారపడుచు, అట్లు విచారపడుటచే వాటివలె నుండుట కిష్టపడుచున్నాడు. ('కృష్ణపక్షము' ఆదియందే తద్గ్రంథకర్త "ఆకులో ఆకై", "జలజలని పాఱు సెలపాటలో దేటినై" అడవియందే దాగిపోవుటకు ఇచ్ఛచూపి యున్నాడు.)

సాధారణముగ కవులు కొందఱు తమ్మేలదైవము 'శ్రీమన్నారాయణపాదపద్మయుగళీదాసుల'గా సృష్టింపలేదో యనియు, మఱికొందఱు తమ్మేల సమస్తభోగపరాయణులగా సృజింపలేదోయనియు విచారపడుచుండ, శ్రీ రెడ్డిగారు సర్వసామాన్య వస్తువులుగా మారుటకు ఇష్టము చూపుచున్నారు. ఇయ్యది అధునిక ఆంధ్రవాఙ్మయచిహ్నము. ఇట్టి కోరికలకు కారణములుగూడ విశదములే. ఈ సామాన్యవస్తువులయందు తన అసమానవర్ణనశక్తిచే నొక విధమగు అద్భుతసౌందర్యమునుకవిచూపియున్నాడు. కొద్దిపాటి గాలికికూడ విహారము సల్పుటకు వీలగునట్లుగా జలధరమును అర్భకునిజేసి, సాంధ్యకిమ్మీరవర్ణవస్త్రము లొసంగి మనోరంజకమగు గిరితటప్రాంతములవదలిపెట్టినాడు. ఇట్లే తుహినాంబుకళికను 'తరుణసూర్యాంశుమాలికాతరళకాంతి మిళిత'మొనర్చి యున్నాడు. మలయమారుతకాల్వయందు ప్రకృతిభావముల వెలిపుచ్చు గానమును జూపియున్నాడు. కమలమందు నూతన వికాసమును మొలకనవ్వు నిమిడ్చియున్నాడు. ఈ ప్రకృతి సౌందర్యము కవిని ఆకర్షించి తన్మయత్వము నొందించుచున్నది.

ఆంగ్లకవిపుంగవులలో శ్రేష్ఠులగు వర్డ్సువర్తు (Words worth), షెల్లీ (Shelley), కీట్సు (Keats) మున్నగువారి రచనల చదివినచో శ్రీ రెడ్డిగారి భావములు నూతనములు గావని

ప్రప్రథమమున కొందఱికి తోచును. ఏలన, వీరును తమఖండకావ్యములయం దచ్చటచ్చట సర్వసామాన్య వస్తువులగా మారుట కుతూహలము వెలిపుచ్చి యున్నారు. కీట్సు 'To Fawny Broawn' అను ఖండకావ్యమున నక్షత్రముయొక్క నిశ్చలత్వమునకు మెచ్చి,

"Bright star,—Would I were steadfast as thou art," అని అన్నాడు. శ్రీ రెడ్డిగారికి నక్షత్రముయొక్క నిశ్చలత్వముకన్న 'యామినీవ్యోమమండల ప్రాంగణమున కాంతి వెదచల్లు' స్వభావము నచ్చినది. ఇట్లే కీట్సు 'Happy Insensibility' అను ఖండకావ్యమున మలయమారుతకాల్వను 'Happy Brook' అని సంబోధించి, తాగూడ అట్లుంట కిచ్ఛగించి యున్నాడు. శ్రీ రెడ్డిగారి నాకర్షించినది మలయమారుతకాల్వయొక్క 'ప్రకృతిహృద్గతభావంబు బయలుపఱచుగానము'గాని, కీట్సువలె దానికి కష్టములు మఱచిపోవు శక్తియుండుట గాదు. కోరికలు ఒకటైనను, కోరికల కారణములు వేఱ్వేఱై యుండుటచే శ్రీ రెడ్డిగారాంగ్లకవుల ననుసరించువాడు కాడని తేలుచున్నది. ఆంగ్ల కవుల రచనల చదివియే యుండవచ్చును కాని యిచ్చోట మార్గము, రచన నవీనము.

'సంధ్య'—

సంధ్యాకాలమును వర్ణించునప్పుడుకౌరవ యుద్ధమున

"కూలిన సైనిక భగ్నకాయముల్
పేరిన యుద్ధరంగములలీలఁ జెలంగును పశ్చిమాశయుఁ"

అని ఉపమానముగా జెప్పబడియున్నది. కౌరవయుద్ధభూమిని వర్ణించునపుడుసాయంకాలపు పశ్చిమాశవలె నున్నదనిన సమంజసముగ నుండునుగాని అది యిచ్చో విపరీతమైనందున (తల్లక్రిందులు) యుక్తియుక్తముగ లేదు. దీనినే శామ్యూల్ జాన్సన్ (Samuel Johnson) "A figure or metaphor drawn from Nature ennobles Art; a figure or metaphor from Art degrades Nature" అని అనినది. కళయందలి ఉపమేయమునకు ప్రకృతినుండి గైకొనిన ఉపమానము వన్నె వెచ్చును గాని ప్రకృతియందలి ఉపమేయమున కుపమానము కళనుండి కైకొన్నచో ప్రకృతిశోభకు వన్నె తఱుగును.

'కుసుమాశ్రువులు'—

తల్లి తనకుమార్తెయగు కమలను నిదుర నుండి లేపి, తండ్రిగారిపూజ కొఱకు పూలు కోసికొనరాఁబంపుటయు, కమల అచ్చోటి కరిగి ప్రకృతి సౌందర్యమునకు పారవశ్యము నొంది తన భావములు వెలిపుచ్చుటయు ఇందలి సారాంశము. కడపటిపద్యమున, 'దైవపూజకు అర్పింపవలసినది ఆత్మకుసుమము గాని ప్రకృతి రామణీయకములగు పుష్పములు గావుగదా' యని బహుఇంపుగ నీతి యిముడ్చబడినది.

'కవితాప్రణయిని'—

అను ఖండకావ్యము కవియొక్క కల్పనాశక్తికిని, ఊహకును మంచి ఉదాహరణము. కవి కవితాలతాంగిపై తనకున్న గాఢానురాగమును

వెలిపుచ్చుచు వ్రాసిన పద్యములు మిక్కిలి ఇంపుగా నున్నవి. ముఖ్యముగా

"సందెమబ్బుల చిఱువేరు చాయ తీసి
పండువెన్నెలపసరున బదనుచేసి
తరుణి, నీపట్టుముసుగు నద్దకము వైవ
విఫలయత్నంబులంజల్పి వెఱ్ఱినైతి.

పారిజాతపుష్పంబులు పవనహతిని
మృదుల తృణముల రాలెడు నెడల, నీదు
చరణ విన్యాసకోమలశబ్దమనుచు
నడుగుగుర్తుల బలుమాఱు నరయుచుందు.

సాలెగూళుల ముత్తెంపు సరము లటుల
లేతగాలికి నల్ల జలించుమంచు
నీటిబొట్లమాలను గట్టి నీదుమెడను
వైవ తలపోసి మొగతాళిపడితి చెలియ."

అనునవి ఉత్కృష్టము లైనవి.

కడపట తన యోగ్యతలు (qualifications

"గ్రామవాసిని, యెఱుగను గైతవంబు
ప్రకృతి తల్లి స్తన్యంబున ప్రబలినాడ
బాలముల విహరించుచు ప్రొద్దుపుచ్చుచుందు,"

అని కవితాలతాంగికి చెప్పినాడు. ఇట్టికవితను విన్నపిదప ఆమె 'బాహువులెత్తి ప్రేయసుందన కవుగింట నొత్తె'నన ఆశ్చర్య మేమున్నది.

'ఎంతమోసము'—

ఇది శ్రీకృష్ణభగవానునింగూర్చి యువతి బాటసారి చేసిన సంభాషణ

ఉపోద్ఘాతమున కవి చెప్పినట్లు

"చెట్లనీడలు విరివియై చేరె తూర్పు;
సంజకెంజాయ పడమట జక్క నలమె;
బైరుకోతల కేగిన పల్లెపడుచు
లింటి కరుగుచు పాడువా రేలపాట.

......................

గాలి తాకున వెన్నులు కదలునపుడు
తిరుగబాఱిన వరిచేలు........."

ఈ దృశ్యము చిత్రకారుని ఒకవిధముగను (తనవర్ణసమ్మేళన సౌందర్యము చేతను), కాపు వానిని మఱొకవిధముగను (చేనియొక్క పూర్ణ ఫలితము చేతను) ఆకర్షించును. ఏలన, వారి హృదయసంస్కారములు (apperceptive masses) వేఱుగా నున్నవి. అదే దృశ్యమునందు మన రెడ్డిగారిని ఆకర్షించినది ఆ తిరుగబారిన వరి చేలు తీయురాగము. సెలయేటిగానము నానందించు కవిశిఖామణికి వరిచేలు తీయురాగము హృదయరంజకముగాక మఱి యేమగును?

'ద్రౌపదీసందేశము'—

రాయబారమునకు వచ్చిన సంజయునకు ద్రౌపది తన అసమ్మతిం దెలుపు పద్య రత్నములు. ఇందు స్త్రీలు సాధారణముగ వాడు సామెతలు ఇంపుగా చేర్పబడియున్నవి. అందు కొన్ని:

1. "వగచినట్లుండవలయును వానియాలి
త్రాడు తెగవలెనన్న విధాన;
2. "నిరత మొక్కరీతి జనునా మనకాలము;
3. "పిల్లిశాపంబులకు నుట్లు ప్రిదిలిపడునె,"

ఆద్యంతము ద్రౌపది లక్షణములు స్పష్టముగా కనుపించు చున్నవి. మహా పతివ్రత యగు నారీమణియొక్క మృదుమధుర భాషతో

"సంజయా! యింక చాలు నీశాంతిమార్గ
మడవిపడ రాని యిడుముల బడితిమయ్య"

అని మొదలిడి, కొంతతడవునకు తనపరాభవము స్ఫురణకు రాగ వీరవనిత వలె,

"పరిభవానలకీలలు పాండుసుతుల,
హృదయముల రగులింపవే రేపు మాపు"

అనిచెప్పుచు,

"దుర్దాంత ప్రక్రియ వైరి వీరమథన
ప్రారంభ కౌతూహల
స్వాంతుల్ శాంతులుగారు కాలమెపుడో
వచ్చుంగదా యంచు న
త్యంతాసక్తి బ్రతీక్ష చేసెదరు
శౌర్యాలంబులౌ మత్పతుల్."

అని భర్తల కుద్రేకము గల్గించుచు నొక్కొక్కరశక్తి సామర్థ్యములు సంజయునకు వర్ణించుచు:

"ఉత్తమాటల నేమి ప్రయోజనంబు
అవని యొసగుటో, లేకున్న నని సలుపుటో
చెప్పి పంపుడు"

అని సంజయునకు తెల్పి పంపినది.

'కొండవీడు'లోని కథ రాబర్టుసదే (Robert Southey) గారి 'After Blenheim' పోలికగా కన్పట్టు చున్నది.

శ్రీ రెడ్డిగారి ప్రతిభ వీరియాఖండకావ్యములకంటె ఎక్కుడుగ ఈ వీనియొక్క ఉపోద్ఘాతమున కనబడుచున్నది.

శ్రీ రెడ్డిగారు ఇట్టి కావ్యము లనేకములు వ్రాసి, భాషాసేవ జేసి, ఘనత కెక్కుదురు గాక యని నా కోర్కె!

---

## ధర్మ సందేహము

కాళ్లకూరి గోపాలరావు గారు

పురుగులను జంపి తీసిన పోగు నేసి-పట్టుమడి యని ప్రీతిగాఁ గట్టుకొంద్రు;
శౌచమున కలంకృతి కహింసను త్యజింత్రు;-స్వార్థపరతయె ధర్మరహస్య మరయ?
పూజ్యమని గోవు నేప్రొద్దుఁ బొగడుచుంద్రు-దానిని బలాత్కరించి బంధమున నుంచి
దూడ నోరు గొట్టి గ్రహింత్రు దుగ్ధమెల్ల;-ఆత్మలాభంబె దాని పూజ్యతకుఁ గతము?
శత్రుసంహార శీల ప్రశస్తి గన్న-హరిహరాదుల నర్చింతు రంతె కాని,
సాధుమూర్తిని బ్రహ్మను సరకుగొనరు-దైవభక్తికారణము తద్భయమె తలఁప?

---

# రాఘవపాండవీయము

ఆదిభట్ల తరిణయ్య సిద్ధాంతి గారు

శ్లో. "పురాణ రామాయణ భారతాది తీరాణి సంయోజిత భక్తివత్యైః,
పురాతనై ర్యా దుదుహే కవీంద్రైః సా భారతీ కామదుఘామమాస్తు." —కవిరాజ.

శ్లేషకావ్యమగు రాఘవపాండవీయమును సంస్కృతమున కవిరాజువిరచించెను. ఈతఁ డేకాలము వాఁడో తెలియరాదు. కాని

శ్లో. "సుబంధు ర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః"

అని చెప్పికొనియుండుటచే భట్టబాణుని తరువాతివాఁడై యుండవలెను. ఈతఁడు కాదంబ కులతిలకుఁ డగు కామదేవుని ఆస్థానపండితుఁడు. ఈకామదేవుఁడు జయంతీ పురవర ప్రభు వని తెలియుచున్నది.

శ్లో. "జేతా భూమే ర్జయంతీపుర పురమథన
శ్రీపదాంభోజభృంగః"

అని (౧-౭౫) ఉన్నది ఈపురము గౌడదేశమున నుండును. ఈతఁడు ముంజభోజరాజుల తరువాత నుండినట్లు ఈక్రింది శ్లోకములవలన తెలియుచున్నది.

శ్లో. "శ్రీవిద్యాశోభినో యస్య
శ్రీముంజా దియతీ భిదా,
ధారాపతి రసా వాసీ
దయం తాపత్ ధరాపతిః."

(౧-౧౮.)

సరస్వతీకంఠాభరణమున భోజరాజు శ్లేషను ఆఱువిధముల చేర్పఱిచినట్లు ఈతఁడును

శ్లో. "ప్రాయః ప్రకరణైక్యేన
విశేషణ విశేష్యయోః,
పరివృత్యా క్వచి త్తద్వ
దుపమానోప మేయయోః,
క్వచి త్పదైశ్చ నానార్థైః
క్వచి ద్వక్రోక్తిభంగిభిః."

అని ప్రసంగించెను. కావున నీకవిచంద్రుఁడు ౧౩-వ శతాబ్దమున జీవించియుండును.

రాఘవపాండవీయము ౧౩ సర్గలకావ్యము. ప్రతిసర్గాంతము కామదేవాంకితము. ఇట్లే భారవిలో లక్ష్మీశబ్దమును, మాఘములో శ్రీశబ్దమును అంకితములై యున్నవి. ఈతనికవిత్వము మృదుమధురమై, సులభార్థసమన్వితమై యొప్పియున్నది. మచ్చునకైనను క్లిష్టపదము లేదు. కదళీపాకము, వైదర్భీరీతి, సులలితమగు శయ్య ఇందుఁ గాననగును.

హిందువులకు భారతరామాయణములు మిక్కిలి సుప్రశస్తము లగు ధర్మగ్రంథములు. అందు రామాయణము ననుకరించి భారతము విరచింపఁబడియెను. రెండును కథావిధానమునందును, పాత్రౌచిత్యమునందును, గుణసమన్వయమందు నైక్యము గలవి: దశరథుఁడు పాండురాజు; శ్రీరాముఁడు యుధిష్ఠిరుఁడు; సౌమిత్రి అర్జునుఁడు; భరతశత్రుఘ్నులు నకులసహదేవులు; కుంభకర్ణుఁడు భీముఁడు; రావణుఁడు దుర్యోధనుఁడు; ధనుర్భంగము మత్స్యయంత్రచ్ఛేదనము; వరము జూదము. వనవాసము, యుద్ధము, అధర్మవిధ్వంసనము, శిష్టపరిపాలనము-మొదలగు నివి అన్నియు ఉభయసాధారణములై అలరారియున్నవి. కావున రామాయణభారతార్థములను శ్లేషించుటలో నీకవిరాజునకుఁ గొంతసౌకర్యము లేక పోలేదు. కాని మన ఆంధ్రకవీంద్రచూడామణి పింగళిసూరనార్యుని రాఘవపాండవీయము ప్రౌఢనిర్భర పరిపాక మగుటంజేసి, అంత సులభగ్రాహ్యము గాక, ఏకాగ్రదృష్టితో పునఃపునః మంతవ్యము కాఁదగి యున్నది. కవిరాజసూరనార్యులు సర్వస్వతంత్రులు. వారి రచనలు వేర్వేరుగా నున్నను, అచ్చటచ్చట స్వల్పముగా నేకీభవింపక తప్పినది కాదు. స్థూలారుంధతీ న్యాయమునఁ గొంతఁ దెల్పెనన సాహసించినందులకు క్షంతవ్యుఁడను.

శ్లో. "స్వాధిష్ఠానాంబుజరజః
పుంజపింజర మూర్తయే,
ఇచ్ఛాధీన జగత్సృష్టి
కర్మణే బ్రహ్మణే నమః."
(సర్గ ౧, శ్లో ౧.)

........................ . ..........................

శా. "ఖ్యాతబ్రహ్మము ప్రోచుఁ గావుత విరూ
పాక్షాహ్వయంబు..."
(ఆశ్వా ౧, పద్యము ౧.)

ఇరువురును మొట్టమొదట పరబ్రహ్మమును స్తుతి గావింప నేల?

శ్లో. "వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే"

అను భగవద్వాక్యము శరణ్యమై యుండును.

సూరన్న రెండవపద్యమునఁ జేర్కొనిన కృష్ణమేఘమును, కవిరాజు

శ్లో. "శ్రీలతాలింగితాంగస్య
విష్ణుకల్పద్రుమస్య వః,
అవతారమహాశాఖా
పుష్ణంతు ఫల మీప్సితమ్."

అని విష్ణుకల్పద్రుమమును రూపింపఁ జేసినాఁడు.

శా. "లోకత్రాణరతిం దదాదిమమహీ
లోకప్రవేశోత్కథా
సాక్షాత్ప్రథమద్వితీయపదసుం
జన్మంజుమంజీరగ
ణాకల్పామలరామభారతికథా
సర్గంబుల న్నిర్మించు వా
ల్మీకివ్యాసులఁ గొల్చెదం దదుభయ
శ్లేషార్థసంసిద్ధికిన్."

ఇందు భారతీదేవికి పాదనూపుర ప్రాయము లైన వాల్మీకివ్యాసులను కవిరాజు



శ్లో. "నిఃశ్రేణౌ బ్రహ్మలోకస్య
వాగ్దేవ్యాః కర్ణకుండలే,
ధర్మద్రుమమహామూలే
వాల్మీకివ్యాసయోః కృతీ."

అని సరళముగా కర్ణకుండలరూపమునఁ జేర్కొనినాఁడు. ఒక్కుమ్మడి మూఁడుచరణములలో శబ్దాడంబరమును బ్రయోగింపఁజేసిన మనసూరన్నను వినుతింప వలసినదే!

శా. "రెం డర్థంబుల పద్య మొక్కటియు ని
ర్మింపంగ శక్యంబు గా
కుండుం; దద్గతి కావ్య మెల్ల నను నే,
నోహో యనం జేయదే
పాండిత్యంబున."

అని సూరన తనప్రాగల్భ్యమును సూచించినట్లు గీర్వాణ కవీంద్రుఁడును

శ్లో. "పద మేక మపి శ్లిష్టం
వక్తుం భూయాన్ పరిశ్రమః,
కథాద్వయైక్యనిర్వాహః
కిం ధరాపతితో ఽధికః."

అని వక్కాణించినాఁడు.

ఉ. "రాఘవపాండవీయకథ
రమ్యముగా నొక కావ్యసృష్టి నా
హా ఘటియింపఁగా వశమె?
ఆంధ్రకవీంద్రుల కైన..."

దీనిలో నున్న కావ్యసృష్టి అనుపదమును

శ్లో. "సృష్టిం కవిః సూక్తిమయీం వితన్వన్"

అనువిపులాశయమున విశదీకరించినాఁడు.

సీ. "ఆంధ్రభాషాసంస్కృతాఖిలభాషా శ్లేష
మొక్కొకచోట నొక్కొక్కచోట
సుచితశబ్దశ్లేష మొక్కొక్కచోట న
ర్థశ్లేష మొక్కొకతలిని ముఖ్య

గౌణవృత్తిశ్లేషఘటన; రొక్కొక్కతఱి
సర్థాన్వయము వేఱై యసుచు నునికి
శబ్దాన్వయుని భేదము..."

ఈశ్లేషపంచకమును కవిరాజు

శ్లో. "ప్రాయః ప్రకరణై క్యేన విశేషణవిశేష్యయోః"

అని ఎత్తికొనినాఁడు.

చ. "క్షమయు నవోఘువిక్రమము
సద్వినయంబు ప్రతాపముఞ్ సుగో
పము నవికారభావమును
బ్రాభవశక్తియు నిత్యదానశీ
లము దగ నొక్కటొక్కటి క
లంకృతిఁ జేయఁగఁ దాల్చి శోభిలుఞ్."

ఈ ఆశయమునే కవిరాజు

శ్లో. "క స్త్రాతా కామదేవః ప్రచురవిజయినాం
కోగ్రణీః కామదేవః
క స్త్యాగీ కామదేవః పరసకవిగిరాం
కిం పదం కామదేవః,
కః సేవ్యః కామదేవః క్షితిధరణవిధౌ
కః కృతీ కామదేవః
ప్రశ్నానా మేక మేవప్రతివచన మహో
రామన త్కామదేవః."

క. "...తనపాండుసమాఖ్యాజగం
బున వెలయంగ..."

శ్లో. "పాండు ర్యశోభి రభిరంజితసర్వలోకః."

సీ. "ధృతిఁ గుంతి మద్రభూపతుల నెయ్యపుకన్య
కల వనవాలుఁ దూపుల జయించి
యలరారు వతనుజయశ్రీల వరియించె
..............................
జగతిఁ గోసలకేకయమగధులలసన
యలవరించిన యాజ్ఞలో మెలఁగఁ జేసె."

శ్లో. "కరగ్రహాత్ కోసలకేకయేంద్ర
భువో గురుశ్రీ ర్వినపత్సుమిత్రః,
పృథావరోధః సమరే జితారిః
గోప్తా హిమాద్రేశ్వరతాం స లేభే."

గీ. "కొంద అొకటిరెండేటులకొలఁది గలిగి
విదితదిగ్దేశనృపతులు విఱిగి పోవ
వనినియందును యుద్ధవిహారమునకు
మఱుఁగు లేకయ విహరించె మనుజవిభుఁడు."

శ్లో. "పూర్వోర్వీపతికల్పితాభయవతు
ర్దిక్పాలవర్గాం నిజా
మాజ్ఞాం స్థాపయతా త్రిలోకవలయే
దోర్మండలం మండితమ్."

వ. "శ్రేమ ముడుగం దనూజుడిపు
జాఱుఁ జలానలలక్ష్యభేదన
క్రమము లెఱుంగ నచ్చు మది
గావఁ బడుం బరజాతిభీతికో
పముల విచేష్టితంబు లివి
భావమునం దలపోయ, నన్నిచం
దములఁ బ్రియంబె యంచు వర
నాథుఁడు వేటకు నుద్యతాత్ముఁడై."

శ్లో. పరిచయం చలలక్ష్యనిపాతనే
భయరుషో శ్చ తదింగితబోధనమ్,
శ్రమజయా త్ప్రగుణాంచ కరో త్యసౌ
తనుమతో ఽనుమతః సచివై ర్యయౌ."
(రఘువంశము—సర్గ ౯, శ్లో. ౪౯.)

ఉ. "హరిమృగవ్యవన్యనిపో
లాడరుఁ డాధరణీతలేశుఁ డ
ధ్వారచిత్రశ్రమాకలితుఁ
డై కడు మెచ్చె సురాపగాజలా
సారసమాగమార్హతమ
పారసపారసపారపారభో
దీరణకారణంబు వతి
ధీరసమీరకిశోరవారముఞ్."

శ్లో. "ఏవం స తే నామదినం వనేషు
నిషేవ్యమాణో మృగయావిహారః,

సమీరణోత్సేక ఇ వాప్య వావం
సప్తాంగచింతాం నృపతే ర్జహార."

సీ. "పుడమి తోఁ డీకీతిఁ గడఁగి డెందము మృగ
వ్యాపార ఖేలన మభిలషింపఁ
గానఁగోఁ దారు మృగంబులకై వడిఁ
జైకొని యసమాస్త్రకౌశలనఁ
దశరు చొక్క-పురాణమునిదంపతులు..."

శ్లో. "స గాఢబుద్ధి స్తపసోపకంఠే
విక ర్తమానం గతభీ రభీకమ్,
మత్వా మృగం మార్గణ లక్ష్యభూతం
అన గ్రజన్మాన మృషిం చకార."

గీ. "ఆత్మజాయాసమాగతం బైనయపుడు
ప్రాణములు వాయునట్లుగాఁ బరమశోక
వశత శపియించి..."

శ్లో. "శాపం సుతాపాయనిబద్ధమృత్యుం
ప్రియానువృత్త్యా కుశలోఽప్యవాప."

రాజుసీతా ద్రౌపదులను ౧౦ శ్లోకములతో కవి సమముగా వర్ణించెను. అవి మిక్కిలి రసవంతములు. ఇవి వక్రోక్తినిపుణుఁ డగు జయదేవుని స్మరింపఁజేసినవి.

శ్లో. "శక్తి ర్మూర్తిమయీ స్మరస్య జగతో
నారీమయం మండనం
కాంతానా ముపమానకల్పనకలా
కాంతే స్సృజు స్తేజనమ్,
లక్ష్మ్యాః సంస్మృతిసాగరస్య సరసీ
లావణ్యపుణ్యాంభసాం
సా రాజన్ జనకస్య సాం తణ మధూ
దానందసంస్థలీ."
(సర్గ ౨, శ్లో. ౮.)

శ్లో. "సర్వస్వం నవయౌవనస్య భవనం
భోగస్య భాగ్యం దృశాం
సౌభాగ్యం మదనశ్రీమస్య జగత
స్సారం ఫలం జన్మనః,
సాకూతం కుసుమాయుధస్య హృదయం
రామస్య తత్త్వం రతేః

శృంగారస్య రహస్య ముత్పలదృశో
స్తత్కించి దాలోకితమ్."
(ప్రసన్నరాఘవం-అంకము ౨, శ్లో. ౨౬.)

ధనుర్భంగము విషయమై జనకుని ప్రతిజ్ఞ ఇది:—

శ్లో. "దురాసదం ధను రిద మీశ్వరాద్ధృతే
నికోజసా కలితగుణం విధాయ యః,
ప్రదర్శయే త్వరితమ దిలబ్ధలక్ష్యతాం
జయశ్రియా సహ స లభేత కన్యకామ్."
(సర్గ ౨, శ్లో. ౨౧.)

శ్లో. "ఆకర్ణాంతం త్రిపురమథనో
ద్దండకోదండనద్ధాం
మౌర్వీ ముర్వీవలయతిలకః
కోఽపి యః కర్ష తీహ,
తస్యా యాంతీ పరిసరభువం
రాజపుత్రీ భవిత్రీ
కూజత్కాంచీముఖరజఘనా
శ్రోత్రనేత్రోత్సవాయ."
(ప్రసన్న. ౧, శ్లో. ౨౯.)

శ్లో. "సురాసురైః స్వీకృతరత్నరాశి
స్తథాపి రత్నాకర ఏవ సింధుః."
(సర్గ ౩, శ్లో. ౩౧.)

శ్లో. "రత్నేషు లుప్తేషు బహు ష్వమర్త్యై
రద్యాపి రత్నాకర ఏవ సింధుః."
(విక్రమాంకదేవచరితము-సర్గ ౧.)

కవిరాజు సూరనార్యులు అగస్త్యపరమేశ్వరు లను సమానముగా శ్లేషించినారు.

శ్లో. "త ముగ్రతో దర్శితవిగ్రహం ప్రభుం
కృతప్రసాదం ప్రణిపత్య మౌళినా,
స కుంభజన్మాన మవాప్య శంకరా
త్తతో ధనుర్వేదమయం సమాదధే."

సీ. "దివి మోచి యున్న యద్రిని ధర్మకార్యార్థ
మానతంబుగఁ జేసినట్టి ఘనుని

మించి లోకము నావరించిన విషరాశి
నాపోశనము గొన్న యద్భుతాత్మ
.........................."

ఇరువురును శూర్పణఖను, ఊర్వశిని ఒక్క-రీతిగా శ్లేషగావించిరి.

శ్లో. "తస్మిన్ దురాపే వసతః ప్రదేశే
లబ్ధ్వా ప్రజాతస్య మనోభవాంధా,
త స్యోర్వశీతుల్యవిలాసవేషా
నిశాచరీ సన్నిధి మాజగామ."

సీ. "ఆసక్తి దనరి వవాసవసేవామి
హానుభవనిరంతరానువృత్తి
వడఁగక రొంటె పేరాసఁ గుందెడి యుర్వ
శీకలోదరి పరిస్ఫీతతరస
కామసంభ్రమతి.................."

ఇట్లే కొంతవరకు వ్రాయించినను, మిక్కిలి విస్తరించునను భీతిచే వెఱచి విరమించితిని. కాని కవిరాజ సూరనార్యులు భిన్నకాలము వారు, భిన్నదేశములవారు, భిన్నకవిత్వసంపద గలవారు. అందు సూరనార్యుని కవితారసన ప్రౌఢమై, ఇంచుక నారికేళపాకసమన్వితమై, ఉభయభాషాశ్లేషసమ్మిశ్రమై పరిఢవించును. కవిరాజు కవితాపాకము హృదయంగమమై, సరళమై, పవిత్రరసోద్రిక్తమై అలరారి యున్నది.

---

# రంభ

విశ్వనాథ సత్యనారాయణ గారు, యం. ఏ.

(మాట్లాడకుండా పూరుకున్న శుకుణ్ని రెచ్చగొడదా మనుకుంది)

కోమల మందహాస వినిగూహన చారుకపోల, కామినీ
చ్ఛామతి, లోకమంతటను సర్వుఁడు, కాని యొకండ పేతవాం
ఛామతిఁ దన్ దలంచుకొని సాగి వృథా అనుభూతిలోభినై
యేమి గడించు, లోక మెలయించిన నేమిఫలంబయా ఋషీ!

దేహ మనంగఁ గోర్కులు జితించిన గూఁడు, నిరీహ మన్ భ్రమో
త్సాహములో నెఱుంగకయ దాఁగిన రోగముగాఁ దపోబహు
వ్రీహిభుజిక్రియన్ దిరుగఁబెట్టును. పెట్టునయే న్మహావధుల్
దోహదముల్ వ్యపేతధృతితోఁ బనిసేయవయా తపస్వికా!

భావము లేల చంపుటకుఁ బాల్పడె దీ ప్రతిచంపువెంట, హా
త్యావధి చేరుచున్నదిగదా! మఱి మీరలు మానులై యహిం
సావిధియాత్రులుం గద ప్రశస్తులు వర్ణి! త్వదీయమహా తప
స్స్వవధిలో లయాంతశిఖఁ జిట్టముగట్టెడు లోకముల్ మునీ!

మానిశలాక! వెన్క నొకమారు త్వదీయుఁడు తాత తాతతోఁ
బూనినవైరి, గాధిజుని మొగ్గలకన్నులు మొగ్గలల్లె మా
మేనక సిగ్గులోఁ జిలికి మీఁగడచూపులు చూఱలాడె మీ
మానల తెప్పక్రింది కనుమాయల గోప్యము లేదు మా దెసన్.

తను వొకచోట నుండియు సదా గతియుక్తుఁడ వంతరాన, లో
చనములు మూసియున్ నిఖిలసాక్షివి, పల్కకయున్ సమస్తభా
వ నిలయుబుద్ధి వీవి యమభావనలో సహజన్వయం ప్రతా
రణ మొనఁగూడి యున్న దదిరా! మునిలోకశిరోమణీ ఘృణీ!

ఒకరుఁ డకుంభలీసతి వయోవిభవం బఖిలంబు చూఱఁపు
చ్చకయ పతివ్రతాగ్రసరచండిమ గుత్తగొనెన్, మఱొక్కఁ డో
డకు తెరచాఁపనీడల కరీన్ బెదరెన్ చలిగాలి వెచ్చఁ దా
వకపితరుల్ మునీ! మెఱుఁగుపట్టినరాతివి నీవు వారిలో.

మనలక యుండు నేమి యొకమారు కదల్చుము లోనియూహ, మే
ల్మనకపు పాముగా మలకలై దుసికింతలు వోవు చూడు మా
ననమును దాఁటి యాత్మ యనినారట! ఆప్రమ యీమనస్సు నూఁ
గినలన కల్గు నా తెలివికిన్ తలదాఁటినదా! కృతవ్రతీ!

లొంగనియుల్లె నాపలుకులోఁపలి చక్కెరపాలు గ్రుక్కిళుల్
క్రింగెదువో, బెడంగు కనురెప్పల నంపఁగివచ్చి రేకు లా
లింగనముం బొనర్చు నవులే కనుదమ్ములఁ, దేఁటికూటమిన్
పొంగిన తేనెలో నొలికిపోయిన యానలపంటునో మునీ!

(తూర్పులో తెల్ల రేకలు తోచినై. ప్రక్కని రావిచెట్టుఆకుల్లో ప్రాతర్మందానిలాలు దూరి కిలకిలా నవ్వినై.)

---

# పినవీరభద్రుని శాకుంతలమునందలి యనుచితపు మార్పులు

బులుసు వేంకటరమణయ్య గారు

ఆంధ్ర సారస్వతమున గీర్వాణదృశ్య కావ్యముల ననుసరించి వ్రాయఁబడిన ప్రబంధములు కొంత మెఱకుఁ గలవు. అందుఁ బిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి రచించిన శృంగారశాకుంతలము లేక శకుంతలాపరిణయ మను నది యొకటి.

పినవీరభద్రుని చరిత్రాంశములఁ గూర్చి యిదివఱకే లేఖకులు చాలవఱకుఁ జర్చలుచేసి యున్నారు. మఱియు "వాణినారాణి" యని చెప్పికొను నాతని కవిత్వమును విమర్శించుటకూడ ననవసరము. కాన నతఁడు తన ప్రబంధమున నొనర్చిన మార్పులం గూర్చియే యొకింత ముచ్చటింపఁదలఁచి యీ వ్యాసరచనకుఁ గడంగితిని.

ఈ ప్రబంధమునకు మూలకథయగు శకుంతలాచరిత్రము మహాభారతమునఁ గలదు. దానిం గైకొని గీర్వాణభాషలో కాళిదాస మహాకవి యభిజ్ఞానశాకుంతలమను నాటకమును రచించి యున్నాఁడు. కాళిదాసు తన నాటకమున నుచితరీతిని, మూలమును మార్చి కథ కనితర సులభమగు సౌందర్యము నాపాదించియున్నాఁడు. ఇఁకఁ బినవీరభద్రుఁ డన్ననో మహాభారతమునందలి కథావిధానము నొక్కొ-కయెడను, మహాకవి కాళిదాసుని కథాసంవిధానము నొక్కొ-కయెడను ననుసరించుచు రెండిటిని మేళవించి యుభయ విలక్షణముగఁ బ్రబంధమును రచించినట్లు

"సీ.......................

......................

గీ. భారతప్రోక్త కథ మూలకారణముగఁ
గాళిదాసునినాటక క్రమముకొంత
తావకోక్తికి నభినవ శ్రీ నహింపఁ
గూర్మిఁ గృతిసేయు నాకు శాకుంతలంబు"

నను కృతిపతివచనమును బట్టి తెలియుచున్నను, ప్రబంధము నాద్యంతముగఁ బరీక్షించినచో "...కాళిదాసుని కథానుసరణమే యెక్కుడుగానున్న" దను సరస్వతీపత్రికాధిపతులవచనము యుక్తముగ నున్నదని చెప్పనొప్పును.

మహాకవి తన శాకుంతలమునఁ జేసిన మార్పులన్నియు మూల్యములు; కథారసపరిపోషకములు; నాయకోత్కర్షతాధాయకములు; సర్వజనహృద్యములు. అట్లు కాళిదాసుని నాటకమున దర్పణమందువలె శకుంతలాచరిత్రము నిర్దుష్టమై ప్రతిబింబించుచున్నను పినవీరభద్రుఁడు తానందుఁ గొన్ని మార్చి, మీఁదు మిక్కిలి మహాభారతకథారీతినే యొక్కొ-కయెడ ననుసరించి తనప్రబంధమున నన్నియు (ఇంచుమించుగా) ననుచితపు మార్పులనే చేసెను. పినవీరభద్రుఁ డొనర్చిన మార్పులను, వాని యందలి యనౌచిత్యమును దెలియఁబఱచుటయే నా ముఖ్యోద్దేశము. అందు ముఖ్యములగువానిని తొలుదొల్తఁ జర్చింతును.

(౧) మృగయావిహారార్థియగు దుష్యంతుఁడు హిమాలయోపకంఠ కారణ్యమునకు వచ్చెను. అట నొక లేడిం జూచి వేటాడ నెంచెను. అయ్యది కణ్వాశ్రమ మృగము. చక్రవర్తికిఁ జిక్కక యది యాశ్రమమువైపు పరుగెత్తెను. దానివెనువెంటనే రథమును బరుగెత్తించు దుష్యంతుఁడు దానిం డాసి చంపుటకై శరసంధానము చేయుచున్నంతలో నాశ్రమతపోధనులు వచ్చి "ఆశ్రమ మృగోఽయం న హన్తవ్యో న హన్తవ్యః"

"నఖలు నఖలు బాణః సన్నిపాత్యోఽయమస్మిన్
మృదుని మృగశరీరే పుష్పరాశావివాగ్నిః
క్వ! బత! హరిణకానాం జీవితం చాతిలోలం
క్వ చ నిశితనిపాతా వజ్రసారాశ్శరాస్తే.

తత్సాధుకృతసంధానం
ప్రతిసంహర సాయకమ్;
ఆర్తత్రాణాయ వశ్శస్త్రం
న ప్రహర్తుమనాగసి."

అని ప్రార్థింప రాజు దానిని చంపక విడిచెను. పిదప నామునులమందానందకందళితహృదయులై

"జన్మ యస్య పురోర్వంశే
యుక్తరూపమిదం తవ,
పుత్రమేవంగుణోపేతం
చక్రవర్తిన మాప్నుహి."

అని యాశీర్వదించిరి. ఈరీతిగా మహాకవి రచించినశాకుంతలనాటకమున కథాసంవిధానము మార్పఁబడినది.

ఇఁకఁ బినవీరభద్రుఁడో దానినంతయు మఱొక రీతిమార్చెను.

రాజుమృగమును వెన్నంటివచ్చుటలో కేమియు మార్పులేదు. కాని యామృగము మాలినీతీరముం జేరిన తోడనే యేలకో రాజునకు దానిపై దయ కల్గెను. కాన దానిం జంపక విడిచెను. ఇంతలో మునులువచ్చి దానిం జేరఁదీయ రాజు తా నాచరించిన పనికి భీతహృదయుఁడై

"క. నొచ్చెనో వీరలహృదయము
నిచ్చట నామీఁద నలిగి-యేమని శాపం
బిచ్చెదరో గదా! నాలుక
వెచ్చన; మునులకును గినుక-వేగమ వచ్చున్"

అని మిగుల శంకించి తాఁజేసిన తప్పు మన్నింపవారలం బ్రార్థించెను. వారును మన్నించి "..........గను...
.................................... ...ఈ
యుర్వరఁ జక్రవర్తి పదమొందుసుపుత్రునిసచ్చరిత్రునిన్"
అని వరం బొసంగిరి.

ఇది పినవీరభద్రుఁ డొనర్చినమార్పు. ఈమార్పంత యుచితమైనదిగాఁ దోఁచలేదు. రాజు మునులు తన్నేమిశపింతురో యను భీతినంతగ నడంకనక్కఱలేదు. చూడుఁడు. రాజు వేఁటకై గదా వచ్చెను. తక్కిన మృగములను వేఁటాడునట్లే లేళ్ళనుగూడ వేఁటాడుటయం దాతని తప్పు లేదు. మఱియు నది యాశ్రమమృగమని యాతఁ డెఱుంగఁడు. మఱియు నతఁ డద్దానిని వేఁటాడెనా? లేదు. ఏలకో దయగల్గి విడిచిపుచ్చెను. రాజు దయగల్గి విడిచినందులకు మునులు సంతసింపవలసినది. "అలయించితి" వని యే వారనుట యుక్తము కాదు. అలయించిన నేమాయె? మఱియు రాజుపనికి సంతసింపని మును లాతని నాశీర్వదించుట యెట్లు పొసఁగును? తమకు వాంఛితార్థసిద్ధి యైనపుడు గదా యయాచితాశీస్సులు మునులు ప్రసాదించుట. మహాకవి యెట్లు సరిపెట్టినాఁడో గమనింపుఁడు. మునులు కోరి నట్లొనర్చుట చేతనే యాతఁ డమూల్యాశీస్సులఁ బొందఁగలిగెను.

పినవీరభద్రుని దుష్యంతుని మును లాశీర్వదింప రాదని కాదు నాతలఁపు. కాని శాకుంతలనాటకమునందు వలె నీసంవిధానము కర్తైకత్వము కలది కాదని విన్నపము.

(౨) మఱియొకటి: తాను వేఁటాడఁదలఁచిన మృగము తన్నుఁ గాదని తప్పించుకొనిపోవ, దాని వెనువెంటనంటి ద్విగుణీకృతోత్సాహుఁడగు మృగయునికిఁ దుష్టతుడగు దానిపైఁ గలుగునది కనికరమా? లేక దానిం దప్పకఁ జంపవలయునను పట్టుదలయా?

కావుననే మహాకవి తననాటకమున రాజునకుఁ బట్టుదలయున్నట్లే వర్ణించియున్నాఁడు.

ఒకవేళఁ గనికరము కలిగినను నంతవేగముగ— రెప్పటిలోఁ గల్గినట్లు వర్ణించు టంతటియుక్తమా?

"గీ. అనటు మృగమును బోలేక యలసి నిలిచె;
నానెలవు నాశ్రమాంతిక మగుటఁజేసి
స్థలవిశేషంబదెట్టిదో! ధరణిపతికి
హరిణపతిమీఁద నెంతయుఁ గరుణపుట్టె"

అని వీరభద్రకవి స్థలవిశేషమాహాత్మ్యమే కారణమట్లు చెప్పినాఁడు. ఇది యంతటిసమంజసమగు సమాధానముగఁ దోఁచదు. ఈ రెండెడలఁ గవి కాళిదాసు ననుసరించుటే యుత్తమోత్తమము.

(3) అనసూయాప్రియంవదలు "మీ రెవ్వరని" రాజ నడిగినపుడు తనపేరుచెప్పినచో వారి స్వేచ్ఛకుభంగమ

కలుగుననియు, నట్లుచెప్పకున్న వసత్యాలాపదోషము కలుగుననియు నెంచి మధ్యస్థముగ నుభయావిరుద్ధమగు రీతి నాటకదుష్యంతుఁడు "భవతి! యః పౌరవేణ రాజ్ఞా ధర్మాధికారే నియుక్తస్సోఽయం తపోవన రక్షాయై ధర్మారణ్యమిదమాయాతః" అని చెప్పెను.

పిన వీరభద్రుని దుష్యంతుఁడన్ననో "నారక యసత్యవచనము, నారక హేతువనఁగను వినంబడె" నని విచారించి యనసూయాదులతో నేను దుష్యంతుండనని యే చెప్పివైచెను. ఇట్లు నడువుట వారలకు స్వేచ్ఛానిరోధకమట్లు తోఁచెడిని. కాని వీరభద్రుని ప్రబంధమునఁ బ్రథమదర్శనమున రాజు తపోవనకన్యకల దరిఁ జాలకాలముండకపోవుటచే దుష్యంతుఁడు తన నామము వెడలఁ గ్రక్కుట యనుచితము కాకపోయినను, ఒండొరులఁ గనినంతమాత్రముననె యిరువురును లెక్కలేని విరహతాపములనుభవించి చిక్కి శల్యావశిష్టులగుట ఎంత యుచితమో తెలియకున్నది. కాళిదాసుని నాటకమునవో అవకాశమెక్కుడుగఁ గలదు.

౪. మహాభారతమున శకుంతలయే తనవృత్తాంతమును రాజునకెఱింగించినట్లున్నది. అదిరసపరిపోషకము కాదని మహాకవి యనసూయాప్రియంవదలం బ్రవేశపెట్టి వారలచే వృత్తాంతమును గడుంగడు నేర్పుతో రసపరిపోషకరముగఁ బరస్పరానురాగవర్ధకముగఁ జెప్పించెను. పినవీరభద్రకవి యనసూయాప్రియంవదలను బ్రవేశపెట్టియు, వారలచే నీవృత్తాంతమును జెప్పింపక ఋషికుమారునిచేఁ జెప్పించెను. అట్లు చెప్పించుట యుక్తమగునట్లు తోఁచుటలేదు.

కొందఱు మునికుమారునివలననే శకుంతలావృత్తాంతము తెలియఁబఱచుటెంతయు సమంజసమని తలఁపవచ్చును. ఆమెచరిత్రమాఁడువారినోటనే చెప్పించుటపాడి గాదని వారు తలంపవచ్చును కాని యసభ్యవిషయములు లేని యపుడాఁడుది చెప్పినమాత్రన నేమినష్టము? అనసూయాప్రియంవదల ప్రవేశమేల? శకుంతలా వృత్తాంతమును దెలియఁజేయుటకే కదా? వారు శకుంతలావృత్తాంతమును రాజునకుఁ దెలియఁజేయుచు, నడుమనడుమ నిరువురి మనోవికారములను గనిపెట్టుచు, వారి యనురాగదార్ఢ్యపాదకములగు పల్కులఁ బల్కుచు నెంతయు నుపకరించినట్లు నాటకమున నిరూపింపఁబడినది. గ్రుక్క విడువక శిష్యుఁడేకరువుపెట్టిన వృత్తాంతము మీఁదిరీతి నుపయోగింప నేర్చునా?

ఆవృత్తాంతము ననసూయాప్రియంవదలు చెప్పుటలో నెంతటి సొగసు? ఎంత నేర్పు! ఎంతమాధుర్యము? ఆనందమంతయు నందే యిమిడియున్నది.

మునికుమారుఁడే చెప్పెనిందు. కాని యంతటి యసభ్యమా? అంతటిశృంగారమా? విశ్వవిరాగియగు నాశ్రమవిద్యార్థి కావిషయాసక్తియేమి? శృంగారమునకును, శాంతమునకు నెంతటి తారతమ్యము కలదు? చూడుఁడు. మునిశిష్యుఁడు.

సీ. తేఁటిమొత్తము నేవుఁ దూఁటిపుప్పగనొప్పు
కమనీయనీలాలకములు చూచి
చిగురుటాకుల డాలుఁ జిన్నపుచ్చఁగఁజాలు
పాంద్రంపు కెంపుహస్తములఁ జూచి
కరికుంభముల క్రొవ్వుఁ గావుసేయుచు నవ్వ
దారంపు నెరిచన్నుదోయిఁ జూచి
చంద్రబింబము పెంపు సనఁగు గావనిపింపు
మొలకనవ్వుల ముద్దు మోముఁ జూచి,
గీ. రసములుట్టెడు బింబాధరంబుఁ జూచి
పసిఁడిసాడిరాలు కటివైభవముఁ జూచి
కమలముల సేలు పాదపద్మములఁ జూచి
మునికిఁ జక్కిలిగింతలు గొనె మనంబు.

అని వర్ణించుట తగిన రీతినున్నదా? అతఁడు చేయవలసిన వర్ణనమా యిది? పినవీరభద్రుఁడిం దనసూయాప్రియంవదల ప్రవేశమునకీటు నేమిఫలము కల్పించును?

౫. దుష్యంతునికి శకుంతలయందుఁ గల్గుకొమరునికిఁ బట్టాభిషేకమొనర్చ నొడంబడికపైనే శకుంతల దుష్యంతుని వివాహమాడుట కంగీకరించినట్లు మహాభారతమునఁ గలదు. ఔచిత్యమును బాటించుటయం దప్రతిమానధీవిరాజితుఁడగు మహాకవి తననాటకమున మార్చి యావృత్తాంతమునే తీసివేసెను. అనసూయాప్రి

యంపదలచేసైనను దానిని జెప్పింప నిచ్చగింప లేదు. కాని యీ ప్రకరణము నతి చమత్కారముగ ననసూయా ప్రియంవదలచేఁ జెప్పించి రాజుచే నంగీకరింపఁజేసెను. చూడుఁడు:

అనసూయా—వయస్య! బహువల్లభా రాజానః శ్రూయన్తే. యథా నౌ ప్రియసఖీ బంధుజనశోచనీయా న భవతి తథా నిర్వర్తయ.

రాజా—భద్రే! కిం బహునా?
పరిగ్రహబహుత్వేఽపి ద్వే ప్రతిష్ఠే కులస్య మే;
సముద్రవసనా చోర్వీ సఖీ చ యువయోరియమ్.
ఉభే—నిర్వృతే స్వః.

దీని వివరణముఁ గనుఁడు. "రాజులకవరోధవర్గము పెంపుగ నుండునట్లు విందుము. కావున మా నెచ్చెలి విషయమున మేము విచారింపకుండు నట్లొనర్పు" మని యనసూయ పల్కినది. శకుంతల పట్టమహిషి కాక తప్పక నగు నన్నచో బంధుజనశోచనీయయే యగును గదా! కావునఁ బట్టమహిషిఁ నొనర్పుమని యామె వేఁడికోలని తెలిపినది. ఆమె పట్టమహిషియే యైనచో నామె కొమరునికిఁ దక్క మఱెవ్వరికి రాజ్యాధికారము కలదు? ఎంతటియుక్తి?

రాజు పల్కిన సమాధానముఁ గనుఁడు, రాజ్యము, శకుంతల తప్ప తక్కినవారు ముఖ్యులు కారనియే చెప్పెను. కాన శకుంతల పట్టమహిషియగుటయు నామె కొమరుఁడు రాజ్యాధిపతియగుటయుఁ దప్పదు.

తాఁగల్పించుకొన నక్కఱలేకయే యిట్టి చమత్కారము కనిపించుచున్నను, పినవీరభద్రకవి భారతమునే యనుసరించుచు శకుంతల చెలిమికత్తెలచే

ఉ. మా తరళాక్షిపైఁ గలుగు
మక్కువ నిక్కువ మయ్యెనేని యో
భూతలనాథ! యీ తలిరుఁ
బోఁడికి నీకును బుట్టుపుత్త్రుఁ బ్ర
స్ఫీతిగ యౌవరాజ్యపద
పీఠమున న్నిలుపంగ సత్కృపా
న్వితుఁడవై మనోజ్ఞ మహా
నీయముగా శపథంబు సేఁదగున్.

అని మోమోటమి యించుకంతైన లేకయే యొట్టు వేయుమని చెప్పించెను. ఒట్టువేసిన నేమాయె? లేకున్న నేమిపోయె? ఇం దిసుమంతేనియుఁ జమత్కారము, నౌచిత్యముఁ గలదా? ఇట్టియెడఁ గాళిదాసునే యనుసరించిన నెంత బాగుగనుండెడిది? అతనిని కాదని త్రోసిపుచ్చుటకు వీరభద్రుఁ డెట్లంగీకరించెనో?

౬. దుష్యంతుఁడు శకుంతలను గాంధర్వవిధిం బరిణయమాడిన పిదప నాశ్రమమునకు మరలవచ్చిన కణ్వముని కొమరితచేసిన పనికిఁ గినియక యనురూపవరుని జేరినందులకు మిక్కిలి సంతసించియుఁ బుత్రవతియై, పుత్రుఁ డైదాఱేండ్ల యీడువాఁడైన పిదపనే యత్తవారింటికిఁ బంపెననియు, రాజు శకుంతల తనభార్యయే యని యెఱిఁగియున్న ప్రజలవలని భయమున "నిన్నెఱుఁగ" నని శకుంతలం దిరస్కరించినట్లును, బదపసి యంతర్వాణి యథార్థమును బలికిన పిదప ప్రజల నంగీకరింపఁజేసి రాజామెం బరిగ్రహించినట్లును మహాభారతమునఁ జెప్పఁబడియున్నది.

యుక్తివేత్తయగు కాళిదాసు పెండ్లియైన పడుచు పుట్టినింటనుండుట భావ్యముకాదని గర్భవతి యగునప్పుడే యామెను మగని కడకుఁ బంపించెను. మఱియుఁ బుత్రవతినే బంపినచోఁ జక్రవర్తి లక్షణ లక్షితుఁడును, దన్నుఁ బోలినవాఁడు నగు కుమారుఁడు శకుంతలం దాను పెండ్లియాడెననుటలో సాక్షియగుట సంభవించును. అప్పుడు రాజామెం బరిగ్రహింపక తప్పదు. అట్లయిన నాకాశవాణి యవసరమే యక్కఱలేక యుండును. అందుననే కాళిదాసు పుత్రవతిని రాజసభ కెక్కింపలేదు. చక్రవర్తియంతటివాఁడు వివాహమాడియు లేదని బొంకుట యనుచితమని దుర్వాసశాపవృత్తాంతమును గల్పించి, శాపప్రభావముననే రాజు శకుంతలను మఱచెననియు, నంగుళీయకముం జూచిన తిరిగి శాపప్రభావము నశించి రాజునకు వెనుకటి సంగతి స్మృతికి వచ్చి శకుంతలనుబరిగ్రహించెననియు కాళిదాసు ఇతివృత్తమును మార్చెను. ఈ యెడ మహాకవియుక్తికౌశలము వర్ణనాతీతము.

ఇఁకఁ బినవీరభద్రకవి యొనర్చిన మార్పులఁ దెల కింతము. ఈతఁడు భారతమున నుడివినట్లు పుత్రసహితయగు శకుంతలనే హస్తిపురికిఁ బంపెను. అది యుక్తముకాద నియు, భరతుఁడు దుష్యంతుని పుత్రుఁడేయని యతని యాకారాదులను బట్టి ప్రజలు నిశ్చయింపక మానరని యు, నప్పుడు రా జనృతమాడుచున్నాఁడని తెలిసిపోవు ననియు నీకటకే నిరూపించియుంటిని.

కాళిదాసు తన నాటకమున శకుంతలను రాజసభ కెక్కించి రాజు శకుంతలను బానెఱుంగనని పల్కి నపుడు రాజపురోహితుఁడు "ఏమో రాజు వివాహ మాడినను గాలాతీతమున మఱచియుండెనేమో? లేని యెడ మునులు, నమాయికయగు శకుంతలయు నన్యాయము లాడనేర్తురా? ఈమె సంపూర్ణగర్భవతి గదా! ఈమెకు గల్గిన కొమరుఁడు చక్రవర్తి లక్షణ లక్షితుఁడై యున్న చో తప్పక దుష్యంతుఁ డీమెనుఁ బరిగ్రహించి యుండవ లె, నని యాలోచించి రాజున కీ సంగతి నెఱింగిం చెను. శాపోపహతస్మృతి కలవాఁడయ్యు రా జందుల కంగీకరించెను. అంతపురోహితుఁడు శకుంతలం దన గృహమున నుంచ నెంచెను. కాళిదాసుని యీ కల్పన మును బట్టి కూడ పుత్రుఁడు తప్పక ముఖ్యమగు సాక్షి కాఁగలఁ డనుటలో సందియములేదు. కానఁ బినవీరభ ద్రుఁడు కాళిదాసు ననుసరింపక భారతమునే యనుసరిం చుట యౌచితీయుతము కాఁజాలదు.

6. సోమతీర్థమునుండి మఱలి వచ్చిన కాశ్యపుఁడు * అశరీరవాక్కువలన శకుంతల దుష్యంతపత్ని యనుట తెలిసికొని శకుంతలం గాంచి

"దిష్ట్యాఽధూమాకులిత దృష్టేరపి యజమానస్య పావక ఏవాహుతిః పతితా. వత్సే! సుశిష్యపరిదత్తా విద్యేవ అశోచనీయా సంవృత్తా, అద్యైవ ఋషిరక్షి తాం త్వాం భర్తుః సకాశం విసర్జయామి."

అని చెప్పెను. వీఁడి వాక్యమున "అద్యైవ" అనిచెప్పు టచే మునిరాఫేగమే శకుంతలను భర్తృ సమీపమునకుఁ బంపనెంచెననుట సువ్యక్తముకాఁగలదు. కాని "సంగతి యేమి?" అని ముని శకుంతల నడుగలేదు. అట్లడుగుటయు నంతటిభావ్యము కానేఱదు.

పిన వీరభద్రుఁడన్ననో ముని యాశ్రమమునకు మఱలివచ్చి శకుంతలను "యోగక్షేమంబులడిగి కాలత్రయ జ్ఞానశీలుండగుట సకలంబును నెఱింగియు నెఱుంగనివాఁడ పోలె నమ్మెఱుంగుఁబోఁడి తెలుగు తన్ముఖంబున విన నున్ముఖుండై

ఉ. ఎన్నఁడులేని క్రొత్తసిరి
నీనెడు నీ వదనాంబుజంబు పై
చెన్నను మాత్న రేఖవిల
సిల్లెడు భావములెన్ని యెన్ని యున్
మున్నిటిభంగిఁ గాక కడు
మోహనలీలలఁ గ్రాలుచున్న నీ
యున్న నిజంబుదాఁచుకొని
యుండినవాపయి నానపెట్టెదన్"

అని బలవంతపఱచినట్లు వర్ణించెను. "చెప్పకున్న నాతో" డని యొట్టుపెట్టుకొనెను. ఆహా! తండ్రి కూఁతునడుగురీతి యేనా యిది? గాంధర్వవివాహము శాస్త్రసమ్మతమే; కానిండు. కాని శకుంతలయొనర్చినది సాహసము. ఆమె తుంటవిల్తుని వాడికోలలకుఁ బూర్తిగ వశమైపోయినది. ఇనుపకచ్చడాల్ కట్టుకొను మునిముచ్చులకూడఁ బంచ బాణునికి లోకువయగునపుడుఁ బ్రపంచమున నేమియో, ప్రకృతిస్వభావపరిణామము లెట్లుండునో యెఱుంగని యమాయిక యతనికి లోనుగాకుండు టెట్లు? తప్పుచేసిన శకుంతల తాఁ చేసినపనిని తండ్రికెఱిఁగించు టెట్లు? అబల లట్లెఱింగింప నెంతురా? శకుంతల చేసినపని నెఱింగియుఁ గాశ్యపుండడుగుటయుఁ గన్యాపుత్రి యెఱిఁగించుట యౌనా? పుత్రికావృత్తాంతమును దండ్రి యెఱుఁగకున్నపుడును నీ రీతిని నిట్టియెడఁ బ్రశ్నచేయఁడు. ఉపాయాంతరమున నావృత్తాంతముఁ దెలిసికొనును. ఇచటఁ గణ్వుఁడో త్రికాల జ్ఞుఁడు. శకుంతులయెడ దోషమిసుమంతేనియు లేదనియు, నామె న్యాయముగనే ప్రవర్తించెననియు నతనికిఁ దెలిసి పోయినది. ఇఁక నామె నడుగుట యెందులకు? అడుగుట

* దుష్యన్తే నాహితం తేజో దధానాం భూతయేభువః; అవేహితనయాంబ్రహ్మన్! అగ్నిగర్భాం శమీమివ.

# జీర్ణ విద్యానగర చిత్రములు

"ఇది యొక గొప్పసౌధమై యుండవలెను. ఇది శ్రీ కృష్ణదేవరాయలచే నతఁడు పూర్వదిగ్విజయ యాత్ర నుండి వచ్చిన పిదప క్రీ. శ. ౧౫౧౩ సంవత్సరప్రాంతమున నిర్మింపఁబడినట్లు 'పేయస్' వ్రాసియున్నాఁడు. మహర్నవమి యుత్సవముల కిది కేంద్రస్థానమగుటచే నేఁటికిని దీని నిక్కడి జనులు మహర్నవమి దిబ్బయని పిలుతురు. ఇది మిగుల యెత్తుగా నున్నది. పునాదులపైభాగము నందలి రాళ్లపై సైనికులు, గుఱ్ఱములు, ఏనుఁగులు, వేశ్యకాంతలు నొక్కొకటాతివరుసపైఁ జిత్రింపఁబడెను. (౧-వ చిత్రము)

* ఈ మహర్నవమి దిబ్బయొక్క దక్షిణపార్శ్వమున రాళ్లపైఁ జెక్కఁడపుపని మిక్కిలి యందముగా నున్నది. మొదటివరుసలో నేనుఁగులవరుస చిత్రింపఁబడినది. ఎవ్వరో యిద్దరు పాశ్చాత్యులు, గడ్డములతో, పెర్షియా టోపీలను ధరించి సింహాసనమునందుఁ గూర్చున్నట్లు చిత్రింపఁబడిన బొమ్మలకు నమస్కారము చేయుచున్నట్లు చిత్రింపఁబడిరి. ఈ చిత్రవిశేషమునుబట్టి విజయనగరరాజుల సభలలో నితరరాజ్యములకుఁ జెందిన రాయబారు లుండిరని మనము గ్రహింపవచ్చును. వేషమునుబట్టి వీరు 'పోర్చుగీసు'వారని ఫాదరు హీరాసుగారు గుర్తించుచున్నారు. పైచెప్పఁబడిన యేనుఁగులవరుసక్రింద హంసలును, మొసళ్లును జిత్రింపఁబడినవి. దానిక్రింద వేశ్యకాంతలు నృత్యము చేయుచున్నట్లు చిత్రింపఁబడిరి."* (౨-వ చిత్రము)

౩-వ చిత్రమునందు ౧-వ వరుసలో వేశ్యలు, ౨-వ వరుసలో విలుకాండ్రు, ౩-వ వరుసలో గుఱ్ఱములవారు (ఈగుఱ్ఱములు పోర్చిగీసువారు కానుక తెచ్చినవని ఫాదరు హీరాసుగారు అభిప్రాయపడుచున్నారు.), ౪-వ వరుసలో ఏనుగులవారు కలవు.



చిత్రము ౧. మహర్నవమి దిబ్బ

* జీర్ణ విజయనగర చరిత్రమునుండి.

చిత్రము 2. మహార్నవమి దిబ్బకు దక్షిణపార్శ్వమున రాళ్లపై శిల్పము



చిత్రము 3. హాజార రామస్వామి దేవాలయము నందలి శిల్పము

యేకాదు - నిర్బంధించుట యెందులకు? చెప్పకున్న నొట్టని యనుటెందులకు? కణ్వునియతంటి వాఁడు వృత్తాంత మెట్టిదో యెఱింగియు నామెనోటనే చెప్పింపఁ దలఁచుట పరిహాసాస్పదముకాదా? ఆమెతో నాతని కేమిపరియాచకమా? తండ్రికూఁతులు మేలములాడు కొనుట-అందు విరాగియగు మహర్షి యట్లొనర్చుట— యుచితమా? ఎఱిఁగియు కూఁతునునిర్బంధించుట ఎందైనఁ గలదా? పినవీరభద్రున కీమాత్రపుటూహ యేలతోఁచలేదు? కాళిదా సేమిచేసినాఁడు? "అమ్మాయీ? నీ వొనర్చినపని తెలిసినది. నీవు మహాపవిత్రురాలవు. చాలసంతసమైనది. ఇదిగో! నిన్నిపుడే ఋషులసాహాయ్యమిచ్చి యత్తవారింటికంపుచున్నా"నని కణ్వునిచేఁ జెప్పించెను.

౮. పినవీరభద్రుఁ డంతటితో నూరకొనెనా? చూడుఁడు: ముని తన్నట్లడిగిన పిదప నామె.

గీ. ......గడగడవడఁకుచు-నశ్రువారి
కన్నుఁగవరాల గద్గదకంఠయగుచు
కొంతయును మాటుపెట్టక కోమలాంగి
మునికి విన్నపమొనరించె మునికి మునికి.

కొంతయును మాటుపెట్టక చెప్పివేసెనఁట ఆమె; చెప్పింపక యేతప్పనిచో ననసూయా ప్రియంవదలచేనైనఁ జెప్పించిన బాగుండెడిది. ఆమెచేతనే చెప్పించి వినినచో ముక్తియా మోక్షమా? ఈయెడ పినవీరభద్రుఁ డౌచితి నణుమాత్రమును పాటింపలేదని నొక్కిచెప్పవచ్చును.

ఇంతియకాదు. "వదనాంబుజము మున్నెన్నఁడు లేని క్రొత్తసిరి నీనుచున్న"దనియు,"మైచెన్నును నూత్న రేఖ విలసిల్లుచున్న"దనియు,"భావములన్నియు మున్నిటి రీతిఁగాక కడుమోహనలీలలఁ గ్రాలుచున్న"వనియుఁ దండ్రి కూఁతును వర్ణించు టెంతటియసభ్యమో చదువరు లూహింపఁగలరు. ఇఁక నీవిషయమునింతటితో విరమింతుము.

౯. దుర్వాసుని శాపముకలననే దుష్యంతుఁడు శకుంతలను మఱచెననియుఁ బోయిన యుంగరము జాలరి యీయఁగా రాజునకు శకుంతలస్మృతిపథమునకు వచ్చి చాల నొచ్చుకొని, విచారించి తుదకు మారీచాశ్రమమున నామెం గనుఁగొనెననియు మహాకవి తననాటకమునఁ జెప్పెను. దుర్వాసశ్శాపవృత్తాంతప్రయోజన మీవఱకే చెప్పఁబడినది.

పినవీరభద్రకవియు భారతానుసరణమును బరిత్యజించి మహాకవిమార్గమునే త్రొక్కి దుర్వాసశ్శాప వృత్తాంతమునే గల్పించెను. కాని యీ వృత్తాంతము ననుకరించుట యందు నొక లోపము చేసెను. శకుంతల మగనివిషయమై యాలోచించుచు నావ్యామోహమునఁ బడి దుర్వాసుఁ డచటికి వచ్చియున్నను గుర్తెఱుఁగ లేక పోవుటచే (అతనివైపుఁ జూడకపోవుటచే) నా ముని క్రుద్ధుఁడై

విచిన్తయన్తీ యమనన్యమానసా
తపోధనం వేత్సి న మాముపస్థితమ్;
స్మరిష్యతి త్వాం న స బోధితోఽపి సన్
కథాం ప్రమత్తః ప్రథమం కృతామివ.

అని శపించినట్లు శాకుంతలనాటకమునఁ గలదు. కాని పినవీరభద్రుని శకుంతలయో

క. ఆసన్నుఁడైన ముని దు
ర్వాసునిఁగనుఁగొనియుఁ బ్రాణవల్లభుపైఁ జిం
తాసక్తి.....................తా
నే సత్కారమును జేయ నెఱుఁగకయున్నన్.

తాపసి నిర్దయాత్ముఁడై "నిశేకుఁడెవ్వఁడాత్మపతి యీ పతివ్రతఁ దలఁచుఁగాక" అని యామెను శపించెను. కాని దుర్వాసుఁడు వచ్చెనని కనుఁగొనియు శకుంతలయుపేక్షించెననుట యుక్తముకాదు. తగుమనుష్యుఁడు తనగృహమునకు రాఁ జూచి, అతనింజూచి ముఖము వంచుకొనుట మర్యాదకు లక్షణము కాదు. కావుననే కాళిదాసు శకుంతల మునిని జూడనేలేదని చెప్పినాఁడు. ఈలోపమున కేమి హేతువు. ప్రకృతము ననుసరింతము.

శకుంతల శపింపఁబడినట్లు చెలిమికత్తెలే యెఱుఁగుదురు. మునకు వారిరువురు నట్లే చెప్పినారు. కాళిదాసు శకుంతల యత్తవారింటికి కదుఁనప్పు డనసూయా ప్రియంవదలచే "సఖీ! ఒకవేళ రాజు నిన్ను మఱచిపోయిన యెడల నీయుంగరమును జూపు"మని శకుంతలకుఁ జెప్పించెను. దురదృష్టవశమున నామె యాయుంగరమును దారి

యేకాదు - నిర్బంధించుట యెందులకు? చెప్పకున్న నొట్టని యను టెందులకు? కణ్వునియంతటి వాఁడు వృత్తాంత మెట్టిదో యెఱింగియు నామెనోటనే చెప్పింపఁ దలఁచుట పరిహాసాస్పదముకాదా? ఆమెతో నాతని కేమిపరియాచకమా? తండ్రికూఁతులు వేళములాడు కొనుట-అందు విరాగియగు మహర్షి యట్లొనర్చుట— యుచితమా? ఎఱింగియు కూఁతును నిర్బంధించుట యెందైనఁ గలదా? పినవీరభద్రున కీమాత్రపుటూహ యేలతోఁచలేదు? కాళిదా సేమిచెప్పినాఁడు? "అమ్మాయీ? నీ వొనర్చినపని తెలిసినది. నీవు మహాపవిత్రురాలవు. చాలసంతసమైనది. ఇదిగో! నిన్నిపుడే ఋషులసాహాయ్యమిచ్చి యత్త వారింటికంపుచున్నా నని కణ్వునిచేఁ జెప్పించెను.

౮. పినవీరభద్రుఁ డంతటితో నూరకొనెనా? చూడుఁడు: ముని తన్నడిగిన పిదప నామె.

గీ. ......గడగడవడఁకుచు-నశ్రువారి
కన్నుఁగవఁరాల గద్గదకంఠయగుచు
కొంతయును మాటు పెట్టక కోమలాంగి
మునికి విన్నపమొనరించె మునికి మునికి.

కొంతయును మాటు పెట్టక చెప్పివేసెనఁట ఆమె; చెప్పింపక యేతప్పునిచో ననసూయాప్రియంవదలచేనైనఁ జెప్పించిన బాగుండెడిది. ఆమెచేతనే చెప్పించి వినినచో ముక్తియా మోక్షమా? ఈయెడ పినవీరభద్రుఁ డౌచితి నణుమాత్రము పాటింపలేదని నొక్కి-చెప్పవచ్చును.

ఇంతియకాదు. "వదనాంబుజము మున్నున్నఁదు లని శ్రీ [illegible] "దనియు, "భావములన్నియు మున్నిటి రీతిఁగాక కడుమోహనలీలలఁ గ్రాలుచున్న"దనియుఁ దండ్రి కూఁతును వర్ణించు టెంతటియసభ్యమో చదువరు లూహింపఁగలరు. ఇఁక నీవిషయము నింతటితో విరమింతును.

౯. దుర్వాసుని శాపమువలననే దుష్యంతుఁడు శకుంతలను మఱచెననియుఁ బోయిన యుంగరము జాలరి యీయఁగా రాజునకు శకుంతలస్మృతిపథమునకు వచ్చి చాల నొచ్చుకొని, విచారించి తుదకు మారీచాశ్రమమున నామెం గనుగొనెననియు మహాకవి తననాటకమునఁ జెప్పెను. దుర్వాసశ్శాపవృత్తాంతప్రయోజన మీవఱకే చెప్పఁబడినది.

పినవీరభద్రకవియు భారతానుసరణమును బరిత్యజించి మహాకవిమార్గమునే త్రొక్కి దుర్వాసశ్శాప వృత్తాంతమునే కల్పించెను. కాని యా వృత్తాంతము ననుకరించుట యందు నొక లోపము చేసెను. శకుంతల మగనివిషయమై యాలోచించుచు నావ్యామోహమునఁ బడి దుర్వాసుఁ డింటికి వచ్చియున్న సంగతి తెలియఁగ లేక పోవుటచే (అతని సేవఁ జేయక పోవుటచే) నాముని క్రుద్ధుఁడై

విచిన్తయన్తీ యమనన్యమానసా
తపోధనం వేత్సి న మాముపస్థితమ్;
స్మరిష్యతి త్వాం న స బోధితోఽపి సన్
కథాం ప్రమత్తః ప్రథమం కృతామివ.

అని శపించినట్లు శాకుంతలనాటకమునఁ గలదు. కాని పినవీరభద్రుని శకుంతలయో

క. ఆసన్నుఁడైన ముని దు
ర్వాసునిఁగనుఁగొనియుఁ బ్రాణవల్లభుపైఁ జిం
తాసక్తి......................తా
నే సత్కారమును జేయ నెఱుఁగకయున్నన్.

తాపసి నిర్దయాత్ముఁడై "నినుఁ డెవ్వఁడాత్మపతి యా సతినమ్మఱచుఁగాక" అని యామెను శపించెను. కాని దుర్వాసుఁడు వచ్చెనని కనుఁగొనియు శకుంతలయుపేక్షించెననుట యుక్తముకాదు. తనమనుష్యుఁడు తనగృహమునకు రాఁ [illegible] లక్షణము కాదు. కావుననే కాళిదాసు శకుంతల మునిని జూడనేలేదని చెప్పినాఁడు. ఈలోపమున కేమి తెండు. ప్రకృతము ననుసరింతము.

శకుంతల శపింపఁబడినట్లు చెలిమికత్తెలే యెఱుఁగుదురు. మనకవు లిరువురు నట్లే చెప్పినారు. కాళిదాసు శకుంతల యత్తవారింటికరుగునపు డనసూయాప్రియంవదలచే "సఖీ! ఒకవేళ రాజు నిన్ను మఱచిపోయిన యెడల నీయుంగరమును జూపు"మని శకుంతలకుఁ జెప్పించెను. దురదృష్టవశమున నామె యాయుంగరమును దారి

లోనే పాలైనెను. కావుననే యామె తా నతని భార్య నని దుష్యంతునిచే నంగీకరింపఁజేయఁ జాలకపోయినది.

పినవీరభద్రుఁడన్ననో అనసూయా ప్రియంవదలను గూడ శకుంతలతో హస్తిపురికిఁ బంపించెను. "శకుంతల తనభార్యకా"దని దుష్యంతుఁ డుపన్యసించునపు డనసూయా ప్రియంవదలు చెల్లముకొట్టిన బాళ్లవలె నులుకక పలుకక యూరకుండిరి. ఉంగరము నానవా లీయ లేక పోయిరి. వారు శాపవృత్తాంతము నప్పుడును మఱచి యుందురా? అట్లు మఱచుట విదుషీస్వభావము కాదు. వారానవా లీయక "కోపవిహితేక్షణులై యంతరిక్షంబు నకు హస్తంబు లెత్తి యొత్తిలి సకలజనంబులు వినునట్లు దేవతలార! ఓ దిక్పతులార! ............ప్రకటముగఁ జేయుదురుగాక ప్రజలెఱుంగ" అని సమస్తదేవతలను ప్రార్థించిరి. తలపాగచుట్టలేక తలవంకయన్నట్లున్నది వీరి సంగతి. ఉంగరముచూపఁజాలక యుగ్రమూర్తిన లగు టేలాగో? పిదప నంతర్వాణి యథార్థము పలికినది. అనసూయా ప్రియంవదలు

ఉ. ఆపలుకు ల్వస న్వినుచు
నాగ్రహవృత్తి శకుంతలాంగుళి
స్థాపితమైన యుంగరముఁ
జయ్యన నూడిచి మీఁద వైచి యో
పాపపురాజ ఎట్లిదియు
బాలికచేతికి వచ్చెఁ జెప్పుమా!

అని రాజుతో ననిరి. చేయి కాలిన పిదప నాకు లేల? ఈజ్ఞానము వారలకు తొలుతనే యున్నచో నీచేతు లెత్తి దేవతలకు సాక్షిపట్టేలఁ గట్ట నక్కఱలేకుండునే?

నేఁ జెప్పున దేమన, మన పినవీరభద్రుఁడు కాళిదాసు కల్పించినచొప్పున దుర్వాసశ్శాపవృత్తాంతమును గల్పించియు దానికిఁ దగినంత ప్రయోజనము చూపలేక పోయెనని; ఈశాపవృత్తాంతమున శాపోపసంహారరూప మగు నంగుళీయకవృత్తాంతము కల్పింపకపోయినను నష్ట మేమియును లేదు కావున నితని యంగుళీయవృత్తాంతము నిష్ప్రయోజన మనవచ్చు.

౧౦. న్యాయమునకుఁ గట్టుపడినచో శకుంతలతో ననసూయాప్రియంవదలను హస్తిపురికిఁ బంపుట పినవీరభద్రుఁ డొనర్చిన పెద్దతప్పులలో నొకటి. శకుంతలవలెనే వారును బాలలు; సౌందర్యవతులు. కావుననే మహాకవి తననాటకమున "అహో! సమవయోరూపం భవతీనాం సౌహార్దమ్" అని దుష్యంతునిచేఁ జెప్పించెను. కావున శకుంతల యెట్లనురూపవరునిఁ బొందెనో వారు గూడ నట్లే యనురూపులఁ బొందఁగలరు. అట్టివారిని శకుంతల యత్తవారింటికిఁ బంపుట తగునా?

మహాకవినాటకమున శకుంతల భర్తృగృహమున కేఁగుచు, "తండ్రీ! అనసూయా ప్రియంవదలనుగూడ నాతోఁ బంపరా?" అనిఅడుగఁగా కణ్వుఁడు "అమ్మాయీ! వీరుకూడ నీవంటివారే; వారినిగూడ ననురూపవరుల కీయవలెను తల్లీ! వారక్కడికివచ్చుట తప్పమ్మా!" అనిచెప్పెను. కానఁ బినవీరభద్రుఁడు వారిని హస్తిపురికిఁ బంపుట తప్పు.

ఇవి కాక సూక్ష్మములగు ననుచితపరిణామములు చాలఁ గలవు. దుష్యంతుఁడు తన్ను వీడి నగరమునకుఁ జేరినపుడే విరహవేదన భరింపక తదేకధ్యానయై దుర్వాసుని లక్ష్యముచేయనంత స్థితి నుండు శకుంతల బాలుఁ డైదాఱేండ్ల యీడువాఁ డగునంతకు నావేదనను సహించెనా? ఆమె విరహవేదన పడుచున్నట్లుగాని, బాధవలనఁ గృశించినట్లు గాని పినవీరభద్రుఁడు చెప్పకపోయెనే!

శకుంతలాపుత్రుని కాఱేండ్లు వచ్చునంతకును గణ్వముని యేల యుపేక్షించెను? అందుఁ బ్రయోజన మేమి? ఇట్టివే కొన్నికొన్ని కలవు. కాని వాని నన్నింటిని నిరూపించుట యంతటి యవసరము కాదు.

పినవీరభద్రుని నిందించుట నామతము కాదు. అతఁడు చాలగొప్పకవి. కవన మతిపేలవము, మృదుమధురము. అతఁడు రచించినది శ్రవ్యకావ్య మగుట మహాభారతమునైనను, శాకుంతల నాటకమునైనను ఒక్కదానినే యనుసరించి గ్రంథము రచించియుండిన బాగుగ నుండి యుండెడిది. నాటకమునే యనుసరించుట మిక్కిలి యుత్తమమైనది.

---

# ప్రస్తావన*

జమ్ములమడక మాధవరామశర్మ గారు

రూపకములందు మంగళమునుగోరి ముందుగ నాందిని జరిగించుట యాచారముగ నున్నది. అట్లు నాందిజరిగిన యనంతరము సూత్రధారునితో మారిషుఁడు గాని, నటిగాని, ప్రస్తుతానుబంధియగు మిథఃసంలాపమొనర్చునది 'యాముఖ' మనఁబడును. దీనికే 'ప్రస్తావన'యని వేఱొక పేరు. ప్రస్తావన సూత్రధారుఁడు ప్రయోగింపఁబోవు విషయమును దెలియఁజేయునదియై యుండును. ఈ ప్రస్తావన రూపకములం దుండితీరవలయును.

"విధేర్యద్దైవసంకల్పో ముఖతాం ప్రతిపద్యతే;
ప్రధానస్య ప్రబంధస్య తథా ప్రస్తావనా మతా."

అని యొకపండితుఁడు ప్రస్తావనాప్రాశస్త్యము నుగ్గడించినాఁడు. మన సంస్కృతవాఙ్మయమునందలి ప్రతిరూపకమునందుఁ బ్రస్తావన యున్నది. సాహిత్యదర్పణమున విశ్వనాథకవిరాజు ప్రస్తావనానిర్వచన మిట్లు చేసినాఁడు:

"నటీ విదూషకో వాపి పారిపార్శ్వక ఏవ వా;
సూత్రధారేణ సహితాః సంలాపం యత్ర కుర్వతే.
ఆముఖం తత్తు విజ్ఞేయం నామ్నా ప్రస్తావనాపి సా."

రంగమునఁ బ్రవేశించిన సూత్రధారుఁడు మారిషాదులతో సంభాషణ మొనర్చుటయు నట్లా మాటలసందడిలోఁ బరిషదారాధనమునకై తా మొనరింపఁదలఁచిన రూపకప్రదర్శనరూపమగు ప్రయత్నమును దెలియఁజేసి, యభిమత ఋతువునుగూర్చి గాన మొనరించుటయు నాచారముగ నున్నది. 'నీ వీరూపకమును బ్రదర్శింపవలయు'నని యొక్కొకచో సూత్రధారుఁడు సామాజికులచే నాజ్ఞప్తుఁడగును. 'నీకభిమతరూపకమునే ప్రదర్శింపు'మని యొక్కొకచోట, కొన్ని ప్రస్తావనలందు సూత్రధారుఁడు రూపకప్రణేతచేఁ బ్రార్థితుఁడయి ప్రయోగింపఁబోవుచున్నటులుండును. కొన్ని ప్రస్తావనలందు సూత్రధారుఁడు తన కభిమతమగు నేదే నొకరూపకమును బ్రదర్శింపఁబోవుచటు లుండును. ఆసమయముననే సూత్రధారుఁడు కవీశ్వరుని వృత్తమును దెలియఁజేయును.

సూత్రధారుఁడన, నాటకసూత్రమునంతయు ధరించువాఁడు రంగప్రసాధనప్రౌఢుఁడును. ఆతఁడే, పాత్రసజ్జీకరణ మొనరింపవలసిన ప్రధానుఁడును. ఆతఁడు లేకున్న నాయకుఁడు లేనట్లుండును. సూత్రధారుఁడు లేకున్నఁ బ్రయోగము జరుగదు. సూత్రధారుఁడు తన ప్రయత్నమును సామాజికులకుఁ దెలియఁజేసి, తనవారలతోఁగూడి సన్నద్ధుఁడగుటకుఁ బ్రయత్నింపవలయును. అది యాతని విధి.

అనంతరము రూపకమును గవియౌచితీవంతముగఁ జేయవలయునన్న సూత్రధారుని రంగస్థలమునుండి నిష్క్రమింపఁజేసి, తత్తత్పాత్రోచిత వేషధారుల నాయత్తపఱచుటకై యాతని కార్యవ్యాపృతునిఁ జేయుట యుక్తతరము. ఇట్లున్న యుక్తముగ నుండునని నాతలంపు. అట్లుగాక ప్రధానుఁడగు సూత్రధారుఁడు రంగభూమినుండి నిష్క్రమింపకయే, తానా రంగస్థలమున భాషకులసముక్షమున నిశ్చయించుకొనిన భావమును దెలియఁజేయకయే వేషధారులఁ బ్రవేశింపఁజేసినట్లు కవులు వర్ణించుట సాంప్రదాయికముగాదు... సంస్కృతభాషలోఁ బండితకవులు రచించిన కొన్ని రూపకములందు నా యీభావమునకు విధి వ్యతిరేకమైనట్లు చున్నది.

అపు డౌచిత్యమా ప్రస్తావనలో దూరదూరమగుచున్నది. ఎచ్చటెచ్చట కావ్యజీవమగు నా యౌచితి సన్నిహితము గాకున్నదో, యద్దానిఁ దెలిసికొనుట యుక్తము. సంస్కృతవాఙ్మయ మనంతము. కాన దిఙ్మాత్రప్రదర్శనమే యిందొనరింపఁ బడును. సంస్కృతభాషలోఁ గవిచంద్రులందరు నిట్లే యొనర్చిరని నే నన సాహసింపను. మహదౌచిత్యమును సంఘటించిన విశ్వ

* శ్రీవిజయనగర మహారాజ సంస్కృతకళాశాలావిద్యార్థి సమితి తృతీయసమావేశమునఁ జదువఁబడెను.

వాక్యములు పరిణత ప్రజ్ఞాలు వను కవి తల్లజులు లేకపోలేదు. అట్టియెడ రమ్యత నాటుకొనియే యున్నది.

సుభటకవి విరచితమగు దూతాంగదమను ఛాయా నాటకమునందలి ప్రస్తావనలో నిట్లున్నది.

"త్రిభువన పాలదేవస్య పరిషదాజ్ఞయాప్రబంధ విశేషమహ ముపక్రమమాణోఽస్మి......

...దూతాంగదం నామ చ్ఛాయానాటకమభినేతవ్యం"

నటీ—'అజ్జఉత్త! జుత్తం వవసిదం' అని ఈ మాటలలోని భావ మాలోచించునపుడు నటీ సూత్రధారు లింకను రూపకోచిత పాత్ర సజ్జీకరణమునకై ప్రయతింప వలసిన వారుగఁ దోఁచకపోరు. ఇదిట్లుండ వెంటనే కవి "తారాపతేర్వానరరాజలక్ష్మీం" మొదలగు వాక్యములను సజ్జీకృతపురుషు లాయా వేషముల ధరించి నేపథ్యమునఁ బలుకుచున్నట్లు చెప్పినాఁడు. తరువాత నున్న "ప్రారబ్ధమేవకుశీలవైః" అను సూత్రధారుని వాక్య మాచితినిఁ బోషించుచున్న ట్లగపడుటలేదు. ప్రధానుఁడును సజ్జీకరింపవలసిన వాఁడును నగు దాను రంగస్థలము నుండి నిష్క్రమించి యనుకార్యుల సరుస్థఁ జేయక యరూపకమును బ్రదర్శించుట కాతని జనము తెగినదెట్లు కాఁగలిగెను. పాత్రల నాయత్తముచేసియే సూత్రధారుఁడు రంగస్థలమునఁ బ్రవేశించెనా? అట్లయిన నాతని కత్యంతము సన్నిహితయై యుండు 'విలాసవతి'కిని దెలియదా? అట్టివాఁడు "ఉపక్రమమాణోఽస్మి" "అభినేతవ్యం" అనుట సామంజస్యము గూర్చునా?

ప్రసన్నరాఘవమున జయదేవకవి యిట్లు రచించినాఁడు. పరిషత్తుచే నభినేయము చూచుటకుఁ బలుకఁబడిన సూత్రధారునకు "తత్క్షణం పునరవధారణీయం కిం నామధేయం నాటకమితి" అని యను సమయమున నే రూపక మభినేయమో తెలియదు. ప్రధానుఁడగు నాతఁడేకదా పాత్రల నాయత్తము చేయవలసినవాఁడు. అనంతరము ప్రస్తావనాంతమున 'సాధు! భోః కుశీలవోత్తంస! సాధు" అను దాల్భ్యయనుని వాక్యమును కవి వినిపింపఁ జేసినాఁడు. సూత్రధారుఁ డంతకుఁ బూర్వమెట్లాచరింపవలయునో యాలోచింపలేదు. ఆతనికిఁ దెలియకుండగనే యొకనటుఁడు దాల్భ్యయను వేషము నేకరించినాఁడని తెలియఁజేసిన కవి బ్రహ్మ సూత్రధారుఁడు ప్రధానుఁ డనెడి విషయము నాలోచింపలేదా?

శ్రీరామవిజయమను నొకయాధునిక వ్యాయోగమున్నది. అది భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రి విరచితము. అందును నౌచిత్యమును బోషింపఁజాలని వాక్యము లున్నవి. "అహో! సిద్ధం వస్సమీహితం" "కథం?" "అభిమత రూపకలాభేన" అను వాక్యముల నాలోచించునపుడు సూత్రధారున కంతవఱకు కభినేయ మేమో తెలియదని తేలును. అతఁడు వస్తుతత్త్వమును దెలిసికొనిన తరువాతఁ బాత్రలఁ దత్తదనుగుణముగ సజ్జీకరింపవలసిన వాఁడు కదా! ఆవిషయమును బారిపార్శ్వకుఁడు తెలిసికొనియే "నేదానీం కాలవిలమ్బః కార్యః, తత్తద్భూమికా పరిగ్రహార్థం త్వర్యతాం నటవర్గః" అనినాఁడు. ఈ మాటచే సూత్రధారుని నటవర్గమునందలి ప్రాధాన్యము సుస్పష్టముగ నవగత మగుచున్నది. ఇట్టి సూత్రధారుఁడు రంగస్థలమునుండి నిష్క్రమింపక పూర్వమే నటులు భూమికాపరిగ్రహణము చేసినట్లు కవి చెప్పినాఁడు.

ఈ సంగతి "సాధు! భో! భరతపుత్ర! సాధు! సత్యముక్తం భవతా" అను కిష్కింధారపురవాసుల సంలాపముచే వ్యక్తమగుచున్నది. ఇఁక నిది యౌచితి నెట్లు పోషింపఁగల్గును?

మఱియుఁ గాళిదాస సమకాలికుఁడని కథానకములు చెప్పు, అరారాలపురవాస్తవ్యుఁడగు దిఙ్నాగుని కృతి యగు కుందమాలలో నిట్లున్నది. దిఙ్నాగాచార్యుని సూత్రధారుఁడు కుందమాలా ప్రయోగమునకుఁ బరిషదాజ్ఞప్తుఁడయి యిట్లనినాఁడు: "తదాస్య పదస్య సందర్భస్య ప్రయోగసాచివ్య విధాయినీ మార్యా మాహూయ రంగభూమి మవతరామి." అని ఇంతవఱకు సూత్రధారి పాత్ర సజ్జీకరణ మొనర్చినట్లు లేదు. అందుచే సహాయమున నపేక్షించి నటిని బిలిచినాఁడు. ఇది యిట్లుండగనే నేపథ్యమున "ఇత ఇతోఽవతరత్వార్యా" అని లంకేశ్వరుని భవనమునఁ జిరకాల మున్నదని లోకపరీవాద భయాకులు,

డగు రాముఁడు గర్భగుర్వియగు సీతను విడువ లక్ష్మణుం డు వనమునకుఁ దీసికొని పోవుచున్నాఁడు. ఇచ్చట పూర్వాపరవాక్యములకు సాంగత్యమేది? దేశాంతరీయ సంస్తూయమానకీర్తి కాళిదాసమహాకవి గూడ తన యభి జ్ఞానశాకుంతలమున నాయీ యభిప్రాయమునకు వైపరీ త్యమును జూపియున్నాఁడని నే నన సాహసించినందు లకు సహృదయులగు మీరు క్షమింపుఁడు. ప్రస్తావనాంతర్గ తనిగూఢతత్త్వమును దెలిసికొనక నే నిట్లుద్యమించిన, సాహితీనిష్ణాతులగు మీరలే నిర్ణేతృత్వము నొందవలయును. మహాకవి తన నాటకమున రచించిన సంవిధానమును జూడుఁడు:

"ఆర్యే! అభిరూపభూయిష్ఠా పరిషదియమ్. అద్య ఖలు కాళిదాసగ్రథితవస్తునాఽభిజ్ఞాన శాకుంతల నామధేయేన నవేన నాటకే నోపస్థాతవ్య మస్మా భిః తత్ప్రతిపాత్ర మాధీయతాం యత్నః."

అను సంతవఱకుఁ బాత్రసజ్జీకరణమునఁ బ్రయత్నకూర్తవ్య తయే యున్నదని తెలియుచున్నది గదా! తత్తత్పాత్రో చిత ప్రయత్న మొనరించి వేషధారుల రంగభూమి నవత రింపఁజేయుట యుక్తమని పొడగట్టుచున్నది. ప్రస్తుత ప్రస్తావనయం దట్లులేదు. సూత్రధారుఁడు రాగప్రలుబ్ధ బుద్ధియై రంగమునుండి నిష్క్రమింప లేదు. పాత్రసజ్జీక రణమునకును బ్రయత్నింప లేదు. ఈ పరిస్థితి యిట్లుండ

"తవాస్మి గీతరాగేణ హారిణా ప్రసభం హృతః;

ఏష రాజేవ దుష్యంత స్సారంగే ణాతిరంహసా."

అని సూత్రధారుఁడు పలుకుచున్నాఁడు. ఈ స్థలమున 'ఏష' అను పురోవర్తినిర్దేశముచే దుష్యంతపాత్రధారి యగునటుఁడు రంగమునకు రానున్నట్లు తెలియుచున్నది. సూత్రధారుఁడు పాత్రలసజ్జీకరింప లేదే? ఈసంవిధాన మెట్లు జరిగినదో?

రసగ్రహణపటులారా! నాభావమిభిన్నతగల ప్ర స్తావనల నిప్పుడు చూపితిని. ఔచితీసహితముగఁ బ్రస్తావ నల రచించిన కవిచంద్రులున్నారనియే పూర్వము మనవి చేసితిని. బహుగ్రంథముల చూడమి నే నావిషయమున నుదాహరణముల నెక్కుడు చూపలేను. అయినను మచ్చున కొకటిరెండు రమణీయతరరూపకముల రచించిన భాస మహాకవిని మనమందర మెఱుంగుదుము. ఆతని రూపక ములందలి ప్రస్తావనలు రత్నములు. భాసకవి ప్రస్తావనా రచనమునందే కాక కథా సంవిధానాది తదితర విషయ ములందును ముందుగఁ జేర్కొనఁ దగినవాఁడు. తత్కృతి యగు ప్రతిమానాటకమున సరసతకుఁ గాని, యౌచి త్యమునకుఁగాని కూర్పులోని సారళ్యమునకుఁ గాని లోటు కన్పడదు. మున్ముందు బుతుగాన మొన ర్చుటకు రాఁబోవు పాత్రల సూచించుటకు, రంగ మంగళసంపాదనకు భాసుని ప్రస్తావన పర్యాప్తము. ఆ ప్రస్తావనలోని రమ్యమధురరసమును మిమ్ములఁ గ్రోలఁ జేయుటకు నిచట దాని వ్రాయుట యుచితము.

నాంద్యంతమున—

సూత్ర. ఆర్యే! ఇతస్తావత్

(ప్రవిశ్య) నటీ. ఆర్య! ఇయమస్మి.

సూ. ఆర్యే! ఇమమేవశరత్కాలమధికృత్య గీయతాం తావత్.

నటీ. ఆర్య! తథా (గాయతి)

* * * * *

సూత్ర. అస్మిన్హి కాలే.

"చరతిపులినేషుహంసీ

కాశాంశుకవాసినీసుసంహృష్టా,"

(నేపథ్యే)

ఆర్య! ఆర్య!

(ఆకర్ణ్య)

భవతువిజ్ఞాతం.

"ముదితానరేంద్రభవనే

త్వరితా ప్రతిహారరక్షీవ."

(నిష్క్రాన్తా.)

ఈప్రస్తావనయందు లోటు కన్పడుటలేదు.

సూత్రధారుఁ డంతకుఁ బూర్వమే సజ్జీకృత పాత్రుఁడై ప్రవేశించి సామాజికుల కావిషయమును రమ్య తరముగ ధ్వనితము చేసినాఁడు. పాత్రప్రవేశమును సరస ముగఁ జూపినాఁడు.

పరిణతప్రజ్ఞుఁడగు భవభూతి మహాకవి యుత్తర రామచరిత ముత్తమమయినది. అందుఁ బ్రస్తావన యెంత ప్రశస్తముగనున్నదో చూడుఁడు.

"సూత్ర. అస్తిఖలు................ భవభూతిర్నామ.

యం బ్రహ్మాణ మియం దేవీ వాగ్వశ్యేవాన్వవర్తత;
ఉత్తరం రామచరితం తత్ప్రణీతం ప్రయోక్ష్యతే."

ఈ వాక్యమును బరిశీలించునపుడు సూత్రధారుఁడు తా నొనరించిన ప్రయత్నమును భావుకులకుఁ దెలియుటకై రంగస్థలమునకుఁ బ్రవేశించినట్లు తెలియును. పిమ్మట సూత్రధారుఁ డాయోధ్యకుఁడై తెలియఁజేయవలసిన విషయమును సరసముగఁ దెలియఁజేసినాఁడు. పాత్రప్రవేశమును రమణీయముగఁ జేసినాఁడు. "ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే" అనులోకోక్తి బయలు దేరుటకు నీరమ్యతర ప్రస్తావనారచనము గూడ హేతువయి యుండనోపు.

గ్రంథములందుఁ బరస్పరము వాక్యములు విరోధింపకుండునట్లు రచించుట యౌచితీమహత్వమును. అది లేకున్న వైరస్యభావ ముదయించును. నే నీ వ్యాసమున, సారస్యభంజకములగు విషయములు మహాకవుల ప్రస్తావనలందుఁ గన్పడుచున్నవను భావమున సూచింప సాహసించినందులకు సహృదయులు నన్ను క్షమింతురు గాక.

---

# ప్రాఁకులు

ఉభయభాషాప్రవీణ, మిన్నికంటి గురునాథశర్మగారు

పండినపండ్ల మెక్కుచును భద్రముగా వసియించుచుండు నీ
యండను జేరి కోటరమునందు విహంగము లెన్ని యేని, అ
ట్లుండియు నీటివేగమున నుక్కిరిబిక్కిరిగా భ్రమించు నీ
గండము సూచుచుండెడిని గట్టి! తటస్థములై తరూత్తమా!

మొదట న్నీడ నెలర్చి, యావల సుమంబుల్ గూర్చి, యాపై రుచి
ప్రదముల్ పండ్ల నొసంగి, యంతఁ బథికవ్రాతంబు సౌఖ్యంబున
న్మొదలం జేయుదు కాని యెవ్వఁ డెఱుఁగు న్నీ కోటరంబుఁదు భీ
ప్రదహాలాహల కీలికాప్రకరవక్త్రివ్యాళ వాహ్యాళులన్.

జనసం బేల చతుష్పథంబున? సరే, ఛాయ న్విడంబింప నే
ల? నితాంతంబు ఫలింప నేల? ఫలము ల్గన్న న్విసమ్ముండవై
తనరం జెల్లునె? కావునం గద తరూత్తంసంబ! శాఖావిహా
టనము న్మోటనముల్ లభించెడిని దుష్టశ్రేణి మూలంబునన్.

తీయనిపండ్లఁ బత్రములఁ దేరిననీడలఁ బూల నేరికిన్
సాయము సేసితో మునుపు త్యాగిమ! వా రిపు డేరి? నీ వెతం
ద్రోయఁగఁ; బైని నంటు మెయిఁ బ్రోదని గాంచుటఁ దొల్త కాయమున్
బాయును గొడ్డటం బెరడు; ప్రాణుల కీగుణముల్ సెలంగునే?

స్థూలమగు మూల, మధికబంధుర పరస్ప-రానుబద్ధము శాఖాచయమ్ము,మాంస
లమ్ము త్వక్కు,నీ కేమిభయమ్ము ?తరువ!-కాంచు ననియొ దావానలఘస్మరుండు.

మచ్చిక గంధవాహ సుకుమారునిచేఁ బిలిపించి చాయకు
న్వచ్చిన యాచకావళికిఁ బచ్చిక రెమ్మల మంచునీరు నం
దిచ్చి సుపాద్య మీప్సిత సమృద్ధఫలంబుల నిచ్చుద్రుమాఁక! నీ
గ్రచ్చపాదల్ పదంబులఁ బెనంగొనుటల్ గని మెట్టు లోర్చుటల్.

పురందరుని యంత వాఁడడిగెఁ బో ననుం దీనుఁడై
కిరంబులను జాఁచి దుర్భరముఁ గల్మషోద్వేగమున్
బరిగ్రహణ మాచరింప; నని వాగెదే కాని వా
హ్వారే! బదులు గోరవే వరము వాని? వృక్షాగ్రణీ!

చెప్పెద నొక్కమాటఁ జెవిఁ జేర్పవె, వృక్షమ! వృత్తి మార్చవే!
ఎప్పుడు యాచకావళి కభీష్టపదార్థచయం బవారిగా
గుప్పుచుఁ గీర్తికాంత యుపగూహనమున్ గొనుచుందు గాని నీ
వెప్పుడు స్వప్నమందయిన నెంచకె కంటకపాళిఁ గూడఁగన్.

మానవసేవ సేసెదము మానక మే మనుమాన మూన క
స్త్రైనను నిర్దయాత్ములయి యక్కట! హింస యొనర్ప సాగి రీ
మానవు లంచు నెంచెదవు ద్రుమాన! దోసం గది మీఁదె; మీ కుల
స్థానుఁడు మొండికట్టె చొరసాగెనయా! పగవాని గొడ్డలిన్.

(అడవి పువ్వులు)

---

# నిష్కంటక నిరాఘాట ఘంటాపథ వినాశనము

అను

## ఉత్తరరామచరితనాటక రసవిచార ఖండనము

వేంకట లక్ష్మీనారాయణులు

బ్రహ్మశ్రీ కొంపెల్ల సుబ్బారాయశాస్త్రిగారు శుక్ల సంవత్సరాషాఢ శ్రావణమాస భారతులలో "ఉత్తరరామచరిత్రనాటకరసవిచారము" అను వ్యాసమును బ్రకటించిరి. ఈనాటకమందలి రసము కరుణ విప్రలంభ శృంగారమని వారియాశయము. వారివాదమున కుపష్టంభకము లగు యుక్తులు కుమారతాతార్యకృతోత్తర రామచరిత వ్యాఖ్యయగు "కల"లోనివని బ్రహ్మశ్రీ మల్లాది రామమూర్తి శాస్త్రిగారు గడచిన ఆశ్వయుజ మాసపత్రికలోఁ బ్రకటించియున్నారు. ఆపత్రికయందే బ్రహ్మశ్రీ మున్నంగి లక్ష్మీనృసింహ శర్మగారు "బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారు సూత్రప్రాయముగఁ జూపిన విషయములు కొంపెల్ల సుబ్బారాయశాస్త్రిగారు విస్తరించిరి" అని వ్రాసిరి. నిజమే కావచ్చును. అయినను మే ముత్తరరామచరితనాటకరస విచారమును విమర్శించు సందర్భముల శ్రీసుబ్బారాయశాస్త్రిగారి పేరునే యుదాహరింతుము.

శ్రీసుబ్బారాయశాస్త్రిగారు "కరుణరస ప్రాధాన్యవాదులు తమవాదమున కుపష్టంభకముగాఁ జూపు ప్రమాణము లును, యుక్తులును నెవ్వియనిన" అని వ్రాసి, మొత్తము పదునెనిమిదిఁ జూపి, "ఇట్లు కరుణరసవాదులు చూపు పదునెనిమిదింటికిని క్రమముగఁ బ్రత్యుత్తరము లీక్రింద వ్రాయఁబడుచున్నవి" అని వ్రాసిరి. పదునెనిమిది యుక్తులనే కరుణరసవాదులు చూపుచున్నారను వీరివ్రాఁత కాధారము లేదు. ఇంతకంటె నెక్కువయుక్తు లున్నపుడు వీరివ్రాఁత కసమంజసత వాటిల్లెడిని. శ్రీశాస్త్రిగారు తా మిందు వ్రాసిన పదునెనిమిదింటిని కరుణరస వాదుల యుక్తులని వ్రాయుటకంటె "కరుణరసవాదు లీ యుక్తులఁ జూపింతురేమో" అని వ్రాసి సిద్ధాంతీకరించుట యుచితము. ఇదియే శాస్త్రసిద్ధాంతరీతి.

వీరు కరుణరసవాదుల ౧, ౨, ౩, యుక్తులకుఁ జెప్పిన సమాధానములు మాకు విప్రతిపన్నములు కావు.

శ్రీశాస్త్రిగారు "రాముఁడు-హా కష్టమ్, అతిబీభత్సకర్మా నృశంసోఽస్మి సంవృత్తః.

శైశవాత్ప్రభృతి పోషితాం ప్రియాం
సౌహృదాదపృథగాశ్రయా మిమామ్,
ఛద్మనా పరిదదామి మృత్యవే
సౌనికో గృహశకుంతికా మివ."

............... దెయోఽహం.

విస్రంభా దురసి నిపత్య జాతనిద్రా
మున్ముచ్య ప్రియగృహిణీం గృహస్యలక్ష్మీమ్,
ఆతంకస్ఫురిత కఠోరగర్భగుర్వీం
క్రవ్యాద్భ్యో బలి మివ దారుణః క్షిపామి.

అని సీతపాదములను శిరంబున నునిచికొని, 'అయం పశ్చిమ స్తే రామశిరసి పాదపంకజస్పర్శః' అని యేడ్చుచున్నాఁడు. దీనివలన రాముఁడు సీతావిషయమునఁ గేవల నిరాశఁ జెంది యిదియే కడపారిగా భావించుచున్నట్లు స్పష్టమగుచుండఁ, బిమ్మట రాముని హృదయమున శోకమే కాక శృంగార రసస్థాయిభావమగు రతి యంకురించుట కయిన నవకాశము గలదా" అని కరుణరసవాదుల వాల్గవయుక్తిం దెలిపి, "ఇందు రాముఁడు" 'బాల్యము నుండియు నకృత్రిమ పరమానురాగముతో నన్ను సేవించుచున్న మహాసాధ్వి నిప్పటివఱ కుపలాలించుచుండి, యిప్పుడు మిష పెట్టి ఘోరారణ్యములో నేకాకినిగా విడిచి హింసింపఁదలఁచిన మహాపాతకిని. ఇట్టి దారుణ కార్య మొనరించి నా యైహికమంతయును నిరర్థకము చేసికొనుచున్నాఁడను' అని నిర్విణ్ణుఁడై యేమేమియో తలంచి విలపించుచు, సీతాపాదములను శిరంబునం గీలించి

యుదిరమే కడసారియని యేడ్చుచున్నాఁడు." అని వివరణము వ్రాసి, "ఇదియంతయు సీతాపరిత్యాగ పూర్వవృత్తాంతమే కావున నిదియును కరుణసాధకము కాదు" అని సమాధానము వ్రాసి, "భావిసీతామరణ సంభావనయే కరుణసాధకమైనయెడ 'జాతస్య మరణం ధ్రువ' మ్మని యున్నది కావున సర్వత్ర కరుణరసమును సాధింపవచ్చును" అని వ్రాసిరి.

మీఁది కరుణరసవాదులయుక్తి రామునకు రతిసంస్పర్శము లేని శోకమును నిరూపించుచుండఁగా నాయుక్తి భావిసీతామరణ సంభావనోపష్టంభకముగాఁ జెప్పిరని భ్రాంతిపడి యాయుక్తి కరుణరససాధకము గాదని చెప్పిన యీసమాధాన మెంత సమంజసమో రసగ్రహణ ధురీణులకు గోచర మయ్యెడిని. కరుణరసవాదులు రామునకు శోకమును నిరూపించి రామునకు సుఖల సీతాసమాగమమునందాస లేమిం జేసి తత్ప్రయోజ్యమగు రతి లేమినిస్థాయిభావము లేకపోవుటచే శృంగార రసము కాక కరుణమే రసమగుచున్నదని నిరూపించిరి, కాని రామునకు సీతామరణసంభావన యుండెనని కాదు. ఇట్టిచో వీరి సమాధాన మెట్లు పూర్వపక్ష నిరాకారకమో తెలియదు. నాయకునకుఁగాని, నాయికకుఁగాని వియోగము సావధికమని తెలిసినపుడుగదా పునస్సమాగమాశ యుండుట. నిరవధికత్వ జ్ఞాన మున్నపుడో, ఆయాశ శశశృంగాయమాణమగును. రామునకు సీతావియోగ నిరవధికత్వ జ్ఞాన ముండె ననుటకు "అద్యావసితం జీవితప్రయోజనం రామస్య; దుఃఖసంవేదనా యైవ రామే చైతన్య మాహితమ్" అను కరుణ రసవాదుల ప్రమాణములు ప్రమాణములే యగును. నిరవధికత్వజ్ఞాన ముండెనని తెలుపుటకే కవి "జీవిత ప్రయోజన"మ్మని ప్రయోగించినాఁడు. శోకభారముచే చెల్లడిసేయవలెనన్న "అద్యావసితం జీవిత" మ్మనియే ప్రయోగించును. అట్లు గాక "జీవితప్రయోజన"మ్మనుటచేఁ దన జీవితమునకుఁ బ్రయోజనమగు జానకీసమాగమము నేఁటితో సమాప్తమనియు, జీవితాంతమునకును జానకీ వియోగమునకు సావధికత్వము లేదనియుఁ దెలియఁబడుచున్నది.

"దుఃఖసంవేదనాయైవ" అనుచో నేవకారము గూడ నిటులపై జీవితమునకు దుఃఖసంవేదనమే ప్రయోజనము కాని సీతాసమాగమము కాదని తెలుపుచుఁ దైనిరవధికత్వమునే క్రమ్మఱ చాటుచున్నది. రామునకు సీతావియోగ నిరవధికత్వజ్ఞాన మున్నదనుటకు మున్ముం దెన్నియో ప్రమాణములు చూపింతుము. శ్రీశాస్త్రిగారు మృతత్వనిశ్చయము లేనియెడఁ గరుణము కాదను నభిప్రాయమును మనమం దుంచుకొని, ౫, ౬, ౭, ౮ నెంబర్లుగల కరుణరసవాదుల యుక్తులను విమర్శించుచో నాయుక్తులు మృతత్వనిశ్చయ సంపాదకములు గావనియు, మృతత్వనిశ్చయ మెప్పుడు లేదో యప్పుడు రసము కరుణము గాదనియు సిద్ధాంతీకరించిరి. ౫, ౬, ౭, ౮ నెంబర్లుగల యుక్తులు మృతత్వ నిశ్చయసంపాదకములు గావన్నమాట మేము నంగీకరించునదే, కాని మృతత్వనిశ్చయము లేనప్పుడు కరుణరసము గానేరదను శాస్త్రిగారి యూహ నిరాధారమని మున్ముందు సప్రమాణముగ నిరూపించుచున్నాము. మృతత్వనిశ్చయము రామునకుఁ గలదనుట కుపష్టంభక మైన కరుణరసవాదుల తొమ్మిదవయుక్తికి పైయుక్తి మృతత్వనిశ్చయ సంపాదకము గాఁజాలదని శ్రీ శాస్త్రిగారు చెప్పిన సమాధానము మా కుపపన్నమే. ౧౧ వ యుక్తియొక్క సమాధానముగూడ మే మంగీకరించినదే.

ఇఁక పదునొకండవ యుక్తికి శ్రీ శాస్త్రిగారు చెప్పిన సమాధానముం గూర్చి విచారింతము. కరుణరసవాదులు "అన్యఏవాయ మధునా విపర్యయో వర్తతే.

ఉపాయానాం భావా దవిరల వినోదవ్యతికరై
ర్విమర్దై ర్వీరాణాం జనితజగదత్యద్భుతరసః;
వియోగో ముగ్ధాక్ష్యా స్సఖలు రిపుఘాతావధి రభూ
త్కటుస్తూష్ణీం సహ్యో నిరవధి రయం త్వప్రతివిధిః."

ఇత్యాదికముచే రామునకు సీతా ప్రాప్త్యాశ లేదని నిరూపించిరి. శ్రీ శాస్త్రిగారు "పూర్వవిరహము శత్రుకృత మగుటవలన శత్రుసంహారమవధిగాఁగలది. కావున నుపాయములచే దరిఁగాంచితిమి. ఇప్పటి విరహము స్వయంకృత మగుటవలన నిరవధి. అవఁగా నవసానకా

సంభావన కవకాశములేనిది. కావునఁ బ్రలపింపక యెట్లూరక సహింపవగును? ఎంతకష్టము, హా! ప్రియురాలా! పూర్వమున నుపయోగించిన సుగ్రీవ సఖ్యాద్యుపాయములకు గోచరముగాని యేప్రదేశమందుంటివి" అని రాముఁడు విలపించెను అని పై శ్లోకములకు వివరణము వ్రాసి, "ఇట రామునకుఁ బ్రాప్త్యాశ లేకపోలేదు" అని సమాధాన మిచ్చిరి. శ్రీశాస్త్రిగారు "ఇటరామునకుఁ బ్రాప్త్యాశ లేకపోలేదు" అని వ్రాసి కారణము చూపకపోవుటచే నించుకంత జ్ఞానముగల పాఠకులకైనను నీ రీసమాధానమునందు నీల్గున...... విశదము. లక్ష్యవ యుక్తులకు సరియగు సమాధానములు చెప్పి యీ యుక్తి శ్రీశాస్త్రిగారట్టి సమాధాన మొసంగకుంటుట శోచనీయము. పై శ్లోకములను వివరించుచు శ్రీశాస్త్రిగారు "ఇప్పటి విరహము స్వయంకృత మగుటవలన నిరవధి" అని వ్రాసి నిరవధి యను పదమునకు సరియగు నర్థస్ఫూర్తిగలుగనని "అనఁగా వనవాస కాల సంభావన కవకాశములేనిది" అని వివరించిరి. పై వ్రాఁతవలన శ్రీశాస్త్రిగారుకూడ రామునకుఁ బ్రాప్త్యాశ లేకపోవుట నంగీకరించినట్లు గన్పట్టుచున్నదే. కాని యూవల "ఇట రామునకుఁ బ్రాప్త్యాశ లేకపోలేదు" అని వ్రాసి శాస్త్రిగారు రామునకుఁ బ్రాప్త్యాశకలదని సమాధానము చెప్పిరి. అట్లగుటఁ బై రెండు విషయములకుం గల విరోధ మపరిహార్యము. విరహము నిరవధికమని యంగీకరించినవారు ప్రాప్త్యాశలేదని యొప్పుకొనవలయునుగదా!—

ఇఁక శాస్త్రిగారు కరుణరసవాదుల పంద్రెండవ యుక్తికి చెప్పిన సమాధానమునుగూర్చి విచారింతము.

"ఏకోరసః కరుణ ఏవ నిమిత్తభేదా
ద్భిన్నః పృథక్పృథగివ శ్రయతే వివర్తాన్;
ఆవర్తబుద్బుద తరంగమయాన్ వికారా
నంభోయథా సలిలమేవహి తత్సమస్తమ్."

అని తమస వచించెను. "భవభూతి యీ నాటకము కరుణరస ప్రధానమని స్వాభిప్రాయమును దమసా ముఖమున వెల్లడించెను. నాటకకర్తయే ప్రధానము కరుణరసమనియుఁ, దక్కినవి దాని వివర్తములనియుం జెప్పినాఁడు కదా!" అని కరుణరసవాదుల వాదము. శ్రీశాస్త్రిగారు పై శ్లోకమును వివరించుచుఁ గరుణపదమునకుఁ గరుణవిప్రలంభమని యర్థము చెప్పి, "భవభూతి యిచ్చటఁ గరుణపదమును స్వార్థమందుఁ బ్రయోగించి యుండఁడు. కరుణరసమందే భవభూతి తాత్పర్యమై యిట్లు కరుణపదమును బ్రయోగించినయెడ స్వశబ్దవాచ్యత్వ రూప రసదోష మనివార్యమగుటవలన "కవయః కాళిదాసాద్యాః భవభూతిర్మహాకవిః" అని పేరుఁగాంచిన యిమ్మహాకవి పై నవభిజ్ఞతాశనిపాత మవ్యాహతమగును చిత్తగింపుఁడు" అని వ్రాసిరి. దీనింబట్టి చూడఁగా శ్రీశాస్త్రిగారికి "కరుణః" అను పదమునకుఁ గరుణరసమని యర్థము చెప్పినయెడ నీ రసమునకు స్వబోధకశబ్దవాచ్యత్వ దోషము వాటిల్లుననియుఁ, గరుణవిప్రలంభమని యర్థము చెప్పునప్పుడా దోషము గలుగదనియు నభిప్రాయమున్నట్లు స్పష్టమగుచున్నది. రసమునకు స్వశబ్దవాచ్యత్వరూపదోషము వాటిల్లుననఁగా, వ్యంజకములగు విభావాదులచే రసము వ్యక్తమగునప్పుడా రసమును స్వబోధకశబ్దముచేఁ జెప్పఁగూడదనుట. ఈ సంగతి సర్వాలంకారిక సమ్మతము. ప్రస్తుత మీ నాటకమునఁ గరుణమే రసమై యయ్యది విభావాదులచే నభివ్యక్త మయినప్పుడు తద్బోధకపదముచే నారసమును బోధింపఁగూడదుకదా "ఏకోరసః కరుణః" అను నప్పుడు కరుణపదమునకుఁ గరుణరసము నర్థము చేయరాదనికదా కరుణవిప్రలంభవాదులు వాదించుచున్నారు. పైదోషము కరుణపదమునకుఁ గరుణవిప్రలంభమను నర్థము చేసినప్పుడు వాటిల్లునో వాటిల్లదో చూతము. ఈ నాటకమునఁ గరుణవిప్రలంభము రసమని యొప్పుకొన్నను సీతప్రస వ్యంజకములైన విభావాదులచే నీ రస మభివ్యక్తమగును. పిదప నీ రసమును బోధించు కరుణపదముచేఁ గరుణవిప్రలంభమును స్పష్టముగ బోధించుటచే రసమునకు స్వశబ్దవాచ్యత్వదోష మవస్థితమే కనుక నీయుక్తి కరుణరసవాద నిరాకారకము కాదు. పై శ్లోకమునందుఁ గరుణపదమునకుఁ గరుణవిప్రలంభమని యర్థము చెప్పుటకే వీలులేదని సప్రమాణముగ మున్ముందు నిరూపింతము. రసమునకు స్వశబ్ద

వాచ్యత్వము కూడదని శ్రీ శాస్త్రిగారు ప్రమాణపురస్సరముగఁ జెప్పి పిమ్మట కరుణరసవాదుల యుక్తి నొకదానిని నెలవిచ్చి సిద్ధాంతీకరించిరి. అదెంతవఱకు సమంజసమో విమర్శింతము.

"కొందఱు '......మరణ నిశ్చయము కలిగియుండిననే కరుణరసమగుననుటను నియమమిన్చుట నవసరము లేదు. మరణనిశ్చయము లేకున్నను గరుణరసము కావచ్చును. ప్రవాసవిప్రలంభాదులయందు భావిసంప్రయోగ నిశ్చయము కలదు. కావున వానియందు ప్రవాసవిప్రలంభాది విషయము. భావిసంప్రయోగ నిశ్చయము కలిగినది కావుననే మరణనిశ్చయమున్నను జంద్రాపీడునితో మహాశ్వేత సంభాషించిన వాక్యములయందు విప్రలంభమని యంగీకరించుచున్నారు. ప్రకృతమున రామునకు భావిసంప్రయోగనిశ్చయముగాని, తత్ప్రయత్నముగాని లేనందున మరణ నిశ్చయము లేకున్నను గరుణరసమనియే చెప్పవలెను' అని వాదించుచున్నారు" అనునది కరుణరసవాదుల యుక్తియని చెప్పి, దానికి శ్రీ శాస్త్రిగారు "సీతారాముల పరస్పరానురాగ మనన్యసామాన్యము, అనితరవేద్యము.............. ... ............... ఇట్టి లోకోత్తర పరమానురాగమున్నను లోకాపవాదముఁ దొలఁగించుకొను నుపాయము స్వాధీనముగా లేనందునను, శాస్త్రశిష్టసమ్మతి కులాచారపిత్రాచారముల ననుసరించి లోకరంజనము స్వధర్మమగుటవలనను విధిలేక సీతను నిష్కారణముగా విడువవలసివచ్చును. అయినను రాముని హృదయమున నాటియున్న రతి నశించుటకు హేతువు లేదు.........ఇట్లుండ రాముని హృదయమున శోకేతరభావము నిలిచియుండుట కవకాశము లేదనుట యతి సాహసము." అని సమాధానము చెప్పిరి. ఈ సమాధానమున శాస్త్రిగారు ధార్ష్ట్యమునే యవలంబించిరి. కరుణరసవాదులు భావిసంప్రయోగ నిశ్చయము రామునకు లేదని వక్కాణించుచుండ రతి నశించుటకు హేతువు లేదని సమాధానము చెప్పుట యసంగతము – రతి నశించుటకు భావిసంప్రయోగ నిశ్చయము లేకపోవుటయే హేతువగుచుండఁగా రతి నశించుటకు హేతువు లేదనుట శ్రీ శాస్త్రిగారి యవిమర్శకతను బోధించుచున్నది. రతి నశించుటకు హేతువు లేదనుటలో రత్యభావమునకుఁ గరుణరసవాదులు చూపిన భావిసంప్రయోగ నిశ్చయాభావ రూపమగు కారణము లేదని శ్రీ శాస్త్రిగారి యభిప్రాయము. ఇప్పట్టున శ్రీ శాస్త్రిగారు రతికి హేతువగు భావిసంప్రయోగనిశ్చయము రామున కే రీతిగనున్నదో తెలుపవలసియున్నది. కాని యీ విషయమును శ్రీశాస్త్రిగారు చల్లగా జారవిడిచిరి. ప్రమాణరహితమయిన రతిసత్తను నిరూపించి శోకము తద్ధేతుక మగుటవలన నా శోకము రత్యంగమగుచున్నదని శాస్త్రిగారు చెప్పుచు నిట రతికే ప్రాధాన్యముగాని శోకమునకుఁ బ్రాధాన్యము లేదని యుక్తిని వ్రాసిరి.

రామునకుఁ బునస్సమాగమాశ లేమిని రతి నశించినదనియు, శోకమే యంగి యగుచున్నదనియుఁ గరుణరసవాదు లుద్ఘోషించుచుండ శాస్త్రిగారది చెవిని బెట్టక తమ పట్టువీడక, ప్రమాణములు చూపక రతి యున్నదని చెప్పుచు శోకమంగి కాదని చెప్పుట యసమంజసము.

మఱియు శ్రీశాస్త్రిగారు "ఎట్లయినను నిర్వేదాదిసమున్మేషమాత్రముచేతనే శోకమునకు స్థాయిత్వము నంగీకరించుచో ప్రవాసాది విప్రలంభములన్నిటియందును శృంగారవ్యవహార ముత్తమించును. కావున సకలాలంకారిక వచనవిరోధము దుర్వారమగును. శోకము రత్యంగమగుట "ప్రవాసాది విప్రలంభములందు చరితార్థమగునుగాని యిచ్చటఁ గాదనుటయు యుక్తము కాదు. ప్రవాసాది విప్రలంభములకును దీనికిని భేదము నిరూపింప శక్యముగాదు" అని వ్రాసిరి.

నిర్వేదాది సమున్మేషమాత్రము చేతనే శోకమునకు స్థాయిత్వము లేదనుట నిర్వివాదమే; కాని నిర్వేదాది సమున్మేషమున్నను పునస్సమాగమాశ యుండుటంజేసి ప్రవాస విప్రలంభాదులందు శోకమునకు స్థాయిత్వము లేదు. ఈ నాటకమందన్ననో: నిర్వేదాది సమున్మేషమును, పునస్సమాగమాశాభావమును నుండుటంజేసి శోకమునకు స్థాయిత్వము నంగీకరింపక తప్పదు. అట్లగుటఁ బ్రవాసవిప్రలంభాదులకును, సీతన్నాటకరసమునకును భేదములేదని చెప్పిన శ్రీశాస్త్రిగారివాదమపాస్తమగుచున్నది.

మఱియు "నాయికయొక్క జీవననిశ్చయమును, దానియ భావము నను నీరెండింటిని బట్టి వైలక్షణ్యము గలదని చెప్పుటయు నుచితము గాదు. ఆవిషయమునను వానికిని దీనికిని భేదము లేదు. అదియును గాక హిరణ్మయప్రతికృతిని సహధర్మచారిణిగాఁ జేయుటచేత సీతాజీవితనిశ్చయమే యిందుఁ జెప్పితీరవలయును." అని శాస్త్రిగారు వ్రాసిరి. మృతత్వనిశ్చయము రామునకు లేదన్నమాట మేమంగీకరించినదే. హిరణ్మయప్రతికృతిని సహధర్మచారిణిగాఁ జేయుటచేత రామునికి సీతాజీవత్వ నిశ్చయమే యున్నదని చెప్పిన శ్రీశాస్త్రిగారి వాదము మాత్రమంగీకార్యము కాదు. రామునకు సీతాజీవిత నిశ్చయమునే శాస్త్రిగారంగీకరించినచో "క్రవ్యాద్భిరంగలతికా నియతం విలుప్తా" ఇత్యాదులచే రామునకు మృతత్వ సంభావనయే కాని మృతినిశ్చయము లేదని చెప్పిన శాస్త్రిగారి పూర్వవచనమునకు వ్యాహతి వాటిల్లెడిని. మృతత్వ సంభావన యున్నపుడు జీవితత్వనిశ్చయమునకును, జీవితత్వ నిశ్చయమున్నపుడు మృతత్వ సంభావనకును నసత్వము సర్వజనీనము. కావున మృతత్వసంభావన నంగీకరించిన జీవితత్వనిశ్చయము లేదనికాని, జీవితత్వనిశ్చయము నంగీకరించినయెడ మృతత్వసంభావన లేదనికాని యంగీకరింపకతప్పదు. మఱియు హిరణ్మయప్రతికృతికరణముం బట్టి జీవితత్వనిశ్చయము నంగీకరించినచో శాస్త్రిగారికి మృతత్వ సంభావనామాత్ర ప్రమాణములైన "నియతం విలుప్తా" ఇత్యాదులతో శాస్త్రిగారి వాదమునకు విరోధము వాటిల్లెడిని.

కావున రామునకు సీతామృతత్వ నిశ్చయమును లేదు. తజ్జీవితత్వనిశ్చయమును లేదని చెప్పితీరవలయును. మృతత్వనిశ్చయము లేనంతమాత్రముచేతనే ప్రతికృతికరణముపపన్నమగుచుండఁగా జీవితత్వనిశ్చయము లేనిచోఁ బ్రతికృతికరణ మనుపపన్నమనుటలోఁ దమపట్టుదల యనివార్యమని కాఁబోలు శాస్త్రిగారి యూహ.

మఱియు రామునకు సీతాప్రాప్త్యాశ కలదనుట కింకొకయుక్తిని దెలిపియున్నారు. "ఇదియును గాక జీవితత్వనిశ్చయము లేనియెడఁ బ్రాప్త్యాశకుఁ గారణాంతరము లేనందున నది లేకపోఁగాఁ బ్రాప్త్యాశచేతనే నిర్వహింపఁదగిన గర్భసంధికే యుచ్ఛేదాపత్తి కలుగుటచేత నీనాటకమునకే యలాక్షణత్వమాపతిల్లుచున్నది." అని.

పైవిషయమును శ్రీశాస్త్రిగారు స్థూలదృష్టితో నాలోచించి వ్రాసినట్లు కన్పట్టుచున్నది. నాటకమం దుండవలసిన గర్భసంధి "ప్రాప్త్యాశచే" నిర్వహింపఁదగినదగుటవలనఁ గవి యేరీతిగనైన ప్రాప్తిఁ దెలుపవలెనని యాలంకారికుల యభిప్రాయము. కాని నాయకునకుఁ బ్రాప్త్యాశ యున్నపుడే గర్భసంధియగునని కాదు. కావుననే ఋషి దేవతా శ్రేయోవితరణ రూపమగు బీజమును మురళా తమసా వాక్యములచేఁ గవి యన్వేషించినాఁడు.

శాస్త్రిగారి యుక్తి యెంత సమంజసమో పాఠకుల కిప్పటికి తెలియఁగలదు. ఇంతియు వ్రాసి శాస్త్రిగారు "అట్లయినచో నిందలి రసము కరుణముగా ననుభవగోచరమగునా? శృంగారముగా ననుభవగోచర మగునా? అనిన కరుణవిప్రలంభ శృంగారముగా" నని సదుత్తరము" అని వ్రాసిరి.

కరుణవిప్రలంభమును సాధింపనెంచిన శ్రీశాస్త్రిగారినిఁ బోలువారికి రసము కరుణవిప్రలంభముగా గోచరింపవచ్చును. కాని యసంఖ్యాకులగు కరుణరసవాదులకుఁ గరుణరసముగా గోచరించును. ఇట్లుండ శ్రీశాస్త్రిగారు "కరుణవిప్రలంభముగా నని సదుత్తరము" అని వ్రాయుట పొరపాటు. కరుణరసవాదు లసంఖ్యాకులనుటకు "బహుజనసమ్మతమగు కరుణరస ప్రాధాన్యము నంగీకరించుటకెంతమాత్రమును నా యంతరాత్మ సమ్మతించుట లేదు" అని వ్రాసిన శాస్త్రిగారే ప్రమాణము.

మఱియు శాస్త్రిగారు

"యత్రైకస్మిన్ విపన్నే ఽన్యో మృతకల్పోఽపి తద్గతమ్;
నాయకః ప్రలపేత్త్వేష్ణా కరుణోఽసౌ స్మృతో యథా.

..............................................

స్త్రీపుంసయో ర్భవేదేవ సాపేక్షస్సంగమే పునః;
శృంగార ఏవ ప్రాయః కరుణ స్సాప్యతోఽన్యథా."

ఇత్యాదికముచేఁ గాదంబరియందు మహాశ్వేతకును, కుమారసంభవమున రతికిని నిష్టజనమరణమున్నను జంద్రమండ

లాంతర్గతపురుష వాక్య శ్రవణముచేతను, నాకాశవాణీ వాక్యశ్రవణముచేతను భర్తృజీవితత్వ నిశ్చయముగలిగి పున స్సమాగమాశ జనించుటచే వారి నాశ్రయించిన రసము కరుణవిప్రలంభ మయ్యెనని నిరూపించి, "రఘువంశమునం దజప్రలాపమున నిట్టియవస్థాభేదము లేదు. అజుని కిందుమతీమృతి ప్రత్యక్షసిద్ధమై పునస్సమాగమాభిలాష మంకురించుటకుం గారణము లేనందున నచ్చట శృంగార సంస్పర్శమే లేకుండుటం గేవల కరుణరసమని యాలంకారికులందఱు నైకకంఠ్యముగా నంగీకరించుచున్నారు" అని వ్రాసిరి.

దీనింబట్టి శ్రీశాస్త్రిగారేమి, సర్వాలంకారికులేమి, రఘువంశమున నజునికిఁ బునస్సమాగమాశ లేనందునఁ గేవలకరుణమే రసమని యంగీకరించిన సంగతి పాఠకులకు విశదము.

ఆపై నొకచోఁ శ్రీశాస్త్రిగారు "మతియు నలంకార శేఖరాది గ్రంథములయందు

స్యాదేకతరపంచత్వే దంపత్యోరనురక్తయోః;
శృంగారః కరుణాఖ్యోఽయ మజస్యేవ రతేరివ.

ఇత్యాదికముచే మృతత్వజ్ఞానమున్నను పశ్చాత్సమాగమము లేకున్ననుగూడఁ కరుణవిప్రలంభ శృంగారత్వ మంగీకరింపఁబడి యున్నది" అని వ్రాసిరి.

దీనింబట్టి చూడఁగాఁ గొందఱాలంకారికులు రఘువంశమునం దజవిలాపమునఁగూడ కరుణవిప్రలంభమే రసమని యొప్పినట్లు కన్పట్టుచున్నది. అట్లగుట నజవిలాపమునఁ గరుణమే రసమని యాలంకారికులందఱు నైకకంఠ్యముగా నంగీకరించుచున్నారని శాస్త్రిగారు వ్రాయుట స్పష్టముగు తప్పు. ఆలంకారికులలోఁ గొందఱజునికిఁ గరుణవిప్రలంభము రసమని చెప్పుచుండఁగా నాలంకారికులందఱికి నైకకంఠ్యమెట్లు గుదిరెనో శ్రీశాస్త్రిగారే సెలవీయవలసియున్నది.

"ఘనశ్యామ వీరరాఘవప్రముఖులగు వ్యాఖ్యాత లీనాటకము కరుణరసప్రధానమనియే వ్యాఖ్యానములు రచించిరి." అని చెప్పిన కరుణరసవాదుల పదుమూఁడవ యుక్తికి సమాధానము చెప్పుచుఁ గరుణరసవాదులగు వీరరాఘవాదులు లేఖించినవన్నియు యథార్థములు కావనియు, వీరరాఘవుఁడు భవభూతిభావముం దెలియఁజాలక

"యదత్రోచ్ఛృంఖలం కించిత్క్వచి న్నానేన బధ్యతే;
నిరంకుశతయా తత్తు సమాధేయం మనీషిభిః."

అని భవభూతియందు దోషారోపముం గావించినాఁడు." అని శాస్త్రిగారు చెప్పినారు.

వీరరాఘవుని యభిప్రాయము భవభూతిపై దోషారోపము చేయవలెననిగాదు.

"భవభూతేః కవీంద్రస్య క్వ గంభీరో గిరాం భరః;
క్వ మన్మతి రతిస్థూలా సహాయోఽత్ర హయాననః"

ఇత్యాదికముచే భవభూతియందు గొప్ప గౌరవముఁ జూపిన వీరరాఘవుఁడు భవభూతిపై దోషారోపముం గావించునా? మహాకవులు సమర్థులు గావున వారి గ్రంథముల నుచ్ఛృంఖలములున్నను "నిరంకుశాః కవయః" అను యుక్తి ననుసరించి యా యుచ్ఛృంఖలములు సమాధేయములే కాని దూష్యములు గావని వీరరాఘవుని యభిప్రాయము స్పష్టమగుచుండ, వీరరాఘవుఁడు భవభూతిపై దోషారోపముం గావించినాఁడని శాస్త్రిగారు చెప్పుట యతిసాహసిక్యము. పై శ్లోకముచే వ్యాఖ్యాతకు భవభూతియందుఁగల గౌరవాతిశయమే స్పష్టమగుచున్న సంగతి సార్వజనికము. వీరు పదునాల్గవ యుక్తికిఁ జెప్పిన సమాధానము మాకు విప్రతిపన్నము కాదు. ఇఁక వీరు కరుణరసవాదుల పదునైదవయుక్తికి చెప్పిన సమాధానమును విమర్శింతము. "భవభూతికిం దరువాతివారగు గోవర్ధనాచార్యాది మహాకవులు "భవభూతేస్సంబంధాద్భూధరభూరేవ భారతీ భాతి, ఏతత్కృతకారుణ్యే కిమన్యథా రోదితి గ్రావా" ఇత్యాదికములవలనం గరుణరసప్రధానమనియే ప్రశంసించియున్నారు" అని కరుణరసవాదులు.

దానికి శ్రీశాస్త్రిగారు "గోవర్ధనాచార్యాదులు విప్రలంభాంగమగు కరుణము నే ప్రశంసించిరికాని శుద్ధకరుణమని వారితలంపు కాదు. "అపి గ్రావా రోదిత్యపి దళతి

వ్రజస్యహృదయమ్" అనునది పూర్వవిరహావస్థావర్ణనము కాని యుత్తర విరహావస్థావర్ణనము కాదు............ అని సమాధానము చెప్పిరి.

గోవర్ధనాచార్యుఁడు భవభూతి నాటకమునఁ గరుణము రసమనియు, సీతా నాటకమునందలి కారుణ్యమును వినినంత నే రాయి యైనను వాపోవకమానదనియుఁ జెప్పినాఁడు. కాని యీ నాటకమునందలి పూర్వవిరహావస్థావర్ణనముం గని రాయి కూడ వాపోవునని వచింపలేదు. అట్టితఱి "అపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయమ్" అనునది పూర్వవిరహావస్థావర్ణనముకాని యుత్తరవిరహావస్థావర్ణనము కాదు"—అని శాస్త్రిగారు చెప్పిన సమాధానము, పృష్టతాడనము నంతపత్తమున కట్టికారణమో యేతచ్ఛ్లోకమున 'కారుణ్యే' అను పదమునకుఁ గరుణరసమని యర్థము కాదు." అనుట కట్టి కారణమై యున్నది.

"అపి గ్రావా రోదిత్యపి దళతి" అనునది పూర్వవిరహావస్థావర్ణనమైనను, "సీతాత్యక్తికారుణ్యే" అనునప్పుడు కరుణరసమర్థముగాఁ జెప్పుట కసమంజసత లేదుకదా!

౧౦, ౧౭, ౧౮, యుక్తులకు వీరు చెప్పిన సమాధానములు క్రింద వ్రాయఁబడు మా కరుణరసస్థాపకోపన్యాసమునందు విమర్శింపఁబడును.

"యత్రైకస్మిన్ వినష్టే ఽన్యో
మృతకల్పోఽపి తద్గతమ్;
నాయకః ప్రలపేత్ సోఽత్ర
కరుణోఽసౌ స్మృతో యథా".

..................................

"స్త్రీపుంసయో ర్ద్వయే దేవ,
సాపేక్ష స్సంగమే పునః;
శృంగారవదవప్రాయః
కరుణ స్స్యాత్ స నాన్యథా".

అని శృంగారతిలకమునఁ గరుణ విప్రలంభ లక్షణము చెప్పఁబడెను. కరుణ విప్రలంభమున స్త్రీపురుషులకుఁ బునస్సమాగమాశ యుండవలెననియు, లేనిచోఁ గేవల కరుణమనియు లక్షణకర్త్రభిప్రాయము. ప్రస్తుత నాటకమున రామునకు సీతావిషయక పునస్సమాగమాశ లేమింజేసి కరుణవిప్రలంభము కాకపోవుట స్పష్టము.

"ఇష్టనాశా దనిష్టాప్తౌ శోకాత్మా కరుణో ఽనుతమ్;
నిశ్వాసోచ్ఛ్వాసరుదిత......................."

అని దశరూపక కర్తయగు ధనంజయుఁడు కరుణరసమునకు లక్షణము చెప్పియున్నాఁడు. అనఁగా నిష్టనాశ మున్నప్పుడు కరుణరసమని పైశ్లోకమున కభిప్రాయము. ప్రస్తుతము రామునకుఁ బ్రియానాశము గలుగుటచే నిందలిరసము కరుణరసమనుట నిర్వివాదము. ప్రాచీనాలంకారగ్రంథమగు దశరూపకమునకుఁ బ్రామాణ్యము లేదనుట సాహసము. అట్లే నవీనాలంకారగ్రంథమును, సార్వజనసమ్మతమును నగు ప్రతాపరుద్రీయమునకును బ్రామాణ్యము లేదనుటయు సంగతముకాదు.

ఇఁక శాస్త్రిగారు "ఇష్టనాశ" పదమునకు నిష్టమృతియని యర్థము చెప్పి, మృతియున్నప్పుడే కరుణరసము, లేనప్పుడు కరుణము గాదందురేమో. సమాధానము చెప్పుచున్నాము. నాశశబ్దము నదర్శనార్థక 'నశ' ధాతూత్పన్నమగుటచే నాశమనఁగా నదర్శనమనియే యర్థముకాని, మృతియని కాదు. మఱియు, శ్రీశాస్త్రిగారు నాశశబ్దము మృత్యర్థకమనినచోఁ, గరుణరసవాదులు చూపిన "ఏకస్సం ప్రతి నాశితప్రియతమః"! అనుదానికి 'ఇందు "నాశితప్రియతమః" అని యుండుటవలన నిది రెండిట సాధకమని కరుణరసవాదులు భ్రాంతినొందుచున్నారు. నాశమనఁగా జాడతెలియకుండుట కాని మృతికాదు. "నష్టే మృతే ప్రవ్రజితే" ఇత్యాదిప్రయోగములం జూడుఁడు.' అను శ్రీశాస్త్రిగారి పూర్వోక్తికి వైరుధ్యము వాటిల్లెడిని. తద్విరోధ పరిహారమునకై "నాశ" పదమున కదర్శనమర్థమని శ్రీశాస్త్రిగారు కూడ తప్పక యొప్పుకోవలసి యున్నది. ఒప్పుకొనినప్పుడు ప్రస్తుతము రామునకుఁ బ్రియాఽదర్శనమును, పునస్సమాగమాశ లేమింజేసి శృంగారరసబాధ నిశ్చయముగ నున్నది కనుక కరుణమని శాస్త్రిగా రంగీకరింపక తప్పదు. ఇది యుభయతస్పాశయగు రజ్జువు. కరుణరసము పునస్సమాగమాశాఽభావప్రయోజ్యమను సంగతి శ్రీశాస్త్రిగారు కూడ

పలుసార్లంగీకరించినదే. కావున రామునకుఁ బ్రియా పునస్సమాగమాశ యిందుకరతయు లేదనుసంగతిని సప్రమాణముగ నిరూపించుచున్నారము. తృతీయాంకమునందలి రాముఁడు "అన్యథైవాయ మధునా విపర్యయో వర్తతే.

"ఉపాయానాం భావా దవిరలవినోదవ్యతికరై
ర్విమర్దైర్వీరాణాం జనితజగదత్యద్భుతరసః;
వియోగో ముగ్ధాక్ష్యాః స ఖలు రిపుఘాతావధి రభూ
త్కటుస్తూష్ణీంసహ్యో నిరవధి రయం త్వప్రతివిధిః."

అని విలపించుచున్నాఁడు. దీనింబట్టి పూర్వవిరహము సావధికమనియు, నీవిరహము స్వయంకృతమగుట వలన యావజ్జీవభావి యనియు, నట్లగుట జానకీ పునర్దర్శనమునకు వీలు లేదనియు రాముని యభిప్రాయమని విస్పష్టమగుచున్నది. వియోగనిరవధికత్వ జ్ఞానమున్నపుడు పునస్సమాగమాశ లేకపోవుట సర్వాలంకారిక సమ్మతము కదా.

ప్రస్తుతము రామునకుఁ నిరవధికత్వజ్ఞానమున్నందువఁ బునస్సమాగమాశ యుండుట కవకాశము లేమి రతి నశించుటచే శృంగారము, రసము గాదని యొప్పుకొనక తప్పదు. అట్లే మేమిదివఱకు చెప్పిన "దుఃఖసంవేదనాయైవ" అనువదికూడ రామునకు సీతాపునస్సమాగమాశాభావమునే చాటుచున్నది.

పాఠకులారా! రామునకు సీతావియోగ నిరవధికత్వజ్ఞానము కలదని భవభూతి పలుసార్లు స్పష్టముగఁ జాటినాఁడు.

నిరవధికత్వజ్ఞాన మున్నపుడు పునస్సమాగమాశ కలుగుటకు వీలుండునని యెవ్వరును చెప్పఁజాలరు. పునస్సమాగమాశ రామునకున్నను "దుఃఖవశమ్మున సీతావిరహమును నిరవధిగా రాముఁడు తలంచినాఁడు" అని యొకవేళ కరుణవిప్రలంభవాదు లనవచ్చును, అది యన్యాయ్యము.

పై శ్లోకముచే దుఃఖవశముచేత నిరవధికత్వమునే రాముఁడు చెప్పుటలేదు. పూర్వవిరహము సావధి యనియు,నిప్పటివిరహము పునస్సమాగమోపాయము లేకపోవుటచే నిరవధి యనియుఁ జెప్పి రెంటికిని భేదమునుగూడఁ జూపుచున్నాఁడు. రాముఁడొక్కఁడే యీవిరహము నిరవధికమని తలఁచినచో నది దుఃఖవశమ్మున భావించినదని తలఁపవచ్చును. అట్లు గాక యనేకులీవిరహము నిరవధికమనితలంచునపుడది దుఃఖవశమ్మునఁ దలఁచినదనుట యసమంజస మనుట యెల్లరకును విదితమే.

షష్ఠాంకమందలి కుశుఁడు రాము నేల యేడ్చుచున్నావని ప్రశ్నించిన లవునితో "అయి వత్స!

"వినా సీతాదేవ్యా కిమివహి న దుఃఖం రఘుపతేః
ప్రియానాశే కృత్స్నం కిల జగదరణ్యం హి భవతి;
స చ స్నేహ స్తావా నయ మపి వియోగో నిరవధిః
కి మేవం త్వం పృచ్ఛ స్యనధిగతరామాయణ ఇవ."

అని దుఃఖకారణములఁ దెలిపినాఁడు.

ఇందు "అయమపి వియోగో నిరవధిః" అనుటచేఁ గుశునకుఁగూడ సీతారామ వియోగ నిరవధికత్వజ్ఞానమున్నట్లును,బునస్సమాగమాశ లేనందునఁ గేవల శోకమే రామునకుఁ గలదని తలంచినట్లును విస్పష్టమగుచున్నది. మఱియు సప్తమాంకమున పృథివి (నిట్టూర్పువిడిచి), "దేవి! సీతాం ప్రమాయ కథ మాశ్వసిమి.

"సోఢశ్చిరం రాక్షసమధ్యవాసః
త్యాగో ద్వితీయస్తు సుదుస్సహో౽స్యాః"

అని యిప్పటి సీతాత్యాగమునకును సీతారాముల పూర్వవియోగమునకును వైలక్షణ్యమును స్పష్టముగ నిరూపించెను. యావజ్జీవభావియగు సీతాత్యాగము సుదుస్సహమనియు వెల్లడించెను.

ఇఁక శ్రీ శాస్త్రిగారు పంద్రెండవ యుక్తికి సమాధానము చెప్పుసందర్భమున "ప్రవాసాది విప్రలంభములకును దీనికిని భేదము నిరూపింప శక్యముగాదు" అని వ్రాసిరి. ప్రవాసవిప్రలంభాదులకును,బ్రస్తుతనాటక రసమునకును భేదము లేదని శాస్త్రిగారి యభిప్రాయము. ప్రవాసవిప్రలంభాదికమునకును బ్రస్తుతనాటకమునకును భేదమున్నసంగతి భవభూతి స్పష్టముగ షష్ఠాంకమందలి

"చిరం ధ్యాత్వాధ్యాత్వా నిహితఇవ నిర్మాయపురతః
ప్రవాసే చాశ్వాసం నఖలు నకరోతి ప్రియజనః;
జగజ్జీర్ణారణ్యం భవతి చ కళత్రే వ్యుపరతే
కుకూలానాం రాశౌ తదను హృదయం పచ్యతఇవ"

అను శ్లోకముచే సువ్యక్తీకరించినాఁడు.

"ప్రవాసమునందు ప్రియజనము చిరకాలము ధ్యానింపఁబడి ధ్యాయకుని ఓదార్చును. కళత్రము నశించి నప్పుడన్ననో, ప్రవాసమునందుం బోలె పునరాగమన శంక లేమిం జేసి జగమంతయు శూన్యముగఁ గన్పట్టును. పిదప హృదయము తుషాగ్నిరాశియందుఁ బక్వమగును" అని పై శ్లోకమున కభిప్రాయము. మఱియు నిందు రామునకుఁ బ్రియానాశమును, తజ్జన్యమగు శోకాధిక్యమును గవి నిరూపించినాఁడు. ఇందు భవభూతి "జగజ్జీర్ణారణ్యం భవతి చ కళత్రే వ్యుపరతే" అను పాదముచే రామునకు సీతా పునస్సమాగమాశ లేదని స్పష్టముగఁ జాటుచున్నాఁడు.

అట్లగుటఁ బ్రవాసవిప్రలంభ కరుణవిప్రలంభాది వాదము లీయొక్క శ్లోకముచేతనే పరాస్తము లగుచున్నవి.

సహృదయులగు పాఠకులారా! యిందలి రసము కరుణమో, కరుణవిప్రలంభమో బాగుగ గ్రహించితిరా?

ఇట్లెన్నోచోట్ల భవభూతి రామునకు శోకాధిక్యమును నిరూపించుచుఁ గరుణము రసమని సుస్పష్టముగఁ జాటుచుండ, నేవో కొన్ని యనుపపన్నములగు యుక్తులఁ జూపి కరుణవిప్రలంభమే యిందలి రసమని వాదించు కరుణవిప్రలంభవాదుల వాదము వారి మౌగ్ధ్యమునే వెల్లడి చేయుచున్నది. ఇంక కరుణవిప్రలంభవాదులగు శాస్త్రిగారు "ఏకోరసః కరుణఏవ నిమిత్తభేదాత్" అనుచోఁ గరుణ పదమునకు గరుణవిప్రలంభ మర్థమని సెలవిచ్చియున్నారు.

కరుణపదమునకుఁ గరుణవిప్రలంభ మర్థముచెప్పుట గొప్పతప్పు. శ్రీశాస్త్రిగారు

"లోకాంతరగతే యూని.............
కరుణస్స తదోచ్యతే."

అని యుదాహరించి యర్థము వ్రాసి, "యిందును 'కరుణవిప్రలంభః' అనుటకు 'కరుణః' అని భోజమహారాజు కూడఁ బ్రయోగించినాఁడు. కావునఁ గరుణవిప్రలంభమును గరుణమని చెప్పుటయుఁ గలదనుట నిర్వివాదము." అనిచెప్పి పైశ్లోకమునఁ గరుణపదమునకుఁ గరుణవిప్రలంభమని యర్థముచెప్పుట తప్పుగాదని స్పష్టీకరించిరి. ఈయూహ యసంగతము. సరస్వతీ కంఠాభరణమున భోజరాజు

"నాధిగచ్ఛతి చాభీష్టం విప్రలంభస్తదోచ్యతే;
పూర్వానురాగో మానశ్చ ప్రవాసః కరుణశ్చసః,
పురుషస్త్రీ ప్రకాండేషు చతుఃకాండః ప్రకాశతే"

అనిచెప్పి పిదప "లోకాంతరగతే......కరుణస్స తదోచ్యతే" అని చెప్పుటచేఁ బై విప్రలంభప దానువృత్తిచే "కరుణః" అనుపదమునకుఁ గరుణవిప్రలంభమని యర్థము చెప్పఁబడినది. కాని యెల్లెడలఁ గరుణపదమునకుఁ గరుణ విప్రలంభ మర్థముగాఁ జెప్పుట తప్పనుట నిర్వివాదము.

మఱియు భోజరాజు కరుణవిప్రలంభమునఁ గరుణ మంగమగుటవలనఁ గరుణ విప్రలంభమందుఁ గరుణాత్మకత్వము నారోపించినాఁడు. కాని "కరుణః" అనుపదమునకుఁ గరుణవిప్రలంభ మర్థమని చెప్పలేదు. "కరుణః" అను పదమునకుఁ గరుణాత్మకమని యర్థమనియు,నది యనువర్తమాన విప్రలంభ పదార్థముతో నన్వయించుటచేఁ గరుణవిప్రలంభమని యర్థమువచ్చునని భోజరాజు నభిప్రాయము. ఇట్లే యితరగ్రంథస్థ కరుణపదములకును గరుణవిప్రలంభ మర్థము.

ప్రస్తుతము "కరుణః" అనుపదమునకుఁ గరుణాత్మకమని యర్థముచెప్పినను విప్రలంభార్థ బోధకమగు పదము లేమింజేసి కరుణవిప్రలంభమను నర్థము బోధ్యము గాదని నిరాఘాటముగఁ జెప్పఁగలము.

సప్రమాణముగ నిట్లు శాస్త్రిగారి వాదమును ఖండించి యింతకు మేము సిద్ధాంతీకరించున దేమనఁగా,—

"ఇష్టజనస్మృతి శేషున్నను దన్నాశముండి పునస్సమాగమాశ లేమి నీనాటకమునఁ గరుణమే రసము; కాని తదన్యములు గావు." అని.

# కామినియా నూనె

వేనవేల కుటుంబములయందు ఉపయోగించబడుచున్నది

## ఎందుకు?




కామినియా నూనె

వెండ్రుకలు ఊడిపోవుటను ఆటంకపరచును.

కామినియా నూనె

తలను చుండులేక నుంచును.

కామినియా నూనె

తలకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

తలకు సంబంధించిన వ్యాధు లన్నిటిని కుదుర్చును. ఉష్ణముగా నున్న ప్రకృతికి చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

యందు వెండ్రుకలు పెరుగుట కవసరమైన వస్తువులు, మెదడుకు కావలసిన అమూల్యవస్తువులు గలవు.

కామినియా నూనె మనోహరమైనట్టియు ఆహ్లాదకరమైన సువాసనగలది.

కామినియా నూనె శిరోజములకు ప్రాణము. ఇట్టి సుగుణము లుండుటవలననే వేలకొలది కుటుంబములందు కామినియా నూనె ఎక్కువగా వాడబడుచున్నది.

కామినియా నూనెను ఉపయోగించునట్టివారు గనుకనే దీనిని "శిరోజములకు ప్రాణ మని" దీనియందు గల లాభకారియైన సుగుణములను బట్టి తెలుపుచున్నారు.

బుడ్డి 1 కి ధర రు. 1. వి. పి. ఖర్చులు అ. 6. ప్రత్యేకము.

బుడ్లు 3 కి ధర రు. 2-10-0. వి. పి. ఖర్చులు 0-12-0. ప్రత్యేకము.

అత్తరులకు రాజైన

## ఓ టో దిల్ బ హా ర్ (రిజిస్టర్డు)

హిందూదేశమంతటను దీనికి గల ఎడతెగని అత్యధిక అమ్మకమే దీనికి గల అసాధారణమైన శ్రేష్ఠత్వమును రుజువుచేయుచున్నది. కొన్ని బొట్లు చేతిరుమాలపైన చల్లిన సీమపుష్పములు, మల్లెపుష్పముల వాసనవలె మనోహరమైన దీర్ఘ సువాసనను గలిగించుచున్నది.



$\frac{1}{2}$ ఔ. బుడ్డి 1 కి రు. 2. $\frac{1}{4}$ ఔ. రు. 1-4-0. 1 డ్రా. 0-12-0.

వి. పి. ఖర్చులు అణాలు 6 ప్రత్యేకము.

2 అణాలు తపాలబిళ్లలు పంపిన శాంపిల్ బుడ్డి పంపబడును.

కామినియానూనె ఓటోదిల్ బహారు సుప్రసిద్ధమైన ష్టోరులన్నిటియందును దొరకును.

## ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ.

తపాలపెట్టె నెం. 2132. బొంబాయి నెం. 2.

త్వరపడుడు! కొలది ప్రతులే గలవు!!

ఇకను మోసములకు భయపడ నక్కరలేదు.

# మతివంచన దీపిక.

డెమ్మి 250 పేజీలు, 16 చిత్రపటములు, 120 విధములగు విషయములు నిండియున్నది.

వెల రు. 1-4-0 పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

ప్రపంచవంచకుల మాయాజాలము దెలుపునట్టి యిట్టి గ్రంథ మిదివర కాంధ్రమున వెలువడి యుండలేదు. క్రొత్త క్రొత్త విధములగు వంచనలు విస్తరించుచున్నవి. వ్యాపారము వ్యవసాయము, ఉద్యోగము, న్యాయస్థానము, దేవాలయము, విద్య, వైద్యము, మాంత్రికము, జ్యోతిషము, సోద, రైలు, స్టీమరు, ఇది యది యననేల ఎచ్చట జూచినను మోసపుచింత ప్రబలియున్నది. నిర్వంచకు లిట్టి మోసములకు లోనై పరితపించుచున్నారు. ఇట్టివారి మోసములయొక్క రహస్యములను ఇందు చక్కగ వర్ణింపబడియున్నది. దీని చదువుటవలన నిర్వంచకులు వంచకులకు లోబడక తప్పించుకొనవచ్చును.

చిరునామా:—ఆనందబోధిని ఆఫీసు, 6, వెంకటేశమేస్త్రీ వీధి, మద్రాసు.

---

## చిరకాలమునుండి బాధించుచున్న మూత్రవ్యాధులకును శగ (గనేరియా) వ్యాధికిని క్రొత్తగాకనిపెట్టబడిన దివ్యౌషధము.




## గనోకిల్లర్ (రిజిస్టర్డు)

ఈయౌషధము శ్రేష్ఠతమము. ఇంగ్లీషుమందులను దేశీయములగు నౌషధములను పుచ్చుకొనినను గుణము కలుగనియెడలను, యింజక్షనులవలనను వాక్సినులవలననుగూడ లాభము లేకపోయినయెడలను కడపటి ప్రయత్నముగా మా గనోకిల్లరునుగూడ పుచ్చుకొనిచూడుడు. పెక్కుయేండ్లనుండియున్నను లేక క్రొత్తగా కలిగినను ఏరకము శగసంకటమైనను మరెట్టి మూత్రవ్యాధులకైనను స్త్రీలకైనను పురుషులకైనను గనోకిల్లరు తప్పక కుదుర్చును. మూత్రము ధారాళముగా వెడలును. మూత్రముపోవుచున్నపుడును కలుగుమంట తగ్గిపోవును. మూత్రనాళమునందలి వాపు తీసిపోవును. శగవ్యాధి (గనోకోకసు) వలన మూత్రము బొట్లుగా పడుట, మేహరోగములవలన మూత్రద్వారమునుండిపోవు తెలుపు, యూరెత్రిటిసు, ప్రోస్టాటిటిసు, సిస్టిటిసు, లుకోరియా, మున్నగువ్యాధులన్నియును స్త్రీలకును పురుషులకునుగూడ గనోకిల్లరువలన కుదురును. వీర్యము (పెమను) పోవుట, స్త్రీలు గర్భవతులుగానున్నపుడు కలుగు మూత్రవ్యాధులు మున్నగునవిగూడ దీనివలన కుదురును. 50 మాత్రలుగల సీసా ఖరీదు రు. 3-0-0 వి. పి. చార్జీ ప్రత్యేకము. ఒక్కసారి 3 సీసాలు తెప్పించుకొనిన వి. పి. చార్జీ మేమే భరించెదము.

అడ్రసు:—డాక్టర్ డి. యన్. జస్నాని, 137 కికావీధి, గులాల్‌వాడి, బొంబాయి 4.

Tel. Add. "GONOKILLER" Dr. D. N. JASANI, 137 Kika Street, Gulalvabi, Bomday, 4.



౧. దొడ్డ బెట్ట. దానిపై గోమటేశ్వరవిగ్రహము

# శ్రావణబెళగొళ చిత్రములు



౧. గోమటేశ్వర విగ్రహాము

ఇఁక శాస్త్రిగారు పదునారవయుక్తికి సమాధానము చెప్పుచు "భవభూతికిఁ గరుణవిప్రలంభ మని తాత్పర్యముగాని కరుణము కాదు. కరుణరసమందే తాత్పర్యమయిన నాటకాంతమున రామునకు సీతాపునస్సమాగమమునే చేయకపోవును." అను నొకయుక్తి నొసంగియున్నారు. ఇదియు నసమంజసము.

కవి మంగళాంతరూపకముల రచించుట శాస్త్రోక్తమగుటచే నిట్లు మంగళాంతముగ సీతారాములంగూర్చినాఁడు కాని కరుణవిప్రలంభ మిందలి రసమని సూచించుటకుఁ గాదు.

ఇంతమాత్రముచేఁ భవభూతికిఁ గరుణరసమందుఁ దాత్పర్యము గాదనుట సాహసము.

మఱియు శ్రీశాస్త్రిగారే "యీ నాటకమందుఁ దఱచుగాఁ గరుణానుభావములు గోచరించుచుండుట సత్యము" అని వ్రాయుటచేఁ గరుణానుభావము లిందుండుటనుగూర్చి మేము వేరుగా వ్రాయ నక్కఱలేదు. ఈ నాటకమునఁ గరుణవిప్రలంభము రసముకాదు. కావుననే "సర్వథా స ఏవభగవా ననేక వారపరికల్పితో విప్రలంభః పునః పునరనుబధ్నాతిమాం" అను రామవాక్యము నందలి "విప్రలంభః" అను పదమునకుఁ గరుణరసవాదులగు వీరరాఘవాదులు "భ్రమః" అని వ్యాఖ్యానము చేసియున్నారు. మఱియుఁ బ్రాచీనులగు నాలంకారికులు కొందఱు, నవీనులు కొందఱును కరుణవిప్రలంభమును రసాంతరముగా పరిగణింపనే లేదు.

---

# మంగళూర్-పెషావర్ గ్రాండ్ ట్రంక్ ఎక్స్ప్రెస్

వేలాల సుబ్బారావుగారు, బి. ఏ.

దాక్షిణాత్యులకు హిమాద్రి దర్శనంబు-శీతశైలావసథులకు సేతునికట,
వాసముల మూఁడునాళ్లలోపలనే కూర్చు-ఘనుఁడు మంగ్లోర్పెషావరు గ్రాండుట్రంకు.

అపరవారిధితరంగాఘాతజాతశీకరపూర్ణపృషదశ్వగతులఁ దోఁగి,
సహ్యజాంభఃకణాసారసంకులచందనమహీధ్రపవనసంతతుల దేలి,
ప్రాచీదిశాంభోధి వీచీసమాక్లిన్నవాతపోతముల నుఱ్ఱూత లూఁపి,
కృష్ణాతరంగిణీ నిష్ణాత పవమానమానవానీకంబులోన దూఱి,
దక్షిణాశాజహ్నుతనయాతుషారపూరిత సదాగతుల సంప్రీతిఁ ద్రావి
వర్షాంబుపానసంవర్ధమాన మహానిలౌఘంబుతోడ సయ్యాట లాడి,
రేవాపగావేతసీవనాభ్యంతరోద్భూతవాయువులతోఁ బోరు సలిపి,
చర్మణ్వతీసరిత్ సంభూతమాతరిశ్వాంకురావళుల నుయ్యాల లూఁపి,

యమునానదీతీరకమఠసంభుక్తముక్తమరుత్ సమూహంబు భ్రమలఁ గొల్పి,
శాతద్రవాంభోజజాత సువాసనా సలలితశ్వసనసంచయము లాని,
పుణ్యరావీతటాగణ్యరోజాకాననాంతరాగత సమీరాలి గ్రోలి,
చంద్రభాగాదివ్యసలిలావగాహనశీతలాశుగముల జిమ్మవైచి,
ప్రాంచద్వితస్తాసమాసీత దేవదారుద్రుమారణ్య మారుతము లీది,
భారతీసౌవర్ణహారసన్నిభసింధుగంధవాహంబుల గాసిపరచి,
భరతఖండమహాద్వీపవతుల నెల్ల-మూడునాళ్లైన గడవక మున్నె చూపు,
కామరూపి మహావేగగామి యితడు-కాదు ప్రాణవిహీనమా గ్రాండుట్రంకు.

కేరళీవక్షోజగిరులలో భ్రమియించు, ద్రవిడాంగనానాభిదరుల దూరు,
ఆంధ్రకళింగచంద్రాననాసీమంత సమసీమలందు బేరెములువారు,
మధ్యహిందూస్థానమహిలావలిత్రయోపరిలసద్రోమాలి వనుల బారు,
మాలవారట్టపాంచాలాది తరుణీజన శరీరలావణ్యనదుల దాటు,
భరతవర్ష విలాసినీ భవ్యరూప-కైతవారామ సౌరభోత్కరము లాన,
పరుగులాడు విలాసిరూపంబు గాని-కా దిది విచేతనంబైన గ్రాండుట్రంకు.

ఒకనాడు హృన్మోద మొదవించు 'నార్తువెస్ట్ర్న్ కంపెనీ'వారి రైలుబండ్లు,
ఒకనాడు సంతోష మొసగూర్చు 'గ్రేటిండియన్ పెనిన్శుల'వారి యాననివహ
మొకనాడు హర్షంబు నొసగు 'నైజాము గారెంటీడు'వారి క్యారేజిగములు,
ఒకనాఁడు నయనముల్ వికసింపగాఁజేయు 'యమ్మ్యయస్యముల' వాహన నికాయ,
మొకదినమున 'సౌతిండియా' శకటజాల-మలర, నైక్యంబువలన సాధ్యము ధరిత్రి
సకల మని చాటు సదుపదేశప్రదాత-కాని కా దిది జడమైన 'గ్రాండుట్రంకు.'

——————

(చిత్రావతి ప్రవేశించును. లేతగులాబీ రంగు పరికిణీ, లేతపసుపురంగు చొక్కా, మబ్బురంగు ఓణీను ధరించియున్నది. ఎఱ్ఱగన్నేరు బొండుమల్లెల నేర్చికూర్చి వదండను వాలుజెడ చుట్టూ పెనవైచుకొని మందారపువ్వును తురాయిగా పెట్టుకొనినది. విశ్వపతిని చూడలేదు.)

చిత్రావతి:—ఇవాళ ఈ గంధరగోళం ఒకటి వచ్చి ఇంతవఱకు "నిత్యజేజే" పాడుకోనే లేదు. (చేతులు జోడించి అర్ధనిమీలితనేత్రయై)

గీతిక

తెలుగు తల్లికి నిత్య జేజే
తెలుగు రాజుకు నిత్య జేజే
తెలుగు మంత్రికి నిత్య జేజే
తెలుగు కవులకు నిత్యజేజే

విశ్వపతి:—ఊప్పెన వచ్చిందిరా బాబూ!

చిత్రావతి:—పిడుగు పడిందిరా దేవుఁడా! ఏం? ఎవర్నంటే ఎవరూరుకుంటారు? మంజీర చేసిన శాస్తి చాలదూ? ఇవాళ "అన్నాజీ-పండుగ" ఎంతో వైభవంతో చేసుకుందామని మంజీరానేనూ ఎంతో సంబరపడ్డాం-సూరన్న బావగారు, పెద్దతాతగారు, ఇంకా తిమ్మన్నగారు" భట్టుమూర్తిగారు "చిన్నారాణీ, కూడా వస్తుంది. అన్నాజీతో సరసాలాడుతూ దదరంగా లాడించాలి అనుకున్నాం; అన్నీ ఇట్లా ఏర్పాటు చేసుకున్నాం. ఎంత మారాంచేస్తే మా నాన్న పాటలు వ్రాసి ఇచ్చారు?— "రామకృష్ణకవిగారి పాటలు వినిపించు అమ్మాయీ!" అని అంతా బలవంతంచేస్తే "వనలక్ష్మి వేషం" పాటా, "పూలకోయిల" పాటా "తెలుగు తల్లీ" పాటా పాడాలి అనుకున్నా.

విశ్వపతి:—పోనీ, పాడు, నేనూవింటాను.

చిత్రావతి:—చిన్నారాణీ ముందు మంజీరని అలా ఎందుకు కవ్వించావూ? అనిడే కోపంవచ్చి వెళ్ళిపోయిందా! అన్నాజీవచ్చి "చిన్నాదేవి ఏదీ" అంటే ఏంచెప్పాలి?

విశ్వపతి:—చిన్నపిల్లవి నీ కెందుకమ్మా అంతటి ఆరాటము? ఆటలో; పాటలో; పోనీ మంచికథ చెప్పనా?

చిత్రావతి:—కథలు గానే ఉంది; ముందు నీకథేమిటో చెప్పు.

విశ్వపతి:—పోనీ నాకథే.

చిత్రావతి:—అన్నాజీ రాగానే అందఱూ కలిసి పాడితే బాగుంటుందని "తెలుగు తల్లీ" పాట నన్నా గారు వ్రాయించమంటే వ్రాయించాను. మంజీరకీ పెద్దన్న తాతగారికి రాత్రే సంత చెప్పివచ్చాను. చిన్నారాణికి చెప్పలేదు; నీవైనా చెప్పకుంటావేమో అనుకున్నా.

విశ్వపతి:—చెప్పకుంటాలే. మఱి, నా కథ వినవూ?

చిత్రావతి:—ముందు పాట చెప్పుకో. అన్నాజీ రాగానే పాడాలి.

విశ్వపతి:— ఆడవాళ్ళతో పాటు మగవాళ్ళని కూడా పాటలు చెప్పుకోమంటావా.

చిత్రావతి:—అబ్బా! మగవాళ్ళు చెప్పుకునే పాటేనయ్యో అంటేను. మా నాన్నగారు పిల్లలందఱికీ "భక్తితో పాడుకోండి" అని చెప్పితే విన్నాకూడాను.

విశ్వపతి:—సరే చెప్పు.

చిత్రావతి:—నీవుకూడా భక్తితోనే చెప్పుకోవాలి.

విశ్వపతి:—చెడ్డ చిక్కు వచ్చిందే నీతో! కానీ చెప్పు.

చిత్రావతి:—

గీతిక

తెలుగుదేశము మాది
తెలుగువారము మేము
తెలుగువారే దేశ
దేశాల నేలారి

తెలుగు తల్లీ నీకు జోహార్!

# నా రాజు

పింగళి నాగేంద్రరావు గారు

[తిమ్మరుసుమంత్రియొక్క ఆదర్శరాజసాధనను నిరూపించు నయిదంకముల అభినయరూపకము]

## పాత్రసూచి

శ్రీ కృష్ణదేవరాయలు:— ఆంధ్రసామ్రాజ్యమునకు ప్రభువు.

విశ్వపతి:.........రాయలకు కృతికస్వాలకుఁడు.

తిమ్మరుసు:............రాయల ప్రధానమంత్రి. మూడు తరములనుండి యీయాంధ్రసామ్రాజ్యమును దిద్దుకొనుచు వచ్చుచున్నాడు. కృష్ణరాయల నాదర్శప్రభువుగ జేయుటయే యతని సాధన.

గోవిందరా:....... తిమ్మరుసు మంత్రికుమారుడు. ప్రధానదండనాయకుడు.

అల్లసాని పెద్దిరాజు (పెద్దన):—గిరిదుర్గ మండలాధిపతి. రాయలయాస్థానమున కవిపితామహుఁడు.

రామకృష్ణకవి:........తెనాలి అగ్రహారీకుఁడు.

చిన్నాదేవి:.........రాయలరాణి.

మంజీర:............తిమ్మరుసుమంత్రికుమార్తె.

చిత్రావతి:...........రామకృష్ణకవి పెంపుడు కూతురు.

(దండనాధులు, సేవకులు మొదలగువారు సమయోచితముగ వత్తురు.)

## ప్రథమాంకము

### రంగము ౧.

స్థానము:—తిమ్మరుసు మంత్రివర్యుని గృహోద్యానము.

సమయము:—ఉదయము. (ఉద్యానమునందెల్లెడల మత్స్యవతోరణములు చిత్రింపఁబడియున్నవి. విశ్వపతి విహరించుచుండును. తెల్లనిలాగు, నీలపుటంగరఖా, ఎఱ్ఱనితలపాగా, పచ్చనితురాయి, పసుపుపచ్చలగోధుమరంగు శాత్రపీతమును ధరించి చేతిలో పద్మనాళమును కలిగియుండెను. నాళమున కొక్కటే దళము మిగిలియున్నది.)

విశ్వపతి:—

మ. అధిశాసించుచు జీవితీవనగతిన్యాసంబు గావింపఁగా
విధిరెవ్వండు? మదీయజాతకముపై వ్రేలుం బివాదించు నే
యధికారంబును నే గ్రహంబునకు నేయంశంబునన్ లేదు నా
విధి నే నే నియమించుకొందును స్వయంవేధస్సృష్టియారంభినై

ఎవ్వడో ఎప్పుడో ఈకృష్ణుని నాహృదయమున పిడిచిపెట్టిపోయెను. కాలదోషము పట్టిదాని స్వామ్యము నాకు సంక్రమించినది. ఏమి యీ రాజైశ్వర్యము! అహా మేమ బ్రహ్మపరత-బ్రహ్మప్రతి-సృష్టికి ప్రతిసృష్టి-కాలవాహినికి ఎదురుపోక!—అప్రతిబ్రహ్మ పూర్వమొక విశ్వామిత్రుఁడే; క్షత్రియుఁడై పుట్టి బ్రహ్మవిధిని తుడిచివైచుకొని బ్రహ్మపదుఁడైనాఁడు. నేఁడు, రెండవ ప్రతిబ్రహ్మను, నే నేమి చేయుచున్నాను? క్షత్రియుఁడనై నాను బ్రహ్మజన్మబంధనములఁ ద్రెంచుకొని, ఈ స్వేచ్ఛను పూర్ణముగ ననుభవింపవలెనన్న పరకాయప్రవేశమునవలెనే పరాదృష్టప్రవేశమున నీవు తొల్కికలముండవలెను. కానిచో పరాన్నభుక్కుడై కటకరాజు దివాణమున నిరుద్వేదమని కితమున చివుకుచున్న ఒక పేరి శాస్త్రి దాని కధికారికాగలుగు టెట్లు? అందుచేతనే క్షాత్రతేజమ్ముస్ఫులింగ సంలబ్ధయశఃకోటీరధారి, మహాంధ్ర చక్రవర్తి, శ్రీశ్రీకృష్ణదేవరాయలస్వాలకుఁడను నీదినే దారి విశ్వపతి నైతిని. ఓహో! చిత్రావతియా?

(చిత్రావతి ప్రవేశించును. లేతగులాబీ రంగు పరికిణీ, లేతపసుపురంగు చొక్కా, మబ్బురంగు ఒల్లెను ధరించియున్నది. ఎఱ్ఱగన్నేరు బొండుమల్లెల నేర్చికూర్చి నడుండను వాలుజెడ చుట్టూ పెనవైచుకొని మందారపువ్వును తురాయిగా పెట్టుకొనినది. విశ్వపతిని చూడలేదు.)

చిత్రావతి:—ఇవాళ ఈ గంపరగోళం ఒకటి వచ్చి ఇంతవఱకు "నిత్యజేజే" పాడుకోనే లేదు. (చేతులు జోడించి అర్ధనిమీలితనేత్రయై)

గీతిక

తెలుగు తల్లికి నిత్య జేజే
తెలుగు రాజుకు నిత్య జేజే
తెలుగు మంత్రికి నిత్య జేజే
తెలుగు కవులకు నిత్యజేజే

విశ్వపతి:—ఉప్పెన వచ్చిందిరా బాబూ!

చిత్రావతి:—పిడుగు పడిందిరా దేవుఁడా! ఏం? ఎవర్నంటే ఎవరూరుకుంటారు? మంజీర చేసిన శాస్తి చాలదూ! ఇవాళ "అన్నాజీ-పండుగ" ఎంతో వైభవంతో చేసుకుందామని మంజీరా నేనూ ఎంతో సంబరపడ్డాం-సూరన్న బావగారు, పెద్దతాతగారు, ఇంకా తిమ్మన్నగారు" భట్టుమూర్తిగారు "చిన్నారాణీ, కూడా వస్తుంది. అన్నాజీతో సరసాలాడుతూ చదరంగా లాడించాలి అనుకున్నాం; అన్నీ ఇట్లా ఏర్పాటు చేసుకున్నాం. ఎంత మారాంచేస్తే మా నాన్న పాటలు వ్రాసి ఇచ్చారు?— "రామకృష్ణకవిగారి పాటలు వినిపించు అమ్మాయీ!" అని అంతా బలవంతంచేస్తే "ధనలక్ష్మి వేషం" పాటా, "పూలకోయిల" పాటా "తెలుగు తల్లి" పాటా పాడాలి అనుకున్నా.

విశ్వపతి:—పోనీ, పాడు, నేనూవింటాను.

చిత్రావతి:—చిన్నారాణీ ముందు మంజీరని అలా ఎందుకు కవ్వించావూ? ఆవిడ కోపంవచ్చి వెళ్ళిపోయిందా! అన్నాజీవచ్చి "చిన్నాదేవి ఏదీ" అంటే ఏంచెప్పాలి?

విశ్వపతి:—చిన్నపిల్లవి నీ కెందుకమ్మా అంతటి ఆరాటము? ఆటలో; పాటలో; పోనీ మంచికథ చెప్పనా?

చిత్రావతి:—కథలు గానే ఉంది; ముందు నీకథే మిటో చెప్పు.

విశ్వపతి:—పోనీ నాకథే.

చిత్రావతి:—అన్నాజీ రాగానే అందఱూ కలిసి పాడితే బాగుంటుందని "తెలుగు తల్లి" పాట నన్నాగారు వ్రాయించమంటే వ్రాయించాను. మంజీరకీ పెద్దన్నతాతగారికి రాత్రే సంత చెప్పివచ్చాను. చిన్నారాణికి చెప్పనే లేదు; నీవైనా చెప్పకుంటావేమో అనుకున్నా.

విశ్వపతి:—చెప్పకుంటాలే. మఱి, నా కథ వినవూ?

చిత్రావతి:—ముందు పాట చెప్పుకో. అన్నాజీ రాగానే పాడాలి.

విశ్వపతి:—ఆడవాళ్ళతో పాటు మగవాళ్ళని కూడా పాటలు చెప్పుకోమంటావా.

చిత్రావతి:—అబ్బా! మగవాళ్ళు చెప్పుకునే పాటేనయ్యా అంటేను. మా నాన్నగారు పిల్లలందఱికీ "భక్తితో పాడుకోండి" అని చెప్పితే విన్నాకూడాను.

విశ్వపతి:—సరే చెప్పు.

చిత్రావతి:—నీవుకూడా భక్తితోనే చెప్పుకోవాలి.

విశ్వపతి:—చెడ్డ చిక్కువచ్చిందే నీతో! కానీ చెప్పు.

చిత్రావతి:—

గీతిక

తెలుగుదేశము మాది
తెలుగువారము మేము
తెలుగువారే దేశ
దేశాల నేలాలి
తెలుగు తల్లీ నీకు జోహార్!

తెలుగు వారల మాట
ఛళియనగ చెల్లాలి
తెలుగు వారంటేను
దేవతలె మెచ్చాలి
తెలుగు తల్లీ నీకు జోహార్!

తెలుగు వారలకీర్తి
తళతళని వెలగాలి
తెలుగు జెండా సర్వ
రాజ్యాలనెగరాని తెలుగు తల్లీ నీకు జోహార్!

ఒక్కొక్క చరణమే చెప్పనా?

విశ్వపతి:—ఎందుకు? ఏక 'సంత' గ్రాహినిగా జేసు.

చిత్రావతి:—అయితే పాడు, మణి.

విశ్వపతి:—(ఆ పాట పాడును.)

చిత్రావతి:—నాకంటె నీవే బాగాపాడతావ్! మీ మగవాళ్ల పాటారెు వది. పరే నీకథ వినాలిగా ఇంక చెప్పు.

విశ్వపతి:—అనగా అనగా

చిత్రావతి:—ఒక రాజున్నాట్ట. ఆ రాజుకో కూతురట. ఆ కూతురికి.

విశ్వపతి:—పెళ్లి కాలేదట.

చిత్రావతి:—(పకపక నవ్వుచూ) మంచి కథకుం డవే నే! నే మొదలు పెట్టిన కథనే అందులో గలిగావు.

విశ్వపతి:—నవ్వకూ విను.

చిత్రావతి:—ఎప్పుడూ "అనగా అనగా" కథ లేనా? కోకంటిపాటకు మల్లే. ఏదైనా చిత్రమైన కథ చెప్పితే వింటాను. అదైనా దబ్బున చెప్పాలి. మళ్లీ ఉత్సవానికి వెళ్లాలా. నీ కేం గండురంగుల దుస్తులతో వేషం ముస్తాబించుకొని తయారయావ్.

విశ్వపతి:—ఛీ. పో. గండురంగులుట.

చిత్రావతి:—పోనీ తురకరంగులు. నీలం, ఎఱుపు, ఆకుపచ్చ, పసుపు పచ్చ.

విశ్వపతి:—ఆ. ఈ లేతగులాబీ, పూపపసుపు, మబ్బుచీర అచ్చుటూటూవేష మే.

చిత్రావతి:—ఉత్సవంలో చూడవోయ్. మా నాన్న వన లక్ష్మివేషం వేయిస్తా నన్నారు. వనలక్ష్మివేషం పాట అప్పుడు పాడతా.

విశ్వపతి:—ఇంతకూ కథ వింటావా

చిత్రావతి:—నన్ను "ఊఁ" కొట్టనియ్య మణి.

విశ్వపతి:—ఆపిల్ల ఒకరాజకుమారుణ్ణి వలచిందిట.

చిత్రావతి:—ఏంచేసింది! వలచింది? అంటే?

విశ్వపతి:—తెలియదూ! (బుగ్గమీదకొట్టి) ఇంత పెద్దదానివి.

చిత్రావతి:—పద్యాలుగేళ్ళగా అమ్మనాకు?

విశ్వపతి:—అంటే పెళ్లి చేసుకుందా మను కుందిట.

చిత్రావతి:— ఆ అమ్మాయా! వాళ్ల నాన్న చెయ్యాలిగాని. ఇదేం కథ!

విశ్వపతి:—చిత్రమైనకథ. వాళ్ల నాన్న ఇష్టపడ లేదుట. పైగా ఆ రాజకుమారునితో విరోధముందిట-కాని ఆ అమ్మాయి ఆ అబ్బాయి నే పెళ్లి చేసుకుందామను కుందిట. కాని తాను ఫలానా అంటే ఆ అబ్బాయికూడా తనని ఒల్లడేమో-ఇట్లా ఆపిల్లకి విచారం కలిగింది. ఇది అంతా ఆరాజుదగ్గరేఉన్న ఒకబ్రాహ్మణపిల్లవాడు కని పెట్టి దల్లగా ఆపిల్లదగ్గఱకువచ్చి—

చిత్రావతి:—తనని పెళ్లాడ మన్నాడా?

విశ్వపతి:—తనని గనుక అక్కడ అన్నగారని చెప్పుకుంటే ఆ రాజకుమారుని దగ్గరకు తీసుకొనిపోయి పెండ్లి చేసేభారము తనది అన్నాడు.

చిత్రావతి:—ఎట్లాచేస్తాడు. పీటలమీద కూర్చు న్నప్పుడు మంత్రాలు చెప్పగలడు కాని కట్నాలు నగలూ పారె ఇవన్నీ ఎక్కడిమంది తీసుకువస్తాడు?

విశ్వపతి:—ఎట్లా చేసాడో చెపతా విను.

చిత్రావతి:—ఆఅమ్మాయి ఒప్పుకుందా? నాన్న గారి ఇష్టంలేకుండా?

విశ్వపతి:— ఆ. నాన్న ఇష్టపడలేదని తనకిష్టం ఉన్న అబ్బాయిని పెళ్ళాడ్డం మానుతుందా?

చిత్రావతి:— ఏమిటో ఈ కథ నాకర్థం అవటం లేదు. ఇష్టమంటే!

విశ్వపతి:— చిత్రా! నీవు నన్ను పెళ్లి చేసుకుంటావ్?

చిత్రావతి;— నిన్నా? ఇట్లా అంటే మానాన్నగారితో చెప్పి ఏంచేయిస్తానో చూడు.

విశ్వపతి:— పోనీ గోవిందరాజుని చేసుకుంటావూ.

చిత్రావతి:— ఆ. చేసుకుంటే తప్పా? నాయిష్టం ఏంచేస్తా వేమిటి?

విశ్వపతి:— చేస్తానంటేమాత్రి మెప్పుకుంటావా? మీ నాన్నగారు చెయ్యాలి నీపెళ్ళి. కోప్పడకు. ఇష్టమంటే ఏమిటన్నావే. ఇప్పుడు తెలిసిందా. నామీద నీకిష్టంలేదు. మీ నాన్న నిన్ను నాకిచ్చి పెళ్ళిచేస్తానంటాడనుకో; గోవిందరాజుమీద నీకిష్టం ఎవరైనా మీ ఇద్దరికీ పెళ్లి చేస్తామంటారనుకో, అప్పుడు నీవేంచేస్తావ్ చెప్పు. నాన్న ఇష్టపడలేదని.

చిత్రావతి:— ఆ అమ్మాయి నాన్ననుకున్నావేమిటి మానాన్న. నాయిష్టం వచ్చినచోటనే పెళ్లి చేస్తాను.

విశ్వపతి:— మీ నాన్న మంచివాడు గనుక పోనీ అట్లాగే అనుకో మరివాళ్ళనాన్న ఇష్టపడలేదుగా?

చిత్రావతి:— సరే. ఆ అమ్మాయి ఒప్పుకుందిట. ఇద్దరు చెప్పకుండా పారిపోయారట.

విశ్వపతి:— ఊఁ. అప్పుడే పండితురాలివైనావు. ఔను. ఆరాజకుమారుని ఊరికివెళ్లి పట్టణానికి చివర ఒక ఇల్లు విలుచుకొని-

చిత్రావతి:— డబ్బెక్కడిది; ఆ అమ్మాయినగలు అమ్మకుందా?

విశ్వపతి:— ఊఁ. కాస్తఅండి స్తేచాలు. ఎట్లా పాండిత్యం ప్రకర్షిస్తోందో చూచావా? రెండు రోజులు శుశ్రూషచేసితివా ఈ విశ్వపతి నిన్నెంతదానిగనైన జేయగలడు.

చిత్రావతి:— ఏం బడాయయ్యా! కానీ కథ కానీ ఊఁ. ఇల్లువిలుచుకొని-

విశ్వపతి:— ఆ విచిత్రపుతెమ్మదూ ఈఅమ్మాయి చెల్లెలు అందు కాపురము; ఇక ఆ విప్రకుమారుడు విచారించి తెలుసుకున్నాడు కదా ఆ రాజకుమారునికి తండ్రి లేడనీ, మంత్రియే వానిపేర రాజ్యము పాలిస్తున్నాడనీ, ఆయువరాజు విద్యావంతుడు బలవంతుడు మాత్రమేకాక విలాసప్రియుడనీ, బుద్ధిమంతు లెవరైనా ఉపయోగించుకో గలిగితే వారిచెప్పు చేతలలోఉండే అనుకూల లక్షణములన్నీ కలవాడనీ - సరి - ఎట్లాగో ఆ యువరాజుని తనవలలో వేసుకుని—

చిత్రావతి:— అబ్బా. ఎంత చిత్రమైన పిల్లవాడమ్మా ఎక్కడా వినలేదు!

విశ్వపతి: — చిత్రమైన వాడా చిత్ర విచిత్రమైన వాడా? అప్పుడే ఏముంది? విను. ఒకనాడా రాజకుమారియొద్దకే యువరాజును రహస్యముగ తీసుకుని పోయి "ఇదిగో నీ వైభోగమునకై మార్పులతను బాసి వచ్చిన కుసుమ"మని పరసముగ బోధించెను.

చిత్రావతి:— ఇదేమిటి కథ విడిచిపెట్టి పువ్వుల చేరానికి దిగుతున్నావు? ఇది కథా నీవుకూడా కవిత్వం చెప్పుతున్నావా?

విశ్వపతి:— శాంతంగా వినూ!

చిత్రావతి:— పోనిద్దు. ఆనకవింటాను. మళ్ళి ఇంటికివెళ్ళి రావాలి వాళ్ళందరూ రాగానే ఇక్కడ చదరంగా లాడతారట. అన్నాకీ మంతీరతో ఆడితేనాతో ఎవరాడతారో—

విశ్వపతి:— కథవినూ?

చిత్రావతి:— నీకు చదరంగం చేతకాదా?

విశ్వపతి:— చేతకాదూ? నేను గజ ఆటగాణ్ణి. మీరు పట్టికాయలు పెట్టి తమాషా కాడుకుంటారు. నేను

నిజంగానే అనుకుంటాను మిమ్మందర్నీ నాయిష్టం వచ్చి నట్లల్లా ఆడించి.

చిత్రావతి:— అదుగో గోవిందరాజు వస్తున్నాడు. చిన్నారాణీ మంజీరమీద కోపంవచ్చి వెళిపోయిందంటే ఏంగందరగోళం చేస్తాడో? మీరు కరణం అని కూడా విన్నాడా అంటే రాజుగారి భావగారేఅని కూడా లక్ష్యపెట్టడు. అప్పాజీ ఎంత గంభీరమైనవారో ఈయన అంత గంభీరమైనవారు.

విశ్వపతి:—గంభీరమేమిటి చిత్రా!

చిత్రావతి:—అబ్బా మాటతోచక అన్నాను. ఆయన ఎంతగడసో ఈయన అంతబోళా. ప్రేమైనా సరే, కోపమైనాసరే అప్పాజీలో ఎంతో అగాధంగా ఉంటుంది. ఇక ఈయనవస్తున్నాడంటే అనుకుందా మనుకొన్న ఆలోచనకూడా ఆయనకంటె రెండామడలు ముందుగా వస్తుంది.

విశ్వపతి:—చిత్రా! ఇంత చిన్నపిల్లవు. ఇన్ని విషయాలూ ఇంతే పరిశీలనా నీకెట్లు పట్టుపడ్డాయో.

చిత్రావతి:—అప్పుడప్పుడే సందర్భంగా మానాన్నగారంటూ ఉంటే వింటాను. నేనిక వెళ్ళాలమ్మా. అప్పాజీకి చెప్పలేదు పాట. వారిని చెప్పకో మనటం ఎట్లా? భయంవేస్తుంది. నాన్ననడగాలి. మీరిక్కడే ఉండండి. అందర్నీ పిలుచుకునివస్తా. (ప్రస్థానము)

విశ్వపతి:—చిత్రా! మాట. మాట.

చిత్రావతి:—(వెనుకకువచ్చి) ఏం. ఎందుకు?

విశ్వపతి:—కథ విని పోవు?

చిత్రావతి:—మంచివాడివే. ఇందుకా పిలిచింది? నాకు తీరిక లేదు. నీకథ కొకప్పుడంత మంటుంది ఇట్లా అల్లుతూనే ఉంటావు. (నిష్క్రమించును)

విశ్వపతి:—కథ అల్లుతూనే ఉంటాను? గ్రుడ్డువాడు విసరినరాళ్ళ కెక్కడపడిన నదియేగురి. అట్టివేనీ మాటలు. కథ అల్లిక ఏమిటె? ఇది నీని స్వీయకథ. ఈ నాప్రతాపకథ లోకము విన్న శ్వాస ఆడక స్తంభించి పోదా! ఆహాహా! "బాలాదపి సుభాషితం" అని చిత్రావతితో ముచ్చట లాడునప్పుడెల్ల నా కథా ప్రణాళిక కుపాయములు దొర్లుచునే యుండును. దొరికించుకొనేశక్తి నాలోనేయుండవచ్చును. ఔను. నాయిష్టవచ్చినట్లు వీళ్లందర్నీ పెట్టినిజంగానే చదరంగ మాడుకోవాలి. ఆటప్రారంభించినట్లే ఉన్నాను. ఏదీ చూచెదను. శేడిచ్చుల జరుగబోవు "అన్నాజీ"ఉత్సవమున వసేసలు పొల్గానవచ్చునుకదా! కాని యందఱి యుత్సాహములకు జాతు లొక్కరీతి నుండవు. నా యుత్సాహజాతియిది. రాజులు, రాణులు, మంత్రులు, దండనాథులు, కవులు నొకరేమి యెల్లవారు నీనాడన్ని రాజసాలు, సామంతాలు, అతిశయాలు, అహంకారాలు వీతాదృశాలవన్నిటిని వీడి ఏకకుటుంబీకులట్లు మెలగి యానందించవలెనని అయితే మంత్రిని 'అప్పాజీ' అని మంత్రికుమార్తెను 'చెల్లీజీ' అని వీరు; ఇక, వారు, 'అన్నాజీ' అని 'వత్సా' అని 'పెండ్లికుమారుడా' అని యిట్టి చనువు నామోదించు సాధుత్వము రాజుకి. ఇది యంతయు మతినాకుగిట్టదు. మంత్రికి రాజు దూరము కావలెను. వీరిమధ్య నొక దుర్గమపర్వతమో దుస్తర సముద్రమో యేర్పడవలె నప్పుడు కదా నాకు విజయము? అందుకే నిర్నిరోధమును బీజమునే నాటితిని. మంజీరకు తండ్రినిమాచుకొనిన మిడిసిపాటు. ఆమె స్వాతిశయమును కవ్వించి రాణియెదుట ప్రేలించితిని. రాణి ఆగ్రహించి మంజీరను శిక్షింతునని శపథముచేసి, యుత్సవమునకు నివచ్చి రుసరుస వెడలిపోయినది. రాజు-మంత్రి యుత్సవమున నున్నపుడే రాణికడనుండి మంత్రికుమార్తెకు శిక్షాపత్రము వచ్చును. అప్పుడేమి కా గలదో? ఏమికాగలదు!

సీ. ఇల్లాలిముద్దు చెల్లించురాయలు. మంత్రి
నలువురిలోన వెన్నటికి గాని
రాణీ యానతిని మీరడుకదా? అదికాక
అతడే శిక్షసేయంగ దొడరు
నదిరాజనీతి రహస్యంబు తరువాత
సరి యనూయాగ్ని రాజకీయుపోరు
ఆయొక్క కణమె మహోజ్వాలయై రాజ
మంత్రుల నడి పెనుమంటయౌను.

గీ. వీర! అమంట నఱచేయి యందు దాల్చి
 త్రిపుర దండాహవోహలో ద్రేకభయద
 తనుపుటూదరలూదుచు దరలివచ్చు
 కారు చిచ్చు నెవండునన్ గడిచి బ్రతుకు!

ఇప్పు డిచ్చట చదరంగము లాడుకొను వీరి నందరిని నేను చదరంగ మాడుకొనవలెను. రాయలు, రాజు. సరే రాజాకట్టు నడుటకే కదా? ఇక మంత్రియా? అహో పరమంత్రి తంత్రభేది, సర్వవ్యూహవిచక్షణుడు కాన నప్పాజీనే నా మంత్రినిగ నుపయోగించుకొనవలెను. విపక్షులనే స్వపక్ష ప్రయోజకులుగ తిరుగతోడగల ఎదురొడ్డగల ప్రజ్ఞయే ప్రశంసార్హము. అదుగో గోవిందరాజిటే వచ్చుచున్నాడు. ఇతనిని గుఱ్ఱ పెత్తువేయవలెను. ఒకమంత్రి,ఒకగుఱ్ఱము చాలు నాట కట్టించుటకు. ఈ పెద్దన్నలు తిమ్మన్నలు పేదబంట్లు ఊ:—

(గోవిందరాజు ప్రవేశించును. జరీ అంచుల రొఱ్ఱనిపట్టుబట్ట మరాటీకట్టు గట్టినాడు. లేత ఊదా రంగు అంగీని ధరించి ఆకుపచ్చని పట్టు ఉత్తరీయమును జందెమువలె వైచుకొనెను. జులపాలు భుజములు దాకుచున్నవి. ముంగురులలో పూజాపుష్పముల నలంకరించుకొనినాడు. చేతిలో పూలదండలున్నవి.)

గోవిందరాజు:— ఏమో క్షాత్ర పీఠమును పెద చేయుదు నాలోచించుచున్నారు?

విశ్వపతి:— బ్రాహ్మణులు ప్రధానదండనాధులై క్షాత్రమును నిర్వహించుచున్నపుడు మఱి మాత్క్షత్రియుల కిది యెందుకే ఉపయోగపడుచున్నది.

గోవిందరాజు:— విశ్వపతిగారూ! నిష్కర్షగ మిమ్మొకమాట నడుగుటకే వచ్చితిని. రాణిముందు నా సోదరినేల కవ్వించిరి? ఆమెకోపమును మాపై ప్రయోగించి యేమి బాపుకొందమనుకొంటిరి?

శా. ఏమీ మావిభవంబు మీకకట
 చేదే? మాప్రధానత్వమున్
 మామర్యాదయు రాజభక్తియున్మన
 న్మానార్హముల్ గామె మీ
సామంతంబున వీర! మమ్మెదురు
 మీసామర్థ్యమెప్పాటి దు
ర్దామక్షాత్ర సమగ్ర విప్రబల
 సందర్భంబు నూహింపుడీ!

విశ్వపతి:— ఓహో! కాని గోవిందరాజుగారు నన్ను కారణముగ నిందించుచున్నారు. ఉన్న యదార్థమిది. ఈ 'అన్నాజీ' ఉత్సవము, మఱియు, నిందెల్లరు నన్నదమ్ములవలె మెలగు నలవాటులకు నేను క్రొత్తవాడను—

గోవిందరాజు:— కావచ్చును. నా సోదరి నేల యవమానించిరి?

విశ్వపతి:— ఇందవమాన మేమున్నది? నేనును నా సోదరియు నిచ్చటికి వచ్చునప్పటికి, మంజీర విలాసముగ నిల్చుని "ఈచూడు నమస్తమువాది; ఈ ఉద్యాన రాజ్యమునకు నేను మహారాణిని" అనెను.

గోవిందరాజు:— అదిమీకు కష్టముగదోచిన దా?

విశ్వపతి:— లేదు. ఆ ఒయ్యారమునకు ముచ్చటపడి "మంత్రికుమారీ!" అని అనుచుండగనే "ఏమిటి ఈ పాతాళవాణి" అని నన్నొకిలించి పల్కెను. అదియు నాకు ముచ్చటయే అటు "మాదు, రాణి నా సోదరి, రాజు నాస్యాలకుడు, పట్టుపట్టి బలవంతముగనైన నిన్ను పెళ్ళాడి గర్వము వదిలించెదము లే" అంటిని నవ్వుటాలకు. దానిపైనే మేమో నన్ను, నాయోగ్యతను నిందించి "ఈ రాజ్యమంతా మా అప్పాజీదే" అనెను. ఆమాటకు నాసోదరికాగ్రహము కల్గినమాట వాస్తవమే. కాని తన సోదరినే అడుగుడు "చిన్నపిల్ల; ఆమాటలకేమి లే ఊరుకో" అని నా సోదరిని బ్రతిమాలితినో లేదో.

గోవిందరాజు:— మహారాజ్ఞి నాసోదరిని శిక్షింప బ్రతినవట్టి వెడలిపోయినదట మఱి మీయాలోక్యమున జరిగిన దీనికి మీయుత్తరవాదిత్వమును గ్రహింతురా?

విశ్వపతి:— ఒకరి స్వభావమున కొకరెట్లు బాధ్యులు. నేలమాడినమాత్రమున కా బాలిక అట్లు వ్యగ్రరాలగు ననుకొంటిరా? అయిన ప్రయత్నించెదను.

గోవిందరాజు:— మీరు ప్రయత్నించున దేమి? ప్రధానమంత్రి దేవునికొమార్తె, ప్రధాన దండనాథుని సోదరి, అట్టి శ్రీమంతురాలిని మీకేయోగ్యతాధికారమున మేలమాడ సాహసించితిరో ముందు తెల్పుడు.

గీ. సకలమూర్ధాభిషిక్త రాజన్యవరులె
రాజవంశము నెట్టులో రాజమంత్రి
వంశమునుగూడ నటులె సద్భక్తి గొల్తు
రదియొయుండగని మీదు యోగ్యతయునేమి?

విశ్వపతి:— అవిజ్ఞుడను క్షమింపుడు. సర్వసమర్థులుకదా మీరు?

గోవిందరాజు:— ఇందక్రమము జరిగినప్పుడుగాని మాసామర్థ్యము బోధపడదు. ఇప్పుడు జరుగబోవు సత్సవేశనైన వివేకము సంపాదించుడని జాగ్రత్త హెచ్చరించుచున్నాను. (ప్రస్థానము)

విశ్వపతి:— ఇంతటి గర్వాంధ్యమా! ఈతడు గుజ్జుపిల్లవకే పనికివచ్చును. పొగరుబోతుగుఱ్ఱము. చేయి సేతకనువుకాదు. కాని నావచ్చినదాటంచే వేయగలను. అప్పాజీ యొకవేళ తానుకూడ శిక్షనామోదించినను ఇతడుమాత్ర మూరుకొనువాడు కాదు. ఏమాత్రము ప్రళయమునైన జేయకపోడు. ఔను.

గీ. త్రాచుకావలెగాని వెన్నత్రులు లేల
పడగ విరబోసుకొని బరిఁ బరవడిలుట
గబ్బుబున్నల పెడఁ బెడఁ గలియఁబడుట
సర్పజాతికి సైజదీక్షలు ధ్రువంబు.

అట్టి పౌరుష సైజము వీనిలో బాగుగనే ప్రస్ఫోటించినది. అది మాకనుకూలమే. కాని మాటిమాటికిని మాయోగ్యత ప్రశ్నింపబడుచున్నదే. ఈదుర్వ్యాధిని శుద్ధిచేసుకొనుటయే మాసంకల్పము. గోవిందరాజా! ఈప్రశ్నచే సింహమును కవ్వించితివి సుమా!

గీ. సుప్తసింహంబు జూలుఁలాగ జూచినంత
చెల్లునే? భద్రగజరక్త సిక్తదారు
ణోరునఖంబు ఘోరమగు వాడికోర చేయు
చేదు గనగనకూడ రోచింపవలదు!!

ఓహో! ఉత్సవమండలి లీలామంటపమును జేరుచున్నది. పోయి పూర్వాహజాగరణము చేయవలెను.

(నిష్క్రమించును)

(యవనిక)

## రంగము ౨

స్థానము:— ప్రథమరంగమునందలి యుద్యానవనమునందే స్థలాంతరమున లీలామంటపము.

సమయము:— ప్రథమరంగము జరిగిన పొటనే కొంచెము తరువాత.

(మండపము ముందు పూలచెట్లసుగన్ధ, చక్రకక్షగా, చంద్రకాంత శిలావితర్దులు నిర్మింపఁబడియున్నవి. రామకృష్ణకవి సల్లనినట్టపంచుల పీరుకావిధోవతిని కట్టుకుని లేతబాదమురంగు పట్టిచేతులఅంగీని తొడుసుకొని పన్నుకాశీను దువ్వమువేసి చుకొనుచు నిల్చునియుండెను. గుబురుజాలపొ జుట్టుపై సవ్వటన్నట పొగడపువ్వులు రాలినవి. అల్లసాని పెద్దన వానికెదురుగా వచ్చుచుండును.)

రామకృష్ణకవి:—

గీ. ఆంధ్రకవితాపితామహ యల్లసాని
పెద్దనకవీంద్ర మనుకృతి విభవసాంద్ర
అందుకొనుమివెయి నవరసస్యందినీ సు
ధామయోక్తుల నాస్వాగతంబుగీతి.

పెద్దన:—(రామకృష్ణకవికి సమీపముగా వచ్చును. ఊదా పట్టుధోవతి బిళ్ళగోచీపెట్టి కట్టినాడు. జరీ బొందుల గరుకు తెలుపుటంగరఖా తొడిగెను. బనారసు ఉత్తరీయము, తెల్లనిపాగ, బంగరు రుద్రాక్షమాల, నడుమునకు ఖడ్గము, చేతిలో గులాబీపువ్వు.) వికటహాస్యసంగమునకుఁ దాతల సన్నికర్షమునగదా మనుకులకు జనావు. శ్రీవారువచ్చు పర్యంతము దమవికటపంచాంగ శ్రవణమున ధన్యుడ నయ్యెదను.

రామకృష్ణకవి:— తమ గడుసు ఆదరణచే వీని నోటికి తాళము వైచినారు.

పెద్దన:—రామకృష్ణ! సత్యము వక్కాణింపవలయుచో నిమ్ముగనిన డెందమానందమున గందళించు జుమీ. అశ్రాంత విశ్రాణనమున రాయలవారి బురణింతురు కదా కవిరాయలు! శ్రీవారిచే దత్తములైన యగ్రహార పారితోషికాదులనెల్ల పెక్కురు నిర్ధనభ్రాతలు తమనుండి సంగ్రహించుకొని ధన్యులగుచుందు రిది యెల్ల హృష్టి సమకూర్చెడిగాని, యొకానొక యరణ్య బాలికను గొనివచ్చి ప్రేముడి పెంచుకొనుట మాత్రము మన వర్ణాశ్రమధర్మములకుఁ గడుంగడు ప్రమాదంబు నాపాదించుచున్న యది.

రామకృష్ణ:—ప్రమాదములయందు పరివర్తనము నొందినపేగాని వర్ణాశ్రమధర్మములకు పుట్టగతులుండవు. మా చిత్రావతివంటి మంచిపిల్లని మీసాంప్రదాయ కుటుంబములలో మచ్చునకైన చూపగలరా? లేనప్పుడు

పెద్దన:—ఏ తత్పురస్కృతిని కులగోత్రంబు లరయకయె భవాదృశబ్రాహ్మణు లట్టి బాలికను దనయగ స్వీకరించుటను మనుస్మృతి నిషేధించును.

రామకృష్ణ:—వర్ణసాంకర్యము మీ స్వారోచిషమను సంభవముతోనే అంకురించినది కదా? విరుద్ధ ప్రకృతిజాతుల రక్తసంకరమునందు మాత్రే తేజస్సత్వ బీజము లుద్భవింపగలవను సత్యము పితామహులెఱుంగనిది కాదు. మఱియొక విశేషము. ఆబాలిక కుల గోత్రములు తెలియరావు గనుకనే నాకు మనశ్శాంతి. ఏమో ఆపిల్ల తమ సంస్కృతి వంశములోనిదే ఎందుకు కాకూడదని తమవంటి పెద్దలను సమాధానపరచవచ్చును.

పెద్దన:—తథ్యము. తథ్యము. ఏతత్సమాధానంబున కుదురుపరచుకొనియే మాన్యశ్రోత్రియులు కూడ—

(విశ్వపతి ప్రవేశించును)

విశ్వపతి:—గీ. ఆంధ్రకవితా పితామహఖ్యాతి నొక్క
కవులకే కాదు తాతవు కలతెలుంగు
బిడ్డలకునెల్ల తాతవౌ పెద్దకవివి
వయసుచే పెద్దనార్య తుభ్యంనమోస్తు.

పెద్దన:—అన్నాజ్యోత్స్న వ్యాజమునగా నొప్పు సమధిక ప్రాతిశయపీసు లీప్సితసాధ్యా దృతివస్మదాదులఁ బృచ్ఛించుట! వత్సాః అభీష్టసిద్ధిరస్తు.

రామకృష్ణ:—దిగ్విజయప్రాప్తిరస్తు.

విశ్వపతి:—తమకు ప్రత్యేకముగ నమస్సు చెల్లించుకొనలేదు. అయినను శుభాశీస్సుహితమైన దయాచితముగ లభించునప్పుడు దానినే శిరసావహించి ప్రణమిల్లుచున్నాడను. పితామహా! ఈ అన్నాజీ యుత్సవము నాకు చాలక్రొత్త. కాని స్వైరవిహారమునొక్క యా లీలను దర్శింపవలెనని యున్నది. అభీక్ష తమచే యనుగ్రహింపఁబడవలెను. ఒక యపూర్వరసపక్షుల యిచ్చట ప్రవర్తిలవలెను; తమ రారంభకర్తలైనగాని యది సనుకూరదు. మన్మనోరథసిద్ధి కభయహస్తమెసంగిన యిదే శరణాగతుడను.

పెద్దన:—(మందహాసముతో) అభయహస్తమెసంగితి మభీప్స రెట్టిదియో ప్రవచింపుము.

రామకృష్ణ:—విశాంధవుల యుత్కృష్ట ఘనతకీ హతాత్మమతి యుపద్రగరిమను సంధించుచున్నది.

విశ్వపతి:—రామకృష్ణ కవిచంద్రులు విజ్ఞాన సాహితీ సార్వభౌములు. కుశాగ్రీయధీశులు తమ ప్రసన్నతకొరకు నమస్కార బాణము.

పెద్దన:—విశ్వపతిరాయా! కోరక కోరితిరి. ఈ పర్వదినమున తమవాంఛ యెట్టిదయినగాక తీర్చెదను. క్షాత్రరాజుల యభీష్టములు కవిరాజులు మన్నించు శుభావకాశము దీనిని సవ్యసించుమనంతటి—

రామకృష్ణ:—"బుద్ధి జాడ్యజనితోన్మాదుల్ కదా శ్రోత్రియుల్!"

పెద్దన:—శ్రోత్రియులము కాము.

విశ్వపతి:—శ్రోత్రియులైన మండలాధిపత్యము దక్కకుండెడిదే కదా! ఎవరును దాడివచ్చుటలేదుగాని విచ్చుకఁములో తమరు యుద్ధముచేయుచుండెడివారా: ఐనను సర్వేశ్వరునికి వలెనే కవుల కొక జాతియేమి?

పెద్దన:—తమకుగూడ కవిత్వ వాసనగలదనియే వింటిని.

విశ్వపతి:—కాని యీవాసన వెనరును భరింప లేరు. అందుచే త్వరలో మరచిపోవుటకు కృషి చేయు చుంటిని. హాస్యధోరణి మరిపింప జూచుచున్నారు నేనడిగిన వరమును.

పెద్దన:—లేదు. సత్వరము కోరుకొనుడు.

విశ్వపతి:—పితామహా! రాయలిప్పుడు సదరంగ మాడునుగదా; అప్పాటితో అనువట్లు చేయవలెను. వారి వదునుటకు మాకు ధైర్యము చాలదు. రాజమంత్రులకు తమరొంత కడుపు జ్యభావము కలదు. తమరడిగిన ఎవ రును కాదనజాలరు. తమరు తలచుకొనవలెనే కాని సమ ర్థింప లేనిదేమి! 'కవిర్బ్రహ్మా' 'కవిర్దేవోనచోఽన్యః'

పెద్దన:—ఓహో సరసశిఖామణులు విశ్వపతి వారు. ఎట్టి 'కవి - ఊహ'ను మనోనీతమొనర్చినారు? (రాయలు కొంచెము దూరముగా ప్రవేశించును. కాంచ నాంచల దుకూలధరుడై యుండెను. హంసతూలికలతురా యిచేతను, ముత్యముల జాలరులచేతను రత్నములచేతను సమలంకృతమగు జరీకుచ్చు పాగపెట్టుకొని యుండెను. మెడలో పూలమాలలున్నవి. కత్తిలేదు.) అదే శ్రీవారు విజయము చేయుచుండిరి. ఆంధ్రప్రతాపయశస్ఫురుల దశదిశల వెదజల్లు తత్ప్రకాశమే రాయలయాగమనవార్త ను దెల్పుచున్నదికదా.

అహో!

చ. వెలుగులజల్లు ముత్యముల వెల్లన
విచ్చురురాయికిన్ హరాయల్
బులబులబూచు నింద్రధను
వున్ వలయించిన యట్టు లొప్పెను
జ్వాల బహుజగ్గ కేత్తువ ప్రభంగని
రాయల శ్రీ ప్రతాపమం
జుల పరివేష లక్ష్మియునడుచు
జయకేలబత్తితుం విన్నలున్.

రాయలు:—(సమీపించి) పూజ్యుల కభివందన ములు. పితామహా! నేడైన నన్ను వంది మాగధీయము నుండి తప్పించి యనుగ్రహింపరా? కవి మిత్రులారా! సుఖాసీనులు కండు. (ఎల్లరును కూర్చొనుచున్నారు)

పెద్దన:—మహారాజా!

రాయలు:—ఉండుడు. ఈ చిత్రమును మీరూ హింపుడు. నిద్రాదేవియొక్క ప్రశాంతవక్షమునుండి మేల్కాంచి, తీవ్రజ్యోతిర్పీడనమునుండి తననంతనలంకుర క్షించు భద్రకవచమగు నిశాపటమును మెల్లజారవిడిచి,కర్మ సంకులమగు దినమున-తపనులోకమున ప్రవేశించువేళ నా 'ఉదయశీవి' చిత్తమెంత స్తిమితముగ నుండవలెను!

విశ్వపతి:—భావగారు కవిత్వప్రియులు.

రాయలు:—ఉండుము. ప్రగల్భనయమును నూతి సౌశ్యముతో నవీనోత్సాహముతో నా 'శిశుజీవి' కర్మపరుడు కావలెనన్న నా ప్రారంభవేళ యెంతప్రశాం తముగ, శుభముగ నుండవలెను!

రామకృష్ణ:—సత్యము.

రాయలు:—అట్టి ప్రధానవేళ, వైతాళికుల మేలుకొల్పులు, మంగళతూర్యరవములు మహారాజా పరాక్కులు నామస్తిమక్కమును చంక్రమ్యము జేసి యెన్నడో రచింపబడి చిరానుగతమగు నొక కర్మ చక్ర మున నన్నుఅకలాగుచున్నటు లుండును.

విశ్వపతి:—పితామహా! మా భావగారు నేడు వేదాంతము నుపదేశించుచున్నట్లున్నదేమి?

రాయలు:—హాస్యముకాదు. వినుడు. ఈయా త్రలో నాకు దారసిలు ప్రతివ్యక్తియు వంగి సలాములు చేయును. వాని పాదములు నామార్గము నుండితొలగి పోవును. స్వేచ్ఛాకాముకతోరకము లనదగు బాలకు మారులు సహితము నన్ను గనినంత నేమి చేయుదురో చూచి తిరా యానాటికే నేర్చియుండిన 'వంగి సలాములపాఠము' ను పునరుక్తము చేయుదురు. ఇంత యెందులకు? నేను చరించునదంతయు నొక కృత్రిమ జగత్తు. 'మహారాజా' అనుపదము నాచెవి సోకినపుడెల్ల నీకృత్రిమమె నాకు సాక్షాత్కరించును. మాడుడు! జాలరిగాలము, బంది ఖానా, శిలీముఖము, నీ శబ్దభూతము నిట్లు వర్ణింప వచ్చునా?

రామకృష్ణ:—కవిత్వానృష్టిని చూచిన నిది చాల సుందరముగనే యున్నది.

విశ్వపతి:—కాని యిదియంతయు నప్పాజీకుబ్రయని పొడగట్టుచున్నది. జనత నిట్టి లక్షణమున శాసించినాడు.

పెద్దన:—జెండియు లక్షణగ్రంథములు ధీరోదాత్తుడనువృభుని యేతాదృశభావోర్మిలనుండి నిషేధించుచున్నవి.

రాయలు:—ఓ పండితకవిగారు? మీలక్షణగ్రంథములు మాపుదారియు నొక కృతక జగత్తునుసూర్చియే యగుచున్నది. జీవజగత్తుతో దానికట్టి బాంధవమును లేదు. నేను లక్షణగ్రంథములను సంప్రదించి రాజనుగా జనింపను లేదు. మనసాహిత్యము కృత్రిమము. మనజీవితేము కృత్రిమము. తుదకు మనమానవుకుచేసిన ఘనకార్యమిది. ప్రకృతిమీద మఱుపునుపూసి కృత్రిమభూతమును రచించినాడు. ఆపిశాచసుందరి, నేడు, యావత్ప్రపంచమున నాట్యము చేయుచున్నది. ఆ పీడనుండి తప్పించుకొను సాధనయందే నన్నజూ నేడు ప్రపంచమున నెల్లెడల ద్రిమ్మరిల్లుచున్నాడు. కాని యీ యాతనలో సుఖమెట్లు?

రామకృష్ణ:—ఆరాజ హంస యీపక్షిజగత్తునుండి వియద్గంగోదమును గ్రోలజూచుచున్నది. ప్రాయికా ఆప్రయత్నమునసే కర్మపరితయుంద సుఖము లభింపవచ్చును.

రాయలు:—అవును. వానివిశ్వాసమదియే. ఇంతకాలము ప్రపంచాటనమీద తుదకు మనయాంధ్రభూమియందు వానికా చిరభ్యాశ సత్యజగదానవము చేటగ గోచరించినదట, ఎంతయో యానందించుచున్నాడు.

పెద్దన:—ఇది యెల్ల వేదాంతమును దలిపెడి నే. లౌకిక ప్రవర్తకులు వేదవిద్యావిచారణ కనధికారులు. పతంజలి యేమని ప్రవచించె?

రామకృష్ణ:—ఛాందసమునువాని స్వేచ్ఛగ నుండుమని.

రాయలు:—అవును. స్వేచ్ఛసహజము. శాసనము కృత్రిమమే. నేనున్న యీకృతకభూమియందు నాలుగు పుణ్యతీర్థములు కలవు. చూడుడు. అప్పాజీ నన్ను 'వత్సా' యని యాదరించును. మంజీర 'అన్నాజీ' అని పిల్చుచు నొకభంగున నాకడకువచ్చును. చిత్రావతి 'పెండ్లికుమారుడా' యని మేలమాడును. రామకృష్ణకవి నన్ను తమమిత్రునిగ జేసుకొని యనుగ్రహించినారు. ఈదివ్యమూర్తుల సందర్శించునప్పుడెల్ల నేనొక ముక్తాపురుషుడనుగ నానందింతును. అప్పాజీకి నమస్కరించునపుడు నేనంతవఱకు మోయుచున్న దుర్భరభారమొకటి వీడినట్టిసుఖమును పొందుచుందును.

విశ్వపతి:—కాని యొకచోట 'వత్సా' యొకచోట 'రాజా' అనివ్యవహరించుట, దీనితాత్పర్య మేమిటి తెలుసురాయ!

రాయలు:—అవును. అప్పాజీ యితరులతోటి ప్రసంగమున 'రాయలు', 'నారాజు' అనునట. కాని నాసమక్షమున నెన్నడునట్టి పరుషత్వమును వారుపూనలేదు. ఎప్పుడును 'వత్సా' యనియె మధురముగ సంబోధింతురు. అప్పాజీ నన్ను మహారాజాయని పిలుచుదురో యోగమే కలుగకూడదు. ఒకవేళ కల్గినచో నామహారాత్రమునుండియే నేనాతనికి, నతడు నాకును కానివార మగుదుము. అట్టివియోగము మనుకొనుటకు నయోగ్యమసహ్యము.

(తిమ్మరుసు ప్రవేశించును. జరీఅల్లిన అపపచ్చంచు తెల్లపట్టుధోవతి, జరీపనిషీ మబ్బురంగు అంగరకా, జరీపాగా, పట్టుత్తరీయము, చేతిలోకొన్ని కాగితములున్నవి. అవసరముగ కార్యాలయమునకు బోవుచు నిచ్చట రాయలతో చెప్పిపోవుటకు వచ్చినాడు.)

తిమ్మరుసు:—పూజ్యుల కభినందనములు.

పెద్దన-రామకృష్ణ:—(లేచి ప్రతినమస్కారము చేసి కూర్చుందురు.)

రాయలు:—అప్పాజీ! వందనములు.

తిమ్మరుసు:—వత్సా! విజయోఽస్తు.

విశ్వపతి:—(మందహాసముతో తిమ్మరుసును సమీపించుచు పెద్దనాదుల జూచి)

గీ. రాయలకు రాయలై రాజరాజశివి
మూరురాయరగండ పెండేర మెవడు
కడిమిఁ దనరాజాపాదాన దొడిగికొనెనో
అతఁడె తిమ్మరుసు మంత్రి జోహారులిడరె!!

రాయలు:—(చమకితుడగును)

తిమ్మరుసు:—(అంతవరకు రాయలపైనున్న దృష్టిని మరల్చి గంభీరముగ మందహాసము జేయుచు) అభ్యాసము లేమి పాకము విమఱింపుచున్నది; విశ్వపతిగారును వికటకవు లగుచున్నారు!

రామకృష్ణ:—ముఖస్తుతి చమవును తెచ్చిపెట్ట గలదని వారి తాత్పర్యము. కాని యిదియేమి తమరు కార్యాలయమునకు బోనున్నటు లున్నది?

పెద్దన:—మంత్రిపత్రము లెన్నటనున్న నన్నటికి రాజకార్యములె పరునవచ్చుగాక! శ్రీవారు తమ నిప్పుడెందును బోనీయరుసుడీ!

చిత్రావతి:—(ప్రవేశించి) ఇవిగో చదరంగపు కాయలు పట్టుకురమ్మన్నారు. బల్లలు అన్నీ మండపంలో ఉన్నాయి పట్టుకొనివచ్చి వేయనా?

రాయలు:—చిత్రా! ఏదీ వనలక్ష్మివేషం పాట పాడుదునంటివి!

చిత్రావతి:—తెలుగు తల్లీపాట యెవరూపాడ మన్నారుగా: అందరు వచ్చినతరువాత నేను పాడకుండా ఉండను.

విశ్వపతి:—ఏదీ వనలక్ష్మి వేషం!

రాయలు;—ఆపాట పాడుమా.

విశ్వపతి:—చదరంగానికి బల్ల ఏదీ చిత్రా!

చిత్రావతి:—అన్నీ ఒక్క మా పెట్లోనేమిటి? వేషంఅంతా మండపంలో ఉంది. ఎంతలోకి వేసుకోవాలి. అన్న ఏర్పాటు చేస్తానుండండి. ఎన్ని బల్లలు వెయ్యాలో (మండపంలోకివెళ్లి ఒక్కొక్క బల్లే పట్టుకు వచ్చి వేస్తూ ఉంటుంది. రకరకాలపూలమాలల జాలరు నొడలిదిగవైచుకొనినది. పన్నని తామరతూడులు చేతుల వద్దను రెండు రొమ్ముతామర మొగ్గలు వక్షమువద్దను, ఆజాల రున కమర్పబడియున్నవి. బల్లమీద చదరంగపుకాయల నమర్చుచు)

గీతిక

వనలక్ష్మివేషాన వలచివచ్చాను
మా వసంతుని పెండ్లిపాట విన్నాను.

రాయలు:—వసంతు డెవరు చిత్రా!

తిమ్మరుసు:—(కాగితములను జూచి సేవకుని కొఱకై అటు నటు జూచును.)

రామకృష్ణ:—(తిమ్మరుసు మనస్సు గుర్తించి సేవకుని కొఱకేగును)

చిత్రావతి:—
పెండ్లి పేరంటాలు పిలువకుండానే
చిన్నదానను నేను చేయవచ్చాను

పెద్దన:—నీవే నాయేమి పెండ్లికుమార్తెవు?
(రామకృష్ణకవి సేవకునితో వచ్చును)

తిమ్మరుసు:—(సేవకుని జూచి) ఈ లేఖల నిప్పుడే పంపవలయునని చెప్పి రాజపురుషుని కొప్పగించుము.
(సేవకుడు లేఖలగొని యేగును)

చిత్రావతి:—
వనకాల దొలికేటి నాబాహు లతల
తళతళల అందాలు దండలవుతాయి

రాయలు:—ఎవరిమెడలో వేయుటకో?

చిత్రావతి:—
వలపు పువ్వులుపూయ కలకల నవ్వి
అనురాగ లతలతో హారాల నల్లి

రాయలు:—రామకృష్ణ కవిగారి తోటలో

పెద్దన:—వలపు పువ్వులా అనురాగలతలా గొప్ప తోటమాలి.

చిత్రావతి:—
మంచిగందముపూసి మా పెండ్లికొమరు
కంఠమునవైచి మంగళసూత్రవేళ
కౌగిలింతలలోన కరిగిపోతాను
చిరునవ్వు తేటలో విరిసియుంటాను.

రాయలు:—ఇట్లా అంటున్నా నిన్నెవరు పెళ్లి చేసుకోలేరు చిత్రా!

చిత్రావతి:—ఇట్లా అంటే నేనసలు పెళ్లిచేసుకోవబ్బాయ్!

రాయలు:—నష్టం ఎవరికో!

చిత్రావతి:—ఎవరికా? సంభావన బ్రాహ్మలికి పురోహితులకేను. లేకపోతేను! ఉండండి మంజీరనికూడ పిల్చుకువస్తేగాని

మాధవునివలపించి మందారవనిలో
మాయమైపోతాను మరలవస్తాను.

(పారిపోవును)

విశ్వపతి:—(రాయలవంక జూచుచు) పితామహా!

రాయలు:—అప్పాజీ!

పెద్దన:—ఉభయపక్షములును యుద్ధసన్నద్ధములయి ఉన్నవి. చిత్రావతిలేదే. రామకృష్ణకవిగారూ! ఈఖేలనమునందు రాజమంత్రులుందురుకదా! రాజును మంత్రియు నీయాటయాడిన సమధికసంతోషంబు కల్గెడినహో యొకపక్షమున శ్రీవారుండనే యుండిరి. అప్పాజీయు మనయభిలాషను దీర్చిన ధన్యులము కదా!

రాయలు:—పెద్దనను చూచి నవ్వుచు అప్పాజీ!

రామకృష్ణ:—ఈకవి ఛాందసమునకు బాధ్యుడనుకానని రాయలవా రనబోవుచున్నట్లున్నది. పితామహా! ఇట్టివిషయముల నప్పాజీ చాల పసివారు. వారిని బలవంతముచేయకుండుట మంచిది.

(తిమ్మరుసు:—మందహాసముచేయును.)

విశ్వపతి:—రామకృష్ణ! ఎంతమాటంటిరి!

ఉ. గారట దోర్బలో గ్రరిపు
రాజులె రాయలపైకి భీతి నా
శూరబలప్రతాపరమ
శోభిలు నెవ్వనికల్మి నాడివాఙ్
గారట బుద్ధియందుగార
గారట నాటియుగంధరాదులే
వారట యెత్తులందు పసి
వారు బలేపసివట్టు వారయా!

రాయలు:—(చిన్నబుచ్చుకొనును)

తిమ్మరుసు:—(శాంతగంభీరుడగును.)

పెద్దన:—అగుడుగాక ఛాందసుడ వట్లనిరైన నామువ్చటను దీర్పవచ్చును కదా! మంత్రిదేవా, క్షంతవ్యుడను.

తిమ్మరుసు:—పితామహులు నేను పరిహాసభూమికను ధరించిరనుకొందును.

రాయలు:—అప్పాజీ! ఈపితామహులు, లోకులకంటబడకుండ భద్రముగ మూటగట్టి యుంచుకొన్న వినోదకసామగ్రిని పారవడి నేడిట విప్పుచుండిరి కానలయు.

పెద్దన:—ఈపితామహ బిరుద మాశ్రితుడని యనుగ్రహించిరి కాక శ్రీవారిమ్రోల నే పాటివాడను? వారి యొక వాక్యము నొక కావ్యమగును. అందుచేతనే పెద్దలు "వాక్యం రసాత్మకంకావ్య" మనుట. అనుగ్రహింపరు! చిత్రావతి వచ్చులోపల రెండుకాయల జరుపుదుచాలును. గజము–సింహము–వైరముతీవిచిత్ర–సఖ్యముగ చెలగాటలాడు నాదృశ్యమెంత మనోమోహనముగ నుండునో దీనిచే నేనూహించుకొందును. మరొక కావ్యరచనకు కొంచెము సామగ్రిని కటాక్షింపుడు. (అని చనువునరించు మల్లాసభాషము నభినయించుచు మృదువుగ రాజమంత్రుల హస్తములబట్టుకొని బల్లపైనుంచును.)

రాయలు–తిమ్మరుసు:—"నిరంకుశాఃకవయః" అనుచు రెండుకాయల జరుపుదురు.

విశ్వపతి:—మంత్రిగారికికూడ మంత్రియుండవలెనా?

పెద్దన:—ఊహ బాగుగనున్నయది. స్వతః మంత్రికద. కొండొక మంత్రి "కింప్రయోజనం" (అని తిమ్మరుసు రాయలనుండి మంత్రిని తీసివైచును.)

రాయలు:—(నివ్వెరబోవును.)

తిమ్మరుసు:—(కటకటబడును.)

విశ్వపతి:—అప్పాజీ!

ఉ. రాయలు రాయలా! తెలుగు
రాయలరాజిగిమిల్మిలించుబల్

రాయలరంగడీ తెలుగురాయలు
    రాయలు గండదరయ్యా నా
రాయవతారభంగి జతురంగపు
    రాయలరాయలయ్యా నీ
రాయలగట్ట రాసచివరాయలనో
    ఒకరెత్తు వేయరా.

రాయలు:—(మంజేతిగోలుసు గంటను విలాసముగ మోగించుచు తనకాయలయందలి రాజును జూచుచుండును)

తిమ్మరుసు:—(కాయను చేతిలో పట్టుకొని రాయలను గమనించుచుండును)

విశ్వపతి:—(రాయలవంక జూచి) బావగారిని మధురభంగిమమున దర్శించుట నేను భట్రాజునగుదుంటిని ఓహో!

క. మంజేతిగోలుసు గంటల
మంజుల రణనంబిదేమి? మా రాయలు ది
క్కుంజర ఘోటాష్టకమున
రంజిలు విజయాంకములను రచియించెడినో!

రామకృష్ణ:—

క. ఎట్టెట్టో స్తుతి పాఠము
భట్టుల కర్జంబు విశ్వపతి రాయలకా?
కట్టా! రెండవడీ రాజను
భట్టున నిటహెచ్చవేసె? భట్రాజయ్యేవ్.

రాయలు:— (నవ్వుచు) పితామహు లంతతో యూరకున్నారు రాజునకు రాజుమంత్రి మేలయని

రామకృష్ణ:— నేను తీసివైచుచున్నాను. (రాయలకాయలనుండి రాజును తీసివైచును.) ఉద్ధవులు మఖాముఖి రైనపుడును మధ్యయుగములో నెవరుగాని యెవరి ప్రయోగమునకును సరికాకుండఁగాచుకొనుటకు, నడుమ, మాఁబోటి పేదలుంటూ యుండవలెను. వెనుక నొకమారు శ్రీమదాంధ్రనేతృస్వామికిని భీమసేనమహారాజు వారికిని సాహిత్యచర్చలో ముష్టాముష్టికై ఆయన గద యొత్తితే ఈయన వాలమున నాగదకురివేయ మన్నప్పుడు నేనడ్డుపడి ఆలోక యొచ్చునకు నా మెడవంచీయబట్టి యూగన గౌరవము రక్షింపఁబడినది. సోదరహత్యాదోషమునుండి యుద్ధరించితి వని యుభయులును నన్ను వేనోళ్లఁ బొగడిరి!

రాయలు:— కవిమిత్రా! తమ వాచాలతలో కళ్యాణసృష్టి తాండవించును గాక!

రామకృష్ణ:— తమ రిట్లు దీవించుచుందురు. ఇఁటికిఁబోయిన దమ్మవాన్మాతృదేవి వారి "అబ్బాయీ! వాగకురా" యనేలాలన.

పెద్దన:— ఎన్ని యసందర్భముల సంపుటీకరణ మైనను తద్వాచాలతను తమకే అంకితము జేసుకొనుట మాత్రము—

రామకృష్ణ:— నాగోడి వేకున్న నీతర్జనభర్జన లన్నియు నెట్లు వచ్చును? కొంటెతనము కర్షించినట్లుగా శౌచము, స్మార్తము లోకాన్ని ఆకర్షింపగల్గితివియా యని నామనవి.

(తెరలో చిలుక కృష్ణా కృష్ణా యనును.)

రాయలు:— అదిగో చిత్రావతి చిలుక చే కిలిపించుచున్నది. శుకరాజును పరామర్శించి అప్పాజీ మంజీరను పిల్చుకొని వత్తును. (ప్రస్థానము)

రామకృష్ణ:— మంజీరతో గలిసి రాయలు చిలుక నాడించును. ఆరసనాటకమున నేను నొకప్రేక్షకుడ నయ్యెదను. (ప్రస్థానము)

విశ్వపతి:— సూత్రధారుడు లేని నాటకములో భిరచును, నేనును వచ్చెదను. (ప్రస్థానము)

పెద్దన:— శ్రీవారికి శుకప్రీతి మిక్కుటము.

తిమ్మరుసు:— అవును.

పెద్దన:— ఈయాటలో దమసామర్థ్యము నొండాడదగినది. ఒకటిరెండు తిరుగుడులలో శ్రీవారియాట కట్టుపడెడిదే.

తిమ్మరుసు:— అయ్యో!

పెద్దన:— నాచిరమాంద్యమును ఛాందసముగూడ యూడిపోవునట్లు రాయలు స్వేచ్ఛనుగూర్చి నేడుపన్యసించిరి.

తిమ్మరుసు:—ఆఁ.

పెద్దన:—తమరు పరాకుగ నున్నటులున్నది?

తిమ్మరుసు:—లేదు.

పెద్దన:—తరుప దేశవ్యాజమున నూతనోత్సాహమొండు సముద్భవించినది. తత్పారవశ్యమున నేను మహారాజుయొక్కయు, మహామంత్రియొక్కయు విజయహస్తముల సంగ్రహించి యుక్తేల వినియోగించు కొంటిని. మజ్జాతక కారుణము యత్కించిత్తు మసకయుండి యుండవలెనుగాక ఈవిజయఘట్టము నతడేల వ్రాయడు అదును?

తిమ్మరుసు:—పితామహులుకూడ నేడేలాగో—

పెద్దన:—మంజీర స్వేచ్ఛ యొడిలోనే పోయికూర్చునెనట. మహారాజ్ఞియు నివ్వెరఁబోయెనట. రాయలవారిం కనురాత్రైరి యరసివచ్చెదను. (ప్రస్థానము)

తిమ్మరుసు:—నేడేమి ప్రతిభానమును బ్రళయదూత్యము సేయుచున్నది. మత్కుమారియేమి స్వేచ్ఛ యొడిలోఁబోయి కూర్చునుటయేమి మహారాజ్ఞి నివ్వెరబోవుటయేమి యేమిటి యీవిధి విపర్యయము! అజస్ర జాగరణమున నుత్తీర్ణమైన నాబుద్ధియు నేడు ప్రమాదోపహతమైనదేమి? నారాజుతో నెన్నఁడేని జయస్పర్థసు గడంగిరాయెఱుఁగుదువా! దేశభద్రము వర్థించి, యిరువురి యందును వ్యక్తిత్వ పిశాచములతలనూపు నేమొ యని కనుగ లిగి యట్టి సంఘటనల దూరముగ నుంచెడివాడనే. ఎవరి ప్రేరణయైన నగుగాక నాలో గుప్తముగ నిద్రవుచ్చిన యహమ్మతి నేడు కొంతవఱకైన పొగరుజూపినది వాస్తవము. ఆపరవశమున సాహస్తము చేయు నుగ్రఖేల గుర్తించలేకపోతిని. నివారించుట కవకాశమైన లేకుండనేమిటి యీనూత్న స్వేచ్ఛావేశము! నీకాయలనుండి మంత్రిని తీసివైచి యతను నాతరపున ప్రజ్ఞా శంఖమూదివాడు? రాయలు చిన్నబోయెను. ఎందుకట్లు చివాలున లేచిపోయెను. చిలుకపిలుపు వట్టి నెపము. నాకుదెలియును వాని స్వాభిమానము ప్రకోపించినది. రక్తార్ద్రిమగు వానికపోల దీప్తిలో నాప్రతిజ్ఞ మిట్టిపడినది; దానితళుకులో ప్రళయక్లేశమును నొకటి ధ్వనించినది. అదృశ్యము

గీ. కర్మవిధిరథమేగడి గతినిచెఱపి
తేవి యాత్మార్థ్యమున దానిజేర్చునడత
సారథి రొంటింగి తద్రథాశ్వముల మగుడ
ద్రిప్పి రుసరిసఁ బోనైన రీతిఁదోచె.

ఈ యుదయ సమావేశము వికృతసంధి యగుచున్న దేమి!

(దండనాథుడు ప్రవేశించును)

దండనాథుడు:—మహామంత్రివారికి జయము!

తిమ్మరుసు:—ఎవరవోయి! పురానుగతమైన యగ్రతస్సరణినుండి వెముద్రోయఁబడినది యేమిటి యీ యనక్షుప్తజయము?

దండనాథుడు:—(తొట్రుపాటుతో) రాణీవారి యాజ్ఞాపత్రము—

తిమ్మరుసు:—ఏమది (అతనిహస్తముల నుండి తీసుకొని చదువును.) మంజీర స్వేచ్ఛ యొడిలోఁబోయి కూర్చెనట యిదియా? రాజసువతను నిందించినది! దండనాయకా విచారణార్థము బంధించుకొని పోవచ్చితివి; జడియు మంటివేల (ఈ సమయమున రాయలు రామకృష్ణకవి వారికి వెనుకగా మంజీరయు ప్రవేశింతురు) మా అధికార భాగ్యమును, బలమును స్వార్థసంచితములు కావె, మంజీరా!

రామకృష్ణ:—ఏమిది (అనుచు తిమ్మరుసును సమీపించును. అతడు మాట్లాడకుండ నాజ్ఞాపత్రమునిచ్చును. రామకృష్ణకవి ఆపత్రమును చూచుచు రాయలకడకేగును.)

మంజీర:—(బెదురుచు నాటబల్ల సమీపముగ నిల్చొనును.)

రామకృష్ణ:— (తాను చదివి యా పత్రము సచమత్కారముగ రాయలకిచ్చును.)

తిమ్మరుసు:—(మంజీరను చూచి) ఇటు రమ్మ!

మంజీర:—జనకా! (భయసంశయములతో ముందునకు వచ్చును.)

రాయలు:—(పత్రమునుచదివి శాంతముగ నాలోచనామగ్నుడగును. పత్రముజారి క్రిందపడును.)



లక్ష్మీ

శ్రీ ప్రమోదకుమార ఛటోపాధ్యాయగారి త్రివర్ణచిత్రమునుండి

శ్రీ అడివి బాపిరాజు గారుపంపిన ఛాయాచిత్రము.

# ఆకస్మిక ఛాయాచిత్రములు



ప్రతిబింబము

శ్రీ వి. ఆర్. తెన్నేటిగారి చిత్రము.



బజారు వీథి

శ్రీ ఏ. రాజారావుగారి చిత్రము.



బొబ్బర్లంక అనకట్ట-పిల్లెవాండ్ర హడవడి

శ్రీ బి. పి. పట్టాభిరామరావుగారి చిత్రము.

తిమ్మరుసు:—(అంతవఱకు రాయలను గమనించుచున్న దృష్టిమరల్చి మంజీరనుచూచి) నీవీ దండనాధుని వెంట మహారాజ్ఞి దర్శనమునకు బోవలయును.

మంజీర:—నా—

తిమ్మరుసు:—అపరాధమా? రాజనువతిను నిందించితివి. మహారాణివారు విచారించి శిక్షింతురు. పొమ్ము.

మంజీర:—కాదుజనకా! విశ్వపతి—

రామకృష్ణ:—అంధేయాత జాపకము.

తిమ్మరుసు:—కుమారీ! ఆశవలదు. నామంత్రిత్వము నిన్ను రక్షింప గలదనుకొనుచుంటివేమొ ప్రయోజనము లేదు. కోమలమగు నీ ముఖకమలముదైన్య కలుషితముగాకముందే నా సమక్షమునుండి పొమ్ము. ఆశాసనమమోఘము.

రాయలు:— (గంభీరముగ నధికారపాదమున ముందువచ్చును.)

మంజీర:—(దండనాధునివైపు బోవును.)

దండనాధుడు:—(సెలవుపేడికోలు నభినయించి బోవును.)

రామకృష్ణ:—(అటు నిటు తిరుగుచు) సమత ఆశయమాత్రగౌరవయోగ్యమే కాబోలుదానికి!

రాయలు:— రామకృష్ణ కవిగారూ!

(గోవిందరాజు ప్రవేశించును. చేతిలో
విచ్చుకత్తి యున్నది)

గోవిందరాజు:—సోదరీ! ఆగుము. రాజబంధువగు మాత్రమున నొక దురాపకుని యహంతపోరాట యంతటి యాగడముచేయ జాలినచో సత్యబలము దాని దిరోహము చేయజాలదేమి! బంధుతిపక్షపాతమునరాజు కర్తవ్యమును దెలుసుకొనలేదు. సేవకధర్మమున జనకులు రక్షాదక్షాంగబలములను కట్టిపెట్టుకొనినాడు. ఒక నీచుని కుపౌరుషమునకు కోమలకుసుమకోరకము బలికావలయునా దుస్సహము సోదరీ? ఆసుమిహమశ్యాసనమునకు ధిక్కారము చెప్పుచుంటిని. దండనాయకా నీయుద్యోగమున నీఘోరఖడ్గపాతము ప్రతిరోధము. (కత్తినడ్డముగా పెట్టును.)

రాయలు:—ప్రతిరోధము! ఖడ్గమును పడవేయుము.

తిమ్మరుసు:—మహారాజునెదుట ఖడ్గచాలనమా! దండనాయకా! వీనిని బంధింపుము. విచారణ అక్కరలేదు. దోషము ప్రత్యక్షము. వీనికి జన్మాంతకారావాస శిక్ష విధించుచున్నాడను.

రామకృష్ణ:—భ్రాంతమగు నధర్మమును నివారించు నుద్రేకమున నీబాలయోద్ధ మతివిభ్రమము శ్రీవారి శాంతిసౌకరిలయొక్క యాంతర్యము గ్రహింప దాళజాలకపోయెను.

గోవిందరాజు:—నా యపరాధము నంగీకరించి శిరసా శిక్షను స్వీకరింతును. కాని మంజీరది దోషము కాదు. ఆయాజ్ఞానిరోధమున కవకాశము కావలెను.

రామకృష్ణ:—నిరోధ మొనర్చువానిపై పూర్ణ ద్వేషము తీవ్రశిక్షనరిమినది. మహారాజునే రైశ్వర్యముగ వలవాని శాసనమునకు తిరస్కృతియు సంభవమా?

రాయలు:—అవును. ఈ రాజ్యమునకు నేను మహారాజును. నారెదుట నిట్టి విజృంభణమా! ఈశాసనములను నేను పరాస్తముల జేయుచున్నాను. (దండనాధునిజూచి) పొమ్ము.

గోవిందరాజు:—నేను శిక్షార్హుడనే. కరుణింపబడుట కంగీకరింపను.

రాయలు:—అంగీకరింపవు? మా శిక్షాగారములలో నాప్తుల ద్రుటులకు తావులేదు. అప్పాజీ! తిరిగి దర్శన మొనర్తుము. పండసములు. (ప్రస్థానము)

మంజీర:—జనకా!

రామకృష్ణ:—(గోవిందరాజుని మంజీరని చూచి) పొందు.

(గోవిందరాజు మంజీర నిష్క్రమింతురు.)

కింకర్తవ్యతాస్వీకృతయందు కంపించిన రాజహస్తమునుండి యాజ్ఞాపత్రము జారిపడుట యాధారముగ వారియభిమతమును తమ రహార్థము జేసుకొనిరి.

తిమ్మరుసు:— అపార్థమా? అనర్థమా!

రామకృష్ణ:— అనర్థమేమి? తమరు తొందరపడకుండ నుండిన రాయలవారాయాజ్ఞను త్రిప్పివైచెడివారు. గోవిందరాయల యవిధేయత సంఘటిల్లెడిది కాదు.

తిమ్మరుసు:— తమకు దెలియదు. నారాజును నే నెఱుగనా? పెంచినది దిద్దినది యీ చేతులతో. ఆపరిచయమహత్తు దమరూహింపజాలరు. ఎట్టిదియగు గాక వాని యంతస్స్వరధోరణి నయనతారళ్యమున మెరయుట, దాని తీవ్రత కపోలదీప్తియం దంకితమగుట వాని రహస్యస్వత్వమును నే నీచర్మచక్షువులతోడనే చూడగలను. అతని జీవితము నాపరిశీలన కంతపరిమితమున నున్నది. ఏది జరుగకుండ జేటికెఱకు జాగ్రత్తపడుచుంటినో యీ యమంగళము స్వయంభవమై నా గృహము నుండియే బయలుదేరినది. ఓ—

రామకృష్ణ:— తమరు త్తేజితులగుచుండిరి నేను—

తిమ్మరుసు:— నా సాధన కింతవఱకు జయవెట్టుచు వచ్చిన దైవసామగ్రి ఔను నేడు ప్రతిముఖమును జూపుచున్నది.

రామకృష్ణ:— గుప్తస్వార్థమునకు ముప్పు కల్గినపుడు గాని యెవరు నిట్టియలజడిని పొందరు. తమ—

తిమ్మరుసు:— స్వార్థమా? దానిని భద్రస్మృతి యందుంచుకొనియే యీ మంత్రిత్వమును మెడకు గట్టుకొనునది.

రామకృష్ణ:— అదియేమి!

తిమ్మరుసు:— సందేహ మెందులకు? స్వార్థము చేతనే యీ విషాన్నమును భుజించుట కొప్పుకొనినది. లేకున్న నా నాటి మధూకర బ్రాహ్మణుడనుగ నేయుండి పోయెడివాడను.

రామకృష్ణ:— అయ్యో, పరిహాసమునకై—

తిమ్మరుసు:— పరిహాస మేమి? రామకృష్ణ కవివరా! తమయందు నాకు గురుభావమే కలదు. ఈ ప్రపంచమున నా విశ్వాసమునకు పాత్రమై లోకహితమును లక్ష్యమునకుంచుకొని జీవించు నుదారచరిత్ర తమరియని యెఱుంగుదును. అందుచే నా కపట నాటకమును మీకు వినిపింపవలెననియున్నది. వినుడు: అప్పుడీవృద్ధుని యలజడి యెల్ల తమకు బోధ కాగలదు.

అప్పుడు నా కిరువది వత్సరములు. మాతాపితృహీనుడనగు నొకదరిద్ర బాలకుడను. ఏకాకినై జీర్ణవసనములతో చేత జోలెపట్టుకొని కూడెత్తికొనుచు చంద్రగిరిలో మాధుకరముల నొకవీధి నొకవాకిట నిల్చితిని. "భవతి భిక్షాం దేహి" యని యతి దీనతతో నవగల్గితిని. ఆ భవనద్వారము తెరువంబడియే యుండెను. కాని అశ్రుపటావరోధమున నా కేమియు గానరాలేదు. దానహస్తము యొక్క స్వాగతచాలన యొకటి మబ్బులో నీడవలె బొడగట్టినది. నే నట్లనే నిలువంటిని. ఒకహస్త మాలింగనము చేసుకొనెను. ఒకహస్తము నాకంటి యవరోధజలమును తుడుచుచుండెను. ఆ దీర్ఘకాయుని విశాల తేజోనయనములు నా శిరస్సున జలాభిషేకము సేయుచుండెను. మరల గనులు మూసుకొంటిని. "వత్సా" ఈ ప్రేమశబ్దమొకటి యతని యధరములనుండి వెలువడి యుద్గీథమువలె నా వీణాతంత్రుల నిస్వనించినది.

ఆతడాతురదృష్టితో నన్ను జూచి శాంతశాసనవాణితో "వత్సా! యొక ప్రతిజ్ఞ చేయుము. నిన్ను దేశమునకు గావలయువానిగ జేసెదను. ఈశ్వరుడు నీకొఱకు జీవించుటకు కాదు నిన్ను సృష్టించినది. పతితజాత్యుద్ధారమునకు నీజీవిత ముద్దేశింపబడినది." యనెను. ఆమంత్రమహాత్మ్యమున చిరనిద్రను విడలించుకొని పొంగిన నా రక్తనాళముల మూర్ఛనొకటై తన్యధుని యుత్తరంగితమై పరవళ్లొట్టినది. పరవశుడనై ప్రతిజ్ఞ జేసితిని.

రామకృష్ణ:— పవిత్రమగు నా ప్రతిజ్ఞ.

తిమ్మరుసు:— ఏమందురా? శకలచ్ఛిన్నమగు జాతిహృదయము నేకోన్ముఖముగ సేయు నొక యాదర్శపురుషుని యాకర్షణయావసరము. ప్రజాహృదయముల బ్రవేశించి ధర్మశిక్షనొసగ సమర్థుడగు నొకచక్రవర్తి పరిపాలనము క్రింద కీదేశమంతయు రావలెను. అట్టివాని నన్వేషింపవలెను. లేకున్న సృష్టింపవలెను. ఇది యా ప్రతిజ్ఞ. ఈ సాధనకై సలయు సామాగ్రిని తీసుకొని యీ రాజ్యమునకు వచ్చితిని. గురుదేవుడు నాకనుగ్రహించిన మహా

స్త్రము రాజనీతి దానిసహాయమున నిట చిక్కొన్న ప్రారంభించితిని. వానిని కాదని వీనిని, వీనినికాదని వానిని సింహాసీత నెక్కజేసితిని దిగలాగితిని, ఈస్వార్థమునకై నేను చేయని దేమి.

సీ. జన్మసిద్ధస్వత్వ సౌభాగ్యమున గద్దె
        నెక్కెడుకాల్ పట్టి యీడ్చివైచి
    రాజనీతిహుతాగ్ని రాజిలో రాజుల
        శ్రీవంశములు నీఱుఁ జేసివైచి
    ర జనద్రోహ కార్యప్రవీణత నన్ను
        నమ్మినన్నృపుకంట దుమ్ముగొట్టి
    ప్రణయంబుజెడిపి దుష్కరసముద్వాహశృం
        ఖలల స్త్రీపురుషులఁ గట్టివైచి
గీ. రాజనక్రమునెట్టుల రాజనీతి
    పేర నాయిచ్చవచ్చిన విధియమించి
    కాదనిన వాని బడద్రోచి కాలరాచి
    ప్రబల నిస్వార్థ పరతయె వ్యాజమయ్యె.

కాని యెంతయన్వేషించినను నాస్వార్థముకోరు ఫలము నిచ్చు నావస్తువు లభింప లేదు.

రామకృష్ణ:—మఱిదొరకనప్పుడు.

తిమ్మరుస్సు:—సృష్టించుకొనవలెను. నిజమే. కాని సులభమా అది.

మ. తనవ్యక్తిత్వముపోంగ నీయక ప్రజా
        ధర్మాధికారంబుగా
    ననపంచాలనమాది భద్ర జయమై
        శాంపత్యమున్నమ్మి ని
    ల్చినవాడే పతిరాజనీయముల
        సాక్షిమాత్రు డైయుండిచే
    సినవాడే నృపు డట్టివాని మనుజాక్
        సృష్టింపగా నేర్తురే.

కాని నేను ప్రయత్నలోపము చేయలేదు. ఇప్పటికి ముప్పదివత్సరముల క్రింద నొకనాడు "కమలుపొడిచిచం పివేయు" మని యొకబాలని తండ్రియే నాచేతులలో పారవైచెను. ఆయనాధబాలుని ముందుపెట్టుకుని కర్తవ్యతామూఢుడనై చింతించుచు గూర్చుంటిని. ఇంతలో నాగురుదేవుని మధురవాణి స్మృతికి వచ్చినది. సరి, వీడే యధికారియని యీబాలుని వత్సా! యని పిల్చితిని. ఇంతవఱకు నాతడు నాయొడిలోనే యుండెను. నాస్వార్థము పూర్తికావచ్చువేళకు మధ్యదూరము వచ్చినది. ఇంతకు విధియొకగీతను గీసెను. దానిని చెఱుపయత్నించిన నలసిపోదుముగాని సాధ్యమగునా? రామకృష్ణకవి గారు నాజీవితమును సింహావలోకనము జేసుకొనిన నవ్వు వచ్చుచున్నది;

ఉ. పుల్లలుపట్టుకొంచునొక
        పూట మధూకర మెత్తుకొంచు ని
    ల్లిల్లుబరిభ్రమించి సుఖ
        మేమియులేని యభాగ్యపుత్రునిన్
    చల్లనిమాపుతో తెలివి
        జాలగలాడని దేశమందు నీ
    యల్లరి సేయఁబంచెను మ
        హాగురు డాతని దెంతస్వార్థమా.

రామకృష్ణ:—నేడు తమ పుణ్యాదర్శసాధన చరిత్రశ్రవణమున మాకు నూత్నలక్ష్య మేర్పడుచున్నది. మాకీ యుదార శాంతశూరులగు రాయలవారి ధర్మప్రభుత్వము తమ సాధనాఫలితమే. ఆంధ్రదేశమున కాదర్శప్రాయుడును, కీర్తిసంపాదియు, తేజఃప్రసారుడు నగు నొక చక్రవర్తిని ప్రసాదింప బ్రతిజ్ఞ వట్టి నెరవేర్చుకుంటిరి. "నమోగురుభ్యః" పవిత్ర లక్ష్యధారియగు చిట్టి గంగనామాత్యులు చిరస్మరణీయులు.

తిమ్మరుస్సు:—శిల్పియేమో యత్నించి శిలామూర్తికి ప్రాణప్రతిష్ఠ జేసెను. అదియు ఫలమునుగొని శిరస్తాడన ప్రారంభించెను.

రామకృష్ణ:—తమ రధైర్యపడిన నేమిలాభము. రాయలయందు కొంచెము వ్యక్తిత్వ ముదయించుటయు తత్ఫలితముగ గొన్నినష్టములు కల్గుటయు నయ్యెనైన నేమి గురువులు తమ నాశీనుంచిన యాశీఃకుసుమము లింకను వాడిపోలేదు. తమ కపజయ భయ మేమిటికి?

తిమ్మరుస్సు:—ఆహా! ఇది క్షణిక దౌర్బల్యమౌనా. అపజయ భయమేటికి?

గీ. భక్తి గురుప్రేమల వట్టి నృపతివదీర్ప
నఘటనాఘటన క్రియాభ్యస్త శక్తి
వలయుచో జయదేవిని బట్టి యింటి
ముంగిటను గట్టివైతు దత్పూర్తినిజము.

ఇప్పు డ్లొకక్రొత్తనాటకము ప్రారంభము కాబోవుచున్నది. తమరును భూమికను ధరింపవలయును. అప్పు డాప్రదర్శన మపూర్వమగును. వ్యక్తిత్వము సంఘహితధర్మము జేమిటో వాని సంఘట్టనాఫలిత మీనాటకమున దెలుపవలయును. రండు ముందు ప్రయత్నమున నుండవలెను. దానికిప్పటకు జరిగిన యిది ప్రస్తావము.

(సభయులు నిష్క్రమింతురు. చిత్రావతివచ్చి క్రిందపడియున్న శిక్షాపత్రమును తీసుకొనును.)

చిత్రావతి:—ఇదేనా ఆ శిక్షాపత్రం! అన్నాజీకికూడా కోపం వచ్చిందిట. ఎన్నడూ లేదు గోవిందరాజుతో పోట్లాట్టం. ఉత్సవానికి భంగం వచ్చింది. చిన్నారాణీ అసలిట్లా ఎందుకు వ్రాయాలి. నన్నీజాగారి చూపించి అందరికీ చివాట్లు పెట్టించాలి. (ప్రస్థానము)

(యవనిక)

---

# గీతములు

బసవరాజు వెంకటప్పారావు గారు

## ౧

### దీపావళి

(యమునాకళ్యాణి-జంపెతాళము)

లోకాని కుత్తుత్త దీపావళీ,
నాకుమాత్రము దివ్యదీపావళీ!
వేదాల నాథుడౌ
వేద్రాదినరసింహ
దేవుడే నాయింట
దీపమైనాడు!
లోకాని కుత్తుత్త దీపావళీ,
నాకుమాత్రము దివ్యదీపావళీ!
వేదవృక్షము లాగు
వేద్రాదినీడ నా
వంశవృక్షమ్ము శా
శ్వతముగా నిలవాలి!
లోకానికుత్తుత్త దీపావళీ,
నాకుమాత్రము దివ్యదీపావళీ!

## ౨

### జేజేలు

(విహగరాగము-బ్యాండ్ వరస)

ఎవ్వరనుకున్నారరో ఎరగరా మీరు?
పాపాయి సాక్షాత్తు పరమాత్ముడండీ!
తరతరాలా గొప్ప తపసు జేశాము,
స్వామి నాటికి నేడు వరమిచ్చినాడు. ఎవ్వ.
ఎన్నో యుగాలుగా విన్నవించాము,
ఇన్నాళ్లకీనాడు విన్నాడు మనవి! ఎవ్వ.
వేద్రాదినాథుడే వెలిసినాయింట
ఉయ్యాలతొట్టిలో ఊగుతున్నాడు! ఎవ్వ.
చేతులెత్తండోయి జేజేలనండోయ్,
నరసింహ దేవుడే నాచిట్టితండోయ్!
ఎవ్వరనుకున్నారో ఎరగరామీరు ?
పాపాయిసాక్షాత్తు పరమాత్ముడండీ!

---

# అతన్ని గూర్చి

వెంపటి నాగభూషణం గారు

౧

ద్వారకనాథశాస్త్రి, నేను చిన్నప్పటి నుంచి ఒకేస్కూల్లో బి. యే. వరకు చదివి కడతేరాము. ఆరోజుల్లో అతనంటి వాడు లేడనిపించుకున్నాడు శాస్త్రి. మేమంతా అతన్ని ముద్దుగా 'ద్వారక' అని పిలుస్తూ ఉండేవాళ్లం. మంచి లక్షణాలన్నీ అతనియందుండేవి. ఇతరులకి ఏవిషయంలోనైనా తాను సహాయభూతుడుగా వుంటే అతను మిక్కుటంగా ఆనందించేవాడు. తన కున్నదాంట్లో తృణమో పణమో బీదవిద్యార్థులకు యిస్తుండే వాడు. ఇటువంటి సుగుణాలు గాక అతనిలో మరొక విశేషం ఉండేది. బాల్యంనుండీ గూడా ద్వారక అందమైన వస్తువులను చూచినా, సొగసైన దృశ్యాలను చూచినా, శ్రావ్యమైన గానం విన్నా, మృదువైన కవిత్వం చదివినా, అపరిమితానంద భరితుడై ఉప్పొంగేవాడు. వేషంలో మహాశ్రద్ధవహించి, ఉన్నంతలోనే, అతిరమణీయంగా తయారయ్యేవాడు. తనగది అంతా సొంపైన చిత్రాలతో అలంకరించే వాడు. తానట్లా ఉండడమే కాకుండా, యితరులకుగూడా ఆవిధంగా ప్రవర్తింప వలసిందని సమయానుకూలంగా చెప్తూండే వాడు. కొందరు అపార్థం చేసికొని అతనిమాటల్ని ఆలకింపక పోయినా, కొందరియందైనా అతను ఉత్తేజం కల్గించ లేకపోలేదు. నేనున్నూ, యిం కా యిద్దరు ముగ్గురు స్నేహితులూ ద్వారక యందున్న శక్తిసామర్థ్యాలకు అచ్చెరువొంద తూ, తరచుగా అతన్ని కలుసుకోవడం, అతని యింటికి పోయి మాట్లాడడం చేస్తూండే వాళ్లం. ద్వారకతో ఎప్పుడు సంభాషించినా ఏదో క్రొత్తవిషయం నేర్చుకోకుండా ఉండే వాళ్లం కాదు. ఏ రసవంతమైన పద్యమో చదివి ఆనంద పరవశుల్నిగా చేసేవాడు మరొకప్పుడు ఏచిత్తరువును గురించో ముచ్చ టిస్తూ కళారహస్యాన్ని తెలియజేసేవాడు. ఆ విధంగా ఆర్టిస్టిక్ జీవితం గడపుతూండే వాడు జీవిత కాలమంతా సౌఖ్యంగాను, ఆనందంగాన యెందుకు సాగించకూడదని అతని పట్టుదల జీవితమంటే ఒక సుస్వప్నమన్నమాట అ అంటూండే వాడు. ఆవిధంగానే ద్వారక త జీవితమంతా సామాన్యవ్యావహారిక ప్రప చంతో సంబంధం లేకుండా స్వప్నతుల్యంగా జరుపవలెనని, ఆర్టిస్టిక్ జీవితమే మోక్షప్రా యకమని అతని ఆశయము. దానికోసం చదువుకునే రోజుల్లోనే బహు ఆవేదన ప వాడు. వీలైనంతవరకు తన ఆశయాలను ఆ చరించే వాడు. కాని కొన్ని సందర్భాలవ అందులోనూ ముఖ్యంగా ప్రపంచక వ్యవ రాలలో మునిగివుండే తండ్రివల్లనూ, అత కొన్ని సమయాలలో హతాశు డయే వా

కాని ధైర్యమునుమాత్రం మొక్కవోనిచ్చే వాడు కాడు.

ద్వారకను చూచి అప్పుడప్పుడు మేము అనుకొనేవాళ్లం, జీవితంలో యెలా నెగ్గుకొస్తాడా అని. ఇంత ఆదర్శప్రాయంగా జీవించడం సాధ్యమేనా? ఎన్నెన్ని కష్టాలు కలుగుతై? ఎన్నెన్ని విపత్తులు వాటిల్లుతై? జీవిత సంగ్రామ మన్నారు మనవాళ్లు — అని కొంచెం భయపడుతూ ఉండేవాళ్లం. ఇవతల యిట్లా అనుకున్నా ద్వారక దగ్గరకు పోయేసరికి యివన్నీ మాయమయేవి. అతనితో ముచ్చటించినంతసేపు భావసౌధాల నెక్కించి, ఊహాప్రపంచకంలో విహారం చేయించి, రసజగత్తులో నోలలాడించి, స్వప్నసౌఖ్యం పొందజేసేవాడు. ఒక్కొక్కప్పుడు ఉక్కిరిబిక్కిరి అయేవాళ్లం.

ఈ విధంగా ఉంటుండగా యిద్దరం బి.ఏ. ప్యాసయినాం. సామాన్యస్థితిపరుణ్ణి గనుక నేను వెంటనే ఉద్యోగంలో ప్రవేశించక తప్పిందిగాదు. ద్వారకకు ఉద్యోగం చేయవలెననే యిచ్ఛా లేదు, అగత్యమూ లేదు. కావలసినంత ఆస్థిగలవాడు. ఒక్కడే కొడుకు. కాని అతని తండ్రిమాత్రం అతన్ని పట్నం పంపి బి. యల్. చెప్పించవలెనని పట్టుపట్టాడు. ఆ చదువు, వృత్తి యేమాత్రం యిష్టం లేదు ద్వారకకు. దానికి బదులుగా ఏశాంతినికేతనమంటి చోటికో పోయి జీవితం గడపవలెనని తలంపు. అట్లాగని తండ్రికి తెలియజేశాడు కాని, అయనకు యివి యిష్టమవుతాయా? ద్వారక ఎంత చెప్పినా తండ్రి విన్నాడు కాడు. లాకాలేజీకి వెళ్లక తప్పింది కాదు.

౨

అయిదేళ్లు జరిగిపోయినై. ద్వారక తండ్రి ఆస్తినంతా వర్తకంలో కోల్పోయినాడు. ఆ బెంగచేతనే త్వరగా పరమపదించాడు. ద్వారక ఒక్కడు. పిత్రార్జిత మేమీ లేకపోగా ఆయన చేసిన అప్పులుమాత్రం కొన్ని సంక్రమించినై. యాడ్వకేటు పట్టా ఒక్కటే శరణ్యం. కాని ఆ మహాపట్నంలో యిత నెంత? అందులోనూ క్రొత్త. ఇట్టి యిక్కట్లు అతనెప్పుడూ అనుభవించ లేదు; అనుభవించ దల్చుకోనూ లేదు. కాని యిట్టివిషమపరిస్థితులలో జీవితసంతరణ మేలా, తన ఆదర్శములను అనుచరించే దెలా?......ఎంతైనా ద్వారక అతని విచారాన్ని కనపర్చేవాడు కాడు.

ఒకపర్యాయం పనిమీద క్రిస్టమస్ సెలవుల్లో పట్నం వెళ్లాను. అక్కడుండగా ద్వారకమాట స్మరణకు వచ్చింది. వెంటనే అతని నెలవు కనుక్కొలి బయల్దేరాను. ట్రిప్లికేనులో, యెక్కడో చివరగా, ఒక మిద్దెలో అద్దెకున్నాడు. ఇల్లు చిన్నదే అనుకోండి, కాని అతనొక్కడికీ చాలు. అందంగా గూడా వుంది. ముందు చిన్నతోట ఉంది. మేడమీదికి సముద్రంగాలి రివ్వున వీస్తుంది. లోపలంతా ఎంతో రమణీయంగా అలంకరించాడు ద్వారక. బల్లలమీద ప్లవరువాజులు, పుదుచ్చేరి కుక్కలు, కొండపల్లి గోవులు, చలువరాతి చిలుకలు,

నెమళ్లూ ఉన్నాయి. గోడలనిండా ఆర్టుచిత్రాలు వ్రేలాడవేశాడు. అడుగు పెట్టడం తోనే నాకు పూర్వకథ జ్ఞప్తివచ్చింది. మా చిన్ననాటి దృశ్యమంతా ఒక్కమారు స్మృతిపథంలో తళుక్కుమన్నది. మొత్తానికి ద్వారక లేవ ఆదర్శ జీవిత నియమాలను వ్యావహారిక జీవితంతో సమన్వయం చేసికొన గలిగినాడే అని సంతోషమైంది.

ఆరోజు రాత్రి చాలాసేపు నేనూ, ద్వారక మిద్దెమీద అనేకవిషయాలను గురించి ముచ్చటించాము. అప్పుడే జరుగుతున్న పార్కు ఫెయిర్ నిగురించి, అక్కడకు వచ్చిన రకరకాల మనుష్యుల్ని గురించి, వింతవిషయాలనుగురించి, తరువాత మాస్కూలు విషయాల్ని గురించి, నాఉద్యోగపు చిక్కుల్ని గురించి,—యీవిధంగా నేనేఎక్కువకాలంలో కాభిరామాయణకాలక్షేపణచేశాను. ఇంత సేపు నేను నాఘోషతో అతన్ని హింసించినా ద్వారక ఏవిధమైన అసహనము వెలిబుచ్చలేదు. మధ్య మధ్య ఊఁ కొడుతూ, అట్లాగా, ఓహో, ఎంతపని, నిజంగా, పాపం, మొదలైనపదము లుచ్చరిస్తూ నేను చెప్పినదంతా విన్నాడు. మధ్యలో ఎప్పుడో ఒక్కమారు కాబోలు, అవనీంద్రనాథ టాగూర్ గీసిన 'తిష్యరక్షిత' చిత్తరువునుగూర్చి, రవీంద్రనాథ టాగూర్ రచించిన 'రెడ్ ఓలియాండర్స్' నాటకమును గురించి ప్రస్తావన తెచ్చి చిన్ననాటిధోరణి రుచి చూపించాడు.

మరునాడు ఊరికి ప్రయాణమవుతూ ద్వారకతో అన్నాను: "జీవితం సరళంగానే సాగుతోం దనుకుంటాను. ఏదో కోర్టువ్యవహారం, అదీ—ఊఁ."

"ఏదో జరిగిపోతోంది. ఆగుతుందా" అని వ్యంగ్యంగా జవాబిచ్చాడు.

"అయితే, ద్వారకా, పెళ్లెప్పుడోయ్? ఇంకా యీడు రాలే దనుకున్నావా? మీ ఆవిడ వచ్చింతర్వాత మా జోటివాళ్లు వచ్చి నాలుగురోజు లుండడానికి ఎక్కువ అవకాశ ముంటుంది" అన్నాను.

"అదే, నేను ఆలోచిస్తున్నా. ఇంతకూ కళ్యాణం ఘడియ రావద్దూ? నా పెళ్లి కేం గాని, నీవు వేసంగికి తప్పకుండా రా. ఇక్కడ బీచీ అదీ చల్లగా ఉంటుంది. చూడూ, మరచిపోయినా, యీమాటు మీ గృహిణినిగూడా తీసుకురాసుమా" అని చిరునవ్వుతో నన్ను సాగనంపాడు. ఇంకా పూర్వపుద్వారకే—అనుకుంటూ యింటికి బయల్దేరాను.

## 3

కాని అతను కోరిన ప్రకారం వేసంగికి పట్నం వెళ్లడం పడలేదు. అనేకపనులు అడ్డం వచ్చినై. ఏ మనుకుంటాడో ద్వారక అని ఆలోచిస్తుండగా నెల్లూరునుంచి మిత్రుడు విజయరెడ్డి ఉత్తరం వ్రాశాడు. బి. యే. చదువుకునే దినాల్లో మే మ్ముగ్గురం ఒకజట్టుగా వుండే వాళ్లం. అంతే కాదు; నామోస్తరే రెడ్డికిగూడా ద్వారక అంటే అనురాగం, ఆదరణ...ఆ ఉత్తరంలో యిలా ఉంది: " నీ వీ మధ్య యెప్పుడైనా ద్వారకను చూచావా? నా కెప్పుడూ

జ్ఞాపకం వస్తూఉంటాడు, అతను. తండ్రిపోరు పడలేక దిక్కుమాలిన ప్లీడరీలో ప్రవేశించాడు. శాంతి నికేతనం, అటువంటిచోట్లకు పోయి కాలం గడపాలని అంటూండేవాడు వెనక, జ్ఞాపకంలేదూ? ఇప్పుడు దమ్మిడీ రావడంలేదట. అసలు ద్వారకకు వకీలువృత్తి అంటే ఎంత అసహ్యమో అప్పుడే చెప్తూండేవాడు. బహుశ వేదన పడుతూ ఉండాలి ద్వారక; పాపం...... ఇంతకన్న విచారమైన దేమంటే, తండ్రి అప్పులన్నీ యితను తీర్చడానికి పూనుకొన్నాడట. ఛాందసం గాదూ, యిది? తన జీవితమే కష్టసాధ్యంగా ఉంటే, మెడకు యీడోలు గూడా ఎందుకు? ... ... ఇంతకూ యిది ద్వారక స్వయంగా చెప్పింది కాదు సుమా; వినికిడివల్ల తెలియవచ్చింది. నేనూ రెండుమూడు మార్లు ద్వారకను కలుసుకున్నా గాని యీ విషయం లేమి అంతనీలేదు అతను. చిత్రంగా ఉంటై వ్యవహారాలు."

ఈజాబు చదివేసరికి నాకు మిక్కుటమైన జాలి కలిగింది. వెంటనే పోయి సంగతి యేమిటో విచారించి ద్వారకకు ఉత్సాహ మిద్దా మనుకున్నా. కాని దౌర్భాగ్యపు మాష్టరీ; శెలవు దొరికింది కాదు......పోనీ, పెద్ద ఆవేశ పూరితమైన ఉత్తరమైనా వ్రాద్దా మనుకున్నాను. కాని ఒకసందేహం కల్గింది. ఇదంతా నా కెట్లా తెలిసింది అని అనుకొనిపోతాడేమో?—అని. ఇదీ గాకుండా మరొకటి ఆటంకం వచ్చింది. అప్పుడే కొత్తసంసారం, కొత్త వ్యవహారం. చిన్నీ అప్పుడే గృహిణిగా అవతరించింది. ఆ దినాల్లో ఒకటి తోచేదా? ఎప్పుడూ చిన్నీతో డిదే లోకం. ఆ మెకళ్ల నీలిమను, కుట్మలముల నలుపును, చేతి సొంపును, శరీరచ్ఛాయను స్తుతించడమే సరిపోయింది. ఒకరిలో ఒకరు లీనమై ప్రణయపారావారంలో యీదుతున్నాం. అనుభవజ్ఞులకే తెలియాలి అప్పటి సౌఖ్యం, సందర్భం. ఆ ఆనందజగత్తులోనే ఆమె నాకు ఉత్సాహ మివ్వడం, నే నామెనుగూర్చి కథలు వ్రాయడం, అవి లోకం చదవడం సంభవించింది...........ఆపరిస్థితుల్లో ద్వారకమాట పూర్తిగా విస్మరించాను. ఉత్తరంగూడా వ్రాయలేదు. ఇప్పుడు పరితపిస్తాను,ఏమిలాభం?

ఇట్లా ఆరుమాసములు గడచినై. తిరిగి విజయరెడ్డి జాబుమూలమున ద్వారక విషయం కొద్దిగా తెలిసింది. ఈవిధంగా వ్రాశాడు: "చోద్యంగా ఉంటుంది వినడానికి, వ్రాయడానికి. నేను కలలోనైనా ద్వారక యిట్లా అవుతాడని అనుకోలేదు. దైవఘటన కాక మరేమిటి, పాపం. తల్చుకుంటే గుండె తరుక్కుపోతుంది... ఇప్పుడు ద్వారక ప్రైవేటుట్యూషన్లు చెప్పి ధనార్జన చేస్తున్నాడట. కొంత భక్తి గడచేటందు కనుకో; ముఖ్యంగా తండ్రి చేసిన అప్పులు తీర్చడానికట!.........విన్నావా, ఎట్లా పరిణమించినాయో పరిస్థితులు? ఎప్పుడైనా అనుకున్నామా, మన మిట్లా? పాపం. ద్వారక తాను అనుకున్న దానికీ; యిప్పుడు జరిగేదానికీ వ్యత్యాసం ఎట్లా భరిస్తున్నాడోనోయ్! విద్యార్థుల కోసం రోజుకు పదహారు గంటలు పనిచేస్తున్నాట్ట.

అంత పని ఎట్లా భరిస్తున్నాడో. ఎప్పుడైనా అనుభవించడా యిట్లా? నాకే చాలా కష్టంగా వుంది......" నాకు తల దిమ్మెక్కింది. మనస్సు పరిపరివిధాల పోయింది. చెంగున పోయి అతని కష్టాలన్నీ ఒక్కమారు నివర్తిద్దామనుకున్నా. అంతశక్తి లేకపోయినా తుదకు పలుకులతో నైనా అతని బాధ కొంత వారించవచ్చును గదా అనుకున్నా. కాని సంకల్పానికి, అది సిద్ధి పొందడానికి మధ్యకాలంలో సముద్రాలు దొర్లి పోతై అన్నా డొక ఆంగ్లకవి. అట్లాగే జరిగింది......ఏమాత్రం తీరుబడీ అయింది కాదు. ఒక్క దినం శెలవైనా దొరకలేదు ........ ఇంతలో అసహాయోద్యమ ఝంఝూమారుతం దేశంలో కాశ్మీరంనుంచి కన్యాకుమారివరకూ వీచింది. ఆమహాప్రళయంలో అన్నీ—సంస్థలు, సభ్యతలు, భావసౌధాలు,—అన్నీ తారుమారైనవి. దానికి అనుగుణ్యంగానే వ్యక్తులలో గూడా పరివర్తనం కలిగింది. సబర్మతీ ఆశ్రమం నుంచి గాంధీమాత శంఖము పూరించేసరికి ఆసేతుహిమాచలపర్యంతమూ నిద్రా నైర్మల్యం వీడి అంజలి ఘటించి, సమరసన్నాహమైంది. ఆఉద్రేక వాయువులు నన్నుగూడా అవరించినై. ఒక్కమారుగా ఉద్యోగానికి స్వస్తి చెప్పి, రంగభూమిలోకి దుమికాను........

౪

ఆసంవత్సరంలోపుగా హిందూదేశానికి స్వరాజ్యమిప్పిస్తానన్నాడు గాంధీ. ప్రచారం తీవ్రంగా జరుగుతోంది. అధికారులలో దౌర్జన్యం ఎక్కువైనకొద్దీ ప్రజల్లో ఆవేశం ఎక్కువౌతోంది. ఊరూరు తిరిగి మా బోటి వాళ్లం ప్రబోధం చేయడం ప్రారంభించాం. ఇటువంటి సంచారంలోనే ఒక్కమారు విజయరెడ్డిని కలుసుకున్నాను. కొద్దికాలంక్రిందటే తాను ద్వారకను చూచివచ్చాననీ, అతనిలో తీవ్రమైన మార్పున్నదనీ, ఆరోగ్యంగూడా హీనస్థితిలోకి వస్తోందనీ, అట్లాగే యింకా ట్యూషన్లు చెప్తున్నాడనీ, ఆవృత్తి విసర్జించమంటే వినలేదనీ చెప్పాడు రెడ్డి.

ఇది విన్న కొద్దిరోజులకే నాకు ద్వారక ఒకలేఖ వ్రాశాడు. ఆతురతతో విప్పి చదివాను: "ఈమధ్య నీపేరు వార్తాపత్రికల్లో తరుచు చూస్తున్నాను. నాన్-కో-ఆపరేషన్‌లో పనిచేసే ప్రచారకుల్లో నీవు చాలా సమర్థుడవని నాదృఢవిశ్వాసం. హిందూదేశం యొక్క బానిసశృంఖలాలు తెంపవలెనంటే నీవంటి తరుణోత్సాహులంతా నడుములు బిగించాలి. ఉత్సాహం లేనిదే ఏపనీ సాగదు...... మొన్న నీవు పన్నుల నిరాకరణం విషయంలో చూపెట్టిన ధైర్యం, సాహసం శ్లాఘనీయములు. ఒకమాసం కఠినశిక్ష ననుభవించడం గౌరవనీయము. అటువంటి అదృష్టం యెందరికో కలుగదు. దేశమాతకు నీ వింకా ఎక్కువగా సేవ జేసేటందుకు ఈశ్వరుడు ఆయురారోగ్యములను యిచ్చునట్లుగా ప్రార్థిస్తున్నాను... మఱచిపోయినా; ఈ మాటు వేసంగిలైన నీవు, చిన్నీ నాతో గడపవలసింది, మహ

భాగ్యం అనుకుంటాను. మీయిద్దరికి నా ఆశీస్సులు......ఉంటాను......ద్వారక......"

నిజంగా, యీ లేఖను భగవత్ప్రసాదితమైన అమృత కలశంగా భావించా నంటే, నమ్మండి......నెలకు నూఱురూపాయలు వచ్చే ఉద్యోగం పోవడమే కాకుండా, ప్రయాణాలవల్ల, ప్రచారాలవల్ల మిక్కుటంగా డబ్బు వ్యయం కావడం, నెలరోజులు జైలులో అష్టకష్టాలు అనుభవించడం, వీటి అన్నింటి మూలాన యింట్లో జగడం, యింతలో వొంట్లో ఆరోగ్యం చెడడం—దానా, దీనా తీవ్రమైన మనోవేదనతో బాధ పడుతున్నా. అట్లాంటి సమయంలో, ద్వారక వ్రాసిన ఉత్తరం ప్రావృట్కాల పయోధరస్వామి శీతలస్పర్శ వలె కొంత చిత్తశాంతి చేకూర్చింది. ఆరాత్రి ఉత్తరాన్ని ఎన్నోమార్లు చదివి, దినమంతా రోదన చేసి చేసి సాయంకాలాన తల్లి చేత బుజ్జగింపబడి జోకొట్టబడ్డ పిల్లవాడిరీతి, స్వస్థతగా నిద్రించాను......

※

అపూర్వగౌరవం చూపించాడు ద్వారక. స్టేషనుకు వచ్చి స్వాగత మిచ్చి తన యింటికి తీసుకువెళ్లాడు నన్నూ, చిన్నీని. అతను, అతని నివాసస్థానమూ యిదివరకురీతినే ఉన్నా, అప్పటికీ యిప్పటికీ కొంత వ్యత్యాసం కన్పడ్డది. మునుపటి ఉత్సాహం, ఉత్తేజం తగ్గింది అతనిలో. ముఖం తీక్ష్ణత తగ్గి కొంచెంగా మందగించింది. కాని మమ్మల్ని చూచేసరికి ఎక్కడలేని సంతోషం తెచ్చిపెట్టుకుని తనలోని మార్పును మాటు జేయడానికి ప్రయత్నించాడు. నాలుగురోజులుమాత్రమే అతని ఆతిథ్యం అనుభవింపడానికి అవకాశ మైంది. అప్పటికీ, యీ నాలుగుదినాలూ ద్వారక మమ్మల్ని అమితంగా ఆనందింపజేశాడు. తన గృహంలో స్త్రీలేని లోపం కనపడకుండా సదుపాయాలన్నీ చేకూర్చాడు. హోటలునుంచి వొచ్చిన భోజనాన్ని తానే వడ్డించడానికి సిద్ధపడేవాడు. కాని ఏ పూటకు ఆపూటే బలవంతంమీద ఆపని చిన్నీకి వదిలేసేవాడు. "ఇక్కడికి వచ్చినందుకు బాగానే వుంది" అనేవాడు నవ్వుతూ. "ఈ మాత్రానికేనా" అని నాకంటె ముందే అనేది చిన్నీ......రోజూ సాయంకాలం బీచికి వెళ్లేవాళ్లం, ముగ్గురం. సందర్భానుసారంగా అన్ని విషయాలను ముచ్చటించేవారం. అన్నింటిలోనూ ద్వారక పాల్గొని ఏదో కలాసాముక్క అంటూండేవాడు. అతను క్రుంగి పోతున్నా అతనిలోని ఉత్సాహఝురి యింకిపోలేదని కన్పడింది......ఒకనా డీవిధంగానే వాహ్యాళినుంచి తిరిగివచ్చి భోజనం కానిచ్చి మిద్దెపైన దక్షిణదిక్కున వరాండాలో కూర్చున్నాం మిత్రత్రయమూ. అంటే జ్ఞాపకం వచ్చింది. ఈకొద్ది కాలంలోనే చిన్నీ తననైజరీత్యా ద్వారకతో చనువుగానే ఉండేది......అట్లా కూర్చున్నాం. దక్షిణదిశ కాబట్టి గాలి దివ్యంగా వీస్తోంది. సముద్రపుహోదయే కాకుండా, దూరాన సముద్రం వెన్నెట్లో మెరుస్తోంది. పట్నం కొంచెం జనసమ్మర్దం తగ్గి నిశ్శబ్దమైంది. తన యీస్థటిక్

సెన్సులంతా ఒక్కమారుగా చూపెట్టడానికి కాబోలు చిన్నీ అన్నది: "ఆ చెట్లమాటునుండి చందమామ యెలా దాక్కుడుమూచ్ ఆడుతున్నాడో!" దానితో మేమిద్దరంగూడా రసజగత్తులోకి దిగవలసొచ్చింది. ఇంతలో చిన్నీ మాట అందుకుని ద్వారక "యిదివరకు యిటువంటివి యెన్నిమనం......" అని నావైపు తిరిగి అని, పూర్తిచేయలేక పోయినాడు. దానితో నాకు తరుణావస్థంతా కంటికి స్ఫురించింది. ఇట్లా మేము కొద్దిగా భావసమాధిలో ఉండగా అంతా ముంచుకుపోయినట్టు, "చూడండీ, చూడండి, ఆతారక లెట్లా చంద్రుడిచుట్టూ లాస్యం చేస్తున్నాయో......అవిగో, పెద్దమేఘా లెట్లా తరంగమాలికల్లే ఊగులాడుతున్నాయో"— అని, ఆగకుండా నావైపు తిరిగి, "వీటి నకల్లేనా యేమిటి మీ ఫేనమాలికలు" అన్నది నవ్వుతూ. నే నేదో మాట్లాడడానికి ఉపక్రమిస్తూండగా ద్వారక అడ్డువచ్చి, "ఇటువంటి సందర్భంలోనే కాబోలు బిల్హణుడు

'నేసం నభోమండలమమ్బురాశి
ర్నైతాశ్చ తారా నవఫేనఖండాః,
నాయం శశీ కుండలితః ఫణీన్ద్రో
నాయంకళంకః శయితో మురారిః'

అని అమోఘంగా అన్నాడు" అని మాధుర్యంగా చదివాడు. అప్పు డతని గాత్రకోమలత్వాన్ని గమనించి వెంటనే చిన్నీ "అయితే మీకు సంగీతజ్ఞానంగూడా బాగా ఉన్నదన్నమాట!" అని ప్రశ్నించింది. "ఉన్నదని పెద్దగా చెప్పడానికి వీలులేదు గానీండి, ఈమధ్యనే ఏడాదినుంచీ ఫ్లూట్ నేర్చుకుంటున్నాను, స్వంతంగానే. అందుచేత కించిత్ జ్ఞానం" అన్నాడు ద్వారక లౌక్యంగా.

"అయ్యో, యింతకాలం చెప్పారే కారు. అయితే శ్రమ అనుకోకుండా ఒక్కమారు వీనులకు విందు......" అన్నది చిన్నీ సరసంగా.

"ఆఁ. మతిచెడగొట్టేమాట లంటున్నారు. మీ రనుకొన్నంత ఏమీ ఉండదు."

"ఏదో నిమేషకాలం కాలక్షేపం—"

"అయినా మీకు వొచ్చినదాంట్లో నాపాట యెంత?"

"సరేలెండి! పోరగా, పోరగా, మొన్ననే వీణ కొనిపెట్టారు. ఇంకా నేను శైశవంలో ఉన్నా ఆవిషయంలో."

"తక్కినవిషయాల్లోనో?" అన్నా నేను.

"ఊఁహు. అందుకున్నారూ —" అని చిన్నీ అంటూండగా ద్వారక తనగదిలోకి వెళ్లి ఫ్లూట్ తీసుకువచ్చి, "మీకు శ్రమ యివ్వడమౌతుంది" అన్నాడు.

"లేదు, లేదు" అన్నాం యిద్దరమూ ఒక్కమారుగా. మరొకమారు అడిగించుకోకుండా ఉత్తరక్షణంలో పాట ప్రారంభించాడు. "నాటిమాట మఱచితివో, ఓరామ, నాటిమాట......" అనేత్యాగరాజకీర్తన దేవక్రియారాగంలో రసవంతంగా గానంచేశాడు. ఆగాన

ఫ్లూటులతో మేమిద్దరే గాకుండా సాగరేశ్వరి గూడా లీనమైనట్లు కన్పించింది.

"ఓహో, యింత తెలిసేనా, మొదలు మొహమాటం పడ్డారు" అన్నది చిన్నీ.

"అబ్బే. అటువంటి దెప్పుడూ లేదు. ఇంకా ప్రారంభ దశలోనే వున్నాను కాబట్టి కొంచెం అనుమానించాను. ఇంతకూ, సంగీత శాస్త్ర జ్ఞానము సారూప్యసౌఖ్యదమే, మనసా, అని త్యాగయ్య మహామహుడు అన్నాడుగదా యని మొదలుపెట్టాను యిది" అన్నాడు ద్వారక.

ఇంతలో నేనందుకుని, "ఎంత త్వరలో నేర్చుకున్నావు, ద్వారకా. నిజంగా మనస్సు బృందావనం......" అంటూండగా అతనడ్డంవచ్చి, "పీటి కేంగాని, ఇవి నాకు ఈరోజుల్లో బాగా ఉపయోగపడుతోంది. జీవితకష్టములన్నీ పాటలో మాయమవుతై" అన్నాడు.

"ఇంతకూ, అదృష్టవంతుడవోయ్"— అని నేనన్నది వినేసరికి అతనిముఖం వికృతాకారం పొందగా, "నేనా?" అని ఊర్కున్నాడు. ఆమాట నాలో దూరి హృదయనాళాలను జలదరింపజేసింది.

ఇంతలో నిద్దర వస్తోందని క్షమాపణ చెప్పి చిన్నీ నిష్క్రమించింది.

"ద్వారకా, క్షంతవ్యుణ్ణి—" అన్నా అతన్ని చూస్తూ.

"దేనికి, దేనికి—" అన్నాడు ఆదుర్దాగా.

"ఇంతవరకూ నీకష్టాల్ని గూర్చి నిన్ను..."

"చాల్లేవోయ్. నేర్చుకున్నావు ... ఏమన్నా వుంటే నేనే చెప్పేవాణ్ణిగా...... ప్రొద్దుపోతోంది, పడుకుందాం పద."

"ఈమధ్య, రెండుమూడుమార్లు రెడ్డి..."

"అవును నీ మాస్తరు వైరివాడే రెడ్డి గూడాను...... అన్నీ సావకాశంగా యీమారు నీవు వచ్చినప్పుడు మాట్లాడుతానుగాని, యిప్పుడు పోయి నిద్రించు. తిరిగి తెల్లవారే ప్రయాణం చేయవలసినవాడవు" అన్నాడు. నేను మరొక ప్రశ్న వేసేందుకు వీల్లేకుండా, ఏమీ లాభం లేకపోయింది. మనస్సులో మాత్రం పొరబాటు జరిగిందని తీవ్రంగా బాధపడ్డాను.........

ఊరికి బయల్దేరాం. నాకూ, చిన్నీకి బట్టలతో గూడా అంపకాలు చేశాడు. స్టేషను దాకా వచ్చి, "దసరాకు రావాలి సుమా!" అంటూ సాగనంపాడు.

త్రోవలో అన్నది చిన్నీ — ఏమండీ. ఎప్పుడూ చెప్పారేకారు. ఆయన దగ్గర ఎంత పాండిత్యం, ఎంతప్రతిభ ఉంది. ఎంత ఉదాత్తుడు. నిజంగా, అటువంటి ఒక్కమిత్రుడున్నా చాలు—అంటూ కొంతసేపు ద్వారక భావోత్కర్షాన్ని, సౌహార్దాన్ని కీర్తించింది......

౬

మేము యింటికి జేరుకున్న నెలకు విజయరెడ్డి ఉత్తరం పంపాడు. "ద్వారక చాల జబ్బుస్థితిలో ఉన్నట్లు అతనిమిత్రుడొకడు నాకు కబురుజేశాడు. ప్రస్తుతం జనరల్ ఆస్పత్రిలో

ఉన్నాట్ట. జీవించడం కష్టసాధ్య మనుకుంటున్నారట. వెంటనే రావలసింది ......"

మరుదినం ఉదయానికి పట్నంలో ఊడిపడ్డాను. ఆస్పత్రిలోకి జనాన్ని పోనిచ్చేవేళ యింకా కాలేదు. అయినప్పటికీ అక్కడున్న నర్సు నాఆవేదన కనిపెట్టి రహస్యంగా తీసుకుపోయింది లోపలికి. రోగి హీనస్థితిలో ఉన్నాడనీ, ఎక్కువగా మాట్లాడకుండా త్వరితం రమ్మని చెప్పింది.

తెర అడ్డంకట్టివున్న మంచంమీద ద్వారక శయనించాడు. మేలుకునే ఉన్నాడు. నన్ను చూడగానే "వచ్చావా......" అని స్వాగతమియ్య ప్రయత్నించాడు. లేస్తాడేమో అనే భయంతో చెంగున దగ్గర జేరి ప్రక్కగా కూర్చుని,—'విశ్రమించు'—అన్నా.

"ఆఁ. ఇదిగో. కొంచెంసేపట్లో శాశ్వతంగా విశ్రమిస్తాను."

"ఎప్పుడూ యింతే, ద్వారకా, నువ్వు పడుకో......"

"అయితే చిన్నీ కులాసాగా......"

"ఇప్పు డవన్నీ యెందుకు...... ఇంతలో యిట్లా సంభవిస్తుందని అనుకోలేదు. ఏం పని జేశావు, ద్వారకా" అని కళ్లల్లోకి నీరు తెచ్చుకున్నా,ఆశల్యపంజరాన్ని చూచి...... "అదేం పనోయ్, జీవనసంధ్య ముగియబోతోంది. పునర్జన్మలో మిమ్మల్ని కలుసుకొంటాలే ...... అయితే మొన్న జరిగినఆర్టు ఎక్జిబిషన్లో..."

ఇంతలో నర్సువచ్చి నాకు వచ్చేయమని సైగ జేసింది. ద్వారకను తుదిమారు దర్శించి వెనక్కు తిరిగాను. అత నప్పుడే నేత్రాలు ముకుళించాడు. ద్వారకను ఆహ్వానింపమని దేవకన్యకలనుగూర్చి ప్రార్థించాను.

౨

ద్వారక ఆస్తివిషయం నేనూ, విజయరెడ్డీ ఏమి చేయడానికీ ఏమీ మిగిలింది కాదు. అతని నిలయంలో తండ్రి ఋణములను తీర్చివేసిన తాలూకు కాగితాలు, మజుందార్ చిత్రసంపుటి, త్యాగరాజుకీర్తనల పుస్తకం, జయదేవుడి గీతగోవిందం,—దొరకినాయి. ఇవి గాక పెట్టిఅడుగున గుప్తంగా ఉన్న కాగితాలు తీస్తే, శాఫో ప్రేమగీతాల అనువాదములూ, అతను రచించిన "జూకామల్లెలు" అనే పద్యాలవ్రాతప్రతి—బయటపడ్డాయి. మొదటిది విజయరెడ్డికి కృతియిచ్చాడు. రెండోది చిన్నీకి, నాకు అంకితమిచ్చాడు......అవును. అది అతని నైజం. తాను కృశిస్తున్నా, యితరుల సంతోషానికి సహాయభూతుడుగా ఉండడానికి ప్రయత్నించేవాడు. తనయొక్క జీవితాన్ని తనఆదర్శముల ప్రకారం సాగించుకోలేక విదళిత హృదయుడైనా, పైకి ఏమాత్రం కన్పడనీకుండా, అంత్యమువరకూ ఆనందంగానే ఉన్నాడు! మహ చిత్రమైన మానవుడు, ద్వారక.

---

౧

చివురుమేసిన కోయిలే చిన్నిచిన్ని
గీతములఁ జేయ మధుర సంగీత రచన
ఫలరసాలను ద్రావు నీచిలుకకొదమ
పాడ దేమమ్మ! పెదవులపవడమదర!

౨

ఈప్రశాంత నిశావేళ నెచటిదచటఁ
బ్రకృతిగంభీరగళమె నిద్రను మునుంగ
విపినవీథిని దిరుగాడు వెఱ్ఱితేఁటి!
ఎగయుకంఠాన శ్రుతిఁగూర్తు వెవనికొఱకు?

౩

సుధలవెదచల్లు నీతెలిచుక్క వెలుఁగ
యనుభవింపని మోహశూన్యంపు టెడఁద
యీజగత్సీమ—ఓశశీ! యేల కోరి
యొలకఁబోతువు? పండువెన్నెలల తళుకు!

౪

ఎనసినంతన నులివెచ్చఁదనములేని
వలితకౌఁగిలి-క్రొవ్వాడి వలపుచెమ్మ
లిగిరిపోయిన హృదయమిం కేల నాకు?
వట్టి గుసగుసలో మందపవనయిట్టి
మార్గశిరనిశాపర్యంక మధ్యమందు?

౫

మోహవనవాటి నెన్నెన్ని పూలులేవు?
వెదకితెచ్చితి నచటి చాంపేయసుమము
కోరికలుదీర మనసార నారగింపఁ
దేనెలేదని యలిగి గద్దింతు నెవని?

౬

గడగడవడంకునాకనికరపు టెడఁదఁ
గూర్చు కన్నీటిముత్యాల క్రోవలెల్లఁ
బగిలిపోవేఁడి యూర్పులుబుగులు కొల్పి
చిన్నవోయితిఁ గడగంటఁ జెమ్మలేక!

౭

కమ్మనిరసమ్మఁ జిలుకురాగమ్ము మేసి
కోనకడకేగె మధుమాస కోకిలమ్మ
రంగవల్లులనిశీ భవత్ప్రాంగణమున
మఁదురుటాకుల తోరణములు రచించి
వేచియున్నావె? ముదుసలి పెండ్లికొడుక!

౮

కడల వెలుఁగొందు తళుకువిల్కాడల నలరు
నాణిముత్యాలు కడలిగర్భాన డాఁచి,
యేలకురియింతు విశ్లేషనెడఁ గదల్చి
యడఁగిపోయెడు మంచుముత్యముల జల్లు?

౯

జాలు జాలుగ విరియు నీపూలవేళ
నెగుడుదిగుడులఁ జిన్నవోయినది బీడు!
నందనోద్యాన కుసుమసంతతులు మానె-
పులకరింపంగఁ దంగేటిపొదలు లేవె?

---

* ఈ 'ముత్యాలు' లోని మొదటి ఇరువది పద్యములును ఆంధ్రపత్రిక శుక్లసంవత్సరాది సంచికయందు ప్రకటితము లైనవి. అన్నియు నొకచో నుండుట మంచిదని మరల వానినికూడ నిందు ప్రకటించినాము.

—సంపాదకుడు-భారతి.

౧౦

ఫలరసమ్మయి తేనియ పలుచఁబారె
కండమై రేకు రేకునఁ గలసిపోయె
వలపుచవి యయి లోలోన నిలిచిపోయె
వలపుపై నేలకనులు మోహమ్ము విడవు?

౧౧

జాలిచేఁ దూలి తొలిరహస్యముగ నెన్ని
వేఁడినూర్పులు నీయెడ విడిచినానొ,
వడవడవడంకు కౌఁగిలిపట్టువీడి
మఱచితే నన్నుఁ గరువలీ! కరుణమాలి?

౧౨

చిక్కిపోయిన నా తెలిచెక్కులంటి
దొరలు కన్నీటిధార ముద్దులహరించి
యవల నీవల గుసగుసలాడి యాడి
దండడించెడు నిట్టినిదాఘవేళ
మఱచితే నన్నుఁ గరువలీ, కరుణమాలి?

౧౩

మురిపెములఁజల్లు నీతొలిప్రొద్దులోనఁ
బూరికొన నాడు మరకతమ్మును దెమల్చి
కోసికొని డాఁచికొంటి నక్కునఁగదించి
ఇంతలోనన జాముప్రొద్దెక్కి పోయె!
నవసిపోయిన యొంటితృణమ్మె మిగిలె!

౧౪

పవలుతీవియ సాగించుపడమటికొన
విడిన సంధ్యాప్రసూనమే వడలిపోయె!
అదరు తారకాతు హిమకణాళినిట్లు
దాఁటిమెటుపోవు నీరేయి తేఁటి కదుపు?

౧౫

పెదవిఁదడుపని యీతేనె పెరఁగదల్చి
యీఁగపోటునఁ దూటువోయినది మేను
తపము గైకొని మధుపగీతమున మునిఁగి
తేఁటినై నేను కన్నులు తెఱచువేళఁ
బూవులన్నియు వసివాడి పోవునేమొ!

౧౬

వెగటుఁదనమునఁ గెమ్మోవివిఱుచుఁ జిగురు
చిఱునగవులోన నెగతాళి నేయుఁ బూలు
క్రించుఁదనమున లత తలవంచికొనును
నిలువుపాటునఁ దరులు కన్నీరురాల్చు
నదరు బెదరుల ననునేన యరసికొందు!

౧౭

చిపురు దొన్నెలఁ బూరేకు చిప్పలందు
వన్నియలుగూర్చి, లేప్రొద్దు చిన్నిరేక
కుంచియలు గట్టికొనెడు నీకొమరుఁ జూచి
కోకిలము రెక్కఁ జిత్రించి కొందువంచు
నంతసించితి-నిదియేటి జాణతనము!
ప్రకృతిలోఁగల క్రొందళుకన్నె లెల్లఁ
గలిపి యీయాకుచిలుకకే పులిమినావు!

౧౮

చిక్కువడి తారహారముల్ చెదర దెసలఁ
గాఱుచీఁకట్ల కుచ్చిళ్లు గంతులిడఁగ
నందెమోమున మసిబూసి నందడించు
నీయమావాస్య రాత్రి యిందెవనికొఱకు?

౧౯

ఈప్రశాంత విశ్రాంతిలో నింతకదలి
పూలతావుల నిలువునఁ బులకరించి

కలఁగని శకుంతగీతాలఁ గలవరించుఁ
గాంతుని దలంచి యీ నిశాకాంత నేఁడు!

౨౦

నవరసవిహీన వేణుదండంబునుండి
చల్లుచున్నావు గానరసమ్ము నీవు!
తరుణ మధురసపూర్ణేక్షు దండమంది
పాడలే నేను తందనపదమునైన!

౨౧

సోగమేనేల? నీ వన్నె సొగసులేల?
తళుకులేలను? గ్రొవ్వాఁడి వలపులేల?
వెఱ్ఱిదానవు సుమ్ము చాంపేయ సుమమ!
తేనె గలపూల నెఱుఁగదే తేఁటికొదమ?

౨౨

నాడు నేనొంటిమై నూపిరాడకుండఁ
గొట్టుకొనువేళ నీ విందుఁగురిసితంట
రమ్యమధుమధుమాస పుష్పసౌరభము లెన్నొ!
నేడు తాలిమినిట్టూర్పు నిగుడఁబుచ్చి
వేచియున్నాఁడ-నొకమరుస్వేచ్ఛకైన
విరుల రెక్కలఁ గదలించి విసరరాదె?
అనుభవమునకు హేమంత మైననేమి?

౨౩

లీల భవదీయ కుసుమమాలికలనుండి
రాలి కొరలిననాటి నిర్మాల్యములను
గడఁక నేఁగోరి యొక్కటొక్కటిగ నేరి
పొదుపుగాఁ గూర్చికొంటిని పూలపడవ
నీభవాబ్ధిని నేఁదరియింతు ననుచు
కాని, కడపఁగ నొక్కచుక్కాని లేదు!
మున్ను నీచేత మ్రోగిన మురళిలేదె?

౨౪

కొనలు వసివాడి గొగ్గుగొగ్గులను ముడిఁగి
కడలఁ గసిబిసి వెలితి రాగమ్ము చెదర
పీడి పీడని నగమ్ము కొవ్విరి మదీయ
హృదయమో ప్రభూ! భక్తి నర్పింతు నీకు
దాని నిరసింపకుము-లోనఁ దేనె గలదు!

౨౫

వెలయఁ దీయనినుడు లెఱపెట్టిపెట్టి
లాగి విదలించి చూడ్కి గాలంపుకవ్వఁ
బఱపి యీ తీరమున రెప్పపాటు లేక
మరియుచున్నాఁడ నాసలప్రొద్దు వాలె!
ఠీవి నీ తెలికన్ను బేడిసలజంట
యేగభీరతరంగాల నిమిడె దేవ?!

౨౬

ప్రేమకారణమునఁ బ్రవర్తిల్లునట్టి
వెఱ్ఱిలోకమ్ము నానాఁట వృద్ధిఁ బొంద
నొక్కకౌపీనమును బట్టఁ జోగిరమ్ముఁ
జాల నేమట్టు మీరు జంజాట మేల?
రావు లేటికి! నీపటాటోప మేల?

౨౭

నవ్యకళ లూరఁ బ్రకృతి భాణము నటించు
నటకుఁడవు నీవు-ప్రవిమలానందమునకు
గాఢదుఃఖమ్మునకుఁ గూడఁ గనులనుండి
బాష్పములె రాల్తు వందలిభావ మేదొ
తెలియఁజాలక నే నిందుఁ దెల్లవోదు.

౨౮

తాపమునఁ బొక్కు నాఁటి నిదాఘవేళ
నీడ కాసించి చేరువ నిలుచునంతఁ



సుందర రూప అనూప బన్యో అతి ఉజల అంగ బిభూతి లగావే ।
ఘుటే జటా స్తుతి సుప్రమతి గ్యానసో ముండిత సేవని ధ్యాన హిలావే ।
ఐసో ఉదాస రహే బనబాసమే తాపసో తంకవ నిలఖావే ।
రాగనీ రంగ హీండోలకీ రాజతి దేవగంధార యో నామ కహావే ॥

[జయపుర చిత్రము: దివాన్ బహదూరు చతుర్భుజదాసు గోవిందదాసుగారి యనుమతిని.

# హైందవ శిల్పచరిత్రము

ఎ. వి. రత్నము గారు

ఇటీవలి ప్రాచీన శిల్పవాఙ్మయ పరిశోధనములవలన భారత జాతీయ నాగరికత కేవలము ఆర్యులవలన నుత్పత్తియైనదే కాదనియు, నందు ద్రావిడ నాగరికత చాలభాగము జీర్ణమయి యున్నదనియు తెలియవచ్చుచున్నది. అందు జ్ఞానభాగమునకు సంబంధించినదంతయు ఆర్యజనితమనియు, శిల్పమునకుఁ జెందినది ద్రావిడజనితమనియు నేతత్పరిశోధనముల మూలమున తెలియుచున్నది. నేటికాలమునకుఁ గావింపఁబడిన తత్పరిశోధనా ఫలితములు నేను జూచిన కొన్ని గ్రంథములనుండి — ముఖ్యముగ నిందు సర్ జాన్‌మార్షల్ మున్నగు సుప్రసిద్ధ శిల్పకళా పరిశోధకుల ప్రచురణములనుండి—యిచట సంగ్రహపఱచి వ్రాయుచున్నాను.

భారత జాతీయమతము, శిల్పము పరస్పర సంబంధ జనితములై పెంపొందినవి. మతాభివృద్ధియను కొలఁది శిల్పాభివృద్ధియు నగుచుండెను. ఈదేశమున మతమును విడిచి శాశ్వతముగ నిర్మింపఁబడిన శిల్పము లేదు. మనదేశపు శిల్పములందా యాకాలముల మతసాంఘిక చరిత్రములు ప్రతిఫలించుచుండును. నేటి శిల్పమునకు వెనుకను చాలకాలపునాఁటి ఆర్యద్రావిడ సమ్మేళన జీవిత చరిత్రము గలదు. ఈసమ్మేళనమునుండి ప్రభవించిన హైందవ శిల్పమునందు ఆర్యుల ప్రతిభ, ద్రావిడుల ప్రతిభ యెట్లు రూపొందియున్నవి?

వేదకాలమున ఆర్యులు శిల్పరచన నెఱుంగరు. వైదికార్యులు విగ్రహారాధకులు కారనియు, దేవతలకు విగ్రహరూపముల నిచ్చి పూజించు భావము వారికి లేదనియు వేదపండితులు చెప్పుచున్నారు.

కావున ప్రాచీనార్యులు శిల్పకళలను సృజించినవారు కారు. ఇందుకు నిదర్శనములు: దేవతావిగ్రహములను నిర్మించుటకు ముందు దేవతలు విశేషమహిమను గల్గి మనుష్యులను బోలియుందు రను భావమొకటి కలుగవలెను.

కాని "దివ్ - దేవుఁడు" అను పదమును ఇండో యూరోపియన్ భాషలందు విమర్శించి చూచినచో దాని కెచ్చటను నిట్టియర్థము కన్పట్టదు. వైదిక దేవతల ప్రకృతిశక్తుల కధిష్ఠాన దేవతలు. అనార్యజాతులంద ప్రత్యేకము దేవుఁ డొకఁడు కలఁడని, మృతులయినవారి దేవుఁ డొక సుఖలోకమునం దుంచు ననెడిభావము నేఁ కిని గలదు. వేదములందు యజ్ఞములే కాని దేవతల మఱొకవిధమగు పూజ లేదు. యజ్ఞమున దేవతలెల్ల హవిర్భాగంబులు గొనువారే. అందఱు సమానస్వత్వమ గలవారలే. వీరిలో నెవ రెక్కువవారో, "కస్మై దేవాయ హవిషావిధేమ" యని నిరీక్షించుచుండెడివారు. బ్రాహ్మ యుగము వచ్చునప్పటికి యజ్ఞపురుషుఁ డధిష్ఠింప బడెను. యజ్ఞభాగములే యజ్ఞపురుషుని భాగములు యజ్ఞపురుషుఁడే విరాట్స్వరూపము. ఇట్లు రానురా ఉపనిషత్తులకాలము నాఁటికే యజ్ఞపురుషుఁడు నిర్గు స్వరూపమునకు వచ్చెను. "శ్రోత్రస్య శ్రోత్రం, మనస మనో యద్వాచో హవాచం,సాయు ప్రాణాసీర్ ప్రాణా అను శ్రుతివాక్యములు దేవుని విగ్రహమున బంధించుటక దగినవి కావు. బుద్ధుఁడు యజ్ఞకర్మలను ఖండించెను గా యెచ్చటను విగ్రహారాధనమును ఖండించినట్లు లే ఆత్మబోధకొఱకు సన్యసించెనుగాని, యేదేవతను ధ్యాని నట్లు గాని, యేవిగ్రహమును పూజించినట్లు గాని లే బ్రాహ్మణకర్మకాండమున విగ్రహారాధన మొకభాగ యుండినట్లయిన, ఇదికూడ యజ్ఞాదిక్రతువులతో పా బుద్ధునిఖండనమునకు గురియై యుండెడిది. బ్రాహ్మణ యజ్ఞములందు పశుబలి నిచ్చుచున్నారు గాని విష్ణు యములయందుఁ గావించుట లేదు. ప్రాచీనార్యుల ములో దేవాలయములే యుండినచో, తప్పక దేవా ములందు జంతువులను బలియిచ్చుట ఆచారముగ సం చెడిది. మహాభారత రామాయణములందు తపము, దే ములవఁగలుగుమహత్త్వ ప్రతిపాదింపఁబడినదికాని దే

పూజగాదు. శిల్పమునందుఁగాని, యోగమునందుఁగాని విగ్రహప్రతిష్ఠ యెందును చెప్పఁబడియుండలేదు. ఇది యిట్లుండ ప్రబలనిదర్శన మొకటి గలదు. శిలాస్తంభముల మీఁదనేక బౌద్ధధర్మములను చెక్కించిన అశోకమహారాజు బుద్ధునివిగ్రహము నొక్కటియైనను చెక్కించియుండ లేదు. ఇది హైందవ శిల్పచరిత్రమునందు గుర్తింపఁదగినది. దేవతలకు రూపము నిచ్చి పూజింపవలె ననెడిభావ మింకను ఆర్యులయందు జనింపలేదు. ఈవిధముగనే పార్శీకుల మతసంస్థాపనములును గన్పట్టును. పార్శీకులకు విగ్రహారాధనము లేదు. ఈస్థితియంతయు అశోకునకుఁ బిమ్మట 5 శతాబ్దములలో (క్రీ. పూ. 200–క్రీ.శ.300) పూర్తిగ మారిపోవును. ఈయైదు శతాబ్దములలోను ఆర్యులదేవతలు విగ్రహరూపములను ధరించి మ్రొక్కు లందుకొనవచ్చిరి.

క్రీ. పూ. 200 నాఁటి దేశమునం దేదయిన శిల్పమున్నదా? యని ప్రశ్నించినచో, ఆర్యమతసంబంధమయిన ప్రతిమరూపమును దాల్చిన శిల్ప మున్నట్లు కన్పట్టదు. కాని ఆర్యులీదేశమునకు వచ్చునప్పటికి నాగరకత యందున్న ద్రవిడులసంగతి యేమి? వారికి గ్రామదేవతలు గలరు. నేఁటికిని చెన్నపురిరాష్ట్రమున, ఒక్కొక్క గ్రామమున కొక్కొక్క అమ్మవారు గలరు. ద్రావిడులు సర్పములు, రాళ్లు, భూతములు మొదలగువానిని గొలుచుచుండిరి. ఇట్టిపూజ కాలక్రమమున ప్రతిమలయందు నెలకొల్పఁబడుట సహజము. శక్తిపూజ ద్రావిడులయందే మొదట ఉత్పత్తిని గాంచినది. నవీనహిందూమతమున పూజింపఁబడు దేవతలలో చాలమట్టునకు ద్రవిడదేవతలే గలరని ఫ్రేజరుగారు చెప్పుచున్నారు. రానురాను ద్రావిడుల సంపర్కమున మానవరూపము దేవతలకీయఁబడినది. పిమ్మట నాయాదేవతలకు చిహ్నముల నిచ్చి కొలుచుచుండిరి. ఈచిహ్నత (symbolism) ప్రాచీన హైందవశిల్పమునకు మూలమయ్యెను. ఈచిహ్నములచే, ఒక్కొక్క దేవతయొక్క బాహువుల, శిరస్సుల బహుళత్వమునకు వెనుక నెంతియో కాలమునాఁటి జాతీయ చరిత్రము గలదు. క్రమముగ ఆర్యుల జ్ఞానసంపర్కమున ద్రావిడులశిల్పము నూతనచైతన్యమున వికసింపఁదొడఁగి, మౌర్యులకాలము నాఁటికి స్వజాతీయమయిన శిల్పము పూర్తిగ దేశములో నావిర్భవించియుండెను.

ఈనూతనచైతన్య మెట్టిది? మొదట ద్రావిడుల శిల్ప మేస్థితిలో నుండెను? విచారింపవయ్యెడిని.

మిగుల పురాతనమగు హిందూదేశపు శిల్పము నందు—భార్హుట్, బుద్ధగయ, సాంచిప్రదేశములందుఁ గన్పట్టు రాతిచెక్కడములందు—'నగిషీపని' విశేషించియున్నది. ఈశిల్పము పాంచాలమునందుఁదక్క, తక్కింగల హిందూదేశమునం దంతటను విరివిగ వ్యాపించియున్నది. ఈశిల్పము మొదటినుండి చివరవఱకును అలంకారముతో నిండియున్నది. ఈయలంకారరచన హిందూదేశపు శిల్పకళలందు స్థిరముగ నిలిచియున్నది. ఈయలంకారశిల్ప మంత యౌన్నత్యమునకు వచ్చియున్న కాలమునందు మానవప్రతిబింబములను చూచినచో నీకళ ప్రాథమికదశలో నుండుట విశదమగును. మథురాపట్టణముదగ్గఱ నున్న పర్ఖాంలోని విగ్రహము లిందుకు నిదర్శనము. వీనియందు నిమ్నోన్నత స్వరూపము యొక్క (relief) ప్రస్ఫుటత్వము లేదు. ముఖమంతయు (frontality) విపరీతముగ చూపింపఁబడును. ఇవి silhouttes వంటి మానవాకృతియొక్క ఛాయామాత్రములే యై యున్నవి. భార్హుట్‌స్తూపమునందలి రాతిచెక్కడములను బరీక్షించినను, నదికూడ నింతకు మించి యుండలేదు. ఇందలి మర్త్యబింబములు సర్వాంగమూర్తియగు మానవుని నిర్మించుటయందుఁగల శిల్పి యభిలాషమాత్రమే చూపించుచున్నవి. ఈస్తూపమునందు జీవులన్నియు సమాన మనెడిబౌద్ధగాథ యొకటి చెక్కఁబడియున్నది. అందు మానవుఁడుగూడ నితరజంతువులవలెనె భావరహితుఁడయిన ప్రేక్షకునివలె నిర్మింపఁబడుట గాంచనగును. ఇటుమీఁద క్రమముగ మానవవిగ్రహమును చెక్కుటయందు శిల్పులు నైపుణ్యమును గాంచిరి. అయినను సర్వతోముఖవిభాజమానమగు గుప్తయుగము నాఁటికిని పరిపూర్ణవిగ్రహనిర్మాణమునందుఁగాని, చిత్తవృత్తినిరూపణమునందుఁగాని మహోన్నతత్వమును బడ

యిన సాంకేతిక శిల్పములను స్వదేశీయశిల్పులు నిర్మిం మండి, తక్షశిల, గాంధారములందు గ్రీకులు బుద్ధదేవుని గ్రహములను నిర్మించుచుండిరి. బుద్ధుని మొదటి విగ్ర హమును నిర్మించినవారు గ్రీకుశిల్పులు. కాని వారు హైందవశిల్పుల సాంకేతికములను తమ విగ్రహములందుఁ బ్రకాశింపఁ జేయలేకపోయిరి. అయినను మహోత్కృష్ట మైన బుద్ధవిగ్రహములరూప హైందవశిల్పుల నభిముఖు లగఁ జేసిరి. బుద్ధునిగూర్చిన కథలను బుద్ధునిమధ్యస్థముగఁ జేసి చెప్పుట నారంభించిరి. మొదట కథలను చిత్రిం చుటయందు గ్రీకులు బార్హూత్, సాంచిశిల్పులకు సాటి లేకపోయినను, క్రీస్తుకాలమునకే యాకళయందు శిలల్లై, తక్షశిలయందు, శాహీబహ్లోలునందు గ్రీకులు దేశీయ శిల్పులను జయించిరి. అంతియ కాదు; దేవాల యాది కట్టడములందు వస్తుతిపరివర్తనమును జాతీయ భావమున కనుగుణముగఁ గావించిరి. హైందవ గ్రీకు రచనాపద్ధతుల సమ్మేళనమునుండి గాంధారశిల్పకళా పీఠ మొకటి యుద్భవించెను. తర్వాత బౌద్ధవిహారముల కిది ఆలయమయి, తురుష్కస్థానము, మధ్య ఆసియా మున్నగు దేశములకుఁ గొంపోఁబడెను.

హిందూదేశమున బౌద్ధవిగ్రహములే కాక, వానితో టు హిందూవిగ్రహములును వందలకొలఁది పెరిఁగిపోవు కు మొదట గ్రీకులే కారణము. "విగ్రహారాధనమును దేశములందు వ్యాపింపఁజేసిన గొప్ప 'నేరస్థులు' ప"లని ఫౌచరుగారు పరిహాసముగ వ్రాసియున్నారు. రాణిక యుగమునాఁటికి దేశమున బౌద్ధమత మంతరిం చు. బుద్ధుఁడు విష్ణువుయొక్క యవతారముగ గ్రహిం బడెను. నాటి ... యుగమునం దుప్పతిల్లిన మంతయు గ్రీకు సంప్రదాయపు రచనాపద్ధతిని పూర్తిగ విడనాడి ప్రాచీన హిందూసంప్రదాయమును గ చేకొనెను. ఈయుగమున నుద్భవించిన సాంచి, రనాత్, అజంత, జగ్గయ్యపేట, సింహళ బుద్ధవిగ్రహ ములను గాంధార బుద్ధవిగ్రహములతో పోల్చిచూచిన మ్యది విశదమగును. "గ్రీకు-పాశ్చాత్యకరూపవిన్యాసము, నా పద్ధతి (technique), గ్రీకుల అంగ సంబంధ మ్యము (proportion) మున్నగు గ్రీకుల శిల్పలక్షణ ములు భారతజాతీయసంప్రదాయమును నెదుర్కొని దానిని గ్రసించుటయందు జయమొందలేదని విన్సెంటు స్మిత్ గారు చెప్పుచున్నారు.

హైందవజాతీయ సంప్రదాయశిల్పమునం దెల్లెడ లను 'నగిషీ' పని—అలంకారవైభవము—ప్రాము ఖ్యమును వహించియుండుట గాంచనగును. మిగుల పురాతనకాలమునుండి నేఁటివఱకును ఇండియాయం దుద్భవించిన శిల్పరచనాపద్ధతు లన్నిటియందు—బౌద్ధుల విహారములందేమి, హిందువుల కట్టడములందేమి, తర్వాత ప్రభవించిన రాజపుత్రుల, మొగలుల శిల్పరీతులందేమి, కళ్ళు, దంతము, లోహపుపనులయందేమి, 'నగిషీ' పని, యీయలంకార కళావైభవము, విశేషించి కన్పట్టుచు న్నది. ఈ యలంకారశిల్పము (decorative art) ఎందుండి వచ్చినది? మున్నెన్నఁడు లేని శిల్పకళావిజృంభ ణము గుప్తచక్రవర్తుల యుగమున ప్రాదుర్భవించుటకుఁ గతం బేమి? అను ప్రశ్నలను పరిశోధించి సర్ జాన్ మార్షల్ గా రిట్లు వ్రాయుచున్నారు:—

"హైందవ శిల్పమునుగూర్చి వ్రాసిన వారిలోఁ జెక్కుండ్ర కిది హైందవార్యులదనియే యభిప్రాయము. హైందవ నాగరికతయం దుత్తమమయినదంతయు ప్రా చీనార్యులచే, వేదములతోపాటు, దీక్షానిర్ణయింపఁబడినదని వీరు తలఁతురు. ఈ 'ఉత్తమమునందు' శిల్పకళలను గూడ చేర్తురు. అయినను సంగతి సందర్భములను విచారింతము: హైందవ శిల్పముయొక్క మొదటికర్తలు వైదికార్యులే యయినచో, వీరు మొదట నెచ్చోట నివసించిరో య చ్చోట నది ప్రబలముగఁ గన్పట్టవలసియుండును,—అనఁగా పంజాబు, పశ్చిమోత్తర ప్రాంతములందు. కాని కన్పట్టు నదంతయు నిందులకు వ్యతిరేకముగ నున్నది. పంజాబును విడిచి దక్షిణమునకు పోయినకొలఁది దీనిప్రాభవము ఎక్కు వగుటను గాంతుము. పంజాబునకు మిక్కిలి దూరమున నున్నట్టి దక్షిణదేశమున నియ్యది ప్రబలియున్నది. మధ్య యిండియా యందును, హిందూస్థానమునందును నిది మిక్కిలి దుర్బలముగను, మార్పుచెందియు నున్నది. పంజాబునందు మిక్కిలి దుర్బలమయి, చూచుట కరుదై

కారణము కాదు. బార్హూత్, సాంచి, బోధిగయ, అమ
రావతిచోట్ల నింకను మిగిలియున్న శిల్పములను గాంచిన,
బౌద్ధమతమునకు చాలపూర్వమే స్వదేశీయమైనశిల్పము వేద
కాలమునకుఁబిమ్మటనుండియు నవిచ్ఛిన్నముగ వచ్చుచున్న
ట్లు,-అకాలపు వాఙ్మయమునందుఁ గూడను నిదర్శనము
లుగలవు, గాన—చెప్పవగును. దాని యుత్పత్తికి మూలము
స్వదేశీయులయిన వడ్రంగులు, దంతపు పనివాండ్రు,
విశ్వబ్రహ్మలు మున్నగువారి వంశ పారంపర్యముగ వచ్చు
నభ్యాసములందుఁ గననగును.* మౌర్యులకాలము నాఁటికే
యీశిల్పము పరిపక్వమయిన స్థితిలో నున్నది. సాంకేతిక
మైన (conventional) ఈ స్వజాతీయ శిల్పసంప్ర
దాయమునకు బౌద్ధమత ముద్దీపనకారి యయ్యెను. ఇంకను
బుద్ధవిగ్రహములను చెక్కుటయందు శిల్పులకు మనస్క
రింపలేదు. బహుశః వీరింకను విగ్రహములను చెక్కుట
యందు నిపుణులుఁ గాలేదేమో. ఇదే యథార్థముగఁ గన్ప
ట్టును. ఆకారణమేదైనను, బుద్ధుని ప్రబోధమును బోధి
వృక్షముచేతను, బుద్ధదేవుని ధర్మచక్రముచేతను, నిర్వా
ణమును స్తూపముచేతను (ఉత్తరోత్తర పరిణామమున
పౌరాణిక యుగమునం దుపయోగించిన లింగములకును,
దేవాలయ గోపురములకును స్తూపము మూలము), ఇట్లు
సాంకేతిక రూపాత్మకమైన శిల్పము నిర్మింపఁబడుచు
వచ్చెను.

## గ్రీకుల సంబంధము

ఇట్టిస్థితిలో విదేశీయుల సంపర్కము,-ముఖ్యము
గా నెన్నఁదగినది గ్రీకులది, హిందూదేశమునకుఁ గల్గినది.
గ్రీకులు రాకపూర్వము హిందూదేశమున విగ్రహరచన,
విగ్రహారాధనము పొత్తిగ లేకుండ లేదు. కాని గ్రీకులరాక
మూలమున హైందవశిల్పచారిత్రమునం దొక గొప్పపరివర్త
నము కలిగెను. ఇంతనుండియు ధైర్య స్థైర్యములతో చిర
స్థాయిగ విగ్రహరూపసంపద మహోదర్కముగ విజృం
భించును. హైందవశిల్పమునకు గ్రీకు ప్రాప్యలము మిళిం
దునికాలమునుండి కలిగినది. భారతీయశిల్పకళాపరిణా
మమునం దీగ్రీకురాజన్యులరాక నూతనశకమును గల్పించు
చున్నది. హిందూదేశచరిత్రమునందే గాదు, ఆశియాఖండ
చరిత్రమునందును ఆశియాఖండపుశిల్పము, మతముగూడ
నూతనపరిణామ విలాసమునందును. అశోక మహారాజా
బోధకుల వంటి దేశదేశములందు బౌద్ధమత ప్రచారమును
సాగించెను. బుద్ధవిగ్రహములద్వారా గ్రీకులు గాంధా
రము, బాక్ట్రియా, చీనా, తురుష్కస్థానము, మున్నగు
పశ్చిమదేశములందు బౌద్ధమతమును విరివిచేసిరి. ధర్మాశో
కునిచే ప్రారంభింపఁబడిన దేశాంతర ద్వీపాంతర ధర్మ
ప్రచార మిట్లు అశోకునకు పిమ్మట నొక నూటేండ్లలో
సఫలీకృతమయ్యెను. రూపముగ్ధులు, మనోధర్మప్రవృత్తు
లగు గ్రీకులకు భారతీయ నిరాకార శిల్పరచనము, విగ్ర
హరూప రహితమయినది, నచ్చకపోవుటచే సాకారశిల్ప
రచనకు, విగ్రహనిర్మాణమునకుఁ గడంగిరి. హిందువుల
వలె కేవలము బుద్ధుని ధర్మకాయముతో గ్రీకులు సం
తృప్తి నొందలేదు. బుద్ధుని వాస్తవిక కాయమును,
స్వరూపమును సాక్షాత్కారము చేసికొనఁదలఁచిరి. బుద్ధ
దేవుని మొదటి విగ్రహమును నిర్మించినవారు గ్రీకులు.
విగ్రహరూపమునందే గాదు, వేరువిధములను శిల్పసం
స్కారమునకు దారిచేసిరి. శిల్పచిత్రములనుండి భవన
నిర్మాణమునకుఁ (architecture) గడంగిరి. ప్రాచీనస్థితి
యందున్న (primitive stage) భారతీయ భవననిర్మా
ణమునం దపూర్వపరివర్తనమును గావించిరి. ఈపరివర్త
నమునందు గ్రీకు లద్భుతబుద్ధిసూక్ష్మతతో భారతజాతీయ
మతానుసారమయిన కల్పనాదృష్టిని (indigenous
motifs) సమ్మేళనము చేసిరి. ఈసంయోగమునుండి
Græco-Buddhist Artఅని పేరు గాంచిన గాం
ధార శిల్పకళాపీఠ మొకటి ప్రభవించి, యీ నూతనశైలి
ఆశియాలోని పశ్చిమోత్తర దేశములందలి బౌద్ధగుహాల
యములందు విలసిల్లు శిల్పవైభవములకు మూలమయినది.
గాంధారమునందు గ్రీకులు నిర్మించిన స్తూపములు, చైత్య
ములు, గుహాలయములు మొదలగుచోట్ల చెక్కఁబడిన శిల్ప
ములు (sculptures) హిందూదేశమునందలి శిల్పముల
లోనికెల్ల చాల సొగసైనవని (" the finest India

* Mon. Fovcher.

has to show") కొందఱి యభిప్రాయము. కాని, యీ గ్రీకు శిల్పము పశ్చిమోత్తరమునందు తప్ప తక్కిన హిందూదేశమునందు వ్యాపింపలేదు. మధ్యయిండియా, దక్కను విహారములందలి శిల్పము కేవలము స్వజాతీయ మయినది.

## బౌద్ధ-పౌరాణిక యుగము

మధ్య, దక్షిణ యిండియాయందు ప్రబలినశిల్పము నందు గ్రీకుప్రాబల్యలము లేశమయినను, వారి శిల్పరచనా పద్ధతి వారితోపాటు దేశమునుండి నిర్గమించినను, విగ్రహ రూపనిష్పత్తికి, విగ్రహారాధనమునకు వారు చేసిన పని మాత్రము శాశ్వతకల్పమై, ఆసేతుహిమాచలపర్యంతము దేశమందంతట నిలిచిపోయినది. వారు వేసిన బీజము మహావృక్షమై "బోధివృక్షమును" గూడ మ్రింగివేసి, అనంతకోటి దేవతావిగ్రహములకును, విగ్రహారాధనము నకును ఫలప్రదమయ్యెను. బుద్ధుని మొదటి విగ్రహమును నిర్మించి యిచ్చిన వారు గ్రీకులు; బౌద్ధధర్మమును పుచ్చు కొని భారతీయులు పెట్టినధర్మభిక్షకిది వారి ప్రత్యుపకా రము! ఈధర్మభిక్షను గైకొని, చాలకాలమునుండి ఆకార నిరాకారములమధ్య పడి దేవతారూపరచనాసందిగ్ధమాన సులగు హిందువుల దీర్ఘసంశయార్తిని బాపిరి. గ్రీకులు సుం దరమైన బౌద్ధవిగ్రహములను నిర్మింప నారంభించిన నాటిగ దేవతారూపరచనము, విగ్రహారాధనము దేశమునందు విస్త రించును. ఇందు బౌద్ధ జాతకకథలును, హిందూ పురాణ కథలు నొంటొంటితో విగ్రహ రూపసంపత్తిని కొల్ల గొనుటయందు స్పర్ధించును. తన్నిరూపణమునకు బౌద్ధ విహారములు, గుహాలయములు, హిందూ దేవాలయములు దేశమునం దెల్లెడల నావిర్భవించును. ఈశిల్పవికాస సమ యమున అనేక జాతులవారి మతములు, దేవతలు, రసజ్ఞ తలు సంక్రమించి రచనాపద్ధతియందు సాంకర్యమును, రూపత్వమునందు వివిధత్వమును కలుగఁజేయును. ఎప్పు డయితే ఒకసారి బుద్ధునిధర్మకాయముతో 'రాజీ' కుదిరె నదో, అంతనుండి క్రమముగ ప్రజలచిత్తము, శిల్పుల దృష్టి బుద్ధదేవుని సంభోగకాయములోనికి, అటు పిమ్మట నిర్మాణకాయములోనికి (ఇది జాతకకథలకు, దశావతార ములకు తావలమయినది) జారిపోవును. కాకున్న ... నాదివిగ్రహములు లేకుండ, దర్శనస్పర్శలు లేకుండ, జన... న్యము, ఆ శేషజనము పట్టిధర్మకాయముతో సం... తృప్తిచెందియుండఁగల్గును? ఈనూతన విగ్రహశిల్ప... మునకు కేవలము పారమార్థిక మొక్కటియే కాదు, ఆ... కూడ చాలవఱకు కారణమగును. అదియును... శిల్పులుమాత్ర మెంతకాలము సారములేని, శృం... లేని సాంకేతిక శిల్పరచనమునందు మదమందఁ... కావున, ఒకనైపున క్రొత్తక్రొత్త విగ్రహములు... మయములు, దారుమయములు, లోహమయములు)... పఁబడుచుండ, మఱొకనైపున శిల్పులు, చిత్రక... కథలను, గాథలను ఉలి, కుంచెతో నిర్మించు... ఇంతనుండి శాక్యముని స్వరూపము వెనుకఁబడి... బుద్ధదేవుఁడు అవలోకితేశ్వరులు, సామంతభద్రులు... భద్రులు మున్నగు ప్రముఖగణపరివారముచేఁ గప్పి... బడును. బుద్ధరూపము సామాన్యమై స్థిరమగును. "... బుద్ధులు" ముద్రాంకితులై (విష్ణుమూర్తికి చక్ర... ములు) వెలయుదురు. ఇట్లు, అమితాభుఁడు ధ... ద్రతో, వైరోచనుఁడు (బుద్ధుని యొక్క యవతారము... చక్రముతో, అక్షోభ్యుఁడు భూమిస్పర్శముద్రతో... సంభవుఁడు వరదముద్రతో, అమోఘసిద్ధి అభయము... బుద్ధుని యవతారములు మూర్తీభవించును. ఇట్ల... కల్పనము బయలుదేఱి మతాభివృద్ధికిని, పురా... గాథలు పెరిగి శిల్పాభివృద్ధికిని పరస్పరము తో... బౌద్ధమతమునకు పోటిగ పౌరాణికయుగమున... మతము మించిన నేర్పుతో విజృంభింపసా... మీఁద సత్యాగ్రహము చూపి యింతకాలము... యున్న బౌద్ధధర్మమును తనలోఁ గలుపుకొనుటకు... మతము విశ్వప్రయత్నమున కుద్యమించెను. ... రంభమున విజయహస్తము హిందూమతమునకే... బౌద్ధధర్మములు హిందూశాస్త్రములో ప్రశస్తముగ... నారంభించెను. బుద్ధుఁడే విష్ణువు యొక్క... మూర్తిగ పరిగణింపఁ బడెను. శివుఁడును... వొకటియే, వేఱు కాదనెడి "బోధసత్త్వము... దేశెను. శైవమతము, బౌద్ధమత మభేదరంజకము...

రాంతః ప్రవేశము గలిగి వర్తిల్లఁజొచ్చెను. శాక్యముని క్రమేణ శివునియవతారముగ, యోగీశ్వరుఁడుగ, తుదకు పురాణములలోనికి వచ్చునప్పటికి విష్ణుని యవతారముగ మారిపోవును. ఈమార్పులతోపాటు "నిర్వాణము"యొక్క మొదటిసంగతికూడ మారిపోవును. గీతలలోని "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" యనెడి వాక్యమును స్మృతిపథమునకుఁ దెచ్చునట్లు, నిర్వాణగతుఁడైన బుద్ధభగవానుఁడు లోకసంగ్రహార్థము అవతారములు దాల్చునట్లుగ, "న బుద్ధః పరినిర్వాతి న ధర్మః పరిహీయతే" యని నిర్వాణసిద్ధాంతము పరిణామమునందును. మఱియు నొక వైపున బౌద్ధగుహాలయందు 1000బుద్ధమూర్తులు చెక్కఁబడుచుండ, మఱొక వైపున శివసహస్ర నామావళి, విష్ణుసహస్ర నామావళి రచింపఁబడుచుండెను. స్తూపములకు సమానాంతరముగ లింగప్రతిష్ఠ, బౌద్ధవిహారములకు దేవాలయములు, బుద్ధవిగ్రహములకు శివకేశవులు-ఇట్లు బౌద్ధమతమునకు ప్రతిగ హిందూమతము సమస్తాంగములందును నూతన చైతన్యమును బొంది, క్రొత్త శోభతో వెలువడెను. ఈ రూరతిరుసు వాసరులు సమతోపాటు వెంటఁ గొనిపోయెదు వాలును నాళులుగల దీపప్రశస్తములు ఆనాఁడు బోధివృక్షమునకు చిహ్నముగా వచ్చినవే. ఇట్లు ధ్వజస్తంభములు, మకరతోరణములు, త్రిశూలములు, చక్రములు, దేవాలయములమీఁది 'పసిఁడికుండలు' మున్నగునవి బౌద్ధమతము నుండివానికి ప్రతిబింబములుగ వచ్చినవే! ఇట్లు నూతన ప్రబోధమును గాంచిన హిందూమతము బౌద్ధమతమును తనదిగా చేసికొని, తనలో నైక్యముచేసికొనుటయే ముఖ్యకారణము గానోపు, బౌద్ధమతము హిందూదేశమున శాంతముగ నిర్వాణము చెందుటకు.

హిందువుల తత్త్వమునందు 'సర్వం ఖల్విదం బ్రహ్మ'యనే గాని పృథక్కర్తృత్వము లేదు. ఏకత్వమే గాని ద్వైతము లేదు. అద్వితీయమే కాని ద్వితీయము లేదు. సృష్టినుండి సృష్టికర్త వేరు చేయఁబడుటలేదు. ఈయాధ్యాత్మిక సామరస్యభావముచే సర్వమతములవారి దైవతములు హైందవ దైవతానీకములోనికిఁ జేర్పఁబడును. మొదట ముగ్గురయిన వైదిక దేవతలు 33 గ్గురయి, కాలక్రమమున 33 కోట్ల దేవతలుగఁ బరిణమింతురు. అంతే సృష్టియంతయు సృష్టికర్తయొక్క రూపము-చిహ్నము. ఈయభేద ప్రతిపత్తిచే మొదటి ప్రకృతిపురుషులు శివశక్తులుగ, తర్వాత అర్ధనారీశ్వరరూపముగను, శివకేశవులు హరిహరరూపముగను పరిణమింతురు.*

## గుప్త యుగము

ఈప్రకారము నూతన చైతన్య ప్రబోధములను గాంచి పునరుద్ధృతమైన హిందూమతము బౌద్ధమతము యొక్క స్థానము నాక్రమించి, గుప్తచక్రవర్తుల యనుగ్రహోదరములకు పాత్రమై, మిగుల ప్రాభవముతో వికసింపఁజొచ్చెను. ఈకాలమునందే సకల విద్యలయందును, శాస్త్రములందును, వృత్తులయందును, సాంఘిక జీవితమునందును గొప్పసంచలనము కలిగినది. రాజ్యము నల్దెసల వ్యాపించెను. వాణిజ్యము ద్వీపాంతరములతో జరుగుచుండెను. వివిధజాతులవారు, వివిధమతములవారు ద్వీపాంతరముల నుండి వచ్చిపోవుచు హిందూమతమునందు క్రొత్తసంగతులను జేర్చుచుండిరి. జాతులపరస్పర సాంకర్యము ప్రబలముగ నుండెను. ఈయుగమునందే వివిధశాస్త్రవిజ్ఞానకావ్యకళాసంపత్తి వికసించెను. దానితోపాటు పురాణములు, స్మృతులు, ధర్మశాస్త్రములు సంస్కరింపఁబడినవి.† ఇట్లు సకలవిషయములందు నభ్యుదయము మహోదయం బగుటంజేసి గుప్తచక్రవర్తుల కాలమునను (క్రీ. శ. 400 - 700) స్వర్ణయుగమని (the Golden Age of India) చరిత్రప్రసిద్ధమయ్యెను. ఈయుగమున శిల్పకళావైభవము వాఙ్మయవికాసముతోపాటు మహోన్నత స్థితికి వచ్చెను. ఈ యుగమునం దావిర్భవించిన శిల్పము

* The syncritistic tendency of the Hindu mythology is a most powerful factor on formation of Indian Gods.—Prof JACOBI.

† ఇట్టి సాంకర్యమునకు వెఱచియే కాఁబోలు, సముద్రయానము, పరదేశగమనము మున్నగు నాచారములు కాలమునుండి నిషేధింపఁబడినవి.

# ఆకస్మిక ఛాయా చిత్రములు

## (SNAP SHOTS)



అమ్మో!!

శ్రీ సి. యస్. శేషాచలంనాయుడుగారి ఛాయాచిత్రము.

(మొదటి బహుమానము)



చిట్టినాన్న !

శ్రీ ఏ వి. అప్పారావుగారి ఛాయాచిత్రము.

(రెండవ బహుమానము)



౮. ఏకాంతము

శ్రీ ఏ. యస్. గోవిందరాజుగారి ఛాయాచిత్రము.



౯. 'మురళి'



'ఇంకాచేపురు రాలేదు'

శ్రీ బి. ఓ. పట్టాభి రామరావుగారి ఛాయాచిత్రము.
(మూడవ బహుమానము)



'విశ్వరూపము'

శ్రీ యం. సుబ్బారాయడుగారు పంపిన
ఛాయాచిత్రములు.

బూలఁ జల్లినయట్టిరసాలశాఖ
రాల రువ్విన స్వార్థపరాయణుండు
నరుఁడు యాచించు నీకరుణారసమ్ము!

౨౯

నుడుల కమ్మనకపురంపువిడెము చేతఁ
జూడ్కి తిన్ననకాటుక సొగసుచేతఁ
దలఁపు చల్లనముత్యాల దండచేత
నలవడినఁ జాలు సృష్టిరాజ్యమ్ము నాది!

౩౦

ఇంత వెగటై విడంబించు హృదయసీమఁ
బూలదండల వరుసలఁ గీలుకొల్పి
కులుకుచును గాని క్రొవ్వాఁడి వలపు దూఁగ
నవ్యరాగాన నశ్రు కణాలు రాల
జిల్లుజిల్లునఁ దేనియ చిలుపలార
నంతలో సౌమనస్యమ్ము నందఁగలనె?

౩౧

మృదుపదమ్ముల మడతలఁ బొదివి, చూడ్కి-
తీవయల్లికలందుఁ గదించి, నగవు
పూఁత నిమిడిచి, కన్నీటిబొట్ల డాఁచి,
కలదు కలదని యఖిలజగమ్ము సెప్ప
హృదయమో ప్రభూ! యెవఁడుగుర్తింపఁగలఁడు?

౩౨

పండుటాకునఁ బారాణిపస నలంది
తొందరను ముక్కు-రంగేని దుముక కుండఁ
జదువుచున్నది యీశుకశాబకమ్ము
తడవతడవకు-రసగర్భితమ్ము లయిన
భావిఫలముల కథ లిందు వ్రాయఁబడెనె?

౩౩

తొగరు చిగురాకు గుత్తుల తోరణాలు
మధువనమ్మునఁ గొమ్మకొమ్మలను గట్టి
యడుగులకుఁ బూవు రేకులమడుఁగు లొత్తి
కరడుగట్టిన తేనె యోగిరము వెట్టి
తేఁటి నటు లాదరించి గుర్తింతు వేల?
కడు మనోహారిమే దీని కాఱురూపు?
చెవులపండువయే దీని జీరపాట?

౩౪

తేటకెరటాల పయ్యెద దిద్దుకొంచు
తమ్మిరేకుల కనులు విదల్చికొంచు
నలరు నీ తెలినీటి పాయంపు కొలను
లోలతఁ గలంతపడు దీనిలోఁతు లెఱుఁద
నిరవుకొనుచుంచు చిక్కుల నెవ్వఁ డెఱుఁగు?

౩౫

కనులముంగలఁ దీవియకొనల విరియు
చిన్నిపూవులలోఁ దేనె చిలుప లూర
సృష్టి విరియు భవద్వికసిత విశాల
చారుహృదయసుమ ప్రవేశమున నమృత
ధారల పరంపరలు జాలువాఱు టరుదె?

౩౬

క్షణము నిల్కడ లేని యీసంజ కింత
మురువువన్నెల వేసాలు పూఁత లేల?
స్థిరతరమ్మైన రాత్రి కీదిగులు కొల్పు
మసక తెర లేల? చీఁకట్ల మాటు లేల?

౩౭

లలిత బాహువసంత పల్లవులఁ బొదివి
చివురులే మేపి నన్నింతఁ జేసినావు

తరతరమ్ముల నీమేలు మరువలేక
పాడుదును గాని కోకిలస్వరను గాదు.

౩౮

రాగమున దువ్వ నీదుకరమ్ము నీక
మురువు లొలికింప నాయరమోడ్పు కనుల,
రెక్కముడుపులఁ దగ సవరింతుఁ గాని
పలుకులు రచింపలేను రాచిలుకవోలె.

౩౯

ఇంతపని నడిపెడి నమాయికపు వ్రేళ్లఁ
గూర్చెదవు చెలీ! మందార కుసుమమాల
చెలఁగని మదీయ కుటిల హృత్సీమకంటెఁ
గదలెడు త్వదీయ కుటిలాలకములు మేలు.

౪౦

పులకరించెడు నుమ్మెత్తపూవుఁ జూచి
యింత వలపేని లేని యాకృతికి భ్రమసి
రాగమే లేని మేని నైర్మల్య మరసి
భ్రమరి! మధులేశమున కాసపడెద వేమొ
చల్లగా వినుము దీని విశాలముఖము
కంటకావృత విషఫలాకరము సుమ్ము!

౪౧

గాలి కదలిక సుమధుర గానరసముఁ
జిలుకుతంత్రుల హృద్బాహ్య సీమ విడిచి
నిశ్చలమ్మయి యావీణె నిదురవోవ
మ్రోఁగఁజాలని యావాడుపోఁగు లెల్లఁ
బొట్టలో డాఁచికొని తలముక్కనీట
నీవెడఁగుతూఁడు గడగడ నేల వడఁకు?

౪౨

పలుతెఱంగులఁ దడఁబడి ప్రాఁకులాడి
భూజమును గౌఁగిలించి యాజాజితీవ
విడిసపూవుల మోదాశ్రు బిందుతతులు
ప్రేమ తళుకొత్తఁ దన్పదసీమ రాల్చు
నిలువుపాటున వెఱగంది నిలుచుఁ గాని
మారుసేతఁ దలంప నీ ప్రూనికొమ్మ.

౪౩

తరుణశాఖాగ్రధర్మ సౌధమ్ము లేదు
నవ్యపల్లవ సింహాసనమ్ము లేదు
కలసి పులకించు పుష్పకోమలులు లేరు
తనరు లీలావిహార భూస్థలులు లేవు
బురదఁ దిరుగాడు నీతమ్మి, పూలరేఁడు!

౪౪

రేకు రేకులఁ దెలితళుక్కు ప్రాఁకులాడ
నగుచుఁ గమ్మనినూర్పులు బుగులుకొల్పఁ
బెదవిఁ దెఱచినయంత నే రదనపంక్తి
మల్లె లయ్యెనె, కమ్మనిమాట తేనె
బొట్టు లెడనెడఁ దులకించి పాడమనున్న?

౪౫

సుందరమ్మయి, విమలమై, సున్నితమయి,
సరసమై, మధురమయి, విశాలమగుచు
విరియు క్రొవ్విరిలోన నాప్రేమ డాఁచి
హాయి నిదురింపఁబోక బ్రహ్మాండ మెల్ల
నరయుచున్నాఁడ నొక హృదయమ్ము కొఱకు.

౪౬

ఏను నినుగూర్చి నా గళ మెత్తి పాడ
జాలుజాలుగఁ దూఁగు తచ్ఛబ్దతతులు
చెట్లఁ బూరేకుసందులఁ జిక్కువడను
మలలకొన లంటి వెనుకకు మరలిపోవు
కడలి తరఁగల నురుఁగులఁ గరఁగిపోవు

వలచుచిఱుగాలికౌఁగిటఁ బట్టువడెదు
నక్కటా! యిన్ని యంతరాయములు దాఁటి
యీపలుకు లెల్ల నీచెవి నెట్లు పడును?

౪౭

గాలిలో గచ్ఛపాదవోలె గలగలమను
చప్పుడుల నిండికొనియె నీజగము నీను
పిల్లమెలుఁగున నే నాలపించుపాటఁ
దొడరి యీవేళ శ్రుతి దేనితోఁ గదింతు?

౪౮

నసుకు బూసుకులఁ దడబడు నాదుపాట
చైత్రకలకంఠగాన సుస్వరముకంటె
మధురమా? చిలుక కొదమల మాటకంటె
స్పష్టమా? పారుసెలయేటి పాటకంటె
సరళమా? మాటి కిట్లు ముస్తాబుసేసి
యింత పనివడి నన్నుఁ బాడింతు వేల?

౪౯

నడల తూనిక మురువుటందంబు దూఁగఁ
గొంగకాళ్ళకు గజ్జియ ల్గూర్చినాఁడ
పలుకు నవ్వడిలో మార్దవమ్ము గదుర
మిసిమిముద్దులఁ గాకికి మేపినాఁడ
నసల రేకులఁ గమ్మవాసనలు పొదలఁ
బెరట మోదుఁగుఁ బన్నీటఁ బెంచినాఁడ
కఠినచిత్తము రసతరంగములఁ గరఁగఁ
గోరి వలపుల వానలు గురిసినాఁడ!

౫౦

వీణపాటను గొంతుక వెలికిఁ గప్పి
తప్పెటల మ్రోఁతఁ బలుకుల తప్పుఁ గప్పి
గజ్జియలసడి శైలివక్రలను గప్పి
భరతమున లక్షణమ్ము లోపమ్ముఁ గప్పి
పాడి నటియింతుఁ గాని, సెబాసనంగ
గళము పైకెత్తి గానసంగతులు దూఁగఁ
బాడలే నొంటి నొకగీత పాదమైన.

౫౧

కాఱుటామని చివురాకు కఱకుకొసల
ముత్తె మై తేలుకొని, విడ్డపూలలోనఁ
దేనె యై చిందు, పండులఁ బానకమయి
జాలువారెడు నేటిరసస్రవంతి
పరభృతమ! నీదు గానప్రవాహమేమొ!

౫౨

పండువెన్నెల పీనెలీవల బిగించి
యా శరత్తున రాత్రికృశాంగి నీదు
పాట కువ్విళ్లుగొని శ్రుతి పదిలపఱిచి
వేచి, నీపాట వినరాక విసువుఁ జెంది
తీవలెచ్చటి వచ్చటఁ ద్రెంచిపోయె
నేఁడు తొలకరిమబ్బుల నీడ నామె
కూర్కు వేళలఁ గోకిలా! కూసె దేల?

౫౩

ముదురుటాకుల ముంగాలు మోపలేదు
మెఱుఁగు క్రిగ్గినపూనీడఁ దిరుగలేదు
గోరువెచ్చని విరితావిఁ దూఁగలేదు
పట్టుమని యొక్క బిగిగీతిఁ బాడలేదు
పలికి మురిపించు నీ సుకవాసి పికము!
పలుచఁ బడి యిట్లు దాని వెంబడియె దేల?
గడుసుటామని కడగొట్టు గాలికుఱ్ఱ!

౫౪

గాలి తరఁగలఁ దేలఁ బద్మాల ముగ్గు
వెట్టుసాలీఁడు చిఱుగాళ్ల వ్రేలికొనల
వలపు నర్తించి యీగంధవహుఁడు నేఁడు
జలకణమ్ముల మాల లంచంబు వెట్టు
తేనె కాసించి యీవెత్తి తేఁటికొదమ
విడీన రేకులఁ బ్రాయోపవేశ మగును!

౫౫

వెండి తళుకుల మెఱకల విప్పులోన
జాలుజాలుగ మంచిముత్యాలు రాల
నలల మెలపుల మేని యొయ్యారమెల్లఁ
దూఁగ నిటు లీఁదకొని తమ్మిత్రోవఁ బోయి
రాజహంసము, కిరి తేనెఁ ద్రావ లేక
వెలితిపడి యిట్లు తూఁ డేల విఱిచి తినను?

౫౬

కమ్మఁదనముల తొలకరి గాలి మూసి
చన్న లే ప్రొద్దుటందపు సన్న రేక
పలుఁరకమ్ముల వన్నెల బయలుపడియె
వలపుచెమ్మల వ్రేఁగైన పదను వెఁదఁ
నడఁగునే యేని గూఢరహస్యమైన?

౫౭

ప్రేమ నమసిన యీశర్వరీగభీర
గర్భకుహరాల నెచట నేకాంతసీమ
సన్నసన్నగ జరుగు మోనమ్ముఁ జూచి
కనలెనో శశి, కాఱుచీఁకటిఫలమ్ము
నమలి చుక్కలగింజల నుమియుఁ గడఁ!

౫౮

హృదయ మాధుర్య మెట్టిదో యెఱుఁగకుండ
వన్నెచిన్నెలఁ బయి పయి వలపుఁ జికె
నవ్వినంతన సంపెఁగ నషకుఁ జిక్కి
చొక్కుపవనుని జూచి కింశుక సుమమ్ము
కనలి నిలువెల్ల జేవురించినది-తప్పె?

౫౯

జిలుఁగు టాడికట్టు చిఱుమడతల విదల్చి
పసక నేలను ముత్యాలు పారఁబోసి
తొగరు చివురులఁ గింజల్కధూళి రేఁగఁ
బూవుటీఱాలలోఁ దూఱి పొదలఁ దారి
వెదకులాడెడు నీగాలిపిల్లఁ గన్న
తల్లి యెటు వోయె నీప్రభాతమున లేచి?

౬౦

విరియు వెన్నెలచే వత్తి వెలుఁగులోన
రేకురేకుల విడఁదీసి రేయియెల్లఁ
బూలగుత్తుల వన్నెలఁ బూసిపూసి
కొనలు చెదిరిన యాప్రాఁకకుంచికులను
దూఱుతోలి ప్రొద్దు సంజను బాఱవైచి
యింతలోనన చిత్రకుఁ డెందుఁ బోయె?

౬౧

చెమటఁ గింజల్కగంధంబు చిత్తడివడ
జిలుఁగు పత్రాలమకరికల్ సెదర, మోము
చివురుగుత్తులు పులకించి జేవురింప
గొనబుబొదల నసినూను ననలు రాల
నిలుకడలు డక్కి యడరి కొనులు చలింప
మించి యొండొంటి బిగిఁ గౌఁగిలించికొనెడు
నీలతల ప్రేమతత్వ మింక కెంత కలదో!

౬౨

లీల నోడిఁ బోసికొన్న ముత్యాలు దీసి
యలల పిడికిళ్ల నరిబేసులాడుఁ గనలి

మేదినీశుల మకుటాల మెఱయుఁ గొన్ని
పూరితలనాడి పుడమిని జారుఁ గొన్ని.

౬౩

పగలు పగలాఁడి వలలోనఁ దగులుకొన్న
భాస్కరుని జాడ మో మెఱ్ఱవారఁ జూచి
యాలిగి శశిఁ జేరు తనత్రోవ కడ్డునిలిచి
రేఁగి యెడనెడఁ గికురించి రేపడంతి
కుంతలమ్ముల నడిఁ బోసికొనియె సంజ
ప్రియునికౌఁగిటఁ బూవట్లు విరిసి మురిసి
కుటిలవర్తిని రేయి పక్కున హసించె.

౬౪

రేపకడ నొంటిమై నిదురించునన్నుఁ
దట్టి మేల్కొల్పి, చివురాకుకట్టలెల్ల
విప్పి, నీవాసికొన్న క్రొవ్విరిపటాల
నొక్కటొక్కటి చూపింతు వో సమీర!
మెచ్చికొన నేర్తునే నేను మేలిపనుల?

౬౫

తొంటిమునుమాపు సవ్వడిఁ దొట్రుపడుట
నీదుపాటను నే వినలే దటంచుఁ
గోరి మునుమున్న నీవ వేకువను లేచి
నాకొఱకె నేఁడు పాడుచున్నావె పికమ!

౬౬

జిలుఁగు తొలిప్రొద్దు బంగరు కొలనుమీఁద
పటుల తెలిమబ్బుతునుక రాయంచపిండు
గొనబుటొయ్యారమున నీఁదికొనుచుఁ బోవు!
విరిసె నెచ్చోట గగనారవింద తతులు?

౬౭

సన్న ముంజేతి ముద్దిడు నెలఁత విచ్చు
కెంబెదవిలోని నుడులు వార్తికము లట్టు
లేతికొంచవు! నీ తీపి నెన్నికొన్న
చక్కెరలకంటె మధురరసమ్ములందు
వెలయునే నాఁడునాఁటికి? వెఱ్ఱిచిలుక!

౬౮

ప్రియునికై కాఱుచీఁకటి వీథిలోనఁ
దిరుగులాడుచుఁ ద్రోవ గుర్తింపలేక
తడఁబడెడు నే విరహిణీపదమ్ము దగిలి
యొలికెనో, రాగ మీసంజ నోఱసి పాఱు!

౬౯

సన్నచీరముసుంగున జాఱుకురుల
పాయలను బొండుమల్లెల వరుసలదర
నవ్వొలికి మొగమ్ము నిశి పొలయల్కఁ బోవు
నానిశాంగన భుజము కరాన నిమిరి
సరససంభాషణమ్ముల శశి రచించు
తద్రసగ్రహణాసక్తిఁ దగిలిపోలు
నఖిలవిశ్వమ్ము నిశ్శబ్దమై తనర్చు.

౭౦

తొడరి తెలిమబ్బు రాళ్లసందులను నడచి
పోవు పసిచందమామ! నీత్రోవఁ జూచి
కొనవు? చిఱునందిటఁ గదించి కొన్నకందు
పాలగిన్నియ తొణఁకెఁ బై పై నటించు
నురుఁగ లీరెల్ల నేలలఁ దొరఁగి పాఱు.

౭౧

ప్రొద్దుపొద్దునఁ గమ్మని పూలతావి
మొత్తముగ ముత్తెముల వెలఁ బోసికొన్న
కగువలీ! నేఁడు దాపరికమ్ము లేని
పూవు లెచ్చోట నిడు? వెలఁ బోసికొందుఁ
దావి, నాకడ నిన్ని ముత్యాలు గలవు.



# "నేనిల్లా వుండడానికి కారణం"......

కాళ్ళూరి వేంకట రామారావు గారు

త. రా.

## ౧

మధ్యాహ్నం పన్నెండుగంటల వేళ. వైశాఖ మాసం; ఎండలు తీవ్రంగావున్నాయి. మాతమ్ముడు పాలి కాపుని తీసుకుని తోటిముంజెలకోసం వెళ్ళిపోయాడు. గదిలోకూచుని మా ఆవిడా నేనూ కబుర్లు చెప్పుకుంటు న్నాం. ఆవిడ తమలపాకులు చిలకలుచుట్టి యివ్వడానికీ, నేను నమలడానికీ విధీవిరామమూ లేదు. ఇంతలో మా నాన్న "అబ్బాయీ యిలారా!" అన్నాడు.

"ఎప్పుడూ యిలాంటప్పుడే పిలుస్తావు" అని గొణు గుకుంటూ విసుగుతో నేను వెళ్లాను.

"చూడూ! పెద్దపెట్లో మనకీ మళ్లపూడివారికీ జరిగిన దావాలో హైకోర్టు (High Court) తీర్పున కళ్లుంటాయి వెతుకూ, అవికూడా కోర్టులో దాఖలు చెయ్యాలి" అన్నాడు మానాన్న.

"ఎప్పుడూ హైకోర్టు తీర్పులూ, దిగూకోర్టు తీర్పులూ అంటూనే వుంటావు" అని విసుక్కుంటూ పెద్దపెట్టెతీసి కాగితాలు తిరగెయ్యడం ప్రారంభించాను. తాటాకుల పుస్తకాలూ పాతకాగితాలూ లెక్కలేనన్ని వున్నాయి ఆపెట్లో, తియ్యగా తియ్యగా శిథిలావస్థలోవుం డటి పుస్తకం ఒకటి చేతికొచ్చింది. దాన్నిండా ధూళీ, బూజూ, చుట్టుకుని వున్నాయి. అసహ్యంతో "ఛీ! దరిద్రగొట్టు పుస్తకం" అని విసిరికొట్టాను. నేలమీద పడ్డంలో ఆపుస్తకం తెరుచుకుంది. అందులో నాగరీలిపి నాకు కనపడ్డాది. వెంటనే "యిదేదో గొప్పశాస్త్రం కాబోలు"ననుకుని జాగ్రత్తగా తీసి కళ్లనద్దుకుని చదవడం ప్రారంభించాను.

సంస్కృతం అనుకున్న భాష హిందీగా మారి పోయింది. ఏదోశాస్త్రం అనుకున్న విషయం ఒకవిచిత్ర చరిత్రగా మారింది. పూర్వచరిత్రయైన ఒక రాజపుత్ర నారీరత్నము తాను యావజ్జీవమూ అవివాహితగానే వుండిపోవడానికి గల కారణాలు తెలియచేస్తూ వ్రాసిన ఒక వ్రాతపుస్తకంగా చివరకి తెలుసుకున్నాను.

ఆచరిత్ర చదువుతున్నకొద్దీ యింకా చదవాలనే అభిలాషతోపాటు ఆగ్రంథ రచయితయెడల గౌరవం కూడా నాలో హెచ్చిపోయింది. నేను చదవడమైన తర్వాత ఆగ్రంథాన్ని మానాన్నకి చూపిద్దామని తీసు కెళ్లాను. ఆయన దాన్ని చూడ్డంతోటే "అదెందుకు తీశావురా? తాతయ్య కాశీయాత్ర వెళ్లినప్పుడు పట్టు కొచ్చార్రా, అందులో యేవేవో వుండి వుంటుంది; దాచు. "అప్పప్ప శాస్త్రుల్లకి చూపిద్దాం" అని తనలు కున్నాడు. అతని గొడవంతా అయిపోనిచ్చి దానిసంగ తంతా చెప్పి, చదివి వినిపించాను.

అదివిని మానాన్న "ఇదేకో ఉత్తరహిందూస్థా నపురాజకన్య చరిత్ర అయివుంటుందిరా. ఈ కాగితాలన్నీ కాశీచుట్టుపట్లవున్న యేదో చిన్న పల్లెటూళ్లో తాతయ్యకి దొరికాయట. ఆయనపట్టుకొచ్చారట" అన్నాడు.

విషయం చాలామంచిదవడంచేత మనభాషలోకి ఆ చరిత్రాన్ని తర్జుమాచేసి సోదర సోదరీమణుల సంతో

షార్థం సమర్పించుకున్నాను. అసలు పుస్తకంలో ప్రకరణ విభజన లేదు. పాఠక సౌకర్యార్థం నేను అల్లాచేశాను.

## ౨

"ఆజన్మాంతమూ వివాహంచేసుకోకుండా ఒంటి జీవనం గడిపిన వాళ్లు ప్రపంచానికి ఒకవిధమైన వింత పశువుల్లాగు కనబడుతారు. వాళ్లనిచూసేసరికి ఓమోస్తరునిరసనభావం జనసామాన్యంలో కలుగుతూవుంటుంది మిగిలిన జనులందరి ప్రమేయమూ వాళ్లకి అక్కర్లేకపోయినా, ప్రతిమనుష్యుడూ వాళ్ల వ్యవహారాలన్నీ విధిగా కనిపెట్టుతూవుంటాడు. వాళ్లేకారణంచేత వివాహంచేసుకోలేదో పసిపట్టడంకోసం ప్రాణాలనేనా అర్పించేసే మహానుభావులు దేశంలో వున్నారు

"ఆగర్భ బ్రహ్మచారుల ముఖాలని వెలిగే దివ్యతేజాన్ని చూసి ఆనందించేబుద్ధి సామాన్యుడికి తోచదు. కాని వాళ్ల రహస్య జీవనదుర్గాన్ని భేదించాలనే పట్టుదల నిముషంలో తోస్తుంది. ఒకవేళ ఆ రహస్యాలని కనుక్కోలేకపోయినా ఏవో కారణాలుమాత్రం చిటికెలో కల్పించేస్తారు. "డబ్బూగిబ్బూ లేని యీ మొహానికి పెళ్లేమిటి" నీ "లోకంలో గొప్పకోసంగాని మనఃపూర్తిగా బ్రహ్మచర్యం ఎవరు చెయ్యగల" రనీ, "ఈ అందాన్ని చూసి పెళ్లెవరుచేస్తా"రనీ యిల్లాంటి కారణాలకి లోటులేదు. కొన్ని విషయాల్లో పైకారణాలు నిజమైనా, ఏ విధాన్నీ లోటులేనివ్యక్తి వివాహంచేసుకోకపోవడానికి కారణం తేల్చాలంటే, ఆ వ్యక్తియొక్క జీవితాన్ని శ్రద్ధతోనూ ఓర్పుతోనూ పరిశీలించాలి. న్యాయబుద్ధికూడా యిందుకు చాలా అవసరం. అంతే కాని తొందరపడి నిర్ధారణచేసినట్లయితే లోకంలో అసత్యప్రచారంచేసిన ద్రోహులై వుంటారు.

"అయితే అంత ఓర్పుతో పరిశీలించేవారు చాలా అరుదు. నేను పరువుగల రాచకుటుంబంలో పుట్టిన దాన్ని. జయపురదుర్గాన్ని సంరక్షిస్తూ యజమానుడి కోసం మా తాత తనపవిత్ర రక్తంచేత భూమినితడిపివేసిన మహావీరుడు. సమస్తైశ్వర్యాలూ, మహోన్నతపదవీ, అక్బరుచక్రవర్తి తనకు సమర్పిస్తానన్నప్పుడు, వాటిని తృణప్రాయంగా కాలదన్ని, పేదరికాన్ని వరించి, రాజకులభూషణుడైన రాణా "ప్రతాపసింహు"ని కుడిచేయియై, అనేక యుద్ధాల్లో జయంసంపాదించిన రాజభక్తుడు మాతండ్రి. ఉత్తరహిందూస్థానంలో మా వంశీయులు పోరాడి పేరొందని యుద్ధమే లేదు. "రాణా ప్రతాపసింహు"ని దక్షిణపార్శ్వంలో కూచుని సహాపంక్తిని విందారగించే గౌరవం మాకుటుంబానికే వుంది.

"అటువంటి రాచవంశంలో జన్మించిన నేను వివాహంచేసుకోకుండా వుండడానికి ప్రజల్లో ముందు ముందు అనేకసందేహాలు బయలుదేరవచ్చును. ఆకారణం చేత ఒకప్పుడు నిర్మలమైన వంశానికి కళంకంకూడా వొస్తే,రావొచ్చు. అలాంటి ఆపదనుంచి మాకుటుంబాన్ని రక్షించాలనే వుద్దేశంతో నేనిల్లా వివాహంచేసుకోకుండా వుండిపోయినందులకు గల కారణాలు వ్రాస్తూన్నాను. అంతకిమించి వేరే విశేషం యేమీ లేదు."

## ౩

"అక్బరుచక్రవర్తిపరిపాలన. సమస్తక్షత్రియదేశాధీశ్వరులూ మొగలు సామ్రాజ్యానికిచేతులు జోడించారు. ఒక్క రాణా ప్రతాపసింహుడుమాత్రం కొద్దిమంది అనుచరులతో అక్బరుకి పక్కలో బల్లెంలాగు లొంగకుండా వున్నాడు. రాణావారి కోటలన్నీ మొగలులచేతుల్లో పడిపోయాయి. అతని ధనాగారాలన్నీ ఢిల్లీకి తరలిపోయాయి. రాజపుత్రసింహానికి నిలవడానికి నీడలేదు. రాత్రేసి పగళ్లు మహారణ్యాల్లో పరుగులెత్తి ఏకొండ, గుహల్లోనో తలదాచుకోవలసివచ్చేది."

"అనుచరుల్లో చాలామంది ఆకష్టాలకోర్వలేక అతన్ని విడిచిపెట్టారు. కొందరు అక్బరుచక్రవర్తి కొలువులో చేరి భోగాలనుభవిస్తున్నారు. మాతండ్రిని తనవద్దకు రమ్మని మొగలు చక్రవర్తి చాలా కబుర్లు పంపాడు. జాగీర్లూ, సైన్యాధిపత్యమూ యిస్తానన్నాడు. కాని మా నాయనగారు దుర్నిరీక్ష్యప్రతాపుడగు రాణా ప్రతాపసింహుని కష్టకాలంలో విడిచిపెట్టి శత్రుకోటిలో చేరే రాజద్రోహికాలేదు.

"రాహావారితోపాటు మేంకూడా అడవుల్లోనే వుంటూవుండే వాళ్లం కొండగుహల్లో నిద్ర. ఏఅర్ధరాత్రి వేళ శత్రువులొస్తున్నారని తెలిసినా అప్పటికప్పుడే ఆచీకట్లోనే యింకోచోటికి ప్రయాణం. రాళ్లూ, ముళ్లూ మాకే లొంగిపోయాయి. చీకట్లలో చూడ్డం మాకలవాటైపోయింది. భయంకరమైన వడితో ప్రవహించే కొండ గెడ్డలుదాటేటప్పుడు కాళ్లుజారి మా అనుచరులలో ఎందరుపడిపోయేవారో లెక్కలేదు. చెవుడుపరుస్తూ వుండే ఆగెడ్డలహోరులో మాకు మనుష్యులు పడిపోయే శబ్దంవినిపించేదికాదు. ఇల్లాంటికష్టాలు మేము పడుతూ వుండేవాళ్లం.

"ఇంతలో వానకాలం రావడంవల్ల కొంతకాలం యుద్ధం మానవలసివచ్చింది. వర్షాకాలంలో మొగలు సైనికులు అడవుల్లోకిరారు గనుక మేమొక కొండలోయలో పెద్దకుటీరం నిర్మించుకున్నాము. మానాయనగారి కింద వుండే పరివారమంతా మాకుటీరానికొక అరమైలుదూరములో నివసిస్తూవుండేవారు. రాణావారి శిబిరానికీ మాకూ మధ్య ఒక మహారణ్యంవుంది. మాకూవారికీ యిరవైమైళ్లదూరం.

"మా నివాసానికి ముందుండే గెడ్డ బ్రహ్మాండమైన ధ్వనితో ప్రవహిస్తూవుండేది. లేళ్లగుంపులు మాయింటిచుట్టూతిరిగి గంతులేస్తూ వుండేవి. సూర్యోదయం అవుతూవున్నప్పుడు, ప్రాతఃకాలమలయానిలాన్ని యనుభవిస్తూ, అనేకజాతుల అడవిపువ్వులుగుప్పే సువాసన భోగిస్తూ కోడెతాచులు నిశ్శబ్దంగా సంచరిస్తూవుంటే నదురూ బెదురూ లేకుండా చూస్తూవుండేవాళ్లం. ఆపాములంటే మాకు సంతోషమే కాని భయంవేసేదికాదు. దూరాన్ని గిరిగహ్వరాలలోనించి తరుచుగా సింహగర్జనలు వినబడుతూవుండేవి, అలాంటప్పుడు మావేటకుక్కలు రోషావేశంచేత గొలుసులు తెంపేస్తాయేమో అన్నంత బింకం చూపించేవి.

"పగలు ఆనందంగానే వున్నప్పటికీ రాత్రి అయే సరికి మాత్రం ఆమహారణ్యాన్నిచూస్తే భయంవేసేది. ఒక్కొక్క పెద్దపులి బొబ్బ పెట్టిందంటే పర్వతసీమలన్నీ గగ్గోలుపెట్టి మారుమోగేవి. మాయింటిచుట్టూ నమ్మకమైన సేవకులు పహరా యిచ్చేవారు. కుక్కలకి జడిసి అడివిజంతువులాట్టే చొరవగా కుటీరందగ్గిరకివచ్చేవి కావు.

"వానకురవగానే కొండగెడ్డలన్నీ ఒక్కసారుగా పొంగిపోయేవి. నేను గెడ్డఒడ్డునకూచుని ప్రవాహతీవ్రాన్ని చూస్తూ వుండేదాన్ని. కాలుజారికాబోలు అడివి పందులూ, జింకపిల్లలూ అందులోనుంచి కొట్టుకుపోతూ కనిపించేవి."

౪

"వర్షాకాలం వెళ్లిపోవచ్చింది. గెడ్డల్లో నీరు తగ్గింది. ఆకాశం సాధారణంగా నిర్మేఘమై, నిర్మలమై వుంది. ఇంక కొద్దిరోజుల్లో మేము మాప్రస్తుత నివాస స్థలాన్ని వొదిలేసి వేరొకచోటికి వెళ్లాలని నాయన గారు అంటూవుండగా విన్నాను.

"ఒకనాడు మానాయనగారు రాణావారితో మాట్లాడాలనివెళ్లి, రాత్రి కేవేళకైనా వస్తానని చెప్పివుండడంచేత ఆయనకోసమని యెదురుచూస్తూ నేను మా వాకిట్లో ఒకచాపరాతిమీద కూచున్నాను.

"సాయంకాలం. సూర్యాస్తమానమై రెండుమూడుగడియలకంటే ఎక్కువకాలేదు. ఆకాశం నిర్మలమై కొద్దిపాటి నక్షత్రాలతో ప్రకాశిస్తూంది. త్రయోదశీ చంద్రుడు మనోహరకాంతితో అరణ్యసీమలని అలంకరించాడు. అడివిపువ్వుల సౌరభం శాంతంగా హాయిగా వెన్నెట్లో నిండిపోయింది.

"దూరాన్నుంచి గుర్రపుడెక్కలసడి వినబడ్డాది. దారికికొంచెం యెదురుగా వెళ్లాను. మాకుక్కగూడా నాతోనే వుంది. చెట్లనీడల్లోన్నుంచి రెండుగుర్రాలు వస్తున్నట్లుగా కనబడ్డాయి. 'రెండోవారెవరూ?' అని నేను వితర్కించుకుంటూ వుండగానే వారు దగ్గిరకొచ్చేశారు. నేను త్వరగా లోపలికెళ్లి కిటికీలోనుంచి చూస్తున్నాను.




"చెట్లనీడల్లోంచి రెండుగుఱ్ఱాలు......కనపడినవి"

"నాయనగారు ముందు గుర్రందిగి, రెండో అతనికి చేయూతయిచ్చి గౌరవంగా దింపారు. ఇద్దరు నౌకరులు రెండు గుర్రాలనీ తీసుకుపోయారు. గుర్రందిగి వాళ్లిద్దరూ లోపలహాలులో ప్రవేశించి కుర్చీల్లో కూచున్నారు. మాఅతిథికి సుమారు పాతికసంవత్సరాలవయస్సుంటుంది. సలక్షణమైనరాజఠీవి అతని ముఖాన్ని తాండవిస్తుంది. చిన్నప్పుడెప్పుడో అతనితో కొద్దిగా పరిచయంవున్నట్లు నాకు తోచింది. కాని సరీగాజ్ఞాపకం చాలిందిగాదు. ఒకగంట మాట్లాడుకున్న తరువాత యిద్దరూ భోజనాలకి లేచారు."

"తర్వాత నన్నుపిలిచి మానాయనగారు నాకు మా అతిథినిచూపించి "అమ్మా! చూడూ, ఇతన్నెరుగుదువా?" అన్నారు. నేను పోల్చుకోకపోవడం చూసి ఆయనే మళ్లా "మన 'జయసింగ్, కొడుకు, హరిసింగు, నెరగవూ? చిన్నప్పుడాడుకునేదానివికావూ?'అన్నారు. అప్పటికి నాకు కొద్దిగా జ్ఞప్తికలిగి ఒక్కసారి మా అతిథిముఖం పరికించాను. "మేము చిన్నప్పుడు కలిసిమెలిసి ఆడుకున్న వాళ్లమేము. మాకూ వాళ్లకీ యేదో దూరపుబాంధవ్యంకూడా వుంది. అయినా ఆ రోజులుగడిచి ఎన్నో సంవత్సరాలవడంవల్ల యువజన సహజమైన సిగ్గు నన్నావరించి అతనితో వెంటనే మాట్లాడనిచ్చిందికాదు. కాని అతడేముందుగా "శ్రీ--, చిన్నప్పటి మనగుర్రపుస్వారులూ, ఆటలూ, అన్నీ మరిచిపోయావా ?" అన్నాడు.

బాల్యంలో సుపరిచితమై, ప్రియతమమైన ఆ కంఠస్వరము వినేసరికి నాశరీరం ఆనందపులకాంచితమైంది. అతన్నిచూసి చాలాకాలమైనప్పటికీ ఒక్కక్షణంలో మాచిన్ననాటిరోజులన్నీ తళుక్కున నా జ్ఞప్తిలో మెరిశాయి. బాల్యస్నేహితులమై చిరవియోగానంతరాన్ని మళ్లా కలుసుకోవడంవల్లనో, ప్రియజనసహవాసం చాలారోజులనించీ దూరమైపోవడంవల్లనో, ఏకారణమోకాని ఆతని మాటలు నాకనంతమైన సంతోషాన్ని కలిగించాయి. కాని యింకా సిగ్గు నన్ను పూర్తిగా విడిచిపెట్టలేదు. ఎలాగో ధైర్యం తెచ్చుకుని జవాబుచెప్పకపోతే మర్యాదకాదని "అన్నీ మరిచిపోలేదు" అన్నాను.



"తరవాత చాలాసేపు మానాయనగారాతనితో మాట్లాడుతూ వుండగా నేనక్కడే వింటూ కూచున్నాను. హరిసింగుతండ్రి మొగలులతో యుద్ధంచేసి చనిపోయాడనిన్నీ, అక్బరుచక్రవర్తివారి రాజ్యమువశపరుచుకోవడంవల్ల ఆతడిల్లారావలసి వొచ్చిందనీ వారి సంభాషణవల్ల నాకు తెలిసింది."

"హరిసింగు తండ్రి మా నాయనగారి బాల్యస్నేహితుడు. ఇద్దరూకూడా రాణావారిసేవలో తలనెరిసినవాళ్లే. రాణా వారాతని చావు విని చాలా విచారించారు. హరిసింగు అప్పటినుంచీ మాయింట్లోనే వుండిపోయాడు.

"ప్రథమసందర్శనలో ముప్పుకున్న సిగ్గు నన్ను క్రమంగా వొదిలింది. బాల్యస్నేహితులం కాబట్టి నేను హరిసింగుదగ్గిర మామూలులాగే చనువుగా తిరిగేదాన్ని. ఎప్పుడు చెప్పుకున్నా మాచిన్నతనపు ఆటలూ, అప్పటి సరదాలూ, ఆసౌఖ్యాలే మాట్లాడుకునేవాళ్లం. 'అల్లాంటి రోజులు మళ్లారావడం దుర్లభంకదా' అనుకునేవాళ్లం. దేదీప్యమానమైన తేజంతో వెలిగే రాజకుటుంబాని కొచ్చినదీనదశే మామనస్సుల్ని కలిచివేసేది. మొగలుసైనికులవల్ల దుర్గమారణ్యాల్లోకి తరుమబడిన క్షత్రియకుటుంబాలు పడేకష్టాలు చెబుతూ హరిసింగు అశ్రువులురాల్చేవాడు.

"రోజూదగ్గిరకొండల్లోకి షికారుగా వెళ్లేవాళ్లం. హరిసింగు విల్లూ అమ్ములూపట్టుకొని నా సంతోషంకోసమని ఎన్నోవినోదాలు చేసేవాడు. అతను విల్లెక్కుపెట్టినప్పుడు ఆజానుదీర్ఘాలైన ఆబాహువుల సౌందర్యం యెంతచూసినా నాకు తనివితీరేదికాదు. అతనిదగ్గిర నేను కూడా కొంత విలువిద్య నేర్చుకుంటూవుండేదాన్ని.

"ఇల్లారపిసారకమి నెలలోజులుగడిచాయి. ఒంటిగావున్నప్పటికంటె హరిసింగు వచ్చినదగ్గిరనుంచీ నాకు ఉత్సాహం యెక్కువయింది బాల్యస్నేహితుడు రావడంవల్ల నేనదివరకనుభవించే ఒంటరితనం తగ్గిపోయినట్లయింది. మునుపు యేమీతోచకుండా కష్టంగాగడిచే రోజులు యిప్పుడు నిమిషంలో గడిచిపోతున్నాయి.

"ఒకనాడు ఝామురాత్రి దాటింది. ఆవేళ సాయంత్రంనించీ ప్రళయమైన తూర్పుగాలి బయలుదేరి ఆకాశంఅంతా గాఢమేఘావృతమైపోయింది. చీకటిపడ్డాకే తడవుగా చినుకులు ప్రారంభమై క్రమంగా కుంభవృష్టిలోకిదిగింది. ఉరుములకీ, మెరుపులకీ అంతులేదు. ఆవానకి జడిసి ఘాతుకజంతువులు సహితం బైటకి రాలేకపోయాయి. అప్పుడప్పుడొకసింహగర్జనమాత్రం మేఘగర్జనలో కలిసిపోతూవుండేది. మా యింటిపక్కనున్న గెడ్డ దారుణధ్వనితో రాళ్లలో సుళ్లుదిరుగుతూ ప్రవహిస్తూంది. ఆ భయంకరరాత్రి నేటికీ నాస్మృతిలో తోచి శరీరాన్ని జలదరింప చేస్తుంది. మేమెవ్వరమూ గుమ్మందాటి వీధిమొహం చూడలేకపోయాం. పహరా వాళ్లుమాత్రం ఆతుపానుతో కలహిస్తూ నిష్ఠురమైన తమవిధిని నిర్వహిస్తున్నారు. సంవత్సరాల తరబడ్డి జీతబత్యాలులేక, కేవలం రాజభక్తినే ప్రధానంచేసుకొని యిడుములుపడుతూవున్న ఆదేశసేవకుల విధి నిజంగా జాలికరమైనది.

"మాఅందరిభోజనాలూ అయాయికాని యింకా యెవ్వరమూ నిద్రపోలేదు. తలుపులు బిగించుకొని, మధ్యహాలులో మేము మాట్లాడుకుంటున్నాం. ఒక్కొక్కసారి గాలిహోరు మాకు భయంకలిగిస్తూవుండేది. ఆగాలి ఉరవడిని మా కుటీరం గడగడవొణికిపోయేది. పహరావాళ్ల కేకలుమాత్రం అప్పుడప్పుడు గాలిహోరుని మించి వినబడుతూవుండేవి.

"అలాంటి సమయంలో హఠాత్తుగా గుర్రపుడెక్కలసడి వినబడ్డాది. 'ఈ ప్రమాదకరమైనస్థితిలో వచ్చేవారెవరూ' అనుకుంటూ వుండగానే గుర్రం మా యింటిముందే ఆగింది. మా సేవకుడొకచీటి తెచ్చి నాయనగారికిచ్చాడు. అది చదువుకుని ఆవచ్చినయతన్ని లోపలప్రవేశపెట్టమని ఆజ్ఞచేశారు.

"ఆ ఆశ్వికుడు లోపలకొచ్చికూచుని ఒకవరలో యిమిడ్చిన జాబుతీసి మానాయనగారి కందించాడు. ఆయన దాన్ని చదువుకుని కళ్లనద్దుకుని హరిసింగుని చూసి "అబ్బాయీ! రాణావారీరాత్రి అడివిదాటాలనుకుంటున్నారట. కొంతమంది మొగలుసైనికులవంతెన

దగ్గిరవున్నట్టుగా తెలిసిందట. కాబట్టి రెండుజాములు దాటింతరవాత పదిమందితో మనం వారి సహాయార్థం వెళ్లి ఈ అడివిదాటించిరావాలి వింటూన్నావా?" అన్నారు

"ఇంతలో నే మొగలు లెక్కడ కొచ్చారూ?"

"శ్రీవారు యెక్కడున్నారో కనుక్కోవాలని వాళ్లు విశ్వప్రయత్నాలూ చేస్తున్నారు. అందులో ఆశ్చర్యం యేముందీ? అవసరమైతే పోరాడే ప్రయత్నమీమ్మీద బయలుదేరు". అని ఒక సేవకుణ్ణి పిల్చి రెండు ఝాములుదాటిం తరవాత తెలపవలసిందని చెప్పి మా నాయనగారు లోపలికెళ్లారు. హరిసింగుకూడా తన గదిలో కెళ్లాడు. జాబుతీసుకొచ్చిన అశ్వికుడు తిరుగు జాబుతో రాణావారి తావుకి వెంటనే వెళ్లాడు."

## ౬

"నేనుకూడా నిద్రపోదామనుకుంటూ దైవప్రార్థన చేసుకుని మంచంమీద శరీరంవాల్చేను. కాని ఎందు చేతనో కన్ను మూతపడలేదు. గుండెల్లో యేదో భారంగావున్నట్టూ, ఒళ్లుతిరుగుతున్నట్టూ తోచింది. నా ఆలోచనలు చాలాదూరంపోయాయి 'హరిసింగు కూడా వెళ్లుతున్నాడుకదా! ఒకవేళ—యుద్ధంజరిగితే—ఆయుద్ధంలో హరిసింగు హతుడైతే—చేసేదేమిటి?' అనే ఆలోచనకలిగినప్పుడల్లా గుండెలు గడగడకొట్టుకుని బద్దలైపోతాయేమో అనిపించేది.

"ఈ అభిప్రాయం నాకదివరకెన్నడూ కలిగి వుండలేదు. హరిసింగు జీవనంతో నాకు యింతగాఢమైన సంబంధంవున్నట్టు ఆరాత్రి—ఆకబురువినేవరకూ నా మట్టుకునేనేయెరగను! రాణావారికోసం నేనెరిగిన వీరు లెందరు ప్రాణాలను అర్పించలేదు? మరి యితన్నిగురించి మాత్రం నాకు విచారమెందుకూ?' అనుకుని సమాధానపడదామనుకుంటే నా మనస్సు ఎంతమాత్రమూ ఒప్పుకోలేదు."

"హరిసింగు లేకపోతే ఒంటిబడిపోతానేమో అని భయంవేసింది. 'ఇదివరకు అతను లేకుండా ఒంటిగా వుండలేదూ? ఇప్పుడెందుకుండకూడదూ?' అని ప్రశ్నించుకునేదాన్ని కాని తగినజవాబు నాకు కనబడలేదు. ఇదివరకెలాగున్నా ఇకమంచి అతనితోడిదే నా జీవనమని నా మనసులో నాటిపోయింది. ఇదివరకతను లేనప్పుడింటిదగ్గిరమాత్రమే ఒంటిగావుండేదాన్నిగాని యిక ముందతను లేకపోతే ప్రపంచంలోనే ఒంటిదాన్నై పోతానన్న భీతి నన్ను కలవరపెట్టింది.

"అయితే యిప్పుడు కర్తవ్యమేమిటే? ఈ రాత్రి యెటూ వెళ్లొద్దని హరిసింగుతో చెప్పనా? ఎంతపని! రాజకులప్రదీపకుడగు ప్రతాపసింహుని జీవన మాపదలోనుండగా, స్వార్థపరురాలనై అతన్ని వుండిపోమనడానికి నోరాడుతుందా? అతడు సుఖంగా దైవానుగ్రహంవల్ల మళ్లా యింటికిరాకూడదూ? 'అనే అభిప్రాయాలు కలిగేవిగాని ఏవిధాన్నీ మనస్సు సమాధానపడలేదు. 'హరిసింగు మళ్లా యింటికి రాడేమో? జాగ్రత్త!' అని అంతరాత్మ మాటిమాటికీ హెచ్చరిస్తూవుండేది. చివరకీపూర్వాపరసందర్భాలుతర్కించుకుని తక్షణం అతనిదగ్గిరకెళ్లి నాహృదయాన్ని విప్పి చెప్పేయ్యాలని నిశ్చయించాను.

"అప్పటికప్పుడే ఝామున్నరరాత్రి అయింది. వర్షం కొంచెం తెరిపి యిచ్చిందికాని తుపారంపడుతూనే వుంది. మళ్లా ఝంఝవృష్టికురిసే సూచనలు కనబడుతున్నాయి ఆకాశంమీద. అల్లాంటప్పుడు నేనొక కాశ్మీరపు శాలువ ముసుగేసుకుని వెనకదారిని హరిసింగు గదిదగ్గిరకెళ్లాను. కిటికీలోనించి అతడు లోపలపచారుచేస్తున్న



ట్టుగా గ్రహించాను. తలుపు తోసిచూశాను. లోపల గడియవేసివుంది. 'హరిసింగ్' అని పిలుద్దామనుకున్నాను. కాని ఆశబ్దం నా పెదవుల్లోనే అణిగిపోయింది. గుండెలు తీవ్రంగా కొట్టుకుంటున్నాయి.

"ఎలాగో ధైర్యంచేసుకుని మెల్లిగా తలుపు తట్టాను. అతను తలుపుతెరిచి ఆశ్చర్యంతో "ఏమిటీ, శ్రీ—, యింతరాత్రివేళ యిలాగొచ్చావు ఎందుకూ?" అన్నాడు మెల్లిగా. నాకు జవాబుచెప్పడానికి శక్తిలేక పోయింది. ఒకకుర్చీలో కూలబడి తలుపుమూసేయ్యమని సంజ్ఞచేశాను. తలుపుమూసేసి నాకెదురుగా అతడొక కుర్చీమీదకూచుని నాజవాబుకి యెదురుచూస్తున్నాడు. కాని నాకు ముందుమాట్లాడ్డానికి ధైర్యంయేదీ? కొంచె ముసేపుచూసి అతడే నిమ్మళంగా "శ్రీ—, ఏంపనిమీ దొచ్చావు? చెప్పు" అన్నాడు. కొంచెంకుదుటబడి "హరిసింగ్, నేనొచ్చినపని నీతో యేలాగుచెప్పడమో తెలియకుండవుంది. ఇంకొకగంటలో ప్రయాణంవుంది కదూ? అప్పుడు నేనూ నీతోవద్దామనుకుంటున్నాను" అన్నాను.

"నాతోనా? ఎక్కడికి? నేను మళ్లీ తెల్లారకుం డానే యిక్కడికొచ్చేస్తాను కదూ?"

"ప్రస్తుత పరిస్థితుల్ని బట్టిచూస్తే అక్కడ దెబ్బ లాట జరిగేటట్టు తోస్తుంది."

"అయితే?"

"అయితే అంటావేం? జయాపజయాలు ఎవరు నిర్ణయించగలరూ?"

"అవును. నిర్ణయించలేము. అందుకేమంటావూ? (నవ్వుతూ) వెళ్లడంమానేయ్యమంటావా?"

"నిష్కళంక క్షత్రియకన్యక కెవరికీ ఆమాట నోటరాదన్నసంగతి మర్చిపోయావా?"

"ఎరుగుదునులే. హాస్యానికంటే అంతపౌరుష మెందుకూ? చిన్నప్పటి ఉడుకుమోతుగుణం యిప్పుడు పౌరుషంగా మారిపోయింది కాబోలూ? నువ్వక్కడ కొచ్చి యేంజెయ్యదల్చుకున్నావు?"

"నీపక్కనే నిలబడి నీప్రాణానికి అపాయంవచ్చే టప్పుడు నాప్రాణం అడ్డుపెడదామని నావుద్దేశం."

హరిసింగు సాభిప్రాయంగా నావేపుచూస్తూ కొంతసేపూరుకుని "శ్రీ—, నీనిశ్చయం గొప్పదేగాని నువ్వురావడానికి మాత్రంవీల్లేదు" అన్నాడు

"హరిసింగ్! నేను రాకతీరదు. నిన్నువొదిలి వుండలేను"

"నామాటల్లో ఒణుకుపుట్టి మనోగతమైన భావో ద్రేకాన్ని సూచిస్తూంది. అప్పటికి హరిసింగుకి నాహృ దయం పూర్తిగా తెలిసిపోయింది. కుర్చీదగ్గరగా తీసికుని నాచెయ్యి తనరెండుచేతుల్లోనూ పట్టుకొని 'శ్రీ—, యింతభాగ్యానికి నోచుకుంటానని యెన్నడూ అనుకో లేదు. నాపైని నీ అనుగ్రహం కలిగింది. ఇంకనేనుబతికి నాసరే, ఏమైనాసరే విచారంలేదు. నా జన్మ ధన్యమై పోయింది. ఈపాటిదానికి నువ్వుకూడా రావక్కరలేదం దుకూ. రాణావారిని నిముషంలో అడివిదాటించి వొచ్చే స్తాను. నీకటాక్షం వుండాలి కాని నూరుసుంది మొగ లాయీలనైనా లక్ష్యపెట్టను. మళ్లీ తెల్లారకుండా వచ్చేస్తే సరికదా? "అన్నాడు.

"ఆమాటలు నా కమృతధారలై యిప్పటికీ నా హృదయకుహరంలో ప్రతిధ్వనిస్తూవుంటాయి. నాఆం దోళన కొంత ఉపశమించింది. నేను వొస్తానని చాలా సేపు వాదించాను గాని అతడన్నిటికీ సమాధానం చెప్పి ఓడించేశాడు.

"రెండుఝాములుదాటింది. సేవకుడొచ్చి నాయ నగారితో సర్వమూ ప్రయాణసిద్ధంలోవున్నట్టు చెబుతు న్నాడు. ఆమాటలు విని యింక మేము విడిపోవలసిన సమయం ఆసన్నమైనట్లు తెలుసుకుని కుదిపలుకగా సే నిల్లా అన్నాను.

"హరిసింగ్! అరుగో నాయనగారు ప్రయా ణంలో వున్నారు. నువ్వు జాగుచెయ్యకూడదు. నామూ లాన్ని రాణావారిపనుల్లో లోటు జరిగిందంటే నేను భరించలేను. కాని కడసారి మాట ఒక్కటే చెబుతు న్నాను విను. నీప్రేమకి పాత్రురాలనయానన్న సంతో

షం భరించలేకుండా వున్నాను. నీ ఆజ్ఞకి వ్యతిరేకం చెయ్యలేక వుండిపోతున్నాను కాని, నీతోటి చావు కంటె నాకు స్వర్గంలేదు. నువ్వు సర్వేశ్వరానుగ్రహం వల్ల మళ్లా రాగలిగితివా ధన్యురాలనే, అలాగ్గాకుండా వేరేవిధంగా జరిగినా యిప్పుడు నాకు విచారంలేదు. ఎందుచేతనంటే ప్రేమభిక్ష నాశించిన నాకు నీవు దానిని దయచేశావు. ఈ లోకంలో కాకపోతే యింకోలోకంలోనైనా మనంకలుస్తాంకదా! అన్న ధైర్యం నాకుంది. హిందూనారీమణులకి అందులోనూ రసపుత్రరమణులకి పరలోకం చాలా సమీపంగా కనబడుతుంది.

"నీప్రాణాలకి ఒకవేళ ఆపదవొచ్చినా, నాశరీరంలో జీవమున్నంతవరకూ నిన్నే తల్చుకుంటూ, ఏలోకంలో తున్నమానవవ్యాపారాలు మనలని వేరుచెయ్యలేవో ఆలోకంలో నీ పునస్సందర్శనభాగ్యంకోసం నిరీక్షిస్తూ కాలం గడుపుతాను. ముమ్మాటికీ యిదేనిశ్చయం. సర్వరక్షకుడు నీయెడల కరుణాళుడై వర్తించుగాక—"

"మరి మాటాడలేక పోయాను. కంఠం గద్గదికమైపోయి అశ్రుప్రవాహం ఆప శక్యంగాకుండావుంది. అతను నన్ను దగ్గిరగా చేరదీసుకుని నాముంగురులు వెనక్కితోస్తూ" ప్రీ—, ఎందుకీవిచారం? మళ్లీ గడియలో ఒచ్చేదానికి ఖంగారెందుకూ? చాలాధైర్యవంతురాలినని చెప్తూవుంటావే? ఆధైర్యం యిప్పుడెక్కడికి పోయింది? అదుగో అంతాప్రయాణం అవుతున్నారు. సెలవియ్య. అని పోబోతూవుంటే చెయ్యిపట్టుకుని ఆపి ఆమనోహర వదనంవంక చూస్తూ 'హరిసింగ్! నువ్వెంత ధైర్యంచెప్పినా నా కెందుచేతనోగాని బెంగగావుంది. ఏదీ ఒక్కసారి నీముఖందగ్గిర నాముఖంచేర్చనీ' అన్నాను.

"అతడు నన్ను కౌగిలించుకొని – ఒక్కసారి – ముద్దాడినాడు. అదే నేను యౌవనవతినైన తర్వాత – మొదటిసారి – అనుభవించిన సంతోషలాంఛనం. అబ్బా! ఆశరీరస్పర్శ యెంత తాపోపశమనంగావుంది!

"సుర్యోదయాలొచ్చి వాకట్లోవున్నాయి. మానాయనగారూ, హరిసింగూ గాక మరి యిరవైమంది ఆయుధపాణులైన రసపుత్రసైనికులు బైలుదేరారు. వాళ్లు నా

దృష్టిపథాన్నిదాటేవరకూ నేనల్లా చూస్తూవుండి తరవాత లోపలికిపోయాను. చైటప్రమాదంగా వర్షంకురుస్తూనే వుంది. 'రాజాజ్ఞకీ ప్రేమకీ చాలాదూరం' అనుకుని నిరాశతో ఒక్కనిట్టూర్పు విడిచాను."

## ౭

"రాజపుత్రులకి జయంసమకూర్చమనీ, హరిసింగుని సంరక్షించమనీ, సర్వేశ్వరుని చాలాసేపు ప్రార్థించాను. చాలాసేపటికి కష్టంమీదకొద్దిగానిద్రపట్టింది. అందులో అనేకస్వప్నాలొచ్చాయి. భయంకర యుద్ధరంగాలని ఆస్వప్నంలో చూశాను. ఇలాగ ఒకర్ఝాము నేపు జరిగి వుండొచ్చు. ఇంతలో మా నాయనగారు తిరిగొచ్చి నాపక్కనినిలబడి 'అమ్మా' అని పిలిచారు".



"అదే నేను... ...అనుభవించిన సంతోషలాంఛనం".

నేను దువ్వవలేచి 'నాయనగారూ' అన్నాను గాభరాతో సవితర్కంగా. ఆయన విచారపూరితనదనంతో "అమ్మా ఘోరం జరిగి పోయింది. రాణావారు సౌఖ్యంగా అడివిదాటారు కాని మనలో చాలా మంది హతులై పోయారు. హరిసింగు పదిమంది మొగలుల్ని సంహరించి తాను వీరస్వర్గం అలంకరించాడు"అన్నారు.

"ఎన్నదూ దీనత్వంతోనని ఆముఖంలో దుఃఖోద్రేకం స్పష్టంగా కనబడుతూంది. ఆలోచనకళ్లలో రెండు మూడు నీటిబిందువులుకూడా వున్నాయి. నాకా సంగతి పిడుగుదెబ్బలాగైంది. "తెలివితెచ్చుకుని నాయన గారూ! శవాన్ని అక్కడే వుంచేసి మీరిల్లావొచ్చారా? అని అడిగాను".

"లేదమ్మా, తీసుకొచ్చి ఆగదిలో పెట్టించాను. రేపుగాని దహనాదిక్రియలు జరగడానికి వీల్లేదు."

"మా నాయనగారు వెళ్లిపోయారు. హతశేషులైన సైనికులు బసలకి పోయారు. కుటీరంలో—భయంకర నిశ్శబ్దం—మృత్యుదేవత స్వేచ్ఛావిహారం చెయ్యడానికి తగిన గంభీరనిశ్శబ్దం — కుటీరంలో తాండవిస్తూంది."

"ఇంకా ఝామురాత్రి వుంటుంది. వానపోడితగ్గ కుండాకురుస్తూంది. ఒక్కొక్కచోట యేదో మహావృక్షం కూలినశబ్దం ఆనిశ్శబ్దాన్ని చీల్చుకుని వోస్తూవుండేది. నా కేంచెయ్యడానికీ తోచలేదు. నేనుకూడా అరనిముషంలో యీప్రాణాలని విడిచిపెట్టి ప్రాణేశ్వరుని సన్నిధికి పోదామనుకున్నాను. కాని నాచావువల్ల, నామీదే ప్రాణాలన్నీ పెట్టుకున్న నాయనగారిగతి యేమౌతుంది? యౌవనవంతులూ, మహాపరాక్రమశాలులూ, అయిన నలుగురు పుత్రులను తన నిశ్చలరాజభక్తికి బలిచేసి వృద్ధుడై పోయి, నన్నే సర్వంగా చూసుకుంటూవున్న జనకుని కెంత మనఃక్లేశం కలిగించినదాన్ని అవుతాను? అందుచేత నేను మరణించే ఆలోచనకి తావే లేకపోయింది.

"కాని కడసారి హృదయేశ్వరముఖారవింద సందర్శనం చెయ్యాలని బుద్ధిపుట్టింది. ఏగదిలో గంటకిందట ప్రియునితో ప్రేమాలాపాలాడుతూ గడిపానో, ఆగదిలోనే గతజీవుడైవుండగా చూసేటప్పుడు ధైర్యం నిలబడుతుందా? అన్న సందేహం కలిగింది. అనాథపరిపాలకుడైన సర్వేశ్వరుని ఒకగడియసేపు నిశ్చలంగా ప్రార్థించి ఆగదిలో కెళ్లాను.

"అబ్బా! అందులోనిదృశ్యం నేను వర్ణించలేను. హరిసింగు శరీరమంతా గాయాలతోనిండి హృదయవిదారణంగా వుంది. ఆగదిలో మృత్యుదేవత సాక్షాత్కరించి నాకు భయం కలిగించింది. నాకాళ్లు వణికిపోయాయి. నాశరీరమంతా ముచ్చెమటలు పోశాయి. మెల్లిగా హరిసింగుదగ్గర కెళ్లి పక్కనే కూచున్నాను.

"గాయాలతోనిండి రక్తంలో మునిగివున్నప్పటికీ ఆముఖసౌందర్యమూ, తేజమూ కొంచెమైనా తగ్గలేదు. శత్రుంభీకరములై, దుర్నిరీక్ష్య తేజోరాజితములై వున్న ఆకనుదమ్ములు ముకుళీభూతములై వున్నాయి. ఆస్థితిలో ఆవిగ్రహాన్ని చూసేసరికి నాకాతనియందు గల ప్రేమా, గౌరవమూ, ద్విగుణీకృతములై పోయాయి. వీరరసస్వరూపమగు నా శౌర్యనిధి నిర్జీవకళేబరమందు గల భక్త్యుద్రేకంచేత నాహస్తాలు నాప్రయత్నం లేకుండానే జోడింపబడ్డాయి.'

'ఆసమయాన్ని నాలోకలిగినభావాలు వ్రాయబూనుకుంటే పెద్దగ్రంథమవుతుంది. త్వరలో నన్ను నా ప్రియునిచేర్చుమని దీనరక్షకునిగూర్చి కొంతసేపుప్రార్థించి నాచేతివుంగరం హరిసింగువేలుకి పెట్టి, అతనివేలునవున్న వుంగరంతీసి కళ్లనద్దుకుని నావేలుకి పెట్టుకున్నాను.'

'ఆవుంగరం తీసేటప్పుడు హఠాత్తుగా అతడుకళ్లు తెరిచి నావేపు చూస్తూన్నట్లయేసరికి, నాశరీరం రోమాంచితమై గడగడలాడిపోయింది. ఇప్పటికీ—అంటే యీ విషయం రాసేటప్పుడుకూడా ఆవుంగరం నా వేలునేవుంది. ఈలోకంలో మాప్రేమకి నిదర్శనంగా నాహృదయేశ్వరుడు దయచేసిన భౌతిక చిహ్నం అదొక్కటే. ఉదయాన్నే లేచి ఆవుంగరానికి నేను నమస్కారము చెయ్యని రోజు లేదు.'

౨

'రోజులు గడిచిపోయాయి. తా నొకటి తలుస్తే దైవము వేరొకటి తలుస్తాడన్నట్లు హరిసింగుతో నిరా

ఘాటసౌఖ్యాన్ని అనుభవించడానికి సంకల్పించుకుని ఉవ్విళ్లూరిన నా బ్రతుకు కల్లా అయిపోయింది.'



"అతనివేళ్ళ నవున్న వుంగరంతీసి......నావేలుకి పెట్టుకున్నాను."

'హరిసింగు గతించిన రెండుమూడునెల్లకి ఒకనాడు మా నాయనగారు నన్నొక నిర్జనస్థలానికి తీసుకపోయి యిల్లాగన్నారు. 'అమ్మా! నీస్థితిచూస్తే నాకేమీ తోచడంలేదు. హరిసింగుపైని నీకుగల గాఢానురాగాన్ని నేను గ్రహించకపోలేదు. అతనిశవాన్ని దహనంచేసేటప్పుడు అతనివేలున నీవుంగరం కనబడ్డాది నాకు, అప్పుడే మీయిద్దరిప్రేమనీ నేను బోధపరుచుకున్నాను. నీ వింక వివాహంచేసుకోనని నిశ్చయించుకున్నట్లుగా నాకు తెలిసింది. నువ్వు యీ మోస్తరుగా నీజీవన అంతా అతనికే సమర్పించడం నాకు చాలా సంతోషం. పవిత్రప్రేమను వెల్లడించే యిటువంటి ప్రతిజ్ఞలు భారతస్త్రీలకు చెల్లును.'

'కాని ఒక్కసంగతి. నేను కనుక్కున్న సంతానం అంతటికీ నువ్వే మిగిలి వున్నావు. నీ అన్నలుంటే నీగురించి నాకింత విచారం వుండకపోను. వాళ్లు క్షత్రియోచితమైన వీరమరణం పొంది శాశ్వతయశస్సు సంపాదించారు. ఇంక నువ్వొక్కర్తెవే నాకున్న సర్వస్వమూను.'

'నీ సౌఖ్యం చూసినతర్వాత నేను జాగ్రత్తపెట్టవలసిన విషయం యేమీలేదు. ఆ పైని నేను నిర్విచారంగా నీ అన్నల అడుగుజాడలనే పోయి ప్రభువు కోసం యీ జీవనం వొదిలేసి ధన్యత పొందుతాను. నీకు మంచి మంచి సంబంధాలు వొస్తున్నాయి. వాటికి యేం చెప్పడానికీ నీ నిశ్చితాభిప్రాయం కనుక్కుంటేనేగాని నాకు వీలుండదు!'

'అలాగన్నానని నీవు మరోకలా గనుకోవద్దుసుమా! వేసవికాలపు జాహ్నవీతోయములట్లు, నిష్కళంకమై పవిత్రమైన మీ ప్రేమని భంగపెట్టడానికి ప్రయత్నించేటంత దుర్మార్గత నాకు లేదు. నే చెప్పే దేమంటే నువ్వు నవయౌవనవతివి. హరిసింగుని ప్రేమించినమాట నిజమే కాని వివాహం కాలేదు. అట్టి సమయంలో యిప్పుడు నువ్వు వివాహం చేసుకున్నప్పటికీ భగవంతునిదృష్టిలో నీవు అపరాధంచేసిన ట్లవదు అని పెద్ద వాడనైన నా అభిప్రాయం. నిన్ను తగినవరుడికి అప్ప జెప్పి నేను చింత లేకుండా ప్రాణాలు వొదులుతాను'

'అలాగుకాకుండా, వివాహం చేసుకోకుండా, ఆపర్ణప్రాయమై, ధన్యమై, కులినరాహిత్యమైన జీవనం గడపడమే నీయిష్టమంటావా? అందుకు నా అభ్యంతరం యేంతమాత్రమూ లేదు. నా ఆస్తితోపాటు నిన్ను రాణా వారికి అప్పజెప్పేస్తాను. నాతరవాత నిన్ను పోషించేటంద్రి ఆ ప్రభు వొక్కడే నాకు కనిపిస్తున్నాడు. శ్రీవారికి నాయందుండే గౌరవమే నాకటువంటి నమ్మకం గలిగిస్తూంది. కాబట్టి నీఅభిప్రాయం చెప్పు.'

'నాయనగారు భావోద్రేకంతో చెప్తున్నారు. ఎంతో కష్టాల్లోనూ అధైర్యం కనపర్చడం ఆయన స్వభావంకాదు. కాని ఆమాటలు చెప్పేటప్పుడుమాత్రం

కంఠం అప్పు డప్పుడు డగ్గుత్తికపడి మనోగత విషాదాన్ని స్పష్టపరుస్తూంది. అది బయలుపడకుండా ఆయన యెన్ని ప్రయత్నాలో చేశారు. కాని దుఃఖం ఆగలేదు. నాస్థితిచూసి మందరాచల సమానస్థైర్యంగల ఆయన హృదయం కూడా చలించిపోయింది.'

'ఆయన దుఃఖంచూడ్డంతోటే నాప్రాణం కొట్టుకుపోయింది. నా రెండుచేతులూ ఆయన మెడకిచుట్టి 'నాయనా ? ఎందు కీవిచారం ? మీకోసమనే యీజీవనం నిలబెట్టుకుని వున్నాను అందుచేత మిమ్మల్ని వొదిలి పెట్టి వుండలేను. నేను వివాహం చేసుకోకూడదనే నిశ్చయించుకున్నాను' అన్నాను.

'ఇంకాయేవో చెప్పాలని నామనస్సులో వుండేదికాని, నోటమాట వొచ్చిందికాదు.'

* * * * *

'పై సంగతులుజరిగి యిప్పటికనేకసంవత్సరాలు గడిచిపోయినప్పటికీ అల్లాంటి నిశ్చయం మానాయనగారికి చెప్పినందుకు నేనెన్నడూ విచారం పొందివుండలేదు.'



"నాయనా ? ఎందు కీవిచారం ?"

---

## పాళ్లు

కవిభూషణ, శ్రీరాజా వత్సవాయ వెంకటనీలాద్రిరాజు గారు

సార్వభౌముని మహాసామ్రాజ్యధన మెల్ల సమితంబులైన సైన్యములపాలు
దేశాధినాథుల దివ్యస్వ మదియెల్ల రమ్యాంతరీపాంతరములపాలు
మండలాధిపుల యఖండవిత్తంబెల్లఁ గడు న్యాయవాదివర్గములపాలు
కోటీశ్వరకుమార కులద్రవ్య మదియెల్ల గణికలసిలుకుజాకట్లపాలు
పిసినిగొట్టులసొత్తది పెంటపాలు-హోరగలవారి సొమ్మది యోట్లపాలు
సారసారస్వతప్రపంచంబులోన-సుస్థిర యశోధనుని కల్మి సుకవిపాలు.

---

# తా జేసిన తప్పు

కూర్పు: వేణుగోపాలస్వామి, శేషుబాయిగోపాలస్వామి గార్లు

(రష్యన్ గ్రంథకర్త చకోవునుండి తెనిగించబడ్డది.)

మిగూవ్ అనే పేరుగల కలిజిస్టేట్ ఎస్సెసర్, ఒకదినం మామూలు ప్రకారం సాయంకాలంపికారుకు వెళ్తోన్నాడు. దారిలో ఒక టెలిగ్రాఫ్ స్తంభందగ్గఱ ఆగి వేడినిట్టూర్పు విడిచాడు. అంతకు ఒకవారంముందు సాయంకాలం పికారునుండి తిరిగి వస్తోండగా, ఇదివఱకు తనయింట్లో పనిచేస్తోన్న పిల్ల, ఆగ్నెయా, ఆస్థలంలోనే తన్నుకలుసుకొని యిలా ద్వేషంతో అంది.

"కొంచెం ఆగు! చూసుకో. అమాయకురాండ్రగు ఆడపిల్లల్ని చెరిపినందుకు, నీరోగం కుదురుస్తా. ఆపసిబిడ్డను, నీయింటితలుపుదగ్గఱ విడిచిపెడ్తా-నీమీద వ్యాజ్యంవేస్తా-నీభార్యతో చెప్తా కూడాను........"

అయిదువేల రూపాయలు తన పేర బ్యాంకులో వెయ్యమని ఆపిల్ల ఖండితంగాఅడిగింది. మిగూవ్‌కు ఇదిఅంతా జ్ఞాపకంవచ్చింది. నిట్టూర్పు విడిచాడు. ఒకనిమిషంసేపైనా ఆమోహంకోసం తాను యింత ఆదుర్దా, వేదనా పడవలసివచ్చెగదా అని మనఃపూర్తిగాపశ్చాత్తాప పడుతూ, తన్ను తాను నిందించుకొన్నాడు.

తన బంగాళా చేరగానే, విశ్రాంతి కోసం మెట్లమీద కూర్చున్నాడు. అప్పుడు పదిగంటలయింది. చంద్రుడు మేఘాలవెనుకనుంచితొంగి చూస్తోన్నాడు. ఆవీథిలోగాని, ఆబంగళాదగ్గఱ గాని ఒక్క ప్రాణిఅయినా లేదు. ఎండాకాలం సెలవల్లో ఆ ఊరువచ్చే పొరుగూరివాళ్లల్లో ఏళ్లుగడచినవాళ్లు అప్పుడేపక్క లేశారు. పడుచువాళ్లు వనంలోకి పికారుకు వెళ్తోన్నారు. మిగూవ్ సిగరెట్టువెలిగించుకుందాం అని అగ్గిపెట్టె కోసం రెండు జేబులు తడుముకున్నాడు. ఇంతలో తనమోచెయ్యికేదో మెత్తగా తగిలింది. సోమరితనంగా, తనకుడిచేతివైపు చూసాడు. చూడ్డంతోనే, పామును తన ఫక్కన చూస్తే ఎంతభయం వేస్తుందో అంత భయంగలచూపుతో, ముఖం ఎ డుచుకున్నాడు. తలుపుదగ్గఱే మూటొకటుంది. ఏదో పొడుగ్గా ఉన్నవస్తువు. దేనిలోనో చుట్టబడి ఉంది. అది పట్టిచూస్తే ఒక బొంతలాగ కనిపించింది. ఒకచివర ఆమూట కొంచెం తెరిచే ఉంది. మిగూవ్ అందులో తనచెయ్యిపెట్టి చూసాడు. అదిఏమేదో కొంచెం తడిగాను, వెచ్చగాను తగిలింది. భయంతో ఒకగంతు వేసి నిలబడ్డాడు. అపరాధం చేసినవాడు కాపలాకాసే వాళ్లదగ్గఱ్నించి తప్పించు కోడానికి ప్రయత్నం చేసేలాగ మిగూవ్ అటూఇటూ చూసాడు.

"అది విడిచిపెట్టి వెళ్లింది!" అని మహా కోపంతో పళ్లు కొరుకుతూ, గుప్పిళ్లు పడుతూ గొణుక్కున్నాడు. "ఇది యిక్కడపడి ఉంది. ...నే చేసినపాపం యిక్కడపడి ఉంది! ఓదైవమా.

భయంతోనూ, కోపంతోనూ, అవమానంతోనూ స్తబ్ధుడయి పోయాడు......ఇప్పుడేంచెయ్యాలి? తనభార్యకు తెలిస్తే ఏమంటుంది? ఆఫీసులో తనతోపాటు పనిచేసే వాళ్లకు తెలిస్తే వాళ్లేమంటారు? గవర్నరు తన పక్కలో పొడిచి గఫాకొడుతూ "నాకు చాలాసంతోషం అయిందయ్యా...హి—హి—హి—నీ గడ్డం నెరిసినా, నీహృదయం ఇంకా వయస్సులోనే ఉంది......నీవు పచ్చి దొంగవోయ్, సెమ్యాన్ ఎఫ్రాస్టొవిచ్!" అని తప్పకుండా అంటాడు. ఎండాకాలం సెలవల్లో ఆవూరువచ్చిన కూటం అందటికీ తన రహస్యం ఇప్పుడు తెలిసిపోతుంది. బహుశా మర్యాదగల కుటుంబాలలో ఉన్న తల్లులందరూ తన్ను వాళ్ల యిళ్లకు రానియ్యరేమో. ఇటువంటిపనులు ఎప్పుడూ పేపర్లో కెక్కుతాయి. ఈఅల్పస్థితిలో నున్న మిగూవ్ పేరు రష్యా దేశమంతా వెల్లడవుతుంది.........

ఆబంగాళామధ్య కిటికీ తెరిచేఉంది. తన భార్య, అన్నాఫిలిప్పోవ్నా, రాత్రి భోజనానికి బల్ల తయారుచేస్తూ ఉండడం, తనకు స్పష్టంగా వినబడుతోంది. దొడ్డిలో గేటుదగ్గఱ పోర్టర్, ఎర్మొలే, బాలలైకా విచారంగా వాయిస్తోన్న శబ్దంకూడా వినబడుతోంది. ఆ పసిబిడ్డ లేచి ఏడవడం మొదలుపెట్టడమే తరువాయి, రహస్యం బయలుపడ్డానికి. త్వరపడవలె నని మిగూవ్ మనస్సుకు పట్టరానికోరిక గలిగింది.

"త్వరగా, త్వరగా!......" అని గొణుక్కున్నాడు. "ఈనిమిషమే. ఎవ్వరూ చూడకముందే. దీన్ని తీసికొనివెళ్లి ఎవరి మెట్లమీదయినా విడిచిపెడ్తా,........."

మిగూవ్ ఆమూటను ఒక చేత్తోతీసికొని నెమ్మదిగా, ఎవ్వరికీ అనుమానం పుట్టకుండా ఉండడానికి, జాగ్రత్తగా అడుగులు వేసుకుంటూ, వీథి వెంట వెళ్లాడు.........

"ఇది మిక్కిలి అసహ్యకరమైనస్థితి!" అని అనుకున్నాడు, ఏం విచారంలేని మనిషిలాగ ఉండాలని ప్రయత్నిస్తూ. కలీజియేట్ ఎస్సెసర్ ఒకపసిబిడ్డను ఎత్తుకొనివీథివెంట నడుస్తోండడం! అయ్యో దైవమా! ఎవ్వరైనా నన్నుచూసి నాస్థితిగతులు తెలిసికొంటే నాపని అయినట్టే ......ఈ మెట్లమీద దీన్ని పెడ్తే మంచిది... లేదు, ఆగు, కిటికీలు తెఱిచి ఉన్నాయి, బహుశా ఎవరైనా చూస్తోన్నారేమో, దీన్ని ఎక్కడపెట్టను? తెలిసింది! దీన్ని మ్యెల్కిన్ అనే వర్తకుడు దగ్గిఱకి తీసికెళ్తా......వర్తకులు ధనవంతులు, కనికరం గలవారు; బహుశా వాళ్లు దణ్ణాలుపెట్టుకుంటూ దీన్ని పెంచుకోవచ్చు కూడాను."

ఆ వర్తకుని బంగళా చాలా దూరపువీథిలో నదికి సమీపంలో ఉన్నప్పటికీ, మిగూవ్

ఆపసిబిడ్డను మ్యాల్కిన్ ఇంటికే తీసికొని వెళ్లడానికి నిశ్చయించాడు.

"ఇది కేకలుపెట్టకుండా ఉండి మూటలోంచి గిజగిజ కొట్టుకొని బయటపడకుండా ఉంటేను." అని అత డనుకొన్నాడు. "ఇది నిజంగా సంతోషం గలిగించే ఆశ్చర్యమే! ఇక్కడ నేను ఒకప్రాణిని కాగితాల సంచిలాగ చంకలో పెట్టుకొని వెళ్తోన్నా. జీవం గలిగి, ఆత్మగలిగి, అందర్లాగ భావాలు తెలిసిన ప్రాణినే...అదృష్టవశాత్తుగా మ్యాల్కిన్ వీణ్ణి పెంచుకుంటే, వీడు ఏదో ఒకటి అవొచ్చు...ఏదో ఒక ప్రొఫసరో, పెద్ద సేనాధిపతో, గ్రంథకర్తో అవొచ్చు...ఏం జరిగినా జరగవచ్చు! ఇప్పుడు వీడ్ని నేను చేతికింద ఒకచెత్త మూటలాగ మోసుకొని వెళ్తోన్నా, కాని, బహుశా ముప్పయి, నలభయి సంవత్సరాలకి అతనిముందట కూర్చోడానికైనా సాహసపడజాలనేమో..."

మిగూవ్ మనుష్యులులేని ఒకసందులో, నిమ్మచెట్ల కారు నలుపునీడలో నడుస్తోండగా, హఠాత్తుగా తన మనస్సుకు తానేదో ఘోరమైన అపరాధం చేస్తోన్నట్టు తోచింది.

"నిజంగా ఇది ఎంతనీచమైన పని!" అని అనుకున్నాడు. "ఇంతకంటె నీచమయింది మెవరూ ఎఱుగరు........ఎందుకు మనం ఈ పసిబిడ్డను గుమ్మంనించి గుమ్మానికి తిప్పడం? పుట్టినందుకు దాన్దేం తప్పులేదు. అది మనకు ఏహానీ చెయ్యలేదు. మనం తుచ్ఛులం...... మనసౌఖ్యం మనం అనుభవిస్తాం; నో రెఱుగని పసిబిడ్డలు దానికిశిక్ష భరించాలి. ఈ వెధవపని చూడు! తప్పుచేసింది నేను. ముందుఉండే దురదృష్టం వీడిది. నేను వీణ్ణి తలుపుదగ్గఱ విడిచిపెడ్తే, వాళ్లు దిక్కులేని బిడ్డలఆసుపత్రికి పంపిస్తే, అక్కడవీడు కొత్తమనుష్యుల్లో, ఎప్పుడూ ఒకటేమోస్తరుగా ఉండే ఏర్పాటుల్లో పెరుగుతాడు......ప్రేమాలేదు, ముద్దూలేదు, గారాబంలేదు......ఆతర్వాత ఒకజోల్లు కుట్టేవాడి దగ్గఱ పనినేర్పుతారు ...... తాగడం మొదలెడ్తాడు, బూతుమాట్లాడడం నేర్చుకొంటాడు, ఆకల్తో ఉంటాడు. జోళ్లుకుట్టేవాడు! మంచి కుటుంబములో ఉన్న కలీజియేట్ ఎస్సెసర్ కొడుకైనవీడు......వీడు నా మాంసం, నా రక్తం........"

మిగూవ్ నిమ్మచెట్ల నీడలోంచి మంచి వెన్నెలకాయుచున్న రోడ్డుమీదికివచ్చిమూట విప్పి, ఆపసిబిడ్డను చూసాడు.

"నిద్రపోతూన్నాడు!" అని మెల్లగా అనుకున్నాడు. "చిట్టిదొంగా! ఇదిగో, నీకూ నీ తండ్రిలాగే కోటేరేసిన ముక్కుంది......నిద్రపోతున్నాడు. తనతండ్రే తన్ను చూస్తోన్నట్లు తెలియదు! ఇదిఅంతా ఒకనాటకం.అబ్బాయీ సరే, సరే, నన్ను నువ్వు క్షమించాలి. నన్ను క్షమించు అబ్బాయీ......ఇది నీ ఖర్మంలాగ కనుబడుతోంది......"

ఆకలీజియేట్ ఎస్సెసర్ చిత్తరపోయి చూసాడు. చెక్కిళ్లలో నరాలు పాకినట్లు

తల్చాడు. బిడ్డను బట్టలో చుట్టి, చంకకింద పెట్టుకొని నడిచాడు. మ్యెల్కిన్ బంగళాకు వెళ్లే దోవలో అంతా, సంఘానికీ, సంబంధించిన ప్రశ్నలెన్నో తన మనస్సుకు వచ్చాయి. అంతరాత్మ మనస్సులో బాధిస్తోంది.

"నేనే న్యాయంగా బ్రతికే వాణ్ణయితే, దేనికీ లెక్క చేయకుండా, ఈ బిడ్డతో, అన్నా ఫిలిప్పోవ్నా దగ్గరకు వెళ్లి, ఆమె కాళ్లమీద పడి: క్షమించు! నేను పాపం చేసాను! నన్ను నీయిష్టం వచ్చినట్టు బాధపెట్టు, కాని నోరెఱుగని ఈ పసిబిడ్డను మనం నాశనం చేయవద్దు. మనకు బిడ్డల్లేరు; మనం వీణ్ణి పెంచుకుందాం, అని చెప్తా. ఆమె చాలా మంచిమనిషి, ఒప్పుకుంటుంది...అప్పుడు నాబిడ్డ నాదగ్గరే ఉంటాడు...ఎచ్చ్! అని అను కున్నాడు.

మ్యెల్కిన్ బంగళా చేరాడు. అనుమానిస్తు కదలకుండా నిలబడ్డాడు. తాను తన యింట్లో చావిట్లో కూర్చుని, పేపరు చదువుతోన్నట్టున్నా, కోటు వేసిన ముక్కు గల ఒక చిన్నిపిల్లాడు తన డ్రెస్సింగు గౌన్ కుచ్చులు పట్టుకొని ఆడుకుంటోన్నట్టున్నా భ్రమపడ్డాడు. తనతో పని చేస్తోన్నవాళ్లు కనుసంజ్ఞలు చెయ్యడం, గవర్నరు తనపక్కలో పొడిచిగఘాకొట్టడం, కళ్లకు కట్టినట్లు కనిపించింది... తన అంతరాత్మ బాధించడం కాకుండా, తన హృదయంలో ఏదో వెచ్చగాను, విచారకరంగాను, కోమలంగాను, ఉన్నట్లుంది.........

అతడు వరాండా మెట్లమీద ఆబిడ్డను జాగ్రత్తగా పెట్టి, చెయ్యి ఊపాడు. మళ్లీ తన ముఖంలో పల సరాఉ పాకినట్లయింది......

"అబ్బాయీ, నన్ను క్షమించు! నేనొక తుచ్ఛుణ్ణి. నామీద ఏ ద్వేషం జ్ఞాపకం పెట్టుకోకు!" అని మెల్లగా అన్నాడు.

వెనక్కి అడుగు పెట్టాడు. కాని తక్షణమే నిశ్చలబుద్ధితో గొంతుకు సవరించుకొని,

"ఓ, ఏమయితే అవనీ! మునిగితే మునగనీ! నేను వీణ్ణి తీసికొని వెళ్తా. ప్రజలు ఏమన్నా అన్నీ!" అన్నాడు. మిగూవ్ బిడ్డను తీసికొని, త్వరగా వచ్చినదారి పట్టాడు.

"ఎవరిఇష్టం వచ్చినట్లు వాళ్లు చెప్పుకోనీ. నేను మాత్రం తక్షణం వెళ్లి కాళ్లమీద పడి, 'అన్నా ఫిలిప్పోవ్నా! రక్షించు!' అంటా. అన్నా మంచిమనిషి. అర్థం చేసికొంటుంది ... ...... మేమే వీణ్ణి పెంచుకుంటాం......పిల్లాడయితే వ్లడిమీర్ అని పిలుస్తాం. పిల్లయితే అన్నా అని పిలుస్తాం! ఎలాగయినా, మా ముసలితనంలో ఇది ఒక సౌఖ్యం అవుతుంది," అని అను కున్నాడు.

తాను నిర్ధారణ చేసుకొన్నట్లే చేసాడు. ఏడుస్తూ, అవమానం వల్లా, భయంవల్లా, కొంచెం నీరసపడి గంపెడాశతోనూ, ఒకవిధమైన సంతోషంతోనూ, తన బంగాళా చేరి, భార్య దగ్గరకెళ్లి, ఆమె కాళ్లమీద పడి.........

"అన్నా ఫిలిప్పోవ్నా! "రక్షించు!" అన్నాడు ఏడుస్తూ, బిడ్డను నేలమీద పడుకో

పెట్టాడు. "నీవు నన్ను శిక్షించే ముందు నే చెప్పేది విను......నేను పాపం చేసాను! ఇది నాబిడ్డ......ఆగ్నేయా నీకు జ్ఞాపకం ఉందా? పాపం నన్ను అల్లాతరిమింది......" అన్నాడు.

అవమానంతోనూ, భయంతోనూ, ఇంచుమించు ప్రపంచకం తెలియకుండా, జవాబుకు ఎదురు చూడకుండా, ఒక గంతువేసి, దెబ్బలుగట్టిగా తిన్నవాడలాగ బయటికి పరుగెత్తుకొని వెళ్లాడు......

"ఆమె నన్ను పిలిచేవఱకూ నేను ఇక్కడే ఉంటా", అని అనుకున్నాడు. "ఆమెకు కుదుటపడ్డానికి, ఆలోచించడానికి సమయం ఇస్తా."

పోర్టరు, ఎర్మోలె బాలలైకా పుచ్చుకొని అతని పక్కనుంచి వెళ్తూ, అతనివైపు చూసి బుజాలు కుంచుకున్నాడు. ఒక నిమిషం తర్వాత మళ్లీ అతని పక్కనుంచి వెళ్లి, మళ్లీ బుజాలు కుంచుకున్నాడు.

"ఇదొక వింత! ఎప్పుడైనా విన్నారా?" అని ఇకిలిస్తూ అన్నాడు. "ఆచాకల్ది, అక్సిన్యా, ఇప్పుడే, ఇక్కడికి వచ్చింది. ఆ తెలివితక్కువ మనిషి, తన బిడ్డను ఈ మెట్లమీద పెట్టి లోపల నాతో ఉండగా, ఎవరో ఆబిడ్డను ఎత్తుకుపోయారు......ఇలా ఎవ రనుకుంటారు!"

"ఏమిటి? ఏమిటి నువ్వు చెప్తున్నావు!" అని మిగూవ్ గట్టిగా అడిగాడు.

ఎర్మోలే, తన యజమానునికోపం తనకు తెలిసినట్టు అర్థం చేసుకుంటూ, తలగోక్కొని, నిట్టూర్పు విడిచాడు.

"నన్ను క్షమించాలి, ఎండాకాలపు సెలవులు.........బ్రతకడానికి వీల్లేదు...... ఆడది లేకుండా.........అది......"అన్నాడు.

తన యజమాని కళ్లు, కోపంతోనూ ఆశ్చర్యంతోనూ, గుచ్చుతున్నట్టు చూసాడు. తప్పుచేసినవాడిలాగ గొంతు సవరించుకొని అన్నాడు:

"తప్పకుండా యిది ఒకపాపమే, కాని ఏం చేయడం?.........మీరు పరాయి మనుష్యుల్ని ఇంట్లోకి తీసుకొని రాకూడదని చెప్పడం నాకు తెలుసు, కాని, ఇప్పుడింట్లో ఎవరూ లేరు. ఆగ్నేయా ఇక్కడున్నప్పుడు బైటి ఆడాళ్లు రాలేదు, ఇంట్లో ఒకర్తి ఉండబట్టి. కాని ఇప్పుడు, మీరే ఆలోచించండి.........బైటివాళ్లు రాక తప్పదు. ఆగ్నేయా ఉండే రోజుల్లో తప్పేదీ రాలేదు, ఎందుకంటే......"

"తుచ్ఛుడా, పో!" అని మిగూవ్ అతని మీద కేకలెట్టి, కాళ్లు కిందకొడ్తూ, గదిలోకి మళ్లీ వెళ్లాడు.

అన్నా ఫిలిప్పోవ్నా ఆశ్చర్యంతోనూ, కోపంతోనూ, ఇంతకు ముందు కూర్చున్నట్లే కూర్చుని కన్నీటితో తడిసిన కళ్లతో బిడ్డ వంకే చూస్తోంది.........

"అదుగో! అదుగో!" అని మిగూవ్ తెల్లబాఱిన ముఖంతో నవ్వడానికి ప్రయత్నిస్తూ అన్నాడు, మెల్లగా, "ఇది అంతా తమాషా.........ఇది నాబిడ్డకాదు......ఇది ఆ చాకల్దాని.........నేను......నేను తమాషా కన్నా.........నిన్ను పోర్టరుదగ్గఱకు తీసికెళ్లు."

---

## 2. ఆటపాటలు

౩౯

గుడుగుడుగుంచం, గుండా రాగం
పాములపట్నం, పడగా రాగం
అత్తారిచెవులో ముత్యా లేస్తే
బయటికి రావే, పందికొక్కా.

౪౦

కొంగకొంగ గోళ్లు
రంగడిచేతి రాళ్లు
నాచేతి పూలు.

౪౧

ఏనుగమ్మా ఏనుగు
ఏవూ రెళ్లిం దేనుగు
మావూ రొచ్చిం దేనుగు
మంచినీళ్లు తాగిం దేనుగు.

... ... ... ...

౪౨

చెమ్మచెక్క చారెడేసి మొగ్గ
అట్లు పొయ్యంగ ఆరగించంగ
ముత్యాల చెమ్మచెక్క ముగ్గు లెయ్యంగ
రత్నాలచెమ్మచెక్క రంగు లెయ్యంగ.

౪౩

బావాబావా పన్నీరు
బావని పట్టుకు తన్నేరు
వీధివీధి తిప్పేరు
వీసెడు గుద్దులు గుద్దేరు
పట్టిమంచం వేసేరు
పాతికగుద్దులు గుద్దేరు
నులకమంచం వేసేరు
నూరుగుద్దులు గుద్దేరు.

## 3. పణతి పాటలు

౪౪

చుట్టు చక్కందమ్మ చక్కిలపుచుట్టు
చూలింత చక్కంది ఓరాచదేవి!
పండు చక్కందమ్మ పనసయ్యపండు
బాలింత చక్కంది ఓరాచదేవి!
ఆకు చక్కందమ్మ తామల్లపాకు
అయిదువ చక్కంది ఓరాచదేవి!
కొమ్మ చక్కందమ్మ గోరింటకొమ్మ
కొమరాలు చక్కంది ఓరాచదేవి!
పోక చక్కందమ్మ బొబ్బిల్లిపోక
భోగపుది చక్కంది ఓరాచదేవి!

౪౫

ఓయిఓయిఓయి ఓకాపు పిల్ల!
తాటిమేకచల్ల తాగడే గొల్ల
నిన్న మొన్నటిచల్ల నేటికి పుల్ల
కవ్వాన్ని తిప్పింది కమ్మన్నిచల్ల.

౪౬

చిలకల్లు చిలకల్లు అందురే కాని
చిలకలకు రూపేమి పలుకులే కాని
హంసల్లు హంసల్లు అందురే కాని
హంసలకు రూపేమి ఆటలే కాని

పార్వాలు పార్వాలు అందురే కాని
పార్వాలకురూపేమి పాటలే కాని
కోయిల్లు కోయిల్లు అందురే కాని
కోయిలకు రూపేమి ఘోషలే కాని
చిలకల్లు మాయింటి చిన్నకోడల్లు
హంసల్లు మాయింటి ఆడపడుచుల్లు
పార్వాలు మాయింటి బాలపాపల్లు
కోయిల్లు మాయింటి కొత్తకోడల్లు.

౪౭

వండా రారమ్మ వడకవంటల్లు
వల్లభుడు అబ్బాయికి వడుగు మాయింట
కట్టా రారమ్మ కలవతోరణాలు
కాముడిఅబ్బాయి కళ్యాణ మన్ని
పెట్టా రారమ్మ పెళ్లిముగ్గుల్లు
పెంపుడు అబ్బాయికి పెళ్లిమాయింట
తియ్యా రారమ్మ చిప్పగంధాలు
సింహాలక్ష్మి అమ్మాయికి సీమంత మసిరి
పుయ్యా రారమ్మ పురిటిగోడల్లు
పుణ్యశాలి సీతమ్మకి పురుడు మా యింట.

౪౮

చింత చెట్టుకింద చికిలింతగడ్డి
మెయ్యడుగ మాఆవు పెయ్యల్ల కన్ని
ఆవుపాలు తెచ్చి పరమాన్నం వండి
కుడువడుగ మాఅమ్మి కూతుళ్లకన్ని.

౪౯

నీలాటి రేవంత నిగ్గు తేలింది
ఏచేడె కడిగింది యీచాయపసుపు
పచ్చిపసుపు బావల్ల మరదలాడింది
అణుప్పసుపు అన్నల్ల చెల్లెలాడింది
కొట్టుపసుపు కోమాళ్ల తల్లి యాడింది
కోమాళ్ల తల్లియే తాను గోపమ్మ
గొంతియాడిన పసుపు గోవపూఛాయ
అన్నల్ల చెల్లెలే తాను అమ్మాయి
అతివె ఆడినపసుపు ఆవపూ ఛాయ
బావల్ల మరదలె తాను అమ్మాయి
పణతి ఆడినపసుపు బంగారుఛాయ.

## 4.

## ప్రకీర్ణములు

౫౦

దంపుదంపనగానె దం పెంతసేపు
ధాన్యరాసులమీద చెయి వేసినట్లు
వంటవంటనగానె వం టెంతసేపు
వదినెల్లు మరదళ్లు వాదించినట్లు.

౫౧

అత్తపోసినగంజి సత్తావలేదు
అల్లూడు సిరిపురవుగ పెట్టక్క లేదు.

౫౨

కోటీవేలాధనమైన చాలు
గోపికృష్ణుడివంటి కొడుకైన చాలు
లక్షావేలాధనమైన చాలు
లక్ష్మణదేవరవంటి తమ్ముడైన చాలు.

౫౩

విశాఖపట్నాన వీధిగుమ్మాన
వింత రాచకొడుకు బంతులాడేడు
బంతి వెళ్లి పాలకొండసభలో పడితే
యిది యెవరిబంతన్ని వివరించె రాజు
గోలకొండవారి గొలుసుల్ల బంతి
పాలకొండవారి పచ్చల్లబంతి

శ్రీకాకుళమువారి చిత్రాల బంతి
నెల్లూరివారిదే నీలైనబంతి
బొబ్బిల్లివారిదే బంగారుబంతి.

౫౪

ఓయిఓయిఓయి వద్దాదిరాజ
పొడిచి గెలిచినరాజ బొబ్బిల్లిరాజ
బొబ్బిల్లి పాడుగాయె కిమిడి కిందాయె
మాడుగులు మనకాయె మళ్లుమీా రాజా.

౫౫

నరసన్న పేటలో భాగోతులాట
రాజు కూర్చున్నది రత్నాలపీట
పీటకిం దున్నది వరహాలమూట
ఆమూట మాకిస్తె మహామంచిమాట.

౫౬

కొయ్యతోటాకూర కొయ్యక్క చెడెను
కొండంత కాపురం కొండేల చెడెను

౫౭

చిచ్చెమ్మ చినగాలి పెట్టు పెదగాలి
అయోధ్యవీధుల్లో అణిగనే గాలి.

౫౮

చలికి వెరిచినట్టు పులికి నే వెరువ
ఆలికి వెరిచినట్టు అమ్మ కీవెరువ.

౫౯

పాటల్ల పచ్చడి రాగాలబుఱ్ఱ
నిత్తెకయ్యలమారి మొగుణ్ణే పాడింది.

౬౦

కొడుకుల కననివాళ్ల కడు పేమి కడుపు
కుల ముద్ధరించన్ని కొడు కేమి కొడుకు.

౬౧

పిడికెడు వితనాలు మడికెల్ల జాలు
వక్కడే కొడుకైన వంశాన జాలు.

౬౨

కొత్తచింతపండు గోనెల్ల చిపుకు
గొడ్రాలివస్త్రాలు పెట్లల్ల చిపుకు
దేవదారుచెక్క చెట్టున్న చిపుకు
దేవుడివస్త్రాలు గుల్లోనుచిపుకు
రావిచెట్టు చెక్క రంపాన్న చిపుకు
రంభచక్కదనము దుఃఖాన్న చిపుకు.

౬౩

నాచేతికోకల్లు నల్లరోకల్లు
నే పాడిన అన్నల్లు రామలక్ష్మణులు
రామలక్ష్మణులాల్ల రతిపతులాల్ల
మీా రెక్కగుఱ్ఱాలు నీలమేఘాలు
మీాచేతికత్తుల్లు చంద్రాయుధాలు.

... ... ... ...

౬౪

ఎవ్వరే చుట్టాలు యెవరుపక్కాలు
ఎవ్వరే మాపాల కలిగివున్నారు
మాపాల శ్రీవెంకటప్ప వుండగను
మనసులో చింతేల మరిభయ్యము లేల.

౬౫

సింహాద్రి అప్పన్న గుళ్లముందార
పడ్డారె గొడ్రాళ్లు ప్రాణచారమ్ము
ఎందూకు పడ్డారు యేల పడ్డారు
సంతాన మియ్యమని చాల పడ్డారు- సంతాన.
బిడ్డల నియ్యమని ప్రియముపడ్డారు- బిడ్డల.
కొమాళ్ల నియ్యమని కోరిపడ్డారు- కొమాళ్ల.
సింహాద్రి అప్పన్నకు యేమి లంచమ్ము
గుడిదిరుగువస్త్రము గుమ్మిాడిపండు
దాగళ్ల వడపప్పు చండుబెల్లాలు.




౧

నవబ్రహ్మలలో నొకడయిన కశ్యపునకు పరశురాముడు తానుజయించిన భూమిని ధారవోసెను. అతడద్దానిని భూమిసురులకు ధారవోసెను. బ్రాహ్మణులు తాము 'రాజ్య పరిపాలనార్హులము కా'మని నిశ్చయించుకొని రాజు నొకని నియమించుటకు స్థిరపరచుకొనిరి. పరశురాముడాతనికూడ చంపునని భయము చే నాతనియొద్ద కేగి యిట్లనిరి: "అయ్యా! తాము భూమిని దానముచేసితిరి. కాన మీ కిందుండుట కర్హత లేదు. ఇందుండక ఆవల కేగుడు."

పరశురాముడు తాను వెడలునపుడు వారలకు మేలు సేయ నెంచి వారితో నిట్లనియె: "ఆర్యులారా! మీ అజ్ఞానుసారము నే నావల కేగెద. మీరు కష్టపడ నక్కర లేకుండ మీకు కావలసిన సస్యములు-మీరు దున్నకయే-సాగు చేయకయే-నీరు మొదలగునవి పెట్టనక్కర లేకుండ నే-పండునట్లు చేయుదును. మీ కవసరమయిన సస్యబీజములను తెండు. అభిమంత్రించిచల్లెద. సుఖముగ జీవింపుడు."

వారామాటలను విని తమలో తాము నవ్వుకొని-ఆతడనిన అసూయపడు వారగుటచే-ఆతని మాటలయందు నిర్లక్ష్యముచే, కొన్ని బొమ్మజెముడు, ఉమ్మెత్త గింజల నిచ్చిరి. వాటి నాత డభిమంత్రించి భూమిమీద చల్లెను.

నాటినుండియు నేటివరకు బొమ్మజెముడు, ఉమ్మెత్తజాతులు-ఎవరు నీరుపోసి పెంచకపోయి నను-అవిచ్ఛిన్నముగ- మంచి యేపుగ పెరుగు చున్నవి.

తరువాత పరశురాముడు మహేంద్ర గిరికి తపముచేసికొనుట కేగెను. [శర్మ]

౨

పాపంపాపం-పుణ్యాంపుణ్యాం

విష్ణుశర్మయను విప్రుఁ డనుదినము ఒక నిమ్మపండును హస్తమం దిడుకొని తన దేశపు రాజును దర్శింప గోటలోనికి బోవుట గలదు. రాజున కా నిమ్మపండిచ్చి 'పాపంపాపం-పుణ్యాం పుణ్యాం'-అని సెలవుదీసికొని తన నిజగృహ

బునకు జనుచుండెడివాడు. వెఱ్ఱిబాపడను కొనుచు రాజామాటల కానందించెడివాడు. పట్నమందా విష్ణుశర్మ రాజుగారి కోటలో చాల గౌరవము, పలుకుబడి గలవాడను వదంతి విస్తరించి పొంగిపొర్లుచున్నది.

అంత నాదేశపు మంత్రి కుటిలబుద్ధియందు ప్రజలకు గల గౌరవాతిశయములు క్షీణింప జొచ్చెను. విష్ణుశర్మయందనురక్తులై ప్రజలుండుటజూచి కుటిలబుద్ధి చాల విచారించి దీర్ఘాలోచనాపరుడై యొక మాయోపాయము బన్నెను.

కుటిలబుద్ధి ఒక నాడు రాజును దర్శించి, 'ప్రభూ! తమదర్శనార్థమై నిచ్చలువచ్చు విష్ణుశర్మ, తమరు పల్లెకులమున బుట్టినవారనియు, తమ ఘర్మబిందువు లుప్పగా నుండుట యానవాలనినగరమందున జాటుచుండె'నని చెప్పిపోయెను. అంతనా రాజు ఘర్మబిందువులు చవిచూచినవాడై విష్ణుశర్మయందు కోపోద్దీపుడై, తనభటుల బిలిచి, 'సింహద్వారము గుండ కోటలోపలినుంచి నిమ్మపండును పట్టుకొనివచ్చువానిని జంపి వేయు'డని యాజ్ఞాపించెను. మఱియు కుటిలబుద్ధి విష్ణుశర్మతో, "మీరు మాట్లాడునప్పుడు తుంపరలు నోటినుండి తూలుచుండునని రాజుగారు కోపముగా నుండి"రని చెప్పెను.

విష్ణుశర్మ చింతిల్లినవాడై యథాప్రకారము రాజుగారిని దర్శింపబోయి నిమ్మపండీయబోవ రాజు పుచ్చుకొన నిరాకరించెను. అంతనా విష్ణుశర్మ మంత్రిని దర్శింపబోయి యాతనికా నిమ్మపండిచ్చి తననిజగేహంబునకు స్వేచ్ఛగా జనెను. మంత్రి, కుటిలబుద్ధి రాజును దర్శించి రాజకీయవ్యవహారములు కొంతవఱకు ముచ్చటించి సెలవుతీసికొని నిమ్మపండు నెగురవైచుకొనుచు కోటలోపలినుంచి సింహద్వారము కడకు రా వేగమే భటులా నిమ్మపండును జూచి రాజాజ్ఞప్రకారము కుటిలబుద్ధిని జంపి వేసిరి.

రాజీహత్యకు గారణంబేమని దరియాప్తు చేయగా నిజము బయల్పడినది. విష్ణుశర్మను మంత్రిగా నియమించెను. పాపం పాపం-పుణ్యం పుణ్యం.

నామగిరి చంద్రశేఖర సోదరులు.

[ఈకథ మాకు మా పెద్దలవల్ల లభించినది.]

---



హంపీశిథిలములలోని
దేవాలయపు ద్వారాలంకారము

శ్రీ కూర్మ దేవాలయమునందలి స్తంభము

ఈ రెండు చిత్రములు, శ్రీ డి. బుచ్చి కృష్ణమ్మగారు (రాజమండ్రి) చిత్రించినవి.



భారతమాత ఆహ్వానము

శ్రీ చేపూరి సింహాచలముగారు-పర్లాకిమిడి.

# ఔరంగజేబు: రాజప్రతినిధి

మొసలికంటి సంజీవరావు గారు

## ౨

### గోలుకొండదాడి

దక్కనునందలి యౌరంగజేబు రెండవ ప్రతినిధిత్వము కడు ముఖ్యము. ఆతని యఖండసామ్రాజ్య స్థాపనయు నొనరింపఁజాలిన దియ్యదియె. కాని, 'కాందహారు' ముట్టడియందు దురదృష్టవశమున నోటువడి పితృదయాభిమానశక్తుఁడైన యీ పాదుషాపుత్రుఁడు కడు నిందలు బడవలసివచ్చెను. ఆర్థికదురవస్థయు, సంతకంబె నిశితతరముగ జనకుని నిరసనమును ఆతని వెంటేని గారించెను. ఐనను, మహావీరుఁడగు నౌరంగజేబు కష్టసమయమున డిందుపడక, స్వీయరాష్ట్రాభ్యుదయమునకును, సామ్రాజ్యక్షేమమునకును, పరిస్థితిపరిణామానుగుణముగ స్వీయలాభము కొఱకును అవిచ్ఛిన్నముగ పాటుపడి, తుదకు సామ్రాజ్యాధిపతిత్వము గాఁగలిగెను. ఔరంగజేబు భ్రాతృపితృ రాజద్రోహములొనరించిన నొనరించుఁగాక. ఐనను ఆతని యపారధీశక్తియు, కార్యదీక్షయు, సమయోపాయ ధురీణతయును గల విమర్శకులనైన దిగ్భ్రమచేతస్కుల నొనరించును. ఔరంగజేబు మహోగుణదోషము లీకాలమున బహిర్గతములాయెను. తాదృశ విషయసంకీర్ణమగు రెండవ రాజప్రతినిధిత్వము పరిశీలనార్హము.

నిరంతరాయము లగు యుద్ధములవలన మొఘలాయీ దక్కనురాష్ట్రము శిథిలపడియుండెను. మఱియు నౌరంగజేబు ప్రథమ ప్రాతినిధ్యానంతరము తదుద్యోగభారము వహించినవార లొక్కొక్కఁ డొక విధమున నా దేశమును నికృష్టపఱచిరి. ఒకఁడు కఠినుఁడై, ప్రజను హింసించెను. ఇంకొకఁడు కేవలస్వార్థపరుఁడై, ప్రజాప్రభువుల నిర్వ్యరను గనుబ్రామి యశేషధనార్జన మొనరించెను. మఱియొకఁ డసమర్థుఁడాయెను. కొండొకకాలము ప్రతినిధిగనుండిన మురాదు—పాదుషావాల్గవపుత్రుఁడు—అసమర్థుఁడగుటయేగాక, సమర్థుఁడగు 'షా నవాజుఖాను' హితము గైకొనక ఆతనిపైరోసి పూర్తిగ నుపేక్షించెను. ఇట్టి ప్రతినిధుల వాతఁబడిన దక్కను దేశము యథాశక్తి సామ్రాజ్యకోశమును బూరించుటకు మాఱుగ నష్టకరముగఁగూడఁ బరిణమించెను. మూడు కోట్ల యిరువది లక్షలరాఁబడి జూపవలసిన యీ దేశ మౌరంగజేబు చేతెంచుసరికి కోటిరూపాయ లొసఁగుటయే కష్టముగ నుండెను.

పరిపాలనాదక్షుఁడగు నౌరంగజేబునాఁడు ప్రబలియున్న దోషములను దొలఁగింపవలయునని సంకల్పించెను. ఆ రాష్ట్రమున కిరుదెంచిన దాది యాతఁ డాకార్యమున నిమగ్నుఁ డాయెను. సైన్యస్థితి యతిహీనముగనుండెను. అంతసులకుఁ దగిన యధికారము లేకుండుటచేత, సైన్యములు శిక్షారహితములై, వృద్ధజనసంకీర్ణములై, దుర్బలములై, నిరర్థకములై యుండెను. ఔరంగజేబు సమర్థాధికారిని నియోగించి, తొలుదొల్త సైన్యవ్యవస్థ సంస్కరించెను. పరిపాలనయంతయుఁ గుంటుపడి యుండుటచేతఁ గుక్షింభరులను దొలఁగించి, సమర్థులగు నుద్యోగులను నియమించి, ప్రభుత్వపటుత్వము నెలకొల్పెను. సత్పరిపాలనము లేమి సుక్షేత్రము లూషరక్షేత్రములై యుండెను. కొన్ని భూములు దశాంశము మాత్రమే ఫలింపఁ దొడఁగెను. ఔరంగజేబు దివానగు 'ముర్షిదు ఖూలీఖాను' విశ్వసనీయులగు నమీనాది శుల్కగ్రహణాధికారుల నేర్పఱచి, క్షేత్రములను జక్కఁగఁ గొలిపించి, బలయు ధన సాహాయ్య మొసంగుచు వ్యవసాయదారులను ప్రోత్సహించి, దేశమును సుభిక్ష మొనరింపఁ గలిగెను. ఈయెడ నౌరంగజేబు చూపిన పరిశ్రమ శ్లాఘనీయమని చరిత్రకారులు వ్రాయుదురు.

దేశము పాడుపడుట సులభము. కాని, బాగు పడుట కష్టసాధ్యము. వ్యవసాయ పునరుద్ధరణము మ

లతో నగునదికాదు. షాజహానువంటి యనుభవజ్ఞుఁడా పాటి యెఱింగి యుండవలయును. కాని, ఔరంగజేబుపై నారంభముననే కుపితుఁడై యుండుటచేతను, స్వార్థపరులు కొందఱాతనిపైఁ గొండెములు పల్కుటచేతను, ఆతని యెడ సైఁపని దారాయొక్క కుతంత్రములచేతను గూడఁ గావలయు, షాజహాను ఉచితానుచిత వివేచనారహితుఁడై, పరిపాలనోద్ధరణ కార్యైకపరుఁడై యుండిన యౌరంగజేబు ననేకవిధముల నిరసించి కలతపెట్టఁదొడంగెను.

జనకుఁడెంత నిరసించినను, ఔరంగజేబు నిజవంశక్రమానుగతమగు రాజనీతి మఱువలేదు. ఆతఁ డరుదెంచిన దాడి గోలుకొండ భాగ్యాపహరణము దలపెట్టెను. కుతుబుషా యని పేరొందిన గోలుకొండ సుల్తాను తొల్లి మొగలులచే నోటువడి షాజహానునకుఁ గప్పము చెల్లించుట కొడఁబడినను, అతని భాగ్య మఖండముగ నుండెను. కృష్ణా కావేరీనదీ మధ్యస్థమగు కర్ణాటదేశమునందలి చాల భాగము మాత్రమేకాక, ఆసుల్తాను ఒరిస్సావఱకుఁ గల దేశముగూడ జయించి, శ్రీకాకుళమునందుఁ దన ఫౌజుదారుని నిలుపఁజాలెను. జగత్ప్రసిద్ధిగాంచిన 'కోహినూరు' వజ్రములకు గోలుకొండ దేశమునందలి గనులే [illegible]. ఇఁక వర్ణ్యాద్భుతములగు గోలకొండ వజ్రపుఁ గనులు ప్రపంచవిఖ్యాతములు: భరత, ఆసియా ఖండములకు మాత్రముగాక, యపరార్థగోళమునకుఁగూడ హైదరాబాదు నగరము కేంద్రమై, సమస్తదేశ వణిగ్వర నిలయమై, యనంతభాగ్యభూయిష్ఠమై యలరుచుండెను. చిత్రవర్ణాంచిత వస్త్రపరిశ్రేణులకుఁ తావలమై పాశ్చాత్య ప్రభువులనుగూడ వెఱఁగుపఱచిన మన మచిలీపట్టణము గోలకొండ రాజ్యమునందే యుండెను. నదీ తటాకాది జలసమృద్ధమై, మనోహరశ్యామల సస్యపూర్ణమై, వజ్రఖనినిలయమై, యఖండభాగ్యములోఁ గల యలాటి గోలకొండరాజ్య మౌరంగజేబునకు నయనానందకముగ నుండెను. ఆ ఖని నెట్టులైన భంగపఱచి తద్భాగ్యాపహరణ మొనరింపవలయునని యాతఁడు తలపెట్టెను. పాదుషా సార్వభౌమత్వమున కొడఁబడిన కుతుబుషా రక్షణీయుఁడగుఁగాని దండ్యుఁడుగాఁడు. కాని, యౌరంగజేబు న్యాయాన్యాయములు దలంపక, వాని విధ్వంసమున కొకనెపము మాత్ర మరయుచుండెను. చిత్తము కార్యాయత్తమగునపుడు వ్యాజము సులువుగాఁ జిక్కుఁగదా. ఔరంగజేబునకు 'మీరు జుమ్లా' యను గోలుకొండ మంత్రి తప్పను సాధనముగఁ జిక్కెను.

మీరు జుమ్లాయనునంత మద్భుతము. ఈతని తండ్రి పెరషియా దేశమునందుఁ దైలవర్తకుఁడు. రాజపూజితుఁడు గావలసిన 'మీరు' తన దేశమున నికృష్టజీవన మొనరింప నొల్లక, యౌవనముననే గోలుకొండ దేశమున కరుదెంచి, వజ్రవ్యాపార మొనరించి భాగ్యవంతుఁడై, స్వీయప్రతిభా విశేషమున నృపాలుదృష్టి నాకర్షించి, యమాత్యుఁడాయెను. వ్యాపారమునందు మాత్రమేకాక పరిపాలనయందును రణవ్యాపారమునందునుగూడ నా సచివుఁడసమానుఁడని పేర్వడసి, గోలుకొండ రాజ్యాధికారము దన యధీన మొనరించుకొనెను. సుల్తానగు 'అబ్దుల్లా' కాతఁడు సర్వము నై యుండెను. రాజానుమతంబున నా ప్రధాని కర్ణాటదేశముపై దాడివెడలెను. రణకుశలుఁడగు 'మీరు' పాశ్చాత్య ఫిరంగీకారులను జేరదీసి హైందవ దేవాలయాంతర పవిత్రలోహ విగ్రహములను గూడ కరగించి ఫిరంగులొనరించి, సైన్యమును లెస్సగ వృద్ధిపఱచి జైత్రయాత్రకుఁ గడంగెను. కర్ణాటదేశాధిపతియగు శ్రీరంగరాయలు వైరినివారింప నేరకపోయెను. రాజ్యసంపాదనమేగాక, తన యధీనమునున్న వజ్రపుఁగనులను శ్రద్ధమెయిఁ బనిచేయించి యామూలమునగూడ నాతఁ డమిత ధనార్జనమొనరించెను. ఇరువది మణుగుల వజ్రములను ప్రోవుచేసిన యాపారసీకుఁడు దక్షిణ హిందూదేశ ప్రజాళిలో నెల్ల నత్యంత భాగ్యవంతుఁడాయెను. తన చాకచక్యమువలన నాతఁ డచిరకాలమున ౧౫౦౦౦ మైళ్ల వైశాల్యముగల దేశము స్వాధీనపఱచుకొనఁజాలెను. నలుబదిలక్షల రాఁబడిగల విశాలదేశము, అవంధ్యధనరాశి, ౪౦ వేల సంఖ్యగల ప్రచండ చతురంగబలము గలిగి యుద్దండుఁడై యుండిన మానిసి యన్యజనవిధేయుఁడై యెట్టులుండఁ గలఁడు? ఆతని వైఖరి గమనించిన గోలు

కొండ సుల్తాను భయాగ్రహాపరుఁడై, యసమర్థుఁడై, మాయోపాయ మాలోచించెను: తన రాజధాని కాతని రప్పించి, యాకస్మికముగఁ బట్టి యాతని బంధన మొనరింపఁగలయునని యోచించెను. మంత్రి యామోసమెట్టులో కనిపట్టి గయమ్మునఁ బలాయన మొనరించెను. సుల్తానును ధిక్కరించి తానన్యసాహాయ్య విరహితముగ మనఁజాలుట యవివేకమని గ్రహించి, యాతఁడు బీజపుర సుల్తాను సాయ్య మపేక్షించెను. 'ఆదిల్షా' నామధేయుఁడగు నా సుల్తాను సంతుష్టాంతరంగుఁడై సానందముగ సగౌరవముగ నాయమాత్యశేఖరు నాహ్వానించెను. కాని, అనేకోపాయాన్వేషియగు మీరుజుమ్లా యంతమాత్రమున దనివినొందక, తాను నిక్షేపించిన యనంత ధనరాశితోపాటు దన దేశమునకుఁ బాఱుటకుఁగూడ నుంతవ మొనరించెను. చంద్రగిరి రాజధానిగ నొనరించుకొనిన శ్రీరంగరాయలు నీక బాధింపనని చెప్పి యాతనిసఖ్య మపేక్షించెను. బీజపుర రాజ్యవశమైన కర్ణాటదేశముఁ బాలించు 'నిఖిలుసుఖాను'తోడ నిశ్చికము లాడినంతనే, తానుగూడ నట్టులే స్వతంత్రరాజత్వము గడింపవచ్చునని యూహించి ఖానుఁడాశనికి సన్నిహితుఁ డాయెను.

సమర్థతంత్రజ్ఞుఁడగు మీరుజుమ్లా బీజపుర సుల్తాను నకేగాక మొగలులకుఁగూడ వాంఛనీయుఁ డాయెను. గోలకొండరాజ్యవిధ్వంసము దలపెట్టిన యౌరంగజేబు తత్కార్యమాతని సాహాయ్యమున సులభసాధ్యమగునని యెంచి మీరుజుమ్లా నాహ్వానించెను. సుల్తానువలనఁ దనకెట్టి యపాయమువాటిల్లకుండ యభయమిత్తుననియు, మొగలాయిసామ్రాజ్యమున నున్నతోద్యోగ మిప్పింతు ననియు నాపాదుషాపుత్రుఁడు రహస్యరాయబారము నంపెను. గోలకొండసుల్తా నీచెయ్దములు గనిపెట్టి, తన యమాత్యునిఁబాపునుడిఁ బరిగ్రహింప వలయునని యెంచి యనునయప్రయత్నము లొనరించెను. మీరు జుమ్లా నిక్కముగ ధన్యతముఁడుగదా! తనకుఁ డొక వంకను, బీజపుర సుల్తానొక వంకను, అఖండభూమండల వ్యాప్తంబగు మొగలాయీ ప్రభుత్వ మొక వంకను నాతని సెయ్య మపేక్షించెను!

ఔరంగజేబు సలహాపై షాజహానునకు విజ్ఞాపన మంపియు, మీరుజుమ్లా ద్వైధీభావము విడునఁ డాయెను. మొగలుపాదుషా ప్రదానము తృప్తికరముగ లేక పోవుట చేతనో, ఇంకఁ గొంతయాలసించినచో నధికతరలాభము చేకూఱుననియో యోచించి, తన భాగ్యముఁ బ్రోవుచేసి కొనుట కొక సంవత్సరము వ్యవధి కావలయునని చెప్పి, తదనంతరము వారి సేవకుఁడ నగుదునని బాసచేసి, యాలోన సుల్తానులవలనఁ దనకుఁ బ్రమాదము రాకుండ తత్సమాచారము రహస్యముగ నుంచవలయునని యాతఁడు కోరెను. కాని, ధీశాలియగు నౌరంగజేబాతని చిత్తము గుర్తింపలేకపోలేదు. గోలుకొండ బీజపుర సుల్తానుల వలనఁ దనకపాయము ఘటింపకుండ సంతతకాల మా 'మీరు' స్వరాజ్యసౌఖ్య మనుభవింపఁ జాలుననియు, దహియుండనుండఁజాలుట యొక తంత్రమనియు నెఱింగి యాతఁడుపేక్షాపరుఁ డాయెను. అనంతర మాతంత్రజ్ఞుని ప్రవర్తనము గోలుకొండ బీజపుర సుల్తానుల కెల్లరకును దెల్లమాయెను. తమకిరువురకు మోసపుచ్చిన టక్కరిని భంజించుట తమకిరువురకును నవశ్యకర్తవ్యమని యా సుల్తానులు సక్రోధముగ నిశ్చయించిరి. తానిఁక నిలుచుట యసాధ్యమగుటచేత, బహురాజ వాంఛితుఁడైన మీరు జుమ్లా తత్క్షణ మౌరంగజేబుసాహాయ్య మర్థించెను. ఆతఁ డామంత్రిరాక కెదురు చూచువాఁ డయ్యు, సుల్తానులు దండెత్తువఱకు వేచియుండినచో నాతఁడు పూర్తిగఁ దనయధీనుఁ డగునని యౌదాసీన్యము వహించెను.

గోలుకొండ రాజ్యవిధ్వంసనోత్సాహి యగు నౌరంగజేబున కాలోపుననే తదుచితావకాశ మాకస్మికముగఁ జిక్కెను. మీరుజుమ్లా దారా పుత్రాదికుటుంబము గోలుకొండయందే యుండెను. అతని పుత్రుఁడు పితృభాగ్యవైభవ సంస్మరణమునఁ గన్నుగానక సుల్తానును దృణీకరింపఁ దొడఁగెను. వాని దుష్ప్రవర్తన మను దిన మధికమగుచుండెను. వాఁడొకనాఁడు తప్పత్రావి మైమఱచి, సోలుచు సభాగారముఁజొచ్చి రాజాసనముపై వ్రాలి, యందు శయన మొనరించెను. సుల్తా నిఁకఁ బట్ట

జాలక, వానిని సకుటుంబముగఁ జెఱయందుఁ ద్రోయించెను (౨౧-౧౧-౧౬౫౫). సమయనిరీక్షణ మొనరించుచుండిన యౌరంగజేబది యే యొక మహాపరాధముగఁ బురస్కరించుకొని యుద్ధసన్నద్ధుఁ డాయెను.

రాజప్రతినిధియగు నౌరంగజేబు స్వతంత్రుఁడు గాఁడు. సామ్రాజ్యాధీశుఁడగు షాజహాను సమ్మతించినఁ గాని యాతఁడు యుద్ధము చేయఁజాలఁడు. పాదుషాసమ్మతి యెట్లయినఁ గాంచవలయును. కాని, మూర్ధాభిషిక్తుఁడై మకుటధారణ మొనరించిన సుల్తానును గేవల మక్రమముగ నడంచుటకు షాజహాను సమ్మతింపఁడు. కావున; గృతనిశ్చయుఁడైన యౌరంగజేబు కఠిన కుటిలోపాయమున కుద్యమించెను.

పాదుషాకు విజ్ఞాపనమంపిన మీరుజుమ్లా రత్నేవకుఁడు. పాదుషా సేవకపుత్త్రుని నిర్బంధించిన సుల్తాను పాదుషా యెడ ద్రోహ మొనరించెను; అట్టిద్రోహి తప్పక దండనీయుఁడు:— అనివాదించి, సమరమున కానతీయుమని యౌరంగజేబు షాజహానును గోరెను. కాని, యాతఁడాలోపున నేమీరుజుమ్లాను బంచసహస్రాధిపతిగను, అతని తనయుని ద్విసహస్రాధిపతిగను నియమించి యాసనదులను గూడ నౌరంగజేబున కంపెను. మీరుజుమ్లా సకుటుంబముగ ఢిల్లీనగరమునకుఁ బోవలసియుండెను. ఆతనివారిం బరాధనియు, నాతని ధనకనకాదులనుగూడ నిరోధింపరాదనియు సుల్తానున కొకజాబు వ్రాసెను. ఆ లేఖయు నౌరంగజేబునకే వచ్చెను. (౧౪-౧౨-౧౬౫౫). తత్క్షణ మాజాబు సుల్తానునకంపి, తదాజ్ఞాబద్ధుఁడై యాతఁడు మీరు జుమ్లాకుటుంబధనములను వెంటనే విడువఁడేని, మొగలాయీ సైన్యములు వచ్చిపైఁబడునని రాజప్రతినిధి తెలియఁబఱచెను.

పాదుషా వ్రాసిన జాబుచూచియైనను, ఔరంగజేబు బెదరింపు గమనించియైనను, సుల్తాను మీరుజుమ్లాకుటుంబమును విడిచివైచిన బాగుండెడిది. కాని, తనకంతమాత్రమునఁ బ్రాపించు ప్రమాదము లేదనియో, కేవలజడత్వముచేతనో యాతఁ డాతఁ డాజ్ఞ లెంచాపకపోయెను. మీరుజుమ్లా పుత్త్రనిర్బంధవార్త తెలియుటకుఁ బూర్వము గదా పాదుషా వ్రాసెనని యపద్ధ యొనరించెనేమొ. సుల్తాను చిత్తమెట్లున్నను, విపత్సమర ప్రయత్నములు రయమ్మునఁ బూర్తి యాయెను. అంతలో, మీరుజుమ్లా పుత్త్రనిర్బంధోదంతము దనకుఁ దెలియ, షాజహా నాతని సకుటుంబముగ విడువవలయునని సుల్తాను నాజ్ఞాపించెను. సుల్తాను తప్పక తదాజ్ఞాబద్ధుఁడగుననియు, యుద్ధావసర మంతరించుననియు బాదుషా విశ్వసించెను. ఐనను, తన పుత్త్రుని దృప్తిపరచుటకై, సుల్తా నవిధేయుఁడై చలము వహించునేని, దండెత్తవచ్చునని యాతఁడు వ్రాసెను. (౨౯-౧౨-౧౬౫౫).

సుల్తాను పాదుషాయాజ్ఞ శిరసా వహించునేని, యుద్ధావసరము తొలంగును. కాని, యుద్ధాతురుఁడగు నౌరంగజేబు దురాశయ దెట్లు ఫలించును? కాన నాతఁ డాజాబు సుల్తానునకు సకాలమున నందనీయక, పాదుషా యాజ్ఞ నాతఁడు ధిక్కరించెనని నేరారోపణ మొనరించి, తా నాయత్తపఱచిన సేనాబలంబును హైదరాబాదునగరముపైఁ బంపెను. * పాదుషా యాజ్ఞ చేరిన స్వల్పకాలమునకే భయంకరరిపు సేనాగమనవార్తగూడ సుల్తానుహృదయము వ్రయ్యలగునట్లు తెలియవచ్చెను. జడుఁడైయుండిన సుల్తాను మిథ్యాస్థైర్యము వంచుకలె నంతరించెను. మంత్రిపుత్త్రునితోడనే సకుటుంబముగ నాతఁడంపివైచెను. తానెల్లపుడు పాదుషాకు విధేయుఁడనని దీనసందేశముగూడ నంపెను. కాని, తత్పూర్వమే ప్రబలాశ్వికసేనా ముఖంబున వాయువేగమున గోలకొండ రాజ్యప్రవేశ మొనరించి, హైదరాబాదు నగరమున కిరువదినాలుగు మైళ్ళదూరమున విడిసియుండిన యౌరంగజేబు కుమారుఁడు—మహమ్మదు సుల్తాను నామధేయుఁడు మీరుజుమ్లాభాగ్య మింకను సుల్తాను నిరోధించెనను నెపమున నాతని వినయసందేశము నిరసించెను.

* పాదుషా డిసెంబరు ౨౯ తేదీని వ్రాసినజాబులు ౧౬౫౬ జనవరి ౮ తేదీన నౌరంగజేబున కందెను, తత్క్షణమాతఁడు తన పుత్త్రునాజ్ఞాపింప, నతఁడు ౧౦ తేదీన బయలుదేరెను.

బెంగళాయీ సేనానివహములు ప్రళయసన్నిభముగఁ దన రాజధాని డాయుననీ కుతుబుషా యెన్నఁడుఁ దలంప లేదు. తదపూర్వజవమును, స్వీయవినయసందేశతిరస్కారమును నిశ్చయముగ నపాయసూచకములని సుల్తానునకు స్ఫురించెను. నగరరక్షణ ప్రయత్నము లొనరించుట కిఁక నవకాశము లేదు. పాప, మామంద భాగ్యుఁడు భయభ్రాంతుఁడై, దారాపుత్రాది బంధుజన సమేతుఁడై, సురక్షితమగు గోలుకొండ దుర్గమునకు రయమ్మునఁ బాఱెను. (౨౨-౧-౧౬౮౭).

కుతుబుషా యట్లు శీఘ్రపలాయన మొనరించుటయే మేలాయెను. ఆతని భీరుత్వమే యాతని రక్షించెను. లేదేని- మహమ్మదు క్రూరకుటిలఖడ్గ ధారావిదళితుఁడై యాతఁడు ముహూర్తమాత్రమున మరణించి యుండును. ఔరంగజేబు మాయావియై దాఁచివెడలుట యేకాక, అమాయికుఁడగు సుల్తాను నాకస్మికముగ వధింపవలయునని గూడఁ గ్రూరముగ నాలోచించెను. గమనింపుఁడు.-"కుతుబుషా భీరుఁడు నిన్నెదిరింప నేరఁడు దుర్గముచుట్టును ఫిరంగుల నమర్చుము: అతఁడు గోలుకొండకుఁ బాఱకుండ యప్రమత్తుఁడవై యుండుము: నీవరుదెంచి నన్నాహ్వానింతునని చిరకాలము వేచియుంటి ననియు, నీవు రాకుండుటచేత నేనే యరుదెంచితినని యతఁ బల్కుచు నాప్రమత్తునిఁ జయ్యనఁ బొడిచి కూలి యింపుము: ధైర్యలాఘవకౌశలంబులచే నీకార్యము సులభ సాధ్యము."-ఔరంగజేబీవిధముగఁ దన కుమారున కుపదేశించెను. * విస్పష్టవిషయ విమర్శన మనవసరము.

హైదరాబాదు నగరమున ౧౪౦౦౦ సైన్యముండెను. కాని, ఝరీవేగమున నరుదెంచు రిపుసేనా నివహమును నిరోధింపఁగడఁగుటకు సాహసము చాలక తత్సేనాను లౌరంగజేబుకుమారుని శరణుజొచ్చిరి. వారి ప్రణతు లాతఁడు గ్రహించి, పౌరులను బాధింపనని యభయమిచ్చి, తన సైనికులనట్టులే యాజ్ఞాపించి, సగర్వముగఁ బురప్రవేశ మొనరించెను. కాని, ప్రపంచవజ్రవ్యాపారమునకుఁ గేంద్రమగు హైదరాబాదు భాగ్యము వర్ణనాతీతము. బెంగళాయీ సైనికు లాజ్ఞ మీఱి, రెండు దినము లానగరమును నిరాఘాటముగ దోచుకొనిరి. సుల్తానగు కుతుబుషా యమూల్యాభరణాదులను గొంపోయినను, ఆతని యంతిపురభాగ్య మనంతముగ నుండెను. తన సైనికు లరక్షితప్రజాధనాపహరణ మొనరించి నపుడు తనపాపమేమని తలంచి కాఁబోలు, బెంగళాయీ రాజకుమారుఁడు స్వీయసైన్యపరిరక్షితుఁడై, యన్య రాజధనగ్రహణము యథేచ్ఛగ నొనరించెను. నాఁటి దోపిడి గణనాతీతము. ఐనను, ఆనగరభాగ్య మెట్టిదో, గాని, శత్రునిగ్రహణానంతర మయ్యది యథాభాగ్యముతోఁ గలకల లాడుచుండెనని నాఁటి చరిత్ర కారులు వ్రాసిరి.

స్వీయరక్షణార్థము గోలుకొండకుఁ బాఱిన కుతుబుషా సంధికొఱకుఁ గడుఁ దత్తరపడెను. విరారు జాగ్లా ధనంబులిచ్చివైచి, యౌరంగజేబు పుత్రున కనుదినము బసదనము లంపుచు, క్షమింపవలయునని యనుదినము సందేశమంపుచునే యుండెను. కాని, ప్రయోజనమేమి? సంధిప్రయత్నము భగ్నమగుటచేత, కుతుబుషా బీజపుర సుల్తానుసాహాయ్య మపేక్షింపుచు నభేద్యమగు గోలుకొండ దుర్గమున నప్రమత్తుఁడై యుండెను.

బీజపురసుల్తాను భయంబునఁ గొంతకాలము వేచి యుండిన యౌరంగజేబు తద్భయ మంతరించినంతనే, యతిరయమున గోలుకొండ దుర్గము సమీపించెను. సుల్తాను నిరపాయముగ నటుపోఁజొచ్చుటచేత నాతఁ డాదుర్గమును యథాక్రమమున ముట్టడింపవలసినవాఁ డాయెను. ఆదుర్గ మొకవంక దుర్గమారణ్య పరిరక్షితమైన కారణమున రిపుసైన్యములు మూఁడువైపుల నప్రమత్తతతోఁ గావలియుండెను. వడివడి నేతెంచిన బెంగళాయీ ఫిరంగులకంటె గోలుకొండ ఫిరంగులు ఘనతరము లగుటచే నౌరంగజేబు కార్యకుశలుఁ డయ్యుఁ దనశతఘ్నీదళ మరుదెంచునంతకుఁ దాళవలసినవాఁ డాయెను. గోలుకొండ సైనికు లప్పుడప్పుడు వైరుల నాకస్మికముగఁ దాఁకి, చేయఁగల సంహార మొనరించి, రయమున దుర్గ

* cf. J. N. Sarkar, P. 230.

ములోనికిఁ బోవుచుండిరి. ఈముట్టడి యీవిధమున ౧౬౫౫ ఫిబ్రవరి ౭ మొదలు మార్చి ౩౧ వఱకు సాగెను.

సుల్తాను స్వీయరక్షణోపాయ మరయుచున్నను, సంధిప్రయత్నముమాత్ర ముపేక్షింపలేదు. అతని యవిరళోపాయనము లౌరంగజేబున కందుచునే యుండెను. కాని, యాతఁ డారాజ్యమంతయుఁ గబళింపనెంచి, సుల్తానును దృణీకరించి, తనతండ్రియాజ్ఞ కొఱకెదురు చూచుచుండెను. షాజహాను నతఁ డెట్లు ప్రోత్సహించెనో గమనింపఁదగియున్నది.—"తండ్రీ, హైదరాబాదు భాగ్యవైభవము లద్వితీయములు: లెక్కకుమీఱిన జలాధారములతోడను, ఎటుచూచినను మరకతములు పండినట్లు పచ్చఁగాఁ గలకలలాడు విశాలక్షేత్రములతోడను, వెలలేని వజ్రపు గనులతోడను నిండి నిబిడమైయున్న యీదేశమును వర్ణింపఁజాలను... ఈతఁడు 'షియా' మతస్థుఁడు, నాస్తికుఁడు: మన మిట్టి నీతిబాహ్యుని శిక్షింపకుండుట యధర్మము......ఈతఁడు ప్రజాకంటకుఁడుగూడను ఇట్టి యవకాశముఁ బోనిచ్చుట యవివేకము*".—పాదుషాకు నీతనిపై నాశామతావేశములు రగుల్కొల్పి, యాతని యనుమతివడసి, కుతుబుషాను భంజించి రాజ్యచ్యుతు నొనరించి, యా రత్నగర్భ నాక్రమింపవలయునని యౌరంగజేబు నిశ్చయించెను. తనదేశము సుభిక్షమై భాగ్యవంతమై యుండుటయే సుల్తాను చేటుమూఁడుటకుఁ గారణమాయెను!

కాని, షాజహాను అంతటి కఠినుఁడుగాఁడు. నిజకుమారవిరచిత మాయానాటక మింకఁ దెలియంగకున్నను, ఒక యల్పనేరము బురస్కరించుకొని మూర్ధాభిషిక్త భూపాల రాజ్యాపహరణ మొనరించుట కిచ్చగింపక, యుచితపరిహారమువడసి యాతని రాజ్యము విడిచివేయ వలయునని పాదుషా యౌరంగజేబు నాజ్ఞాపించెను. (ఫిబ్రవరి, ౮) కాని, యాజాబుచేరు లోపున సుల్తానుస్థితి యింకను విషమమాయెను. అతని సైనికులు స్వామిభక్తియు, దేశభక్తియు వలంపక, శత్రుపక్షమునకుఁ బోవ నారంభించిరి. సుల్తాను భయవిహ్వలుఁడై యెట్టులైన సంధిగావించుకొనవలయునని తత్తరపడెను, మొగలులు బాకీమాపిన పైకమేగాక, విశేషపరిహార మర్పించుటకును, ఔరంగజేబు కుమారునకుఁ దన కుమారి నొసంగుటకును అతఁడు సంసిద్ధుఁడాయెను. ఈ రాయబారము దనపైనైచుకొని, యౌరంగజేబును దర్శించి, ప్రార్థించి, సంధి యొనరింపవలయునని సుల్తాను తల్లియే బయలుదేఱెను. ఇట్టిదైన్యమునకుఁ బాల్పడిన కుతుబుషా షాజహానుకు వ్రాసిన లేఖాసమాచార మెఱుంగునేని వెట్టునేయు నని యెంచి, యౌరంగజే బావిషయమును మఱుఁగుపఱచెను. అందులకు షాజహాను సమ్మతించెనట! మహారాజులు చపలచిత్తులుగదా! ఔరంగజేబు ఒకకోటి రూపాయల పరిహారము గోరెను.

కాని, షాజహానున కంతలోఁ దనపుత్రుని కుటిలవర్తనము పూర్తిగఁ దెల్లమాయెను. కుతుబుషాయొక్క రాయబారి జహానారాదారాలను బ్రసన్నుల నొనరించుకొని, వారి ముఖమునఁ బాదుషాకు యథార్థము విన్నవించెను. తోడనే, రారాజు క్రోధప్రకంపితుఁడై గోలకొండముట్టడి తత్క్షణము చాలింపవలయుననియు, నారాజ్యమునుండి యాతఁడు సైన్యము గదలింపవలయుననియుఁ దన కుమారు నాజ్ఞాపించెను. ఈయాజ్ఞ రహస్యముగనుండక సైన్యమున కంతటికి వెల్లడియగుటచేత నా యవమాన మౌరంగజేబునకుఁ గడుంగ దుస్సహమాయెను. గోలకొండదేశాధిపతియగు కుతుబుషా నాశించిన యపాయ మేఘము మాటలఁగుఁ దొలంగెను. ఐనను, సుల్తాను తన పుత్రిక నౌరంగజేబు కుమారునకొసఁగెను. అధికపరిహార మర్పించుటకుఁ గూడ నాతఁడు సమ్మతింపవలసినవాఁ డాయెను. తద్భారము నొకింత షాజహాను క్రమముగాఁ దగ్గించెను. కాని, సుల్తాను రామగిరియను జిల్లాగూడ మొగలుల కర్పింపవలసినవాఁ డాయెను.

* "Not to punish such a heretical ruler would be a failure of duty on the part of an orthodox Islamic Emperor! To miss this opportunity of crushing such an enemy would be highly impolitic." Sarkar—p. 236.

మన మీసందర్భమున గమనింపవలసిన ముఖ్య విషయ మేద్దియన, ఔరంగజేబునకును దండ్రికినిగల కలఁతలు మితిమీరా లెను. ధనాభావముచే ఔరంగజే బెట్లు సంకటపడెనో, షాజహా నాతని విశ్వసింపక యెంతటూల నాడెనో గమనించితిమే యుంటిమి. గోలుకొండసుల్తా నొసఁగు పరిహారమునందుఁ బాలిత్తునని షాదుషా తొల్లి బాస యొసరించెనట. ఆమాటఁ బాటించి సమరసన్నాహము లొనరించిన యౌరంగజేబు ఋణగ్రస్తుఁడాయెను. కాని, యతనిపైఁ గుపితుఁడైన షాజహాను తనపుత్త్రుఁ డాదాడియందు సమృద్ధ నార్జన మొనరించెనని విశ్వసించి తను వాతఁడు వంచించెననియుఁ దలంచి, కఠినముగ నిరసించి, కుతుబుషా యొసఁగిన బహుమానములను పరిహారమును దక్షిణము లేవ కంపవలయునని యాజ్ఞాపించెను. ఔరంగజేబు నేరమింతైనంతయు లేదు. అతఁ డటు లొనరింపఁ దలంచియే యుండెను. తన్నిష్ఠురవచోఘాతముల కోర్వఁజాలక, ప్రాణమొక్క చీరికింకొనక రాజసేవాపరతంత్రుఁడైయుండు తన్నువట్టి ఘోరావమానము నకుఁ బాల్పఱచుట యన్యాయమని విలపించి, షాజహాను కోరినవానినేగాక, తనకుమారుఁడు, దానును గైకొనిన యల్పబహుమానములనుగూడ నౌరంగజే బంపివైచెను. తాదృశ బహుళావమానములచే నాతని హృదయము కఠినతరమై తుదకు దయారహితమాయెను. ఆమహాశూరుఁ డచిర కాలమున భ్రాతృరుధిరార్ద్రశరీరుఁడై, పితృనిర్బంధకారకుఁడై, సామ్రాజ్యసింహాసనారోహణ మొనరింపఁ జాలిన పరిస్థితు లెటులేర్పడెనో యిఁక నరయవలయు.

---

## మెఱుపులు

సాధకుఁడు

౨౬

నీకును ఇంత భేదము కలదా? నన్నింత యెడముగా నుంచితివేమి?

౨౭

నేను నీ త్రొక్కుడు బండిని.

౨౮

నేను ఎఱుకనొందితి నని కలనైనను రా దేమి?

౨౯

జ్ఞాని కర్మయోగి కానిచో లోభి.

౩౦

మానసమను ఇసుకదిన్నెలో పడిన నీ యడుగుజాడల వెంబడి పోవఁగాఁబోవఁగా దరిలేని యేఱు అడ్డమువచ్చెను. నీపాదచిహ్నములే కరఁగి ఆ యేఱాయెనా? శరీర మందు తేలదు. ప్రాణము లంతకంటెఁ దేలవు. అంతఃకరణమందు దిగిన వెంటనే ఈవలి యొడ్డునకుఁ గొట్టుకొనివచ్చును.

౩౧

మంచిచెడ్డలు మనుజుఁ డెఱుఁగు. తెలిసియు చెడ్డలో నడుగిడువాఁడు మనుష్యపశువు. మంచిలోనే మంచె కట్టువాఁడు మనుష్య దేవుఁడు. మంచిచెడ్డలకు ఆవలనున్నావు నీవు.

౩౨

చెట్లు తమంత ఫలించును. వేళ్లు వెల్లఁకులు తమంత మొలుచును. మనుజుఁడు సర్వాధికారముతో వానిని అమ్ముకొనును.

౩౩

ఎవరిమతము వారి కభిమతము. ఇతర మత మతిపాతము.

౩౪

ఉచ్ఛ్వాస నిశ్వాసములు 'నీవు' 'నేనూ' అని పాటపాడుచున్నవి.

౩౫

కర్మయోగము జ్ఞానికి ఆయుధము ; సాధనకు బడి.

౩౬

కలలో మా గురువులు నేఁడు వేంచేసిరి.

వారు వందనము స్వీకరింపరు.

రాకరాక వచ్చిన గురువులను పాదాభివందనము చేయక ఊరక యెటులుండుట ?

వింతగా ఒక ఛాయ పుట్టి మా గురువుల పాదము లంటుకొనెను. వారు వారింపలేదు. నేను దానివెనుకనే దాఁగి వారిపాదములమీఁద బాష్పాభిషేకము చేయుచుంటిని

ఉలికిపడి లేచి చూతునుగదా మంచపుఁగోళ్ల శిఖరములు రెండును నా రెండు చేతులక్రింద.

౩౭

నేను స్త్రీని, పురుషుఁడనూ.

౩౮

ఒకొక్క పూవు ఒకొక్క భక్తి

౩౯

౧

వైరాగ్యము గభీమని ఇంద్రియముల మూతులు కట్టివైచెను ; నన్ను వెతుక మొదలిడెను. ఇంద్రియము లన్నియు నెండిపోయెను ! అధిష్ఠాత వైరాగ్యమును ఎండిపోయెను. ఇంద్రియములు నశించెను ; వైరాగ్యమును నశించెను. నిగ్రహః కిం కరిష్యతి ? వైరాగ్యము మరల కామనగా జన్మించెను.

౨

ఇంద్రియముల కెడ తెలుపి లేదు. అన్నిటిఁ దినెను. అన్నిటిని బీల్చెను. అన్నిటిని వినెను. అన్నిటిఁ జూచెను. 'మహాశనో మహాపాప్మా' నాని పొట్టలుబ్బెను; ఎండియుండి యెటులు బాధపడెనో ఉబ్బియుబ్బి యటులు బాధపడెను.

౪౦

మనుజుఁ డనుకొనెను—'నా శరీరము ముడతలుపడెను. వెంట్రుకలు జనపనార యాయెను' అని

మనస్సనెను. 'నీమాట నిక్కమే. నాకుఁ బ్రాయమెపుడును ముప్పదియే. నాకెపుడును క్రీడయే' అని.

---



'చెమ్మ చెక్క'

చిత్రకారుడు: శ్రీ దామెర్ల ప్రబోధచంద్రుడు గారు, రాజమండ్రి.

చావలి వెంకటహనుమంతరావుగారు, యమ్. ఏ

# కేంద్రరాష్ట్ర ప్రభుత్వముల ఆర్థిక సంబంధములు

## ౨

కేంద్రప్రభుత్వమువారు చేయవలసినకార్యములనుబట్టి చూచిన వారికి ఇప్పుడున్న ఆదాయము వచ్చుమార్గములు వారు ఖర్చుపెట్టవలసినదానికంటె ఎక్కువ ఆదాయము నిచ్చునవై యున్నవి. ఆప్రభుత్వమునకు ముఖ్యమైన ఆదాయమార్గము ఎగుమతి దిగుమతి పన్నులు Customs Duties). ఈపన్నులనుండి సంవత్సరమునకు 48 కోట్లరూపాయల ఆదాయము వచ్చుచున్నది. ఈ సొమ్మంతయు ప్రస్తుతము ఆదాయముకొరకే (Revenue Duties) వేయు సుంకములవలనే వచ్చుచున్నది. దేశపరిశ్రమలను రక్షించు (Protection) నిమిత్తము ప్రభుత్వమువారు చాల తక్కువ దిగుమతి పన్నులను విధించుచున్నారు. ప్రభుత్వమువారిచ్చుచున్న దేశపరిశ్రమల రక్షణ విధానము వలన పెంపొందుచున్న పరిశ్రమలు చాల తక్కువగ నున్నవి; ఇంకను ఈ విధానమును అనేకములైన ఇతర పరిశ్రమలకు పొడిగించుటకు చాల అవకాశమును, అవసరమునుకూడ కలవు. ఇప్పుడు మన దేశమందు దిగుమతి పన్నులు బట్టలు, పంచదార, మోటారుకార్లు, ఇనుము ఉక్కుసామానులు మొదలగు వస్తువులపై విధింపబడుచున్నవి. ఇవిగాక పరదేశములనుండి దిగుమతియగు వస్తువు లనేకము లున్నవి; వాటియన్నిటిపైనను సుంకముల విధించుటవలనను, వాటి దిగుమతి నరికట్టుట వలనను దేశమునకుచాలలాభము చేకూరును అట్టివిధానమువలన ప్రభుత్వమునకు ఆదాయ మువచ్చుటయే కాక దేశప్రజలకు పరదేశ వస్తువులపై వ్యామోహమునుతగ్గించి స్వదేశపుసరకులను కొనుటకు ఒకవిధమైన పూనికనుకూడ పుట్టించును. కేంద్రప్రభుత్వమువారు రక్షణ సుంకముల నిప్పుడు ఇనుము, ఉక్కుసామాను పైనను, సిమెంటు, అగ్గిపుల్లలు మొదలగు వాటిపైన మాత్రమే విధించుచున్నారు. ఇవిగాక అనేక పరిశ్రమలకీరక్షణపద్ధతి నేర్పాటు చేయుటవలనను, ఇతరసరకులపై దిగుమ సుంకములను విధించుటవలనను ఇప్పటికన్న 10 కోట్ల రూపాయల ఎక్కువ ఆదాయ వచ్చుటకు వీలున్నవి. ముఖ్యముగా రక్ష నీయవలసిన పరిశ్రమలలో బట్టల పరిశ్ర ప్రధానస్థాన మాక్రమించుచున్నది. ఈ శ్రమకు రక్షణనిచ్చు విషయము నాలోచిం టకు ప్రభుత్వమువారు ప్రత్యేక సంఘ (Special Textle Tariff Board)నొకదానినే టుచేసిరి. వారు రక్షణనిచ్చుట అవసర

సూచించినప్పటికిని ప్రభుత్వమువా రా సూచన పై ఏవిధమైన చర్యనుగాని తీసుకొనలేదు. ప్రపంచమం దన్నివిషయములలోను చాల ముందడుగు వైచుచున్న అమెరికా సంయుక్త రాష్ట్రములవంటి దేశముకూడ దిగుమతి పన్నులను విధించి ఆదేశమునకు పరదేశవస్తువులు రాకుండ దారి బంధించుచుండ, ఇంకను పూర్తిగ పరిశ్రమలు వృద్ధికాని మన దేశమందు ఇష్టము ననుసరించి వర్తకము (Free Trade) చేయుపద్ధతిని అనుసరింపజేయుట చాల విపరీతమైన విషయము. ప్రపంచమం దితరసంయుక్త రాజ్యములం దన్నిటియందును, అనగా అమెరికా, దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా, జర్మనీ మొదలగు వాటియందు, ఎగుమతి దిగుమతిపన్నులు కేంద్రప్రభుత్వ ఆదాయమార్గములలోనే చేర్చబడినవి. ఇతర దేశములవారి ఉదాహరణను బట్టి చూచినను, ప్రస్తుత మమలులోనున్న పద్ధతినిబట్టి చూచినను ఈపన్నులను విధించుట, వాటి ఆదాయమును ఖర్చుపెట్టుట మొదలగు పనులన్నియు కేంద్రప్రభుత్వమువారి యాధీనమునం దుండుటయే సమంజసము.

భారత ప్రభుత్వము వారికి ఇప్పుడున్న ఆదాయమార్గములలో రెండవది ఆదాయపు పన్ను (Income-tax). ఈ పన్ను మన దేశమం దిప్పుడిప్పుడే విరివిగా వాడుకలోనికి తీసికొనిరాబడుచున్నది. దాని మార్గముగా ప్రతిసంవత్సరమును ప్రభుత్వమువారికి 16 కోట్ల రూపాయలు ఆదాయము వచ్చుచున్నది. ఇప్పటి కాలములో ప్రపంచమందు ప్రభుత్వములన్నిటికిని ఈఆదాయపు పన్ను కామధేనువుగా నుండి వారివారి పన్నుల విధానములలో (Tax systems) ప్రధానస్థాన మాక్రమించుచున్నదని చెప్పవచ్చును. దానిని సరియగుమార్గములం దుపయోగించుకొనినను, జాగ్రత్తగను, పరిశీలనగను రేట్లు ఏర్పాటుచేసి విధించినను ఇప్పుడు వచ్చుచున్న దానికన్న ఇంకను చాలఎక్కువ ఆదాయము వచ్చుట కవకాశములున్నవి. చిన్న ఆదాయములపై తక్కువపన్ను, పెద్ద ఆదాయములపై ఎక్కువపన్ను (Progressive Taxation) ను, ఇతర దేశములందునివసించు హిందూదేశపు ఫించను, ఉద్యోగస్థులఫించను ఆదాయములపైపన్నును, ఆదాయపుపన్నులకు దగ్గర సంబంధము కల్గియుండునట్టి మరణ సుంకములు (Death Duties), ఆదాయపు అదనపు పన్ను (Super Tax)లను—వీటినన్నిటిని ఒక పద్ధతిపై ఏర్పాటుచేసి విధించుచుండిన, ఇప్పుడు వచ్చుచున్న దానికన్న 12 కోట్ల రూపాయిల ఎక్కువ ఆదాయమును సంపాదించుటకు వీలున్నది. పోయిన రెండుమూడు సంవత్సరములనుండి ప్రభుత్వమువారు ఆదాయపుపన్ను శాఖను జలపర్చి ఆపన్నును విధించుట యందును, వసూలు చేయుటయందును క్రొత్త పద్ధతుల నేర్పాటు చేయుచున్నారు. ఆ ఏర్పాట్ల ఫలితము లప్పుడే కొద్దికొద్దిగ కన్పించుచున్నవి. ఈవిషయ మట్లుండ ఆదాయపుపన్నులమూల సూత్రములను విచారించిన ఆపన్ను రాష్ట్ర ప్రభుత్వ ఆదాయమార్గములపట్టికలో చేర్చుట

ఎక్కువసమంజసమని బోధపడును. ఆదాయపు పన్ను ఒకసూటిపన్ను (Direct Tax). అనగా దాని విధించువారి ఉద్దేశ్యము అది ఎవరిపై విధించబడినదో వారే చెల్లించవలెను గాని ఆ బరువును (Incidence) ఇతరుల భుజములపైకి మార్చకూడదు. ఇప్పుడు పైన విచారింపబడిన ఎగుమతి దిగుమతిపన్నులు(Indirect Tax) పద్ధతిలో చేరును. అనగా అవి ఎవరిపై విధింపబడినవో వారు ఆపన్నులబరువును ఇతరులమీదికి మార్చుటకవకాశ మున్నది. ఎగుమతి దిగుమతిపన్నులు మొట్టమొదట వర్తకులు చెల్లించినప్పటికిని వారాపన్నులను వస్తువులుకొనువారి (Consumers) పై త్రోసివేయుట కవకాశము లున్నవని చెప్పిన, Indirect Tax అనగా నేమో సుబోధకమగును. సూటిపన్నులన్నియు ఇతర దేశములలో రాష్ట్రప్రభుత్వమువారి అధీనములోనే యున్నవి. అట్లు చేయుటవలన పరిపాలనా సౌకర్యదృష్టినుండి చాలలాభము లున్నవి. మరియు రాష్ట్రములకీపన్నును విధించుటకును, వసూలుచేయుటకు ండు సౌకర్యములు కేంద్ర ప్రభుత్వమువారి కుండవు. ఈవిషయము లాలోచించిన ఆదాయపుపన్ను రాష్ట్రప్రభుత్వముల యాజమాన్యముక్రిందకు మార్చుటయే మంచి పద్ధతియని చెప్పవచ్చును. దానికి ప్రత్యామ్నాయముగ కేంద్రప్రభుత్వమువారికి వేరుఆదాయ మార్గములను సూచించుట అవసరము. రాష్ట్రముల క్రిందనున్న మద్యపానపు సుంకములను వారికి ఇచ్చుటవలన, ఆదాయము పన్నును వదులుకొనుటవలన వారు చేయు స్వార్థత్యాగమునకు సరిపోవునట్టిపని జరుగును. ఈవిషయమునుగూర్చి విపులముగ మద్యపానసుంకముల విచారణసందర్భములో ఆలోచించెదము.

ఇండియా ప్రభుత్వమునకు ఆదాయము వచ్చు మార్గములలో మూడవది రైల్వేలు. నాలుగుసంవత్సరముల క్రిందటివరకును ఇనుపదారులు ప్రత్యేకయాజమాన్యముక్రింద నుంచబడి వాటివలన వచ్చు ఆదాయము ఇండియా ప్రభుత్వమువారి సాంవత్సరిక ఆదాయవ్యయ పట్టికలో (General Budget) ఇతర విషయములతోపాటు కలిపి చూపబడుచుండెడిది. కాని 1925 సం.లో అక్వర్తుకమిటీ (Acworth Committee) వారిసూచన ప్రకారము వాటి ఆదాయవ్యయపట్టిక వేరుచేయుబడినది. ఆసంవత్సరమునందే మన దేశస్థులుచిర కాలమునుండి కోరుచున్న ప్రకారము కొన్ని రైలుమార్గములను ప్రభుత్వమువారు తమస్వంత యాజమాన్యము state (management)) క్రిందకు తీసుకొనిరి హిందూదేశములో రైలుమార్గముల ప్రాముఖ్యమును, వాటివలన వచ్చులాభమును, దేశాభివృద్ధికై ఖర్చుపెట్టుటకు ప్రభుత్వమువారి అంగీకారమును, ఈమార్పు చేయుటవలన తేటతెల్లమగుచున్నవి. దాని మూలమున ప్రభుత్వమునకు ఎక్కువ ఆదాయము చేకూరుటయేగాక ప్రజలకు సౌకర్యముగా నుండునట్లు రైలు మార్గములు నడుపబడుటకుకూడ అవకాశము లేర్పడినవి. కంపెనీలయాజమాన్యమునందుండుటకన్న ప్రభుత్వయాజమాన్యముక్రింద నుండుట

వలన ప్రజలకు ఏవిధముగ ఎక్కువ లాభము అను ప్రశ్న కొంతమంది వేయవచ్చును. కంపెనీలు ప్రజల కేమియు బాధ్యత వహించని సంస్థలు. వాటి డైరెక్టరులకు వీలైనంత ఎక్కువలాభము సంపాదించవలెననియే కాని రైళ్లలో ప్రయాణము చేయు ప్రజాసామాన్యమునకు సౌకర్యము లేర్పాటు చేయుటకేబాధ్యతయు లేదు. ప్రభుత్వ యాజమాన్య మన్ననో, ప్రజాబాహుళ్యముయొక్క బాగోగులను విచారించుట ప్రభుత్వమువారి విధియై యున్నది. రైల్వుప్రయాణీకుల సౌకర్యవిషయములందేమి, రైలుమార్గములలో పనిచేయుచున్న పనివారల మంచిచెడ్డలను విచారించు విషయములోనేమి, దేశాభివృద్ధికి తోడ్పడు క్రొత్తరైలుమార్గములను ఏర్పాటు చేయుటయందేమి, దేశీయులను రైల్వే ఉద్యోగములలో అధికసంఖ్యాకులుగ చేర్చుకొని విదేశీయులచేతిలోనుండు అధికారమును తగ్గించుటయందేమి ప్రభుత్వయాజమాన్యము క్రింద సంస్కారము వచ్చినట్లుగ కంపెనీవారి యాజమాన్యముక్రింద రాదు. రైల్వేమార్గముల నిర్వహణమందేలోటు లున్నను శాసనసభలో నున్న ప్రజాప్రతినిధులు వాటిని తగువిధమున మందలించి కావలసిన మార్పులను కోరుటకు కూడ ప్రభుత్వ యాజమాన్యములో ఎక్కువ అవకాశము లుండును. 1925 సం.లో కేంద్ర శాసనసభ (Legislative Assembly) లో చేయబడిన తీర్మానముప్రకారము రైల్వేఆదాయము నుండి జనరల్ రెవిన్యూ (General Rcvenues) లకు ఖర్చులన్నియు పోను మిగిలిన సొమ్ములో 1/5 భాగమును, ఇంకను మిగిలిన సొమ్ము 3 కోట్ల రూపాయిలకు ఎక్కువగానున్న, దానిలో ⅓ భాగమును ఇచ్చుట కేర్పాటు చేయబడెను. ఇప్పుడు మన దేశము మొత్తముమీద 40,000 మైళ్లకుమాత్రమే రైలుమార్గము లున్నవి; ఇంకను 10,000 నుండి 20,000 మైళ్ల రైలుమార్గములను వేయుటకు అవసరమును, అవకాశము కూడ నున్నవి. దీనికంతకును 50 కోట్ల రూపాయిలు మొదట పెట్టుబడి పెట్టవలసివచ్చునను మాట నిజమేకాని దానివలన దేశమునకు కలుగులాభము, ప్రభుత్వమునకువచ్చు ఆదాయము రెండునుకూడ చాల వృద్ధియగును. 1928-29 సంవత్సరపు ఆదాయవ్యయపట్టిక ప్రకారము ఈమార్గమునుండి ప్రభుత్వమునకు 5 కోట్ల 50 లక్షలరూపాయిలు ఆదాయము వచ్చినట్లు కన్పించుచున్నది. పైన సూచింపబడిన మార్పు జరిగిన ఆ ఆదాయము ఇంకొక 5 కోట్లవరకు హెచ్చగునని చెప్పవచ్చును. రైలుమార్గములను ఎక్కువ చేయుటతోడను, వాటిని జాగ్రత్తగ ప్రభుత్వమువారే నడుపుటవలనను ప్రభుత్వాదాయము ఇంతవరకు లాభము పొందుననుటకు సందేహము లేదు. ఇతర దేశముల పరిస్థితులను బట్టి ఆలోచించిన కూడ ఇనుపదారులు కేంద్రప్రభుత్వ ఆదాయమార్గముగానే యున్నవి.

కేంద్రప్రభుత్వమునకున్న ఇతర ఆదాయమార్గములలో ఉప్పుపన్ను, నల్లమందు

పన్ను, పోస్టలు శేట్లనుండి వచ్చు ఆదాయము ముఖ్యమైనవి. ఉప్పుపన్నునుండి ఇప్పుడు ప్రభుత్వమునకు ఏటేట 8 కోట్ల రూపాయలు ఆదాయము వచ్చుచున్నది. ఉప్పుపై పన్ను వేయుట చాల అన్యాయమనియు, ఆపన్నును తగ్గించుటకాని వీలైన తీసివేయుటకాని జరుగవలెననియు ప్రతిసంవత్సరమును అసెంబ్లీలో అనధికార సభ్యులు తీర్మానములను ప్రవేశ పెట్టుచున్నారు, కాని ప్రభుత్వమువారుమాత్ర మేదో యొక కారణము చెప్పి దానిని ప్రతిఘటించుచున్నారు. ఇక ముందైనను ఈ పన్నును తగ్గించవలసిన అవసరము వచ్చునని దృఢముగ నమ్మవచ్చును. కాని వేరు ఆదాయమార్గమేమైనను స్పష్టముగ వ్యక్తీకరింపబడిన కాని ఉప్పుపన్నును పూర్తిగ తీసివేయుట తెలివి తక్కువయని మాత్రము గ్రహింపనగును. పన్నుల విచారణ సంఘము (The Taxation Enquiry Committee) లో ఒక సభ్యుడగు డాక్టరు పరంజిపైగారు ఉప్పుపన్ను 8 అణాలకు తగ్గించవలెనని సూచించియుండిరి. ఆ సూచన సమంజసముగ నేయున్నది. ఉప్పుపన్నును అట్లు తగ్గించిన ప్రభుత్వ ఆదాయములో లోటువచ్చునని తలంచుట పొరపాటు; ఎందువల్ల ననగా, పన్ను తగ్గినకొలదిని దాని ఉపయోగించుట ప్రజలలో ఎక్కువయి అమ్మకము కూడ వృద్ధిచెందును. 1923 సంవత్సరములో ప్రభుత్వమువారు ఉప్పుపన్నును తగ్గించినప్పుడు ఆదాయము 7 కోట్లనుండి 10 కోట్ల రూప్యాలవరకు హెచ్చాయెను. మరుసటి సం॥తిరిగి హెచ్చుచేయుటతో ఆదాయము 7 కోట్ల 85లక్షలరూప్యాల లోనికి పడిపోయెను. దీనినిబట్టి పైన చెప్పినవిషయములోని నిజము గ్రహించవగును. ఇది కాక ప్రభుత్వమువా రిదివరలో చేసిన వాగ్దానము ప్రకారము వారి ఆర్థికస్థితి బాగుపడినవెంటనే ఉప్పుపన్నును తగ్గించుబాధ్యత వారిపైననే కలదు. 1928 సంవత్సరపు మార్చినెలలో సర్ బాసిల్ బ్లాకెట్ గారు ప్రవేశపెట్టిన ఆదాయవ్యయపట్టికప్రకారము ప్రభుత్వమువారి ఆర్థికస్థితి సంపూర్ణముగ మార్పు చెందుటతో రాష్ట్రీయ కప్పములను (Provincial contributions) పూర్తిగ తొలగించుట కవకాశ మేర్పడినది. ఇటుపైన ఉప్పుపన్నును తగ్గించుట జరుగునని తలంచుటలో అసహాజ మేమియు లేదు.

పోస్టలు శాఖనుండి ప్రభుత్వమువారికి వచ్చుచున్న నికరాదాయము 60 లక్షల రూపాయలు. ఈమార్గమునుండికూడ ఎక్కువ ఆదాయము వచ్చుట కనేక అవకాశములు కలవు. ప్రజలలో పోస్టాఫీసులయొక్క ఉపయోగముల గూర్చి ప్రచారము జరిగినకొలదిని, దేశమందు విద్యాభివృద్ధియై దేశీయులు ఉత్తరప్రత్యుత్తరములను విరివిగ జరుపుకొనుట ఎక్కువమైన కొలదిని ప్రభుత్వమువారికి పోస్టలుశాఖనుండి ఎక్కువ ఆదాయమును సంపాదించుటకు మార్గ మేర్పడును. ప్రస్తుతము గవర్నమెంటువారీశాఖనుండి లాభము తీయుటకు ప్రయత్నించుచున్నారే కాని దానిని ప్రజోపయుక్త శాఖగా పరిగణించుటలేదు. పోస్టలుశాఖలో

ఒక అంతర్భాగమగు సేవింగ్సు బ్యాంక్ (Savings Bank) యొక్క గుణాగణములను సరియైన విధమున ప్రచురణచేసిన ఇప్పటికన్న అనేకమంది తమతమ సంపాదనను దానియందు గుప్తము చేసుకొందురనుటలో సందేహము లేదు. తరువాత పోస్టలురేట్ల విషయములో ప్రతిసంవత్సరమును ప్రజాప్రతినిధులు శాసనసభలో వాటిని తగ్గించి పోస్టుకార్డు 3 పైసలు, కవరు అర్ధణా చేయవలెనని ఉద్ఘోషించుచున్నప్పటికిని ప్రభుత్వమువారు దానిని పెడచెవిని పెట్టుచున్నారు. ప్రభుత్వమువారు ప్రజాప్రతినిధుల కోరికలను మన్నింపకుండుట శోచనీయము! ఎందువల్లనన, ఉప్పుపన్నును తగ్గించిన ఉప్పువాడుక దేశములో ఎక్కువయి ఆదాయము ఎట్లు ఎక్కువ యగునో అట్లే పోస్టుకార్డు కవరుల ఖరీదు తగ్గించినచో వాటిని ఎక్కువవిరివిగా ప్రజలు ఉపయోగింతురు. ఇంతకన్నను ముఖ్యమైన మార్పు ఏమన, ఇతరదేశములలో పోస్టు, టెలిగ్రాఫ్ శాఖలు ప్రజోపయుక్త (Public Utility Department) శాఖలుగా గణింపబడుచున్నవి కాని మనదేశములోవలె ఆదాయమును సంపాదించు శాఖలుగా పరిగణింపబడుట లేదు. మనదేశమందు మాత్ర మట్టి అభిప్రాయములతో ప్రభుత్వము వా రెందు కీశాఖలను పరిపాలించుట కిష్టపడకున్నారో తెలియకున్నది. ఈ శాఖనుండి ఖర్చులు పోను అదనముగా నుండు ఆదాయమును కొంతకాలమువరకైనను ముఖ్యముగా పోస్టలుశాఖలను దేశమందంతటను పెట్టుటకును, పోస్టలు బంట్రోతులు మొదలగు వారి జీతములు వృద్ధిచేయుటకును ఉపయోగించుట అవసరము. కార్డు కవరుల ఖరీదులను తగ్గించుటయు, మనియార్డరు రిజిష్ట్రేషన్ మొదలగు రుసుములు తగ్గించుటయు కూడ అవసరమైన మార్పులై యున్నవి.

ఇంక నల్లమందు పన్నువిషయమై ఆలోచించవలసి యున్నది. ఇప్పటికి రెండు సంవత్సరములనుండి నల్లమందు పన్ను పైవచ్చు ఆదాయము క్రమక్రమముగ తగ్గిపోవుచున్నది. అంతకుపూర్వము ప్రభుత్వమువారికి నల్లమందు వ్యాపారమువలన (నల్లమందును మన దేశములో ప్రభుత్వమువారు తప్ప ఇతరు లెవ్వరను తయారుచేయ కూడదు. అనగా ప్రభుత్వము వారికి దానిని తయారుచేయుటకు Monopoly (సంపూర్ణాధికారము) యున్నది. 3, 4 కోట్ల రూపాయల మధ్య ఆదాయము వచ్చుచుండెడిది. జినివా నల్లమందు సభ (Geneva Inter-National Opium Conference) లో అంగీకరింపబడిన తీర్మానము ప్రకారము ఇండియా ప్రభుత్వము వారు నల్లమందును మందుల (medicinal purposes) కు తప్ప ఇతరముగ ఉపయోగించు నిమిత్తము ఎగుమతి దిగుమతులను నిషేధించి యున్నారు. ఈ నిషేధము వలన ఇండియా ప్రభుత్వమున కాదాయములో కొంత నష్టము కలుగుచున్నప్పటికిని ప్రజల ఆరోగ్యము నల్లమందును తినుటవలన చెడిపోవుచున్నదని ప్రభుత్వమువారు గ్రహించి దానిని నిషేధించుటకును, దానివలన ఆదాయ

మును పోనాడుకొనుటకును ఇష్టపడుట అభినందనీయము.

పైన విచారింపబడినవి కాక భారతప్రభుత్వము వారికి క్రొత్తగా ఆదాయమార్గములు కొన్ని సూచింపవలసి యున్నది. ఉప్పు పన్ను నుండి వచ్చు ఆదాయమును, నల్లమందునుండి వచ్చు ఆదాయమును ఇకముందు తగ్గిపోవలసి యుండునని చెప్పియుంటిమి. మరియు ఆదాయపుపన్నును రాష్ట్రములకు మార్చి ఆబ్కారీ పన్నును కేంద్రప్రభుత్వము వారిక్రింద నుంచవలెనని కూడ సూచింపబడినది. ఆబ్కారీ పన్నుకూడ దేశమందు మద్యపాన నిషేధ సూత్రము అమలునందుండబడు సందర్భములో తగ్గిపోవుననుట నిజము. దానికి బదులు కేంద్ర ప్రభుత్వమువారికి ఆదాయమార్గములుగ రెండు క్రొత్తపన్నులను సూచించుట కవకాశము లున్నవి. ఒకటి, వర్తక వ్యాపార సంబంధమగు (commercial stamps) స్టాంపులపై రుసుము; రెండు, చావుపన్నులు (Death Duties), దాయభాగపు (Inheritance Tax) పన్నులు. నల్లమందు పన్ను, ఉప్పు పన్ను ఏదైన అత్యావశ్యకమగు సమయములలోను, అనివార్యకారణముల వల్ల ఆదాయములో లోటు వచ్చినప్పుడును ఉపయోగములోనికి తీసుకొని వచ్చుటకు వీలగునట్లు ఏర్పాటు చేయవచ్చును. ఈ మార్పులు జరిగిన కేంద్ర ప్రభుత్వము వారి ఆదాయము వారి ఖర్చునకు సరిపోవున ట్లుండుటయే కాక అదనముగ కూడ నుండుట వకకాశము లున్నవి.

---

## అపరిచిత వ్యక్తి *

అయ్యగారి సత్యనారాయణమూర్తి గారు

అధికమై, భీతిఁగొల్పెడు నంబుదంబు
　లాకసంబంత తృటిలోన నలముకొనియె;
కాఱుచీకట్లు భూస్థలిఁ గ్రమ్ముచుండె;
చెంత సమభూమి యొప్పెఁ బ్రశాంత మగుచు.

అట్టి నిబిడాంధకారంబునందు వృద్ధుఁ
డొకఁడు తెరువుఁ గానక డస్సి యున్న రనుచుఁ
దుదకు దైవకృప ననతిదూరమందుఁ
గడుమదంబున నొక 'దీపకళిక' గాంచె.

దివ్వెవెల్గు చూపట్టిన దిక్కువైపు
పోయి, యట నున్న శిబిరముపొంత నిలిచి,
కొనయెలుంగున "నాహార"మనుచుఁ బలికె;
అంత, లోనుండి 'అబ్రహా'మనెడువృద్ధుఁ

డేఁగుదెంచి, దిగుల్పడి, యించుకైన
పటిమ లేక, శల్యములెల్ల బయలువడఁగ
వయసు ముదిరి,యూఁతకట నున్న బడుగుఁ గాంచి
సాదరంబుగఁ దోడ్కొని చనియె నతని.

---

* 'Stranger' అను ఆంగ్లపద్యమున కనువాదము.

దివ్యమగు భోజనము గొని తెచ్చి యతిథి
ముందు వడ్డింప, నాతఁడు వందనముల
నాత్ర మొప్ప సూచించెడు నేత్ర యుగ్మ
మలర మిన్నక కూర్చుండె నంతె కాని
త న్నమిత వత్సలతతోడఁ గన్నతండ్రి
కరణి, భీకరంబైన యాకాళరాత్రిఁ
జొచ్చి, తల దాఁచుకొనఁ దావుఁ జూపినట్టి
సర్వవరదుని ప్రార్థన ల్సలుప లేదు,
ప్రాఙ్ముఖుండౌచుఁ బుడమిపై వ్రాల లేదు.

ప్రభున కొనరించువిందు తెఱంగు దోఁప,
వివిధభక్ష్యములం దిన వేడ్కఁ గరముఁ
జూఁప, 'స్రబహో' మంతట సత్వరముగ,
తనదు దండ మూఁతగఁ జేతఁ దనర లేచి,
"ఓయి! ప్రార్థన సల్పవో? ఉడిగినావొ
దేవపూజ? లేదొకో నీకు దైవభీతి?"

అని యడుగ ముసలి యించుకైన సంశ
యింపకయె "లే"దనఁగ సత్కులీనుఁ డంత
ఖిన్నుఁ డగుచు, "జాలి వొడమె నిన్నుఁ జూడ;
పొమ్ము రయమున, నాకుటీరమ్ము నుండి,
తినకుము మదర్పితాహార"మనుచుఁ బల్క
నంధకారమున నదృశ్యుఁ డయ్యె నతఁడు.

అభ్రచయ మప్డు కడు దట్ట మగుచునుండె,
అమితముగ వీచుచుండె ఝంఝానిలంబు
కన్నుఁ గానరాకుండఁగ గాఢమయ్యె
తిమిరపటల, మట్లయ్యుఁ జోద్యముగ నక్క
టీరమంతయు వెల్గె నపారమైన
దివ్యతేజంబుతోడ నాభవ్యచరితుఁ
'డబ్రహాము' తన్ను సృజించినట్టి దేవుఁ
డచటి కేతెంచెనని నమ్రుఁడగుచు నిలిచె.

"ఈ ప్రచండానిలంబునం దేఁగుదెంచి
నిలువ నీడఁ దిన స్గాదు నిన్ను వేఁడి
ప్రాపు గోరిన బడు గేఁడి? రాత్రియందు
పాంథు నొక్కని దయలేక పాఱఁదోలఁ
గలదె, పరికింప, నీ కధికారబలము?"

అంచుఁ బ్రశ్నించు దేవుని యంఘ్రి యుగ్మ
మునకు భయభక్తు లేర్పడ మ్రోఁకరించి,
కరయుగము మోడ్చి, యొడలెల్ల కంప మొంద,
నురుతరావమానంబుచే శిరము వంచి,
యిలను జూచుచు, "క్షమియింపు మేను వాని
సత్కరించి, యాతిథ్య మొసంగి యుందుఁ
గాని నిన్పూజసేయని కతన నిందుఁ
డయ్యె నతఁడు దేవ!" యనిన నవధరించి,
"ఇంత కాలము వాని భరించినాఁడఁ
గన్ను దెఱచి యాతండు ముం దెన్నఁడైన
మించు సద్భక్తి నన్నుఁ దలంచు నేమొ
యనుచు వేచియుంటి; నకట! తినఁగఁ గూడు,
నిదురపోవఁగ నీపంచ నెలవొసంగ
నేరవైతివె? యొకరాత్రి నీ"వటంచు
దేవదేవుఁడు పల్కె నదృశ్యుఁ డయ్యె.

# ఆఠగడాదుర్గమునకు సమీపముననున్న శిలాలిపి

శ్రీ శ్రీ శ్రీ లక్ష్మీనారాయణహరిశ్చందన జగద్దేవ రాజాబహద్దూర్,
పురాతత్త్వవిశారద-విద్యావాచస్పతి, టెక్కలి జమీందారువారు M R.A.S., M.B.D.M.

ఉత్తరగంజాములో అస్కాకు ౧౧ మైళ్లదూరమునను, బొయిరాణికి యీశాన్యమున ౪ మైళ్లదూరముననున్న చారిత్రిక ప్రాముఖ్యము జెందిన ఒక పెద్దశిలాలిపి కలదు. ఈ లిపి ఖోదితము కాబడిన రాయి ౩ అడుగులు పొడవున్ను, ౨౫ అడుగులు వెడల్పున్ను కలిగియున్నది. సదరురాయి పుత్తరమునకు దుర్గము వైపున ముఖము గలిగియున్నది. అదుర్గముయొక్క పేరు "లాంగొలొ శెణి" దుర్గము. అందులో ఖోదితముకాబడిన లిపి ౨౭ పంక్తులలో నున్నది. సదరు ౨౭ పంక్తులలోను ౧౫ పంక్తులు సంస్కృతశ్లోకములు. తెలుగు లిపిని ఖోదితము కాబడియున్నవి. ౧౬వ పంక్తి సగము భాగము నుండి ౨౪వ పంక్తిసగము భాగమువఱకు సంస్కృత శ్లోకములు ఉత్కలలిపిని ఖోదితము కాబడియున్నవి. మిగతా ౨౫ పంక్తులు ఉత్కలభాషలో ఉత్కలలిపిని ఖోదితము కాబడియున్నవి. ఈ శిలాలిపి ప్రాచీన ఆఠగడాదుర్గముయొక్క హద్దులమధ్యమున గలదు. ఈ స్థలము మంచిప్రాకృతికదృశ్యమున తేజరిల్లుచున్నది. ఈశాసనమును కలిగియున్న గుట్ట ప్రస్తుతము "నాగిరితిమిర" అని పిలువబడుచున్నది. బహుశః సదరు శాసనము నాగరి భాషలో ఖోదితమైయున్న కారణముననో, లేక నగరికి (దుర్గమునకు) సమీపమున నున్న కారణముననో, నాగిరి గుట్ట అని పిలువబడుచున్నది. అనేక సంవత్సరముల నుండి ఈశాసనము ఎండకు ఎండి వర్షమునకు తడిసి శిథిలమయిపోయినను, మిక్కిలి కష్టముతో దీనిలోనున్న అక్షరములనెల్లను కనుగొంటిమి. శిలాశాసనముమాత్రము చెడిపోలేదు. అది యెండకు యెండి వర్షమునకు తడియకుండా జాగ్రత్తపెట్టించిన చాలా బాగుగ నుండును.

ఆ శిలాశాసనమున ఒకటితర్వాత నొకటి జరిగిన మూడు ప్రత్యేకపుకాలములయొక్క మూడులిపులు గలవు.

౧. 'లాంగొలొ శెణి' దుర్గమునకు పశ్చిమమున ౧౫౯౯ క్రీ. శ. త్రవ్వింపబడిన సాగరముగురించి గలదు. సదరుసాగరమునకు 'సింహసాగర'మని పేరు పెట్టబడినది.

౨. ఆసంవత్సరములోనే మరి ౬౫ మాసములు పోయినతర్వాత రెండవలిపి ఖోదితమైనది. పైనుదాహరించిన సాగరములోని నీరు పంకము తీయించి శుభ్రపరుచుటను గురించి గలదు (బహుశః సదరు సాగరములోని నీరు చెడిపోయివుండును).

౩. క్రీ. శ. ౧౫౯౧లో ఆశిలాలిపివద్ద త్రవ్వబడిన సరోవరమును గురించి గలదు. (సదరు సరోవరము యిప్పుడు పూడిపోయి, ఒక గుంటవలె నున్నది.)

## లిపియొక్కపాఠము

౧. శ్రీ గణపతయే నమః శ్రీ శ్రీ మన్మహామండ
ఈర్లీప

౨. నమః శ్రీపాదశాశాసనే ఓం త్రైలింగ్యమధ్య
మే క్షితితలే

౩. శౌరానిదుర్గాధిపః కర్ద్దోర్గర్వ్యధురంధరః ప్రభు

౪. దోషా వైదస్వయే జాతః సుకరెల్లి వెహాస
పాలేత

౫. క్రమ్యథాత్రీతలం॥౧॥అత్రః ధురటాహాపమార్గ
జాంగలపర్వతాం

౬. సర్వాక్రాంతాంమహీంచక్రే శ్రీమన్నొకింప
భూపతిః ॥౨॥ గజపతిహరిపేశే

౭. క్రమ్యతే సార్వభౌమః సమర విజయదక్ష
శార్థచంద్రాన్వయేశః

౮. సకలగుణవిశిష్టః సర్వలోకాశ్రయేష్టః (
గజపతినరసింహదేవర

౯. వాంవతారః ॥౩॥ శ్రీమద్బాహుబలేంద్రచంద్ర కులజో శ్రీసింగ్గభూపా

౧౦. లకోప్రాజ్యరాజ మహేంద్రముఖ్యధరణీ కాళింగసౌరాష్ట్రికై

౧౧. సామ్రాజ్యోత్కలభూభుజో గజపతేః సిం హాసనంపాలిత శ్రీశ్రీలంగ్గల

౧౨. వేణిపశ్చిమతటేస్థిత్వా తటాకో కృత ॥౪॥ సింగ్గనామాయాంతటాకో

౧౩. చంద్రతారకం తటాకో లాంగ్ల వేణ్యాంచ పశ్చిమాశాత టేస్థితః ॥౫॥ శాలివాహ

౧౪. నభూపశ్య విలిఖ్యం తేశకా స్సమాః సహ స్రార్ధ్వం పంచశతం శశిద్వయం ౧౧

౧౫. ద్వేష్టమీ శరత్ విరోధిచైత్రబః పక్షే దశ మ్యాం గురువాసరే చక్రే లంగ్గ

౧౬. లవేణ్యాంచ తటాకం సింహభూపతిః ॥౧॥ శాకే చంద్రేంద్రియేసో శశి

౧౭. న ముపగతే జాయమానే విరోధీ మందవారే శితహ్నిస

౧౮. కలశుభపదే కార్తీకే మాసి పాహా మూహా ముద హాలీపాతిపావెస

౧౯. రన్రోసింహనామకక్షితిపతితిలక-కుర్వన్నిర్మ లాంభః సరసిజకుము

౨౦. దమోదితానాధ - యొన్తాలంగ్గల వేణిదుర్గ సమారెసంతో

౨౧. మయాన్కర్దమం - భాస్వవిత్ శి (శి) ంకాడి దుర్గనాథజంక్వాసాపభూమీ

౨౨. పతిం యోగ్యహ్గోతివికకింప దుర్గేష్వఖిలన్రో సింహదు

౨౩. గ్గంతతో - నిక్వేర్భంజశేదాతనో విజయతే కుర్వాక్

౨౪. సాసాహాసరః (౦) పాండోదో సాబారో వుత్తోరాశొరాఠ మహామదో

౨౫. ఖుల్జిపాతిపధీనారె భాహుబళి ఇంద్రాం కో అజ్ఞ రసా మిస్తారయి

౨౬. జోమ (నొంకొ) నిమితొ్యకొరి సహామకు లీలిరామెసార భారో ఖులిల

## ఈలిపియొక్క భావార్థము

శ్రీగణపతయేనమః శ్రీశ్రీమహామదుమాలీ బాదుషా గారి అధీనములో ఓఢ్ర త్రిలింగ దేశమధ్యమున సుకరల్లి మహానగరేకు చౌపురాణిదుర్గములో ఆధిపత్యము చేయుచుండేవాడు. అతడు బాదుషా భుజపరాక్రమమును జూచి గర్వితుడై యుండెను. ఈయన సయ్యదువంశస్థుడు సముద్రతీరమున వున్న జలపర్వతారణ్య ప్రదేశ మునంతయు ఆక్రమించినవాడై నరసింహనామక రాజు ఒకడుండెను ఈయన గజపతి సింహాసనాలంకృతుడు, సమర విజయుడును, సకలసద్గుణవిశిష్టుడును, ప్రకృతిరంజకుడును నై యుండెను. ఇతడు చంద్రవంశమున జన్మించిన వాడు. ఇట్టి గజపతినరసింహదేవుని రుద్రావతారునిగ భావించి శత్రువర్గము భయపడుచుండేవారు ఇతడు "బాహుబలేంద్ర" ఉపాధిభూషితుడై, రాజమహేంద్ర వరము, కళింగసౌరాష్ట్రోత్కల సామ్రాజ్యములను పాలించుచుండేవాడు. ఈసింహరాజు లంగ్గలవేణి దుర్గమునకు పశ్చిమదిశలో నొకతటాకమును స ౧౫౧౧ శతాబ్ది విరోధిసంవత్సర చైత్ర శుక్ల దశమి గురువారమున ఆచంద్రార్కముండునటుగాను త్రవ్వించెను.

౧౫౧౧ శతాబ్ది విరోధిసంవత్సర కార్తీక శుక్ల శనివారమున మహామదు మాలీబాదుషా నరసింహదేవ మహారాజుగారి ఆదేశక్రమమున మీద చెప్పబడిన తటాకముయొక్క నీళ్లను శుద్ధిపరచుటకున్ను, పద్మకుముద కల్హారములచే నాతటాకము నలంకరించుటకున్ను ఆతటాకముయొక్క వొండుబురద తీయించెను. అందువలన ఈ తటాకమునకు "పాసరోవరమని" నామాంతరము గలదు.

ఈ రాజ్యమునకు ఒకవైపున సింకెదుర్గములో వున్న రాజుయొక్క రాజ్యమున్ను, మరియొక ప్రక్క భంజరాజుల రాజ్యములున్ను గలవు. ఈ రెండు రాజ్యములు నరసింహదేవు మహారాజుగారి అధీనము క్రింద ఉండెను.

౧౪౧౨ శకాబ్దమున మహమ్మదు షబ్జీ బాదుషా అధీనమున బాహుబలేంద్ర(గజపతినరసింహదేవు) ఆజ్ఞానుసారము మహోమదుషాలీ అనే పేరుగలవాడు ఈ ప్రదేశమున ఒక సరోవరమును నిర్మించెను.

ఈప్రదేశముయొక్క ఆకాలపు చరిత్ర కనుగొనుట ఆవశ్యకము గనుక యీక్రిందను క్లుప్తముగా వ్రాయనైనది.

ఈకాలమున అతగడారాజ్యము ఒరిస్సారాజుల అధీనమున వుండెను. గోలుకొండసుల్తానగు ఇబ్రహీము కుతుబ్షా ఉరఫు మల్కి ఇబ్రహీము (క్రీ. శ. ౧౫౫౦-౮౧) గంజాముదనుక వున్న అప్పటి ఆంధ్రత్రిలింగమును జయించి, ౧౫౭౧ క్రీ. శకాబ్దమున అప్పటి అతగడారాజుతో మైత్రిచేసి అతని ఆజ్ఞబడసి భోయిరాణివద్ద ఒక దుర్గమును కట్టించెను. ఇబ్రహీము కులీ కుతుబ్షా కుమారుడైన మహమ్మదు కులీకుతుబ్షా సింహాసనారూఢుడై క్రీ. శ. ౧౫౮౦-౧౬౧౧వరకు రాజ్యముచేసెను. ఈశాసనములు మహమ్మదు కులీకుతుబ్షా కాలములో ఖోదితము కాబడినవి. ఇబ్రహీముకుతుబ్షా దండయాత్రచేసి తనరాజ్యమును గంజామువరకు ఆక్రమించినప్పుడు, అక్బరు మొగలాయి చక్రవర్తి వుత్తరమునుండి దండయాత్రను గావించి, తనరాజ్యమును గంజాం జిల్లాలోని కొక్కలివరకు వ్యాపింపజేసెను. గనుక ఇబ్రహీము కుతుబ్షా అతగడారాజులతో స్నేహముచేసెను. ఈ కాలములో ఒరిస్సారాజు గజపతినర్సింగదేవు వురఫు రామచంద్రదేవు. ఈయన భోయీవంశీయుడు. ఉత్కల సౌరాష్ట్రరాజమండ్రీరాజ్యములు, అనగా వుత్కలదేశము నుండి గోదావరివరకు సముద్రప్రాంతమునగల యావత్తు ప్రదేశము అతని ఆధీనములో వుండెను. అప్పటిసుల్తానగు మహమ్మదుకులీ కుతుబ్షాయొక్క మహమ్మదీయ నాయకుడైన ముకరెల్లమోహను భోయిరాణిదుర్గములో నుండెను.

క్రీ. శ. ౧౫౬౮లో ముకుందదేవు కాలముచేసినప్పుడు అక్బరుమొగలాయిచక్రవర్తియొక్క మొగలాయి గవర్నరు టోడరుమాలు అనేవాడు ఒరిస్సా యావత్తు కొల్లచేసి రెండు భాగములుగా విభజించెను. ఉత్తర

అతగడాదుర్గమునకు సమీపమునున్న శిల...

ముగ జలేశ్వరు, భద్రమ, కటకు కలసినప్రాంతమున్నూ దక్షిణమున కళింగము, రాజమహేంద్రవరము-యీ రెండు ప్రదేశములున్నూ: ఈప్రకారము ఒరిస్సా రెండుభాగములు చేసెను.

క్రీ. శ. ౧౫౭౧లో గోలుకొండ కుతుబ్షాహీ వంశస్థుడున్ను, మహమ్మదు కులీకుతుబ్షా తండ్రియును అగు ఇబ్రహీము కుతుబ్షా రాజమహేంద్రవరమును జయించి క్రమక్రమముగా దక్షిణమునుండి ఒరిస్సాపైకి దండెత్తి, తాను దండెత్తిన రాజులవద్దనుండి కప్పము పుచ్చుకొనుచుండేవాడు; ౧౫౯౦ క్రీ. శకాబ్దమున మొగలాయీల క్రిందనున్న ఒరిస్సాకు మానసింగు తర్వాతి గవర్నరు. ఇతను ఒరిస్సాలో ప్రబలియున్న కుట్లుఖాను, యితనికుమాళ్లు సులేమాను, ఉస్మాను-వీరలను చెండాడవలసెను. నర్సింగదేవు ఉరఫు రామచంద్రదేవుగారికి "మహారాజా" అను బిరుదొసగి, ౩౫౦౦ సవారములకు సేనానినిగాజేసెను. ప్రస్తుత గంజాం మండలము కలిపి ౧౪,౦౦౦ చదరపుమైళ్లు పరిమితిగల ప్రదేశము నిచ్చెను. ఒరిస్సాలోని అనేకమంది రాజులు వీరి అధీనమున ఉండిరి. ఒరిస్సాలో అఫ్గనులు తిరిగి ప్రబలు లగుచుండిరి. మొగలాయీలు తమబలము తక్కువగా నున్నను ౧౬ వ శతాబ్దము అంత్యమునకు దక్షిణమునుండి గంజాంమీదుగా ప్రబలి వెళ్లిరి.

ఈకాలములో రఘునాధహరిశ్చందన జగద్దేవు గారు అతగడాలో రాజ్యము చేయుచుండిరి. వీరు లాంగోలో శేణిదుర్గములో నివసించుచుండేవారు. ఇతను ౧౫౭౫-౧౬౨౭ వరకు రాజ్యమును పాలించెను. మొగలులు దక్షిణమునుండి వచ్చుచున్నపుడు ఉత్తరమునకు దండువెడలుటకుగాను అతగడారాజుగారితో స్నేహము చేసినారు. ఇతనితో మైత్రిచేయుటకు కారణమేమనగా ఒరిస్సాప్రదేశములో ఇతను ఒక్కడే బహుబలపరాక్రమశాలి. కులీబాదుషాయొక్క మహమ్మదీయ సేనాని ముకరెల్లమోహను అనేవాడు భోయిరాణి దుర్గములో ఉన్నప్పుడు, నరశింగదేవు ౧౫౮౯ లో లాంగోలో శేణీదుర్గమువద్ద నౌకసాగరమును త్రవ్వించెను. అరుమా

ములు పోయినతర్వాత ఒరిస్సాదేశపురాజగు నరసింగ దేవుగారి ఆజ్ఞానుసారము హాలీబాదుషా ఆసాగరమును శుభ్రపరిపించెను.

౧౫౭౯లో త్రవ్వించిన సాగరమునకు సింహ సాగరము లేక రామచంద్రసాగరము అని పేళ్లు గలవు. ఇది ఒరిస్సాకు అప్పటిరాజైన నర్సింగదేవు ఉరఫు రామచంద్రదేవుగారి పేరిట పిలువబడుచున్నది; అది దుర్గమునకు వెలుపలనుండుటచేత "బహారోసాగరము" అని పేరుకూడా గలదు. బహారో అనుపదమునకు ఉత్కలములో వెలుపల అని అర్థము.

ఈసాగరమునకు సింహసాగరము అని పేరు ఉండుటచేత రామచంద్రదేవుగారికి నర్సింగదేవు అని పేరు కూడా ఉండియుండవచ్చును. మహమ్మదు హాలీకుట్బుషా యీసాగరములోని వొండుబురద తీయించి బాగు చేయించినందున దీనికి "షాసారో"అని పేరుకూడా కలదు.

ఇబ్రహీము కుట్బుషా ఉరఫుమల్కి ఇబ్రహీమునకు భారతీయుల భాషలయందు చాలా అభిరుచి గలదు. అతను గజపతి నరపతికుటుంబములకు చాలా స్నేహితుడు. కవులను చాలా గౌరవించేవాడు. తనఆస్థానమున అనేకమంది కవులను, పండితులను ఉంచేవాడు. అద్దంకి గంగాధరకవి యనేవాడు "తపతీసంవరణము"అను ప్రబంధమును వ్రాసి ఇబ్రహీము కుట్బుషాకు అంకిత మొసంగెను.

ఇబ్రహీముకుట్బుషాకు మరియొక పేరు మల్కి ఇబ్రహీము అనివున్నదని యీపుస్తకముద్వారా తెలియుచున్నది. కనుక అతనినుగురించి వర్ణించిన పద్యము యీ క్రింద వ్రాయడమైనది.

సీ. "సకలవేదపురాణశాస్త్రపారగులైన
దొంటకవివిద్వాంసు లొక్కచోట
అష్టభాషలయందు నాంధ్యంబు లేకుండు
హాంతరకారికవీంద్రు లొక్కచోట
గజపతినరపతిక్ష్మాభర్త లంపిన
దొడికంపురాయబా ర్లొక్కచోట
మేరుమందరముల మించగల్గిన మన్ని
యులుదండనాథు లొక్కొక్కయెడల
గీ. జేరి కొల్వ భద్రాసనాసీను డగుచు
రమ్యగుణహారి మల్కిభరామశౌరి
భారతక్షీరమయసింధుబంధమథ్య
లలితపుణ్యకథా సుధాలహరి దేవి."

ఆకగడాచరిత్రయొక్క పురాతనపు వ్రాతపుస్తకములలో ఇబ్రహీము కుట్బుషాకు మల్కి ఇబ్రహీము అని మరియొక పేరు వున్నట్లు తెలియుచున్నది.

---

## మేలుకొలుపు

(హారిత కృతము)

గేయము

కలవరింతలతోనె కడపితివి తనువెల్ల
కలలేని చోటు గని నిలువవే మనసా. క.

గాలిమేడల నిద్రఁ జాలించి మేల్కనుము
కాలచోరుఁడు పొంచి కబళింప నున్నాఁడు.

గట్టిగా తొమ్మిది గవనులను గట్టేవు
నట్టింటిభూతాల నెట్టలేకున్నావు.

నాడికలు రెండు చెలులాడు నప్పుడె లోని
దాడి యాకట్టి నావాఁడిఁ జూపఁగ లెమ్ము.

దిక్కుదిక్కులుచూచి బిక్కమొగ మేసేవు
చుక్క తూర్పున మొలిచెఁ జూడ లేకున్నావు.

---



# బీరువా

కో. నరసింహాచారి గారు

బీరువాలను వడ్రంగులు సాధారణముగా జాజి, టేకు మొదలగు కలపసామానులతో చేయుదురు. కొయ్యపనికి రంపము, ఉలి మొదలగు పనిముట్లు కావలెను. పాఠశాలలందు చదువు పసిబాలురు వేసుకొనుటకు అట్టి పనులను అట్టతో చేయవచ్చును. ఇందులకు పీరంపముగాని, ఉలిగాని, మేకులుగాని యక్కరలేదు. ఒక వాడియగు కత్తియు, సూది, దారము, అట్ట, రంగు కాగితములు మొదలయిన సులభముగా దొరకు వస్తువులుండిన జాలును.

## బీరువాలోని భాగములు

బీరువాలో సాధారణముగా మూడు భాగములు కలవు. (౧) బీరువా పెట్టె (body) (౨) తలుపులు (౩) అలమారులు. వీటిలో బీరువాపెట్టె, తలుపులు ఒకే అట్ట ముక్కలో చేయవచ్చును.

అలమారులను మాత్రము వేర్వేరు ముక్కలతో చేయవలెను.

## కొలతలు:

ఇచ్చట నేనిచ్చియుండు కొలతలనే తీసికొనవలెననుననిర్బంధము లేదు. వారివారి తెలివితేటల నుపయోగించినయెడల నాకొలతలను మార్చుకొనవచ్చును. కాని ప్రథమ ప్రయత్నమున నేనిచ్చిన కొలతలనే యనుసరించుట మంచిది. పద్ధతి చక్కగా తెలిసిన తర్వాత సొంతముగా కొలతల నేర్పాటుచేసికొన చేయవచ్చును. కొలతలేవియైనను ముఖ్యముగా గమనింపవలసిన సామాన్యాంశములు కొన్ని కలవు. ౧. తలుపులు రెంటియొక్క వెడల్పుకొలతలు బీరువావెడల్పు కొలతకు సమానముగా నుండవలెను. ౨. చిత్రము క యందుగల ౧౦, ౧౧, ౧౨, ౧౩ అను అతుకుముక్కలును (flaps) వాటిని దూర్చుటకు గాను చేసియుండు సందులును ఒకే పొడవుగలిగియుండవలెను. మఱియు క అను మూలనుండి అతుకుముక్క యెంతదూరమున నుండునో దానికిగాను చేయు సందు గూడ క నుండి యంతియదూరమున నుండవలెను. అట్లు సమానదూరమున లేకున్నయెడల నాముక్కల (flaps) ను సందులలో దూర్చుటకు వీలులేకపోవును. ౩. పొడవునందుగాని, కప్పునందుగాని యుండు ప్రక్కలుమూడు వైపులను ఒకే వెడల్పు గలిగియుండవలెను. ఇట్టి ముఖ్య విషయములను గమనించుచు ప్రక్కన కొలతలను యిష్టము వచ్చినట్లు మార్చవచ్చును.

## బీరువా కొలతలు:

౧౮౪ అంగుళముల పొడవును, ౧౨ అంగుళముల వెడల్పును గల క, గ, చ, జ అను అట్టముక్కను తీసికొనవలసినది. దానిమీద పెనసలుతో క, చ అను నిడివి ప్రక్కకు సమాంతరము (parallel) గా ౨, ౧, ౪, ।, ౮, ౪, ।, ౧, అంగుళముల దూరమున వరుసగా గీత

లను వేయవలసినది. మరల క,చ అను వెడల్పు ప్రక్కకు సమాంతరముగా ౪॥ ౨¼, ౮, ౨¼, అంగుళముల దూరమున వరుసగా గీతలను వేయవలసినది, (చిత్రము క.) ఈ గీతలవలన నేర్పడిన భాగములలో ట,డ,త,ద అను దీర్ఘచతురము (Rectangle)న నుండు భాగము బీరువా యొక్క వీపు, తలుపులుగా, నేర్పడును. దీనికి క్రింద నుండు త,ద,చ,జ భాగమున బీరువాయొక్క పాదము లేక పీటయు, పైనుండు ట,డ,క,గ భాగమున కప్పును, వచ్చును. పాదమును కప్పును ఒకేకొలతతో జూపబడి యున్నవి. ట,డ గీతకుపైనను త,ద రేఖకు క్రిందను ౧౦, ౧౧, ౧౨, ౧౩ అను భాగములను అరయంగుళము వెడల్పున కత్తిరించవలెను. ఇందు ౧౦, ౧౧ ముక్కలు న,య, రేఖకు లోవైపునను, ౧౩, ౧౨ ముక్కలు మ,ర రేఖకు లోవైపునను ఒక్కొక్క యంగుళము పొడవు



గలిగియుండవలెను. మఱియు నిది బీరువాయొక్క పక్క రెండవప్రక్కలగు న,ల,య,శ,—వ,మ,మ,ర, అను భాగములయం దుండవలెను. బీరువ ప్రక్కలను విడిచి వస్తువు వాటి స్థానమునందలి బటువుగా విలిచియుండుటకై యీముక్కల వరుసంఖ్యలతో గుర్తింపబడిన సందులలో దూర్చవలసియున్నదిగాన నా పంచులనుగూడ జాగ్రత్తగా కోయవలెను. శ,క, రేఖపై నుండు ౧౩ ముక్క శ నుండి యెంతదూరమున నున్నదో ఆముక్కను దూర్చవలసిన సందును శ,స, అనురేఖపై శ నుండి యదే




దూరమున చేయవలెను. సందుయొక్క పొడవు తునుకయొక్క పొడవునకు సమానముగా నుండవలెను. సందుయొక్క వెడల్పు, అట్టయొక్క మందమునకు సరియగు నట్లుండవలెను. పాదముయొక్క పొడవు ౫, ౬, కలు వీపుయొక్క వెడల్పుకు ౪ మ. కన్న నిరుప్రక్కలను, పాతికయంగుళ మెక్కువగా నుండవలెను. ౫, ౬, ౭, ౮, అనుభాగము పాదముయొక్క పరిమితియగును. దానికి మూడుప్రక్కలకు ముప్పాతిక యంగుళము వెడల్పుగల ప్రక్కలను గుర్తించియుండుటను గమనింపవలసినది. ఇదేతీరుగ ౧, ౨, ౩, ౪ అనుభాగము కప్పుయొక్క పరిమితియగును. దాని చుట్టునుగూడ మూడు ప్రక్కలయందు ముప్పాతిక యంగుళము వెడల్పుగల ప్రక్కలు గలవు.

**కోయవలసినరీతి:**

పైవిధముగ చిత్రమునందు జూపినమార్గము ననుస రించి వివిధభాగములను గుర్తించుకొన్న తర్వాత ఆయా భాగములను క్రిందచెప్పినరీతిగ గోయవలెను. అట్టముక్కం వలెనన్న వంచవలసిన భాగమున గొలతబద్ద సహాయమున నొకగీతగీచి దానివెంబడి వాడిగల కత్తిమొనతో నొకటి రెండు మారులు, గీచినయెడల అట్టయొక్క మందమున సగము లోతునకు దిగును. అట్టనేపైపునకు వంచవలెనని యెంచెదరో దానికి వెనుకప్రక్క కోతవేయవలెను.

బీరువాయందు, వీపు, ప్రక్కలు, పాదము, కప్పు వీటినన్నిటి నొకేపైపునకు మడువవలెనుగాన వీటికిగాను వేయవలసిన కోతలన్నియు నొకేప్రక్క నుండవలెను. పాదమునకును, కప్పునకును గల ప్రక్కలుమాత్రము వేరు ప్రక్కకు మడువవలసియున్నదిగాన వీటికోతలు, వీ మొదలగు వాటికోలకు కో లవేసిన ప్రక్కగాక రెండ ప్రక్క వేయవలెను. ఈభే మును సులభముగా గుర్తిం టకు చిత్రమున గోతవేయవలసిన ప్రదేశములను గుర్తిం యుండు రేఖలు రెండురకములుగా జూపబడియున్నవి. (సూ చికనుచూడుడు). రేఖలను చుక్కలమూలమున గుర్తిం చుండు రేఖలు ప్రధానమున పెనసలుతో వేయవ యాధారరేఖలను సూచించును. వీటిపైన, నేకోతలు వేయరాదు. సాధారణరేఖలు (Continuous line అడుగంటి గోయవలసిన ప్రదేశముల సూచించు గొలుసు (Chain lines) రేఖలు సగము లోతు గోయవలెనని సూచించును. గొలుసురేఖలలో రెం రకము వెనుకప్రక్క సగములోతునకు గోయవలె సూచించును. ఈవిషయములను చక్కగా గమని చిత్రమును పరిశీలించుచు కోతలువేయుట మంచిది. సరపడి రేకోతనైనవేసిన నాయట్టముక్క పనికి

పోవును. కోతలన్నిటిని జాగ్రత్తగా వేసిన తర్వాత ల,ళ—వ,ష అను రేఖలపై క్రమముగా ప్రక్కలను వంచవలెను. అసల ల,వ—ళ,ష అను రేఖలపై క్రమముగా కప్పును, పాదమును వంచవలెను. అట్లు మడుచునప్పుడు ఆయాసందులలో నాయాముక్కలను (flaps) మార్చవలెను. పిమ్మట స,య—మ,ర అను రేఖలపై తలుపులను మడువవలెను. పాదముయొక్క ప్రక్కలను ౫,౬—౬,౮,—౮,౭ రేఖలపై వెనుకనుంచి మూ అని గుర్తించియుండు భాగములను ప్రక్కలలోనికి వంచి యతుకవలెను. ఈరీతిగ కప్పునందలి ప్రక్కలను ౧,౩—౩,౪,—౪,౨ అను రేఖలపై వెనుకకునుంచి మూ అని గుర్తించియుండు భాగములను పూర్వము పాదమును గురించి చెప్పిన రీతిగ నతికింపవలెను.

అలమారులు:

బీరువాలోనుంచి యతుకవలసిన భాగములన్నిటిని యతికిన తర్వాత నలమారుపొడవు, బీరువాలోపువెడల్పునకును, వెడల్పు బీరువాయొక్క ప్రక్కల వెడల్పునకు సమానముగ నుండవలెను. అట్లుండినచో అలమారు బీరువాలో నిముడగలదు కావున మనము చేయు బీరువాకు అలమారు లపొడవు ౯ అంగుళములు వెడల్పు ౨ అంగుళములు నుండవలెను. బీరువా లోభాగమున నతికించుటకు గాను పైపరిమాణమునకు బట్టను మూడుప్రక్కల మాత్రము అరయంగుళము వెడల్పున చిత్రము త యందు జూపిన రీతిని గుర్తింపవలెను. పిమ్మట నీ ౧,౨,౩ అను భాగములను చిత్రము థ యందువలె వంపవలెను. ఇటువంటి యలమారులను మూడింటిని చేసి బీరువయందు మూడు ప్రదేశములందు సమదూరమున నమర్చవలెను. పిమ్మట అంచులయందును, మూలలయందును సన్నని రంగు కాగితములనంటించి బీరువాను పూర్తిచేయవలెను. పూర్తిచేయబడిన బీరువాచిత్రము న యందు జూపబడియున్నది.



## గీతి

శ్రీ శ్రీనివాసరావు గారు (కవితా సమితి)

మెయిలుకదుపులనును మేలిముసుగు వెడలి
గగనసీమంతి నీ కటాక్షములు మెరసె
సెమలిపురి నీలిమేలి వన్నెలవికాస
ముల వలె వెలింగి నా భావములు నటించె!

'తల్లి యింటలేనపుడు'

శ్రీ యం. కే. రంగస్వామి అయ్యంగారి ఛాయాచిత్రమ



౮. 'రెడీ' (Ready)

శ్రీ అల్లూరి నారాయణరాజుగారి ఛాయాచి(



కట్టె చెండాట
శ్రీ జే. వీరన్న శెట్టిగారి ఛాయాచిత్రము.



"దప్పి, దప్పి"
శ్రీ జి. వీ. రంగమన్నారుగారి ఛాయాచిత్రము.



"ధన్ ధన్........."

(కర్నూలునద్ద హంద్రీనదిపై గంటకు ౧౫ మైళ్ళచొప్పున
ప్రయాణించుచున్న రైలు బండి)
శ్రీ యం. యస్. కుప్పుస్వామి అయ్యరుగారి ఛాయాచిత్రము.



బువ్వాలాట
శ్రీ ఆ. వెంకటశాస్త్రిగారి ఛాయాచిత్రము.



## సూక్తిసుధార్ణవ విమర్శనమునకుఁ బ్రత్యుత్తరము

శ్రీ శుక్ల సంవత్సర కార్తికమాసమున వెలువడిన 'భారతి'యందు శ్రీయుతులు ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ. గారు వ్రాసి ప్రకటింపించిన విమర్శనమును జూచితిని. అందులకు నా యభిప్రాయమును విన్నవించికొనుచున్నాను.

ధర్మవ్యాధ పాతివ్రత్యోపాఖ్యానములు ప్రాతవఁట చిన్నగ్రంథమునకు గొప్ప పేరఁట. అట్లయిన ఈ ప్రాంతవర్తి పాతివ్రత్యోపాఖ్యానమునే నేటికిని యనేకులు చిత్రవిచిత్రములుగ రచియించి నాటకములఁ బ్రదర్శించుచుండుటకుఁ గారణమేమి? కాళిదాస మహాకవి విరచితమైన యీ శాకుంతలమునే పలువు రేల వ్రాసిరి? మన ప్రాచీన భారతీయనాగరకతాది సకలధర్మములకుఁ నుదుటైన రామాయణాదుల గతియేమి? ఇఁక గ్రంథనామము యొక్క యౌచిత్యము నించుక విచారింతము. గ్రంథనామము విషయముచేత సార్థకమగునే కాని, పుటలసంఖ్యచేతఁ గాదు. కాలికోబైండు, పైదరువెయిటుపేపరు, ఎక్కువ పుటలు, గిల్టుపేరు, మున్నగు నలంకారములు గల్గి, మెండైములవంటి సమాసములతోడను, ఆంగ్లేయగ్రంథాభిప్రాయజాతీయముల తోడను గూడి వాక్యములు శ్లోకములుగా లేక, పత్రికా మాటల మూటలైన శాస్త్రము లన్నియుఁ గ్రొత్తవనియు, గొప్పవనియు, మన విమర్శకుల భావము కాఁబోలు. వీరి యభిప్రాయము చొప్పున శ్రీనాథాది మహాకవుల గతియేమి కావలయును? ఇఁక శైలి ప్రయత్న ప్రౌఢమఁట అందులకు వీరు నిదర్శనమును జూపకపోయిరి. పోనిండు. కాని, వీరు గ్రంథపీఠికయందలి నా యాశయములను త్రోసిపుచ్చి, ముఖపత్రమునందలి 'ఉన్నతపాతశాలాలను వాక్యమును బట్టుకొని కసితీర విమర్శించిరి. వీరి యీ పంక్తులు నాకు వింతలై తోఁచెను. మఱియు వీరి యభిప్రాయముచొప్పున గద్యతిక్కన బిరుదమునకై నే నీ ప్రయత్నమును జేయ లేదు. ఇఁక వీరాక్షేపించిన వాక్యముల మార్పులను గూర్చి యించుక చిత్తగింపుఁడు.

౧. 1. అపధ్యాతా ఎవి ప్రేణ న్యపత ద్ధరణీతలే,
బలాకాం పతితాం దృష్ట్వా గతసత్త్వా మచేతనామ్
సం. భా. వనపర్వము.

2. అరిగి చూచుటయు నది యప్పుడ నిశ్చేతనంబై నేలంబడిన. ఆ. భార. అరణ్య. పుట. ౧౭౭.

౩. చూచుచుఁజూచిన నది తత్క్షణంబ నిశ్చేతనంబై నేలంబడియె. సూ. సు. ౫.

౨. 1. ధర్మంతు బ్రాహ్మణ స్యాహు స్స్వ స్వాధ్యాయదమమార్జవమ్.

*   *   *   *

శ్రుతిప్రమాణధర్మస్స్యాదితి వృద్ధానుశాసనమ్,
సం. భారతము

2. అనిశంబుఁ గీర్తింతు రమరవర్యు లార్జవంబుశేమవ
ఆ. భా. అరణ్య. పుట ౧౭౮.

3. శాంతార్జవంబులు ధూమకురులకు శ్రుతిప్రమ
నిర్ణీతంబులైన ధర్మంబులని పెద్దలు చెప్పుదురు.
సూ. సుధా.

౩. 1. భగవానపిధర్మజ్ఞ స్స్వాధ్యాయనిరతస్సుచిః.
నతు తత్త్వేన భగవాన్ ధర్మం వేత్సీతి మేమతిః
సం. భారతము

2. నీవు కేవలస్వాధ్యాయపరుండవుగాని ధర్మసూక్ష్మత యెఱుంగవు. ఆ. భా. ౧౪౮.

3. నీవు కేవలస్వాధ్యాయపరుండవుగాని ధర్మసూక్ష్మతయెఱుంగవు. సూ. సు.

౪. 1. ఉపాలంభ స్త్వయా తస్మాత్ మమని శ్రేయసం పరమ్
సం. భారతము.

2. నీహితోపదేశంబున నాశ్రేయస్సాధనం బయ్యె.
సూ. సు. ౮.

ఆంధ్ర పద్య భారతమునందును శ్రీశాస్త్రిలవారి భారతమునందును గల వాక్యసజాతీయతకై యొండు నిదర్శనముగ నుండును.

హీనయోని జాతుండైన పురుషుం డేమి తెఱంగు నడునడిం బరమధార్మికులలోకంబులు వడయు.
ఆంధ్ర భార. పుట. ౧౭౬. ఆరణ్య.

'హీనకులజనితుండైనవాఁ డేవడువడిధర్మంబుఁ గాంచునేర్చు' శాస్త్రిలవారిభారతము, ఆరణ్య. పుట౬౩౫.

ఇట్టివి పెక్కులుకలవు. విస్తరభీతిచే నే నుదాహరింపలేదు. వలయునేని నన్నయ నలచరిత్రమునుంచికొని శ్రీశాస్త్రిలవారి నలచరిత్రమును జూడనగును. ఇంతకంటెను నెక్కుడుగ శ్రీ శేషగిరిరావుపంతులవారికి నే వివరింపవలసియుండదని తలంచి యింతటితో విరమించితిని. శ్రీరావుగారు సెలవు దయచేసినట్లు రెండు గ్రంథములకును మూలగ్రంథము సంస్కృత భారతమగుటంబట్టియుఁ గవిత్రయమువారి భారతమునుండి నేను గ్రహించిన సజాతీయములను గొన్నిటిని వీరు శ్రీశాస్త్రిలవారి భారతమునఁ జూచుటచేతను, తెలుఁగు భారతము వీరి కంటఁ బడకపోవుటచేతను, నాగ్రహపూరితులై విమర్శనము నకుఁ దొడంగి నాగ్రంథమును దుతీవ్ర విమర్శనమునకుఁ బాత్రముగఁ జేసికొనఁజూచిరి 'యతి విటుఁడుగాకపోవు టెట్లు' అన్న చుహనీయుఁడే మఱల 'పురాతనకవీశ్వరు లే గని వీక్షలేదు' అని చెప్పెచున్నాఁడు. గనుక, శ్రీశాస్త్రిలవారును, నేనును, గవిత్రయమువారి నాశ్రయింతు మనికేని సత్యదూరము కాఁజాలదు. విమర్శనమువలెఁ గాక, గ్రంథరచనము మిక్కిలి కష్టతరమను కార్యమని మన విమర్శకు లెఱింగి భాషాసేవ చేయుదురు గాక!

తూములా విశ్వనాథశాస్త్రి

---

# మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుల సంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

మేనేజరు, 'భారతి'

# ఝాన్సీ లక్ష్మీబాయి (1835-1857) ప్రతివాది భయంకరం రంగాచార్యులు గారు

అసాధారణమగు సౌందర్యము, పరాక్రమము, ఆత్మగౌరవముగల వీరనారీమణి ఝాన్సీలక్ష్మీబాయి. ఆసౌందర్యము, పరాక్రమము, ఆత్మగౌరవము, అన్నియు నొక ఘోరమగు నన్యాయమునకు బలియైనవి. బ్రిటిషు పరిపాలనమున భారతీయుల యాత్మగౌరవమునకు స్థానము లేదని యీ యాత్మసమర్పణము, ఈబలి, స్పష్టముగ జాటినది. లక్ష్మీబాయి భారతీయస్వాతంత్ర్యయోధులకు మార్గదర్శిని యైనది.

## లక్ష్మీబాయి బాల్యము; వివాహము.

లక్ష్మీబాయి క్రీ. శ. ౧౮౩౫ సం. నవంబరు ౧౯వ తేదీనాడు కాశీనగరమున జన్మించినది. ఆమె చిన్ననాటిపేరు మనుబాయి. తండ్రి మోరోపంత్ అను నొక మహారాష్ట్ర బ్రాహ్మణుడు. ఇతడు కడపటి పీష్వాయగు బాజీరావు కొలువులో నుండువాడు. మనుబాయి మూడునాలుగేండ్ల ప్రాయముననే తల్లిని గోల్పోయెను. నాటినుండి తండ్రియే యామెను స్వయముగ పెంచి పెద్దజేసెను. మనుబాయి దినదినము విడువక తండ్రితోపాటు దర్బారునకు పోవుచు వచ్చుచుండిన దనుటచే కత్తిపట్టుట మొదలు కలముపట్టుటవరకు గల రాజకార్యముల నన్నిటిని పురుషులతోపాటు బాగుగ నభ్యసించినది.

ఇట్లుండ ఝాన్సీదేశపుకడపటి రాజగు గంగాధరరావు భార్య మరణించుటచే నతడు ద్వితీయ వివాహమునకై ప్రయత్నించుచుండెను. మోరోపంత్, బాజీరావు పీష్వ మున్నగువారి ప్రయత్నములవలన ౧౮౪౨ సం॥న మనుబాయి-గంగాధరరావులకు వివాహమయినది. అత్తవారింటికివచ్చిన తరువాత మనుబాయి లక్ష్మీబాయియైనది

## ఝాన్సీకథకు కారణము

౧౮౫౧ సం॥న లక్ష్మీబాయికి పుత్రసంతానము కలిగెను. కాని మూడు నెలలు మాత్రమే జీవించి యా శిశువు మరణించినది. గంగాధరరావీ దుఃఖము సహింపజాలక, వ్యాధిగ్రస్తుడైపోయి, తుదకు ౧౮౫౩ సం॥ నవంబరు ౨౧వ తేదీనాడు ప్రాణముల వీడెను.

గంగాధరరావుఇంక రెండు రోజులకు తాను మరణించుననగ, ఆనందరావను నొకచిన్నవానిని పెంచుకొని ఆ సంగతిని తాను తెలియపరచవలసిన బ్రిటిషు అధికారుల కందరకును తెలియపరచెను. తన భార్యను, దత్తపుత్రుని బ్రిటిషు ప్రభుత్వము వారి కప్పజెప్పెను. సంతానము లేనివారు దత్తత గావించుకొనుటయు ఆదత్తపుత్రుడు దత్తతచేసికొన్న వారి ఆస్తికంతకు నధికారి యగుటయు హిందూన్యాయశాస్త్ర సమ్మతములు, చిరానుభూతములు నగు భారతీయుల యధికారములై యున్నవి. కాని యానాటి గవర్నర్ జనరలుగా నగు డల్హౌసీప్రభువుగారికి పైపద్ధతి యన్యాయముగ దోచినది. సాధ్యమైనంతవరకు, న్యాయముగనో యన్యాయముగనో, బ్రిటిషురాజ్యమును వర్ధిల్ల జేయుటయే భారతదేశమున తన పదవి తనకు విధించిన కర్తవ్యమని ఆయన యభిప్రాయమై యుండెను. ఇట్టి యీ బ్రిటిషు రాజనీతికి బలియైన భారతీయస్వతంత్రరాజ్యములలో, భారతదేశమునందలి ఆంగ్లపరిపాలన నిజస్వరూపమును విస్పష్టముగ బ్రకటించు ప్రబలసాక్ష్యములలో ఝాన్సీ యొకటి.

## డల్హౌసీప్రభువువాదము

భారతదేశమున, దత్తతచేసికొను పద్ధతి సామాన్యులైన సంసారులు మొదల్కొని సామ్రాజ్యాధిపతులవరకు నెట్లు వ్యాప్తిగాంచియున్నదో, ఎట్టిపవిత్రోద్దేశములు దాని కాధారములుగ నంగీకరింపబడుచున్నవో భారతీయులమగు మనకందరకు దెలిసినవిషయమే. మహమ్మదీయప్రభుత్వము గాని, ఆంగ్లేయప్రభుత్వము గాని యీ యాచారమునకు వైరుద్ధ్యము జూపలేదు. డల్హౌసీ ప్రభువైనను బహిరంగముగ నట్లు చేయుటకు సాహసిం

చినవాడు కాదు. కాని మొత్తముమీద ఆయన చర్య మాత్రము నిరంకుశమగు ఆయన తిరస్కారభావమును విస్పష్ట మొనర్చుచున్నది. ఝాన్సీరాజ్యము, ఇందూర్ బరోడా మున్నగువానివలె స్వతంత్రరాజ్యము కాదనియు, ఒకజాగీరుమాత్రమే యనియు ఆయనవాదము. జాగీరు అనగా బహుమతిరూపమున ఆంగ్లేయుల కడనుండి సంపాదింపబడిన భూభాగమని ఆయనయభిప్రాయము; అట్టి జాగీరుల ననుభవించువారు సంతానము లేనివారైనప్పుడు వారికి ఔరసులగు ఉత్తరాధికారు లెవ్వరును లేకపోవుదురు కాబట్టి, వానిని స్వాధీనపరచుకొనుటకు బ్రిటిషుప్రభుత్వమున కధికారము కలదనియు ఆయన తలంపు. ఇంతేకాక, 1835 సం.లో నే ఝాన్సీ రాజవంశమున నిట్టి దత్తతయొకటి తిరస్కరింపబడినదనియు, నందుచే నది తన యిప్పటి (1853 సం. నాటి) దత్తత తిరస్కారమున కుదాహరణముగ నుండదగుననియు గూడ ఆయన వాదించెను.

## పై రెండువాదములును నిరాధారములే.

కాని నిజమాలోచించినచో డల్హౌసీవాదములు రెండును నిరాధారములేయని తేలును. ఝాన్సీరాజ్యము ఆయన తలచినట్లు జాగీరు కాదు. అది పీష్వాలయధికారమునకు లోబడియుండిన సామంత రాజ్యములలో నొకటి. 1817 సం.న బాజీరావు పీష్వాకును ఆంగ్లేయులకును జరిగిన ఒడంబడిక ననుసరించి పీష్వా కొంతప్రదేశము నాంగ్లేయుల వశమొనర్చెను. అందు ఝాన్సీరాజ్యమొకటి. ఇట్లా ప్రదేశము తమవశమైనప్పుడు ఇంగ్లీషువారు ఝాన్సీ మున్నగు సామంతరాజ్యములతో వెంటనే యొడంబడికల గావించుకొనిరి. ఈయొడంబడికలలోగూడ నెందును దత్తతవిషయము చర్చింపబడియుండ లేదు; ఝాన్సీ కేవలమొక జాగీరుగ నెన్నడును నుండలేదని దీనినిబట్టి తెలియుచున్నది. తరువాతి యొడంబడికలలోగూడ నెన్నడు నది జాగీరుగ నిర్వచింపబడలేదు. ఇంక ఆయన రెండవవాదము విషయమున: 1835 సం.న దత్తత జరిగిన సంగతియే సందేహాస్పదమని ఝాన్సీయందలి బ్రిటిషు ప్రభుత్వమువారి రెసిడెంటే తెలిపియున్నాడు. అట్టిచో నాటిదత్తతను బ్రిటిషుప్రభుత్వమువారు తిరస్కరించిరనియు, ఆతిరస్కారమునే తా నిప్పు డొక యుదాహరణముగ గొనుచున్నాననియు డల్హౌసీప్రభువు వాదించిన నది యెట్టి న్యాయము?

## ఝాన్సీ బ్రిటిషువారికి విరోధియా?

తమయెడ ఝాన్సీ ద్వేషము బూనియుండెననియు, నందుచే దానిని వశపరచుకొనుటకు తమ కధికారముగల దనియు నొకవాదము కలదు. ఇట్టియధికారము ప్రభుత్వమున కుండవచ్చు. ఏలయన, ఝాన్సీ బ్రిటిషుప్రభుత్వమునకు సామంతరాజ్యముగనుండెను. కాని దీనికి సాక్ష్యమేమియు లేదు. రాణిలక్ష్మీబాయి 1857సం. నాటి "తిరుగుబాటు"లో చేరునరకు ఝాన్సీ ఆంగ్లప్రభుత్వమునకు విరోధిగ నుండిన యుదాహరణ మొక్కటియు గానరాదు. పైన జెప్పిన రాణితిరుగుబాటు దత్తతతిరస్కారమునకు తరువాతి సంఘటనమే. ఇట్టిచో నీ తిరుగుబాటుకు కారణ మెవ్వరు? ఝాన్సీ అవిధేయత దాని నాంగ్లేయులు వశపరచుకొనుటకు కారణ మెట్లు కాగలదు?

## "సిపాయీతిరుగుబాటు"; లక్ష్మీబాయి

ఎట్లయిననేమి, ఝాన్సీ రాజ్యమును వశపరచుకొనువిషయమున డల్హౌసీ దృఢనిశ్చయుడై యుండెను. ఈ సందర్భమున రాణి లక్ష్మీబాయి దత్తత చెల్లదగునని బ్రిటిషుప్రభుత్వమునకు పంపుకొనిన విజ్ఞప్తులన్నియు నిష్ప్రయోజనములైనవి. ప్రత్యేకముగ తనంత తాను ఈ యన్యాయమును ప్రతిఘటించి నిలుచుటకుదగు సామర్థ్యము ఝాన్సీకి లేదు. ఒక్క ఝాన్సీకే కాదు, భారతదేశమందలి మరి యే రాజ్యమునకును లేదు. ఇంక డల్హౌసీ ఆశ కడ్డమేమి?

ఇట్టి బలవదాక్రమణములు — "దత్తతచెల్లమి" చే నగుగాక, మరి యేకారణమున నగుగాక — ఆ కాలమున ఎన్నియో జరిగెను. ఇవియే భారతీయరాజ్యము లనేకములు ఇంగ్లీషుప్రభుత్వమునెడ ద్వేషము బూనుటకు కారణమైనవి; 1857 సం. నాటి "సిపాయీల కలహము"నకు ప్రధానకారణమైనవి. ఝాన్సీలక్ష్మీబాయి మొదట నీ

"కలహము"లో జేర లేదు. కాని, తుదకు సంపూర్ణముగ నిరాశ చెందవలసి వచ్చినప్పు డాయభిమానవతి, సూర్యుడ స్తమింపని సామ్రాజ్యమే యగుగాక, దాని యన్యాయమునకు తలవంచి ప్రణమిల్ల జాలక పోయినది. ఆత్మగౌరవమే యా సమయమున లక్ష్మీబాయి మూర్తియై నిల్చినది. భారతస్వాతంత్ర్యయుద్ధమున లక్ష్మీబాయికూడ దుమికెను. యుద్ధరంగమున నామె పరాక్రమము, సైన్య చాలనము విషయమున నామె ప్రకటించిన చాకచక్యము శత్రువుల ప్రశంసలకు గూడ పాత్రములైనవి. ఆమె రాజ్యమును పాలించిననాటి పరిపాలనసామర్థ్యమును ఆంగ్లేయు లంగీకరింపక తప్పలేదు. కాని వారికి ఝాన్సీ రాజ్యము నపహరింపకయు తప్పలేదు!

## ఝాన్సీ లక్ష్మీబాయి వార్షికోత్సవములు





ఆంధ్రదేశమునందు పెక్కు చోట్ల వీరనారీమణి, లక్ష్మీబాయి వర్ధంతి జయప్రదముగ జరుపబడెను. రాజమహేంద్రవరమునం దీయుత్సవమున బాలికలచే లక్ష్మీబాయి నాటక మొకటి యాడించిరి. 12 యేండ్ల కన్యయగు గాజిచర్ల శేషాబాయమ్మ లక్ష్మీబాయి పాత్రనుధరించి ప్రశంసాపాత్రముగ నటించెను. ఆమె ఝాన్సీ కోటను సంరక్షించుచున్నట్లును, బంగారుపతకమును బహుమతిగా స్వీకరించుటయు నిందు గానవగును.

# సౌదామిని

౧

ఆ మెరుపుకన్నె నా ప్రియురాలు, ఆమె
చంచల దృగంచలమ్ముల ఛాయలందె
నే విహరింతు, నామె కెమ్మోవి గాయు
లేత వెన్నెలకొరకె యర్చింతు నా స
మస్త జీవితమును ఆమె మధురమధుర
భాషణమ్ములకొరకె నే పలవరింతు.

ఒక్కచుక్కని లేని యీ యుగ్రరాత్రి
నీమహానీరవాంధకారామనస్య
వాటికల భయంకర వజ్రపాత నిబిడ
నిస్వనమ్ముల నున్మత్త నియతిక్రోడ
నామె కొరకె యన్వేషింతు నామెకొరకె.

౨

ఆమె నీలాంబుదాల ద్యోయానమునకె
ఈపిపాసార్త నన్ను కేలెత్తి పిలుచు
కలలనేని అందని ఆమెకరమె కోరి
యుగయుగాలిట్లు చెయి చాతునూర్ధ్వమునకు.
మరణదేవినిశ్వాసధూమ్యమ్ము లటుల
క్రమ్ముకొని వచ్చు నీతిమిరాల తెరల
జీల్చుకొని వచ్చి నా దేవి చిరవియోగ
భార మేనాటికేనియు బాపుననుచు
ఎన్ని నిశలేని యిట్లె కృశించిపోదు.

౩

ఆమె ప్రోజ్వలాంబరవీథులందె నిలిచి
ఎదురుకని నాకొరకె విలాపించు నేమొ
శ్యామికాప్రవర్తనుడ స్వేచ్ఛాదరిద్ర
జీవితుడ నెట్లు జలదాల చేరగలనొ?

౪

శశికళాశూన్య మానాటి శర్వరీత
మః ఖాల నాసఖిత్రపామధురమూర్తి
నాపరిష్వంగ మెడలి యనంతవీథి
మొయిలు తెరలలో మాయమై పోయె డాగి
అదియె మొదలామె ఈవిషాదార్ద్రజనుని
తృణకుటీరమ్ము చేర నేతేర దచట
ఏ తెగని శృంఖలాల బంధించినారొ
ప్రేమరాహస్యమేని గుర్తింపలేక.

౫

ఇరుల ఛాయల మిణుగురే మెరయనీదు
హృదయరాజ్ఞిగా యని పరువెత్తిపోదు
విరతిలేని ఈచీకటి వెదుకులాట
ముగియదేమొ కల్పాంతాల మగియుదాఁక!

---




## హిందూ విశ్వవిద్యాలయము వారి స్త్రీలకళాశాల

(రామానంద చాటర్జీగారి ఆంగ్లమునుండి)

బొంబాయి నివాసియగు సేఠ్ మూల్‌రాజ్ ఖాటౌగారును, అతని తోబుట్టువులగు సేఠ్ త్రికామ్‌దాసున్ను సేఠ్ గోవర్ధన్ దాసున్ను కాశీలోని హిందూ విశ్వవిద్యాలయమున స్త్రీలకళాశాల యొకటి స్థాపించుటకు గాను రెండులక్షల యేబదివేల రూపాయల మహాదానము చేసిరి. వారికోరికలు కార్యరూపము దాల్చుటకు మధ్య కొంత ఆలస్యమయ్యెను. ఇందువలన ఆనిధికి వడ్డీ ముప్పదినాలుగువేల రూపాయలు చేరెను. ఈ ధర్మముయొక్క షరతు లివి:—

౧. పాఠశాల గదులు, విద్యార్థినుల వసతిగృహము మొదలగు కట్టడములకై ఎనుబదినాలుగువేల రూపాయిలు ఖర్చు పెట్టవలెను. మిగిలిన రెండులక్షలు నిల్వయుంచి దాని నుండి వచ్చు వడ్డీవలన కళాశాల నడుపవలెను.

౨. కళాశాలలో విద్య యుచితముగ చెప్పవలెను. వసతిగృహమున విద్యార్థిని యుండుగదులకు అద్దెపుచ్చుకొనరాదు.

౩. ఈకళాశాలను స్త్రీలే నడుపవలెను. ఇందు పురుషుల ప్రవేశమున కేమియు నవకాశ ముండరాదు.

ఈకట్టడములకు లక్షరూపాయలకు పైగా వ్యయమయినది. మిగిలిన మొత్తమునుండి వచ్చు వడ్డీవలన కళాశాల, వసతిగృహము సాగుచున్నవి. ఈ వడ్డీసొమ్ము నెలకు వేయిరూపాయిలకంటె తక్కువ. ఈ కళాశాలకు మరి వేరు రాబడి లేదు.



స్త్రీల కళాశాలాభవనము

విశ్వవిద్యాలయము వారిస్థలమున నిరువది యకరముల మేర ప్రాకార మమర్చి, అందీకళాశాలను కట్టించిరి. ఈ కట్టడము రెండంతస్థులు గలది. క్రింది భాగమున విద్యార్థినుల గదు లున్నవి; మేడమీద తరగతు లేర్పరుపబడినవి. నేల బాగుగా యెత్తుచేసి కట్టినందువలన విద్యార్థినుల గదులు తేమలేకను, విశాలముగను మంచిగాలియు వెలుగును వచ్చువిధముగ నున్నవి.

ప్రస్తుతము కళాశాలలో నలుబదిమంది విద్యార్థినులు కలరు. అందు ముప్పదియెనమండ్రు కళలను (Arts) ఇద్దరు శాస్త్రములను (Science) చదువుచున్నారు. శాస్త్రములను చదువువారిలో నొకరు యఫ్. ఏ. సీనియరులోను, నింకొకరు బి. ఏ. జూనియరులోను ఉన్నారు. కళలు నేర్చుచున్న ముప్పదియెనమండ్రు విద్యార్థినులు ఈదిగువరీతిని విభజింపబడి యున్నారు:—

యఫ్. ఏ. జూనియరు 12

" " సీనియరు 10

బి. ఏ. జూనియరు 5
,, ,, సీనియరు 4
యఫ్. ఏ. జూనియరు 4
,, ,, సీనియరు 1
న్యాయవాదిపరీక్షకు (మొదటిదేడు) 1

వీరిలో వంగరాష్ట్రమునకు 13 గురు, సంయుక్త పరగణాలు బీహారునకు 12 గురు, పంజాబునకు 3 గురు, బొంబాయిరాజధానికి 6 గురు, మద్రాసురాష్ట్రమునకు ఇద్దరు, అస్సామునకు ఇద్దరును చెందినవారు.

ఈ విద్యార్థినులందు ఏడుగురు వివాహితలు, ఆర్గురు వితంతువులు, తక్కిన ఇరువదియేడుగురును కన్యలు. అందరును పదునారేండ్లు దాటినవారే. ముగ్గురు విద్యార్థినులు పిల్లలతల్లులు. వారిలో నిద్దరు తమ చిన్ని కుమార్తెలతో కూడ నివటి వసతిగృహముననే యున్నారు. ప్రస్తుతము విద్యాలయములో కళలకు యఫ్. ఏ. జూనియరు సీనియరు తరగతులు మాత్రము నడుపబడుచున్నవి. ఆ పైతరగతులవారును, శాస్త్రవిద్యార్థినులును, పురుషుల తరగతులకే పోయి చదువుచున్నారు. ఈ విధముగ ప్రస్తుతమునకు విద్యాబోధనముమాత్రము చాలవరకు మిశ్రముగనే యున్నది.

కలాశాల ప్రాకారము లోపలనే విద్యార్థినులు టెన్నిసు, బాడ్మింటను, బాస్కెట్‌బాలు అను బంతి యాటలు ఆడు కొందురు. ఇదికాక, వారు రెండుమైళ్ల పొడవును ఒకమైలు వెడల్పునుగల యీ విశ్వవిద్యాలయ విశాలస్థలమున నెచ్చటికైనను షికారుగా నడచిపోయి రావచ్చును. వారికి లాఠీకర్ర త్రిప్పుట, మల్లయుద్ధము నేర్పిన బాగుండును. బరోడా సంస్థానమున వాడుకలోనున్న దేశీయములగు కొన్ని స్త్రీల ఆటలు కూడ వీరికి నేర్పిన బాగుగ నుండును.

పట్టణమునకు కొంతదూరమున నుండుట వలన నీస్థలము పొగ, దుమ్ము, ధూళి, కళ్మలములేక శుభ్రముగ నున్నది. ద్రవ్యమనుకూలపడినపుడు విద్యార్థినులకు ఈత, గుఱ్ఱపుస్వారీ, తుపాకులు మొదలగునవి కాల్చుట ఇత్యాది విద్యలను నేర్పుటకేర్పాటులను చేయవలయునని, విశ్వవిద్యాలయోపాధ్యక్షులు పండిత మదనమోహనమాలవీయ గారు తలంచుచున్నారు. ఆటస్థలమునందీయన్ని వ్యాయామములకును వలయునంత జాగా యున్నది.

ఈ సంస్థయొక్క కొన్ని ముఖ్యమైన లాభములు, లక్షణములును గుర్తింపవలసినవి.



ఉపాధ్యాయిలు-విద్యార్థినులు

కళాశాల, పట్టణమునుండి దూరముగను, విశాలమై ఆరోగ్యకరమైన స్థలమునను నిర్మింపబడుటవలన విద్యార్థినులు స్వేచ్ఛగ విహరింపవచ్చును. ఇది శరీర మన స్స్వాస్థ్యముల కెంతో తోడ్పడును.

ఇచ్చటి విద్యార్థినులు భారతదేశములోని వివిధప్రాంతముల నుండియు వచ్చినవారగుటచేత వారి యందు సంకుచిత రాష్ట్రీయాభిమానములు, పక్షపాతద్వేషములు తొలగిపోవును. వారివారి దేశములందలి మంచి సంస్కారములను ఆచారములను వారు కోలుపోవకయే విశాల జాతీయ

# బెంగాలు కెమికల్స్‌వారి

# 3 దివ్యౌషధములు




## అక్వపికోచ్టిస్ కాంక్

అజీర్ణ వ్యాధి, మందాగ్ని మొదలైన ఉదర సంబంధమైన వ్యాధులకు దివ్యౌషధము. నిత్యము భోజనానంతరం సేవించిన కలరా రానీయకుండ కాపాడగలదు.



## పికోటిస్ బిళ్లలు

అక్వపికోటిస్ కాంక్‌నకు బదులు తయారైనది. ఒకబిళ్ల సేవించినవెంటనే బాధ నివారణమగును.




## లిక్విడ్ ఎక్‌స్ట్రాక్ ఆఫ్ కాల్‌మెగ్

లివర్ సంబంధమైన వా… ధులకు గుణమివ్వగలదు. … ద్దలుకూడ సేవింపదగినది.

బెంగాల్ కెమికల్ వారిచే తయారైన ఔషధములనే కోరుడు. మట్టుపురకం కొనకుడు.

**బెంగాల్ కెమికల్ అండ్ ఫార్మస్యూటికల్ వరుక్స్ లిమిటెడ్, కలకత్తా.**

చెన్నపట్టణమునకు సమీపమున ఆరోగ్యపద్ధతులననుసరించి చికిత్స చేయుటకు ...



దోమలబాధను తప్పించుకొనుటకుపాయము

హాయిగా సుఖనిద్రను పొందుడు, మంచిఆరోగ్యము గలుగును. ప్రపంచమందు పన్నికెక్కిన మా

# దోమ తెరలను

కొనుడు. గట్టి అల్లికనూలుచే తయారొనర్పబడినవి. అందముగా తయారొనర్పబడినవి.

సైజులు:—

| పొడుగు. | వెడల్పు. | ఎత్తు. | చదరపుగళ్లు. | గుండ్రపుగళ్లు. |
|---|---|---|---|---|
| 6 అ. | 3 అ. | 4½ అ. | రు. 5-8-0 | రు. 6-6-0 |
| 6 ,, | 4 ,, | 4½ ,, | ,, 6-8-0 | ,, 7-2-0 |
| 7 ,, | 3½ ,, | 5 ,, | ,, 7-10-0 | ,, 8-6-0 |
| 7 ,, | 5 ,, | 5 ,, | ,, 8-4-0 | ,, 9-8-0 |

ప్యాకింగు ఉచితం. పోస్టేజి ప్రత్యేకం.

ఏట్టి సైజువకైనను ఆర్డరిచ్చిన 24 గంటలలో తయారొనర్చి పంపగలము.

Sole Agents:—The Union Trading Co.,
166, Harrison Road, 5, Calcutta.

---

ఇనాం! **అన్నియు మీకే** ఇనాం!!

అత్యుత్తమతరుణము-త్వరపడుడు



ఇందులో తెలుపబడిన బంగారు రిస్టు వాచివి 8-8-0 లకు కొనినవారికొక కేలుగడియారము, ఒక టైంపీసు ఇనాముగా పంపబడును. అన్నియు చిరకాలమున్నుటకు, సరియైన కాలముచూపుటకు పూచీనివ్వబడును. ఆశాభంగము గలుగకుండుటకై త్వరపడుడు. బహుమతులు మితముగానే యున్నవి. మీ పూర్తివిలాసమును ఇంగ్లీషులోనే వ్రాసి ఆర్డరులను ఈదిగువవిలాసమునకు పంపుడు.

THE LONDON WATCH Co.,
Dept. No. 8. 2, Armenian St., Calcutta.



# మలేరియావల్ల గలుగు నిస్సత్తువ

మలేరియా వచ్చిపోయినపిమ్మట, రక్తమంతయు మలేరియా క్రిములచే ధ్వంసమై బలహీనత ఏర్పడును. మరల క్రొత్తరక్తము చేకూరినగాని బలారోగ్యములు చేకూరవు.

సేనటోజెను సేవించు టేల నారంభించ కూడదు ?

సేనటోజెను జగద్విఖ్యాతిగాంచినటానిక్. శరీరబలమును చేకూర్చుటకు, రక్తవృద్ధిని గలిగించుటకు వలసిన పదార్థములన్నియు యిందు చేరియున్నవి.

కొద్దిరోజులు సేనటోజెను సేవించినపిదప బలహీనత, నిస్సత్తువ యివి అన్నియు తొలగిపోవును. నరములపుష్టి, కండపుష్టి చేకూరును.

# SANATOGEN

మంచి టానిక్ ఆహారము

కెమిస్టు లందరివద్దను బజారు లన్నిటియందును దొరుకును

సేనటోజను చేతులతో తాకబడదు (3)

భావము వారియందు మొలకెత్తి పెంపొందుటకెంతో అవకాశము కలదు.

ఈ సంస్థయందు మధ్యతరగతి కుటుంబములకును బీదకుటుంబములకును చెందిన బాలికల, యువతుల విద్యాభ్యాసమునకు ప్రత్యేక సౌకర్యములు గలవు. ఇచట అందరు విద్యార్థినులకును విద్యాబోధనమును, బసయును ఉచితముగ నొసంగబడునని యిదివరకే చెప్పితిమి. ఇక నొక్కొక్కరును నెలకు సుమారు ౧౫ రూప్యములకు మాత్రము భోజనాదులకును దీపమునకును ఖర్చు పెట్టుకొనవలెను. ఈఖర్చుకూడ అందరు విద్యార్థినులకును లేదు. శ్రీసునశ్యామదాసు బిర్లాగారు కీర్తిశేషురాలయినతనభార్య శ్రీమతి మహాదేవి నామము చిరంజీవముగ వెలయుటకుగాను నెల కొక్కొకరికి ౧౫ రూ. చొప్పున కొన్ని విద్యార్థివేతనముల నేర్పరచినారు. ఈ సంవత్సరము ఇరువది యిద్దరు విద్యార్థినులు లీవేతన లాభమును బడసిరి.

ఈకళాశాల కాలక్రమమున నొకపెద్ద స్త్రీవిద్యాకేంద్రముగ వృద్ధినొందవచ్చును. ప్రస్తుతము అనేక కారణములవలన నభివృద్ధికాటంకము గలుగుచున్నది. ధనాభావముచేత, తగినంతమంది ఉపాధ్యాయినుల నేర్పాటు చేయుటకు వీలులేకపోవుచున్నది. ఉదారులగు దాతలెవ్వరైన చాలినంత ధనమునిచ్చినను ప్రభుత్వమువారివద్దనుండి చాలినంత సహాయమువచ్చినను, యీలోపము తొలగిపోగలదు. విద్యార్థినులయొక్క విజ్ఞానసంబంధమైన కృషి సంస్కారమునకును, శరీర వ్యాయామమునకును, వినోదక్రీడలకునువివిధములగు నేర్పాటులు గావింపవలసిన యావశ్యకమును గలదు. విశ్వవిద్యాలయమున నొకపుస్తక భాండాగార మున్నది,నిజమే.కాని పుస్తకములును పత్రికలును నిండుగనున్న గ్రంథాలయము, పఠనాలయము నొకటి ప్రత్యేకముగ స్త్రీకళాశాలవారి కుండవలయును. పైనుడివినట్లు ధనసహాయము లభింపదేని, స్వతంత్రోపాధి గల ఏ విదుషీమణియో, లేక, జీవయాత్ర గడచుటకు వలయు ధనమును మాత్రము కోరు నేవిద్యావతియో, ఈ సంస్థకు తన స్వార్థరహితములగు సేవల నర్పించునెడల, నిప్పటి పరిస్థితులలో నైనను కళాశాల కొంత యభివృద్ధినొందగలదు.

రెండు సారులు మే మీసంస్థనుచూచుట కనుజ్ఞ బడసియుంటిమి; అనుదినాభివృద్ధి నొందుచున్న దీనిప్రయోజనమునుగూర్చి మాకు సంపూర్ణవిశ్వాసము గలదు.

(మాడర్న్ రివ్యూ-నవంబరు సంచిక.)

తా. క. ఈ మాసముననే ఇటీవల జరిగిన తన మనుమని వివాహసమయమున గ్వాలియరునివాసులు రాజా బలదేవదాస్ జీ బిర్లాగారు పెక్కుదానములతో పాటు ఈ స్త్రీలకళాశాలయందు చదువుకొనుటకై రాజపుత్రస్థానమునుండి వచ్చు విద్యార్థినుల సౌకర్యమునకై 30 వేల రూపాయల నొసంగిరని తెలియవచ్చుచున్నది. సం. భా.

---

## శ్రీమతి ఆర్. రుక్మిణీఅమ్మాళ్ గారు.




ఈమె లేడీ విల్లింగ్డన్ వైద్యకళాశాల విద్యార్థిని. ఈ మధ్య చెన్నపురియందు జరిగిన స్త్రీ సంగీతపు పోటీ పరీక్షయందు మొదటి బహుమానము పడసెను.

---

## శ్రీమతి నళినీ తూర్ ఖుడ్ కన్య

[జి. వెంకటచలం గారు 'హిందూ' ఆంగ్ల సచిత్ర వారపత్రిక (౨౮-౧౧-౧౯౩౯) లో వ్రాసినదానినుండి]



'ఈమె ఒక అభినవ కళోపాసకురాలు. బొంబాయివాసియగు శ్రీసురేంద్రనాథ తూర్ ఖుడ్ గారి ఏకైక పుత్రి. ఈమె తాతగారు ప్రసిద్ధిచెందిన పండిత సంస్కర్తయు బొంబాయికి మొదటి హిందూ షెరీఫ్ అగు డా. ఆత్మారామ్ పాండురంగ తూర్ ఖుడ్ గారు. ఈమె తల్లి వంక వారు పూనాకు చెందిన చిప్లూంకర్ వంశమువారు. వారు విద్యావంతులు, ధనికులును. ఈమె పూనాయందు ౧౯౧౧లో జన్మించినందున ఇప్పటికి పదునెనిమిదేండ్ల వయస్సుగలది. ఈమె చిన్నతనమున తాతగారి యొక్క మన పెరుగుటవలన యితని దైవభక్తియు నీతినియమములు నలవడినవదయ్యెను. సౌందర్యోపాసకురాలగుటవలన కట్టుబొట్టుజుట్టు-వీనియందు అందముకొఱకు ప్రయత్నించుచు, బాహ్యరూపమున ప్రాపంచిక విషయముల యందాదరమున్నట్లు కనబడుచున్నను, ఈమె 'నీటియందలి కమలము' వలెపెరిగి 'శాశ్వతము నిత్యమునగువాని కొఱకు' జీవితమును గడపవలెననుచుండును. మంచిరకపు కళాభిలాషులకుండదగు కోరికలు, గుణములు నీమెయందున్నవి. 'మంచి నాట్యకర్తెను, ఉత్తమ తరగతి చిత్రకారిణిని, అద్భుతమగు గాయకురాలను, జయప్రదమగు నటకురాలను కావలెను' అని నా ఆశయని యామె చెప్పెను.

'మృచ్ఛకటిక'మను శూద్రకరాజకృత-ప్రాచీన సంస్కృతనాటకమును సినీమా బొమ్మలరూపమున తెలుగు రూపమందు శ్రీ యమ్. భవానీగారు తయారుచేయించిరి. ఇందీకన్య తొలిసారి సినీమాకొఱకు వేషముదాల్చి నటించినది. 'షిరాజ్'అను తాజ్ మహాల్ సంబంధమగు కథను తెల్పు ఫిల్మునందు పాల్గొన్న మీనాక్షి రామారావు కన్య ఇందు ముఖ్యపాత్రయగు వసంతసేన భూమికను దాల్చినది. ఈమె చెలికత్తెయగు మదనికభూమికను నళినీకన్య దాల్చినది. ఇందీమె చక్కని రూపమువలనను, లాలిత్యమువలనను జయప్రదముగ నెగ్గినది. సౌకుమార్యము లజ్జయు నీమె సొమ్ములు. మనోహరమగు రూపలావణ్యమీమెకు గలదు. నిరాడంబరమగు నామె భక్తిభావమును ధర్మప్రవృత్తియు నిండుకు తోడై యామె నాకర్షణీయముగ చేయును. రాజపుత్రస్థానమునకు చెందిన యశశ్రీ మీరాబాయి గానమాధురి నీమె యారాధించును. ఆమె కీర్తనల పాడుచుండును. తాను మహారాష్ట్రదేశమునకు చెందినదానననుస్వాభిమాన మీమెకుండుట ఉచితమే. వీరుడగు శివాజీయందీమెకు భక్తిగౌరవములు గలవు. భారతీయ ఋషిపూనులయందీమెకు ఎనలేని భక్తి. ఈమె భగవద్గీతను నిరంతరము చదువుచుండును. ఈమె వేసిన రూపచిత్రములును, ప్రకృతిచిత్రములును యింతవరకు పరిశీలలాలిత్యము సౌకుమార్యము లేక మోటురూపమున నున్నను, అవి ఈమె ప్రకృతిని శ్రద్ధతో పరిశీలించి యానందించునదని వెల్లడింపగలవు. అన్నిటికంటెను ఆచారసంప్రదాయ గౌరవములు గల హిందూ కుటుంబమునకు చెందిన యీమె తన స్వబంధుమిత్రుల యిష్టములకు వ్యతిరేకముగ, వారినందరను కాదని ధైర్యముగ సినీమా నటనయందు ప్రవేశించుట యీ కుసుమ కోమల సన్నిభగాత్రయగు సుకుమారవతియందెన్నుకొనదగిన గుణము.'

---

శ్రీ పరంజపైకన్య   శ్రీ మాలతీకేల్కరుసతి



విదేశములకేగి ఆధునిక విద్యాబోధన విధానముల నభ్యసించి మాంటిస్సొరీ డిప్లొమాల నందికొని భారతదేశమున కీమధ్యనే తిరిగి వచ్చిన అనసూయ పరంజపై కన్యయు, శ్రీమతి మాలతి కేల్కరు సతియు.

సీతాజాగనామల్ నర్సియాన్ కన్య



బి.ఏ (కలకత్తా), ? టి.టి.సి.(గ్లాస్గో), యఫ్.ఆ
సి.యస్(లండన్). యమ్.ఆర్. ఏ.యస్(లండ
ఈమె యీమధ్యనే హైదరాబాదునంను
పురపాలకసంఘమువారి విద్యాలయముల
కార్యనిర్వహణశాఖోద్యోగ నియమింపబడె

---

శ్రీమతి వి. ఎ. పార్వతిగారు



ఈమె హైస్కూలుతరగతులను చదివి ముగించినది. చెన్నపురమున కళాశాలాతరగతులయందు చదువుట కీమె కీమధ్యనే కొచ్చిన్ ప్రభుత్వమువారు సంస్థానముతరఫున ఒక ఉచిత విద్యార్థి వేతనము నిచ్చిరి. కొచ్చిను సంస్థానమునుండి కళాశాలలో చదువవచ్చిన మొదటి బ్రాహ్మణయువతి ఈమెయే.

---

శ్రీ యన్. బి. తంబిగారి సతి



ఈమె మధ్యరాష్ట్రములకు గవర్నరుగా నున్న శ్రీపాద బలవంత తంబిగారి భార్యామణి, మోటామల్ వం దీమధ్య జరిగిన మధ్యరాష్ట్రముల మహిళా మహాసభాధ్యక్షురాలుగ నుండెను.

---

మనమోహినీ జుట్షీకన్య



ఈమె లాహోరులోని ప్ర
కళాశాలకు చెందినది. అప్పట
గిన సకలపంజాబు విద్యార్థి
సభకుఆహ్వానసంఘాధ్యక్షురా
నుండెను.

---



# ఆంధ్రాభ్యుదయము






**డీ. వెంకటస్వామి గారు**

వీరు రంగూన్ ఆంధ్రమహాజన సంఘమున కధ్యక్షులు. బర్మా శాసనసభ యందు కార్మికుల ప్రతినిధిగ నున్నారు.

**శ్రీ దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు గారు**

నవంబరు 23 వ తేదీనాడు రంగూన్ పట్టణమున జరిగిన ప్రథమ బర్మా ఆంధ్రమహాసభకు కా. నాగేశ్వరరావు పంతులుగా రధ్యక్షత వహించియుండిరి. వీరికి గొప్పసన్మానము జరిగెను. బర్మాదేశచిహ్నము లగు ననేకచిత్రవస్తువులు వీరికి కానుకలుగ నిచ్చిరి. వీరు నవంబరు 15వ తేదినాడు చెన్నపురమున స్టీమరెక్కి వెళ్లి 30వ తేదినాడు మరలివచ్చి చేరిరి.




శ్రీ మేజరు శంకరశాస్త్రిగారు    శ్రీ సి. వి. చలపతిరావు

ఆస్ట్రియా దేశపు ముఖ్యపట్టణమగు వియన్నాలో ఉన్నత వైద్యవిద్య నభ్యసింప వెడలిన ఆంధ్రులు: మేజర్. టి. శంకరశాస్త్రి గారు, ఐ.యమ్.యస్.; సి.వి. చలపతిరావుగారు, యల్.యమ్.పి. రెండవవారిది రాజమహేంద్రవరము. శంకరశాస్త్రిగా రీమధ్యనే భారతదేశమునకు తిరిగి వచ్చిరి.




సూనె పానకాలు గారు

వీరు గుంటూరుజిల్లా చీరాలలో వర్తకులు పురపాలక సంఘాధ్యక్షులు. ఆపురమున మ్యు సిపల్ హైస్కూలు నిర్మించుటకుగాను 20 వే రూపాయిలు దానముచేసిరి.




క్రొత్తరాట్నము




సులువుగా తొందరగా సన్న నూలు వడుకు రాట్నము; (Automatic Charkha) దానిని తయారుచేసిన శ్రీ ఛబిల్దాస్ కర్సన్ దాస్ దలాల్ గారు




నా॥ యస్. బి. తంబి గారు

పూర్వ మొకప్పుడు స్వరాజ్యవాదిగ నుండిన వీరిపుడు మధ్యరాష్ట్రములకు తాత్కాలికముగ గవర్నరు పదవి నధిష్ఠించియున్నారు. బీహారు, ఒరిస్సాలకు గవర్నరుగ నుండిన కీ. శే. సిన్హాగారు మొదటి భారతీయుడు. తరువాత వీరికే యట్టిపదవి లభించినది. వీరి పూర్తిపేరు శ్రీపాద బలవంత తంబి యందురు.



సర్ జార్జి స్టాన్లీ [redacted]
చెన్నరాజధాని క్రొత్తగవర్నరు
నవంబరు ౧౨వ తేదిన చెన్నపురి విచ్చేసి క్రొత్త గవర్నరు పదవిని స్వీకరించినారు.

---




వి. యస్. తిమ్మా [redacted]
మీరట్‌లోని కళాశాలోపాధ్యక్షులగు తిమ్మా వెంకట సాంబయ్య గారు. ఆంధ్రవిశ్వవిద్యాలయము నందు ఏప్రిల్ పరీక్షలలో బి. యస్-సి. తరగతియందు పదార్థవిజ్ఞానశాస్త్రమునందు ప్రథమస్థానమున నుత్తీర్ణులగువారికి 60 రూప్యాయల విలువగల ఒక్కొక బంగారు పతకము నొసంగుచుండుటకై 1,500 రూ. దానము చేసిరి.

---



డా॥ కిచ్లూ [redacted]
రాబోవు లాహోరు కాంగ్రెసున కాహ్వానసంఘాధ్యక్షులుగ నెన్నుకొనబడిరి.

---

## ప్రాచీనకాలపు క్రూర శిక్షా విధానములు

మహా దారుణమగు అలలు గల సముద్రపుటొడ్డున సిసిలీద్వీపము తీరమున నెత్తయిన యొక బండరాతిపై నొక కోట గలదు. ఏ కల్పితకథారచయితయు నింతవరకు నూహింపజాలనంతటి ఘోరమగు చిత్రవధాయంత్రమింద దమరికొనున్నది. దుర్యశముగల యీస్థలము పేరు 'టోర్ఫ్యా' అమాయికముగా నా చుట్టుపట్ల పశువులను కాచుకొను గొల్లవానిముందీ కేరుకొత్తిన, వాడు భయమున గతుక్కుమని రక్షణకొఱకు దేవుని కొక పండుము పెట్టును.

ఇట్టి భయోత్పాదకములగు క్రూరశిక్షాయంత్రములను ఎక్కువగా నిర్మించినది పదిహేనవ శతాబ్దిలోని ఇటలీదేశము లెక్కలేనన్ని పక్షములుగ చీలి తగవు

పాలయియున్న రోజులలో, ఈ విపరీతయంత్ర-అధికారి కౄరత్వమునకు గురియైన ఒకవ్యక్తిని కొందఱు దుష్టులు బందీకృతునిచేసి నిశ్శబ్దమున నీ 'టోల్ఫీ'కోటకు మోచికొని వచ్చిరి. వారు ఈ ఏకశిలాదుర్గమున సుమారవలెనున్న ఒక చీకటికోణములోనుండి పెద్ద యినుప మడతతలుపులు దాటి లోనికిపోయిరి. ఈ తలుపులకు మూడు తాళములతో వేసినగాని పడని యొక బరువైన పెద్ద కప్పతాళము వేసియుండెను. అది తెరిచి వారొక యినుపపంజరము చొచ్చిరి. ఈ యినుపతలుపుల గదిలో విడువబడినవాని పని యంతే. మఱి వాడు తిరిగి పైకి రాడు. వాడు ఆపాదమస్తకము యినుపపంజరములో చిక్కుకొన్న సంగతి తెలుసుకొన్నాడు. విశాలమగు నీచదరపుగదియొక్క యెత్తయిన యినుపగోడలయందు అనేకతనకగ నక్కడక్కడ యేడు కిటికీలుండుట నతడు చూచెను. బరువైన పెద్ద యినుపకడ్డీలు గల యీ కిటికీలు గాలి వెలుగులు వచ్చుటకే యని తోచును. మూల నొక యినుపమంచముపై నింత యెండుగడ్డి పఱవబడి యుండెను ఒక జలపాత్రమును, ముతుక అన్నము గల యొక మోటురకపు పళ్లెరము నా గదియందుండెను.

ఆ బందీ నిద్రించెను. వాడు మేల్కొనునప్పటికా గదియందు వేరొకపాత్రతో నీరును, మంచియన్నమును కనిపించెను. కాని యెవ్వరి యడుగుల సవ్వడియు వానికి వినరాలేదే! మరునాటిరాత్రియు నిట్లే జరిగెను. ఈవింత రేమిటో బోధపడని యీబందీ మరునాటి యుదయమున విభ్రమముతో నలువైపుల పరికించుచు నా యినుపగోడలలో నిప్పుడైదు కిటికీలు మాత్రమే యుండుట గాంచెను. ఆ గది మడత యినుపతలుపుల కడ్డముగ నతడొక గడ్డిపోచను పెట్టియుంచెను, లోనికివచ్చువా డెవడైన నా గడ్డిపోచను తొలగింపవలసియుండునని. తా నేచోట యుంచెనో అచటి నుండి యీగడ్డిపోచ కొంచెమైనను కదల్పబడలేదు. తా నందు ప్రవేశించినప్పటికంటె నిప్పుడీచీకటిగది ముడుచుకొనుచున్నట్లు చిన్నదైపోయినదని వా డూహించుకొన్నాడు.

ఈ యినుప పంజరము, యింతకు రెండింతలు గల మరియొక పంజరములో నమర్చి కట్టబడినది. ఈ రెండును కూడ నొక్కొకటి సమానమగు వెడల్పు, పొడవు, నెత్తును గలవి. ఈ విధముగ గోడలు రెండేసి యున్నమాట. క్రిందివైపునను, లోపలివైపునను రెండు విధములగు చలనము లుండెను. ఒక జలయంత్రమువలన లోకప్పును గోడలును ఇరువదినాలుగు గంటలలో అగోచరముగా నొక భాగము మేరకు క్రిందకి జరిగి యీ యినుపగోడలలో నున్న యేడు కిటికీలలోను ఒక్కొక్క కిటికీని మూసివేయును. అధశ్చలనము ముగిసిన వెంటనే లోపలివైపున చలన మారంభమయ్యెను. ఇందు లోకప్పును, నేలయు లోపలి గోడలను వానివెడల్పులో నేడవవంతు భాగమును లోపలికి లాగెను. లోకప్పు యొక్కయు నేలయొక్కయు పైకి మిగిలిన భాగములు వెలుపలి గోడలను తాకునప్పటికి బందీ చచ్చిపోయెను.





లండన్ నగరమునందొకనూరు ఫ్రూస్‌బకీ ద్యూకుగారు అద్భుతమగు చిత్రవధపరికరముల ప్రదర్శనము చేసియుండిరి. అతడు వానిని జర్మనీలోని న్యూరెంబర్గ కోటలో కొనెనట. వానిలో నొకటి అతి భయంకరమగు 'Iron Maiden' (స్త్రీయాకారము గల యినుపయంత్రము.) ఇది యినుపగొలుసులతో కలిపి కట్టిన కొయ్యగోరి. దీని పైభాగమున నొక స్త్రీముఖాకారము కనబడుచుండును. ఈ యంత్రపుగోడలయందు రెండు

తలుపులు అమర్పబడి యున్నవి. ఇవి తెరిచి ఖైదీనిందు ప్రవేశపెట్టుదురు. గోడల లోపలిభాగమంతటను పొడుగైన వాడిగల యినుప యీలె లమర్పబడి యున్నవి. ఖైదీని లోపల పెట్టి తలుపులు బిగించి మూసిన యెడల వాని శరీరమంతటను నీ ముళ్లు గుచ్చికొని విపరీతమగు బాధతో మరణ మాసన్నమగును.

1-2 విరళాపె యిడేరాయొక్క రెండు దృశ్యములు. చిల్లంగివిద్య ప్రబలముగా నుండిన కాలమున నుపయోగములో నుండిన శిక్షావిధానములు:



3. మాటిమాటికి నీటముంచి లేల్చి బాధించుట కనువగు కుర్చీయంత్రము.



4. ౨౦౦ యేండ్లక్రిందటి 'అరతూపు'
(మాడరన్ రివ్యూ, నవంబరు సంచిక.)

## శ్రావణబెళగొళ (జైనక్షేత్రము)

శ్రావణబెళగొళ మైసూరురాజ్యమునందలి హాస్స నుమండలమున నొక పట్టణము. ఇది దక్షిణహిందూదేశ మున నొక సుప్రసిద్ధ జైనతీర్థము. ఈ పట్టణమునకు చేరు వనున్న 'దొడ్డబెట్ట' అను గుట్టపై గోమటేశ్వరుని అతి ప్రమాణ విగ్రహమొకటి గలదు. దీనివలన నీపట్టణమునకు గోమటేశ్వరము, దేవరబెళగొళ అను పేరులును గలిగినవి.

బెంగుళూరునుండి పూనాకు పోవు రైలుమార్గ మునను 'అర్సికెరె' అను స్టేషనువద్ద దిగి 'రోడ్డు' త్రోవను ఇక్కడకు పోవ చ్చును. బెంగుళూరునుండి చామరాయ నగర మార్గమున రోడ్డుపై పోవచ్చును కూడ. ఈత్రోవ నూరుమైళ్ళదూరము గలది.

జైనమత ప్రతిష్ఠాపకుడగు మహా వీరుని ఆత్మీయశిష్యులగువారికి సన్నిహి తులగు శ్రుతకేవలులలో నొకడగు భద్ర బాహువు క్రీ. పూ. నాల్గవశతాబ్దమున ద్వాదశవర్ష క్షామము రానున్నదని తెలి సికొని దానినితప్పించుకొనుటకై యుజ్జ యినినుండి దక్షిణమునకుపోవుచు నిక్కడ నిర్వాణమును జెందెననియు, అప్పు డితనివెంట సకలసామ్రాజ్యమును బరిత్య జించి జైనమతము నవలంబించిన మౌర్యచంద్రగుప్తుడుండె ననియు నచటనున్న శాసనములవలన దెలియవచ్చుచున్నది.

తరువాత నీచంద్రగుప్తుని మనుమడు సేనతో నూర వచ్చుటకి పోయెనట. అతనిసేన ఆనాడు విడిసిన చోట నసే నేటి శ్రావణబెళగొళ వెలసినది.

'దొడ్డబెట్ట' (పెద్దగుట్ట)కు వింధ్యగిరి, ఇంద్రగి అను పేరులు గలవు. దీనిచెంతనే 'చిక్కబెట్ట' (చిన గుట్ట) అను చంద్రగిరి నామాంతరముగల ఇంకొక గు యున్నది. దీనిపైన జైనబస్తీలు పెక్కుగలవు. ఇప్పు కిని జైన యాత్రికులు వచ్చుచుందురు. నన్నూటయెబ అడుగుల యెత్తుగల దొడ్డబెట్టపయినున్న గోమటేశ విగ్రహము నెత్తు ౫౭ అడుగులు. గుట్టపయికి బోవు

మెట్లున్నవి. ఈ అతిమాత్రవిగ్రహ మొక్కరాతి నుండి చెక్కబడినది. ఇది నగ్నమై యుత్తరపు మొగమునఁ నిలిచి యున్నది. చుట్టుపట్టుల పెక్కుమైళ్లవరకిది కానవచ్చుచుండును. విగ్రహముయొక్క ముఖమున శాంతరస మట్టిపడుచుండును. తలవెండ్రుకలు ఉంగరములవలె చుట్టలుచుట్టుకొనియున్నవి. తల పైభాగమునుండి చెవి క్రింది అంచువఱకు సరిగా ౬॥ అడుగుల పొడవున నున్నది. భుజములు వెడలుపుగలిగి యున్నవి. చేతు లిరుప్రక్కల తిన్నగ వ్రేలాడుచున్నవి. బొటనవ్రేళ్లు వెలుపలికి తిరిగియున్నవి. నడుము సన్నగ నున్నది. మోకాళ్లు కుఱుచగ నుండును. విగ్రహమున కుభయపార్శ్వముల పెరిగిన పుట్టయు, దానినుండి పుట్టి తొడలకు, చేతులకు నెగ్రాకుచున్న లతలు నిశ్చలతపోనిరతి లక్షణములు. తొడలనుండి విగ్రహము నిరాధారముగ నున్నది. ఇట్టి గంభీరవిగ్రహము ఈజిప్టునదప్ప నింకెక్కడను లేదనియు, అచ్చటకూడ వింత యౌన్నత్యముగలది లేదనియు ఫెర్గుసనుగారు వ్రాసిరి.

మహాప్రమాణ మగు నీ విగ్రహ మచ్చటనే యుండిన యొక గండశిలనుండియో, కొండకొనకొమ్మునుండియో చెక్కబడి యుండవలెను. దీని పీఠముపయి నున్న బహుభాషల శాసనముల వలన దీనిని చాముండరాయడు నిర్మింపజేసెనని తెలియవచ్చుచున్నది. గాంగరాజగు రాచమల్లునికడ నీతడు మంత్రిగ నుండెను. కాబట్టి దీనినిర్మాణకాలము క్రీ. శ. ౯౮౩ కావచ్చును. శిల్పి పేరు 'అరిష్టనేమి' యయి యుండును.

విగ్రహముచుట్టు ప్రాకారము, పంచశాల కలవు. పంచశాలయందు, ఇట్టివే అల్పప్రమాణములగు విగ్రహములు 72 గలవు. వీనిని హొయిసల విష్ణువర్ధనుని దండనాథుడగు గంగరాజు నిర్మింపజేసెను. ఈతనికాలము క్రీ. శ. ౧౧౧౭ ప్రాంతము కావచ్చును.

వేయిరేండ్లు గడచినను ఇది యీనాటికిని ఎండవానలచేనింకనైనను చెడక అభినవరూపముననున్నది.

"ఈ విగ్రహము ముఖము విశేషలక్షణలక్షితము. అతిమాత్రమగు నాముఖప్రమాణము, కష్టములవలనల్లాడి పెనగులాడుచున్న ప్రపంచముపై బరపుచున్న సులలిత మందహాసచంద్రికతో కూడిన ధ్యానముద్ర శిల్పియొక్క అత్యద్భుత శిల్పకళాకౌశలమునకు నిదర్శనములు.

గుట్టపయి నొకయంచున నుండుటచేత, అతిమాత్ర ప్రమాణము గలిగియుండుటచేత నీ యేకశిలానిర్మిత గోమ్మటేశ్వర విగ్రహము మిగుల మనోజ్ఞముగ నుండును." అని ఒక ఆంగ్లేయకళావేత్త చెప్పియున్నాడు.

---




బ్రిటిషువారి పెద్దవిమానము ఆర్, 101.

21 దినములలో ప్రపంచయాత్రచేసివచ్చిన జర్మనీ వారి గ్రాఫ్ జెప్లినుకు పోటీగా ఇంగ్లీషువారు నిర్మించిన క్రొత్తగొప్పవిమాన మిది. ఇందు 52 ప్రయాణీకులకు తగు భోజనవసతి, సౌకర్యములు గలవు. ఇది తయారు చేయబడిన కార్డింగ్టను పురమున ప్రథమప్రయాణము చేయబోవుటకుముందు మూరింగ్ మాస్టునకు తగిలింపబడి గాలిలో నూగులాడుచుండుట యిందు కానవచ్చును. రైలు బండికి స్టేషను, స్టీమరునకు హార్బరు యెట్లో జెప్లినుకు మూరింగ్ మాస్టు అట్లు.

---

# గ్రంథప్రచురణము

పాశ్చాత్యదేశములయందు ప్రచురింపబడు గ్రంథములసంఖ్య మహాసముద్రమువలె పెరిగిపోవుచున్నది. ఐరోపా ఖండమునందును, అమెరికా ఖండమునందును సంవత్సరమునకు అనేక వేలతరబడిని ప్రచురింపబడుచున్న గ్రంథములను గాంచినచో మన కాశ్చర్యము గలుగును. ఆదేశములలో గ్రంథరచన గూడ నిపుణులగు పారిశ్రామికులచే కొనసాగింపబడు పరిశ్రమలవంటిదైనది. ఒక్కవిషయమునుగురించి గ్రంథకర్త అనేక గ్రంథములను వ్రాయుటచేతను, గ్రంథబాహుళ్య ప్రచురణపద్ధతుల నవలంబించుటచేతను, గ్రంథములసంఖ్య అపరిమితముగా పెరిగిపోయినను జనోపయోగమగు ఉత్తమ సారస్వతము వృద్ధియగుటకు బదులు ఎందుకును కొరగాని చెత్త విస్తారముగా పెరుగు దురవస్థ యేర్పడినది. ఒక్క విషయమును బాగుగా పరీక్షించి అవసరమగుచో గ్రంథకర్త ఆ విషయమై కొన్ని గ్రంథములను వ్రాయుట శ్రేయోదాయకమే యగును. కాని, ద్రవ్యాపేక్షచేతను, కేవలము వర్తకము కొరకును ఒక్కొక్క డిన్ని గ్రంథములను వ్రాయదలపెట్టుట అనర్థహేతువగును. ప్రచురణకర్తలు గ్రంథకర్తలచే పుస్తకములను వ్రాయించుటవలన మధ్యవర్తులు చాల హెచ్చుగా పెరిగిపోయినారు, గ్రంథములోని పుటలు పెరుగుచున్నవి. పుస్తకము దళముగాను బరువుగాను ఉండును. కాని, గ్రంథముయొక్క ఉపయోగమేమియు వృద్ధియగుట లేదు.

ఈ స్థితిగతులను నివారించుట సులభమే. కాని, ధైర్యము, స్వార్థత్యాగము అవసరము. ఎంత అమూల్యమగు వస్తువునైనను సరే, దీనిఖరీదెంత అని యడుగు ఈ రోజులలోగూడ గ్రంథప్రచురణకర్తయొక్క అవసరమేమియు కనబడదు. గోధుమలు, బియ్యము, కాయధాన్యములు మొదలగు వర్తకపు దినుసులకును గ్రంథరచనకును సంబంధమేమియు లేని గ్రంథవ్యాపారములోనికి గ్రంథప్రచురణకర్తను దించి లాభము లాసించువారినిగా చేసితిమి. నిర్ణీతకాలములో నిన్ని పుటలు గల నవలను వ్రాసెదనని యొప్పుకొని ఆకాలములో గ్రంథకర్త ప్రచురణకర్తకు పుస్తకము నొప
గించుచున్నాడు. గ్రంథములోని విషయముల ప్రాశస్త్య
మునుగురించి దాని అమ్మకము ఆధారపడియుండుటా
లేదు. విషయము చూచిన గ్రంథము నెవ్వరును కొనరు
గ్రంథమును ప్రకటించి, ప్రజలచే విస్తారముగా కొ
పించు నిపుణులగు ప్రచురణకర్తల తెలివితేటలపై గ్రం
ముయొక్క అమ్మకము ఆధారపడియుండును. గ్రం
ములోని విషయములు సత్యదూరములు. గ్రంథరచ
యందును, ప్రచురణయందును అవలంబింపబడు పద్ధతుల
గూడ కేవలము లాభము నపేక్షించి యవలంబింపబడినవ
ఫలితములుగూడ యాదృచ్ఛికములును, మిశ్రములును
యున్నవి. ఇట్టి గ్రంథరచనవలన నేమి యుపయోగమ
చేకూరినది? ఉపయోగ మేమియు లేకపోగా కద
చిత్తుగా రేపైన మంచిపుస్తకము లుత్పన్నములైన
అవియు నీ చెత్తపుస్తకముల వెల్లువలోబడి కొట్టుకొ
పోవుచున్నవి.

ఈ దురవస్థను మాన్పుటకు స్వల్పసంస్కరణ
లేమియు నుపయోగకరములు కావు. సాధారణముగా
నిప్పుడు వ్యాపారములో నాణెముగుసరకు అమ్మకముగా
రెండుకు పనికిరానిసరుకు విస్తారముగా ఖర్చగుచుండు
చూచుచునే యున్నాము. గ్రంథముల వ్యాపార
గూడ నీ ఉప్పు పప్పు వ్యాపారమునవలెనే యున్న
ఇట్టిస్థితి సంపూర్ణముగా మారవలెను. తాము ఖర్చుపెట్ట
పైకమునైనను రాబట్టుకొనుటకై సంవత్సరమునకు మా
గ్రంథములను ప్రచురింపవలసిన కంపెనీ గ్రంథ
యొక్క ప్రాశస్త్యాప్రాశస్త్యములను పరిగణించుచు
జాలదు. ఒక్కదేశములో నిట్టి కంపెనీ ఒక్కటే
కాదు. లక్షోపలక్షలు. పనిలేని ప్రతివాడును గ్రంథకర్త
ఈ గ్రంథములను చదువుటకు మూక లెగబడుచున్నా
గ్రంథరచనయు ముద్రణ, బైండింగు మొదలగు వ్యా
ములవలె నొక వృత్తియైనది.

ప్రస్తుతస్థితిగతులను మార్చి ప్రశస్తమగు
నేర్పరుపవలెననినచో నేమిచేయవలెను? గ్రంథక
ముద్రాపకుడును, పుస్తకములకు అట్టలుకట్టువా

ప్రచురణకర్తయు నైయుండవలెను. ఇట్లయినచో నిప్పటి వలె ద్రవ్యకాంక్షగలిగి, ఆలోచన లేక గ్రంథములపైని గ్రంథములను వ్రాయుటకు గ్రంథకర్తలు పూనుకొనరు. ఇతరుల గ్రంథమును ప్రచురించుట కెవ్వరును ద్రవ్యమును పెట్టుబడిపెట్టరాదు. గ్రంథకర్త మేధాశక్తు లెట్టివో, ఉత్తమములైనవో, నీచములైనవో? వానివలన గ్రంథకర్తకు లాభమువచ్చునో, నష్టమువచ్చునో? ఇట్టిసందర్భములలో నింకొకడు గ్రంథకర్తకు పెట్టుబడిపెట్టి యెందుకు నష్టపడవలెను? తన గ్రంథప్రచురణకు తగినంత ధనమును సంపాదించియుండని వాడు జీవితమన నేమో, దానికష్టసుఖము లెట్టివో యెరుంగగలడా? ఆస్థితిగతులను తగిన పరిజ్ఞానముతో, తగిన సానుభూతితో వర్ణింపగలడా?

ఇప్పుడు ప్రతివిషయము ఒకవృత్తి వ్యాపారము క్రిందికి దిగినది. మతబోధవలె సారస్వతముకూడ ఒక వృత్తి కాజాలదు. సంగీతము వృత్తిగా నవలంబించు వాని పీడవలన పాటలువ్రాయువానికి ఊపిరి సలుపుట లేదు. సారస్వతమనగా నేమి? ప్రకృతితో నైక్యమునొంది, గ్రంథకర్త సంతోషసమయములయందు, ఉత్సాహసమయములయందు తన యనుభవములను వెలిబుచ్చుటయే. ఇట్టి ఉత్సాహ సమయములు ప్రతిరోజు రావు. ఎప్పుడో ఒక్కసారి పరవశముకలిగి వ్రాయవలెనను ఉద్దేశ్యము వానికి గలుగును. అట్టిసమయములయందు వ్రాసిన విషయమే మిక్కిలి ప్రశస్తమైనదిగా నుండును కాని ప్రచురణకర్త ద్రవ్యకాంక్షచే వర్తించుచు, అనేక గ్రంథములను వ్రాయించవెంచి త్రాళ్లు పేనుటలో గంటకిన్ని గజములని నిర్ణయించినట్లు యిన్నిరోజులలో నిన్నిపుటలని నిర్ణయించుచున్నాడు.

శైండింగు మొదలగు వృత్తులకంటె గ్రంథరచనను చాల ఉన్నతస్థానమునం దుంచుటకు హృదయపూర్వకమైన ప్రయత్నములను మనము చేయవలెను. కాగితపు వర్తకులు, ముద్రాపకులు, ప్రచురణకర్తలు ఇత్యాది వారల బారినుండి సారస్వతమును మనము రక్షించవలెను. ఈ వర్తకు లందరు ద్రవ్యకాంక్షులు. కాని ఉత్తమ గ్రంథరచనకు తొందరపనికిరాదు. కావలసినంత విరామము కావలెను. శాంతికావలెను. ఈశ్వరప్రేరితజ్ఞానముండవలెను. స్థితిగతు లిప్పుడున్నట్లే యున్నచో సముద్రమునం దొకతెప్పపై తేలుచున్నవాడు అపారమగు జలరాశి నడుమనున్నను దాహమువలన ప్రాణమును విడుచునట్లు అసంఖ్యాకములగు గ్రంథములు ప్రతిరోజు ప్రచురింపబడుచున్నను ప్రపంచము అజ్ఞానమువలన నశించుట ధ్రువము.

(త్రివేణీపత్రిక రెండవసంపుటము అయిదవ సంచికలోని కె. యస్. వెంకటరమణిగారి వ్యాసమునుండి భాషాంతరీకరింపబడినది.)

---

## చకోవ్

సుప్రసిద్ధ రష్యక్ష గ్రంథకర్త ఏన్టన్ పవ్లోవిచ్ చకోవ్ దక్షిణరష్యాలో నున్న 'టెగన్ రాగ్' అను నగరమున క్రీ. శ. ౧౮౬౦ సంవత్సరం జనవరి ౧౭ వ తేదీని జన్మించెను. అతనితండ్రి చిల్లరసరుకులు విక్రయించుచుండెడివాడు. ౧౮౭౯ వ సంవత్సరంలో చకోవ్ మాస్కో విశ్వవిద్యాలయమునందు డాక్టరు పట్టాను తీసికొనెను. కాని ప్రాక్టీస్ పెట్టలేదు. ౧౯౦౧ వ సంవత్సరములో 'ఓల్గానిప్పర్' అను నాట్యస్త్రీని పెండ్లాడెను. క్షయరోగముచే బాధపడుచు, కుదుర్చుకొనుటకు ౧౯౦౪ సంవత్సరమున 'బేడన్‌వీల్లర్' అను నగరమున కేగి యా సంవత్సరముననే జూలై ౨ వ తేదీని గతించెను.

అతడు మొట్టమొదట హాస్యమైనకథలను వ్రాయుచుండెను; కాని ౧౮౮౬ వ సంవత్సరమునుండియు ఇతర విధములగు చిన్నకథలను మాసపత్రికలలో వ్రాయుచుండెను. ఆత డా చిన్నకథలను సమకూర్చి ౧౮౮౭ వ సంవత్సరమున పుస్తకరూపమున ప్రచురించెను. అప్పటి నుండియు నాతనికీర్తి వృద్ధియై కొలదికాలములో చిన్నకథలు వ్రాయువారిలో నగ్రగణ్యుడని ప్రపంచమంతయు వెల్లడియయ్యెను. ఆతడు కొన్ని నాటకములనుకూడ వ్రాసెను. అందు, 'ముగ్గురు అప్పచెల్లెండ్రు' అనునదియు, 'చెర్రీతోట' అనునదియు చాలా ప్రసిద్ధ

కెక్కెను. నాటకములు వ్రాయువారిలో కూడ నాతని కీర్తి వ్యాపించెను. కాని చిన్నకథలు వ్రాయుటయం దతనికి సమాను లేదేశమందును లేరనియే చెప్పవచ్చును. చెకోవ్ వ్రాసిన చిన్నకథలలో 'నాజీవితము,' 'తా చేసిన తప్పు' 'వేశ్య,' 'మంత్రకత్తె,' 'ప్రేయసి,' 'చిత్రకారుని చరిత్రొ' అనునవి చాల ప్రసిద్ధి కెక్కినవి.

కూర్మా వేణుగోపాలస్వామి,
శేషుబాయి గోపాలస్వామి.

---

## యుద్ధవిరామ దినము!

౧౯౧౮ సంవత్సరమున ప్రపంచ మహాసంగ్రామము ముగిసెను. ౧౧ సంవత్సరములుగ ప్రతియేడును ౧౧వ మాసమున ౧౧వ తేదీనాడు పగలు ౧౧ గంటలకు కొంతసేపు ప్రపంచమున నందఱును అన్ని కార్యములను కట్టిపెట్టి యుద్ధవిరామమును స్మరించి ప్రపంచశాంతి కొఱకు ప్రార్థించుచున్నారు. ఆంగ్లేయ సామ్రాజ్యమునను వెలుపలను గూడ యీ ప్రపంచశాంతిదివసము జరుపబడవలెనని వాంఛింపబడుచున్నది. నాటిదినమున అనేకవిధములగు నుత్సవములు ప్రదర్శనములు జరుగుచున్నవి. మృతయోధుల స్మారకచిహ్నములపయి పుష్పమాల లర్పింపబడుచున్నవి.

ఆర్. సి. షెరీఫ్ అను నాంగ్లేయుడు 'Journey's End' ప్రయాణాంతము అను నొక ఆంగ్ల నాటకమును వ్రాసెను. యుద్ధము-శాంతిని గుఱించి యింతవఱకును వ్రాయబడిన బ్రిటిషు నాటకములకెల్ల గొప్పది యని యీ నాటకము పొగడ్త గాంచెను. ఇంగ్లాండు, అమెరికా, ఇండియాలయం దీనాటకము ప్రదర్శింపబడెను. చక్రవర్తిగారు సకుటుంబముగా నీనాటకమును చూచి యానందించిరట. గ్రంథకర్తను సార్వభౌముడు స్వయముగ ప్రశంసించెనట. యుద్ధవిరామదినమునా డీనాటకగ్రంథ విషయము అన్ని దూరశ్రవణ యంత్రములద్వారా వినిపింపబడి విశాలప్రకటనము నొందునట్లేర్పాటుచేసిరి. ఈ దూరశ్రవణము 1¾ ఘంటలకాలము పట్టును.



ఆర్. సి. షెరీఫ్.

ప్రపంచమున మఱి యుద్ధములు జరుగకుండ నాపివేయుటకు నిర్ణయించుకొని జాతిసమితివారు కెల్లాగు శాంతిసంధిపత్రమున సంతకములుచేసిరి.

క్షేమ్, సంతోషము!

కాని జర్మనీవారును, ఇంగ్లీషువారును, అమెరికావారును పందెములువేసికొని ఒకరికంటె నొకరు ఎక్కు-వగా మరఫిరంగులు, యుద్ధనావలు, వాయువిమానములు, విషవాయువులు-వీనిని విపరీతముగ తయారుచేయుచునే యున్నారు. పరుగుపందెములు, మోటారువేగము పందెములువేసుకొని శీఘ్రగమన దేవత నారాధించుచున్నారు. బలము-శక్తి రాజ్యముల నేలుచున్నవి. విశ్వమానవసోదరభావమును, పరశ్రేయోభిలాషయు, నిజమగు ప్రపంచశాంతియు నెప్పటికి నెలకొనునో!!! రాజ్యతృష్ణ, హింసయందు విశ్వాసము, తొలగిపోయిన దినమే శాశ్వత యుద్ధవిరామదినమని భారతీయుని హృదయము స్పందించి బోధించుచున్నది.

జ. బ్ర.

---

## కీ. శే. జార్జెస్ క్లెమెంకోగారు



పూర్వము ఫ్రాంసుదేశపు ప్రధానామాత్యులు నుండి, ఫ్రెంచివ్యాఘ్రమని ప్రసిద్ధినొంది, నాటిలే

ధైర్యసాహసోత్సాహములు దేశభక్తి రాజకీయపరిజ్ఞానములు గలిగియుండిన క్లెమెంశోగారు తమ 89 వ యేట ప్యారిస్ నగరమునందు నవంబరు ౨౪వ తేదీనాడు ఉదయము ౧-౪౫ ఘంటలకు మృతినొందిరి. వీరి మరణము నకు జగచ్చమ్ము ఫ్రాంసుదేశమందున్నయున్న బావుటాలను సగము క్రిందికి దించియుంచిరి. వీరి యింటివద్ద చేరిన ప్రేక్షకులలో మాత్రన ప్రధానమంత్రియగు టార్డ్యూగారు మొదలగువా రుండిరి... వేండీయందలి యొక్క వనమునందు తన తండ్రిగారి సమాధిప్రక్కనే యితని శవమును భూస్థాపితముచేసిరి. వీరి అంత్యక్రియలు జరిగినసంగతిని వెల్లడించుటకు 191 గుండ్లు ప్రేల్చబడెను. బ్రిటనుకు ఆత్మమిత్రుడగు నితని మరణమునకు ఆంగ్లప్రభుత్వమువారు దుఃఖించుచున్నారు.

ఇతడు ౧౮౪౧ సం సెప్టెంబరు నెల ౨౮వ తేదీనాడు వేండీ యనుస్థలమున జనన మొందెను. ఇతడు ౧౮౬౫-౬౯ సంవత్సరములలో అమెరికా సంయుక్త రాష్ట్రములయందు నివసించుచుండి యొక అమెరికను యువతిని వివాహమాడెను. మొదట నితడు వైద్యవృత్తి యందుండెను. పిదప ప్యారిస్ పురపాలక సంఘాధ్యక్షుడయ్యెను. ౧౮౭౧ సం. ఫిబ్రవరి ౮వ తేదీని జాతీయ మహాసభా సభ్యుడయ్యెను. అతివాదిగ నుండెను. ౧౮౭౬లో ఫ్రెంచి పార్లమెంటు సభ్యుడయ్యెను. ౧౮౮౦లో నొకవార్తాపత్రికను స్థాపించెను. రాజకీయవిషయములందు విమర్శకాగ్రేసరు డనిపించుకొనెను. ౧౯౦౨లో మరల పార్లమెంటు సభ్యుడయ్యెను. ౧౯౦౬లో దేశీయ మంత్రియయ్యెను. ఆ సంవత్సరమే అక్టోబరు నెలలో ప్రధానామాత్యుడయ్యెను. ఐరోపా మహాసంగ్రామ ప్రారంభమున విదేశాంగ సభాధ్యక్షుడుగ నుండెను. రెండవ సభయగు సెనెటునందుగూడ నితడు యుద్ధసంఘాధ్యక్షుడుగ నియమింపబడెను. ౧౯౧౭ సం జూలై నెలలో నితడు విక్టరీమంత్రివర్గము నేర్పాటుచేసెను. యుద్ధవిరామకాలమున శాంతిసభాధ్యక్షతను వహించెను. ౧౯౧౮లో ఫ్రెంచి ఎకాడమీ (విద్వత్పరిషత్సభ) సభ్యుడయ్యెను. ౧౯౨౦ వరకును యుద్ధశాఖామంత్రిగ నుండెను. ౧౯౨౧ సం. జూన్ నెలలో ఆక్స్ఫర్డు విశ్వవిద్యాలయము వారితనికి డాక్టర్ (పండిత) బిరుదమునిచ్చిరి. ఇతడు ఇండియా దేశమునకు వచ్చి గంగానదిని, కలకత్తా కాళీ దేవాలయమును చూచి యానందించెను. 1922లో నితడు అమెరికా దేశమునకు వెళ్లి అంతర్జాతీయ సఖ్యము నేర్పాటు చేయించెను. ఇతడనేక రాజకీయ సాంఘిక గ్రంథములను రచించెను. రచయితగ కూడ నితడు పేరొందినవాడే. చివరదినములయం దితడు రాజకీయ రంగము నుండి తొలగిపోయినను ప్రతివాదిభయంకరుడగు నితని పేరెత్తిన సందరకు భయము కలుగుచుండెను. ఇతనికి దౌర్జన్యము, యుద్ధము వీనియం దమితవిశ్వాసముండెను. సామ్రాజ్యవాదియగుటచే యూరపుయొక్క క్షేమము, అంతర్జాతీయైకమత్యము, అన్నిటికంటె హెచ్చుగ ఫ్రాంసు ప్రాభవము నితని మనస్సుకు వచ్చిన విషయములు.

---

## కీ॥ శే॥ టి. పి. ఓ'కొన్నర్‌గారు



పార్లమెంటునందు ప్రజలసభలో ఏబది యేండ్లకు పైగా సభ్యుడుగానుండుటవలన 'కామన్సుసభా 'జనకుడు' Father of the House of Commons అని విఖ్యాతినిబడసిన ఓ'కొన్నరుగారు నవంబరు ౧౮వ తేదీ నాడు తమ ౮౧వయేట లండన్ నగరమున మృతినొందిరి. వీరు జన్మించినది ఐర్లాండు దేశమున. పార్లమెంటునందు వీరు

బ్రిటిషు జాతీయపక్ష ప్రతినిధిగనుండి రాజకీయమునను, పత్రికాసంచాలనమునను ఐర్లండుకొరకు పాటుపడి నందుకు, ఐర్లండు స్వాతంత్ర్యమును బడయుట గాంచగలిగి ధన్యులయిరి. వీరనేక రాజకీయ సారస్వత వారపత్రికలను స్థాపించి, వానికి సంపాదకులుగనుండి తమ సామర్థ్య వైవిధ్యమును ప్రదర్శించిరి. అరువదియేండ్ల క్రిందటనే వీరు పత్రికానిర్వహణమున ప్రవేశించి యుండిరి. వీరు స్థాపించిన తుది వారపత్రిక టి. పీస్ వీక్లీ చాల ప్రసిద్ధివిగాంచి చాలకాలము నిర్వహింపబడి వీరి మరణమునకు ఒకపక్షము దినములు ముందుగనే ఆగిపోవుటయు వింత సంభావన. ఓకొన్నరుగారు చివరవరకును వ్యాసములు వ్రాయుచు, ఉపన్యాసముల నిచ్చుచు నుండిరి. ఒక బ్రిటిషు ఫిల్ము కంపెనీకి వీరు ౧౨ సంవత్సరములుగ డైరెక్టరయి యుండిరి. ఒక సంవత్సరము క్రిందటనె బ్రిటనులోని అన్ని రాజకీయ పక్షముల వారును, ఓకొన్నరుగారి పేర ఒక గొప్పనిధి నేర్పాటుచేసిరి. ఇక విూద, నందలి ధనము వీరు స్థలపెట్టిన ధర్మములకై వినియోగింపబడును. వీరి తరువాత ఎక్కువకాలము పార్లమెంటుసభ్యులుగ నుండినది, లాయడ్ జార్జిగారగుటవలన నిప్పుడు వారే 'కామన్సుసభాజనకుడు'. వారి తరువాత సర్ ఆస్టిన్ ఛేంబర్లెనుగారు రావడానికి వస్తురు.

---

## విశాఖపట్టణం హార్బరు



౧. హార్బరుముఖద్వారం. ఈ కొండను డాల్ఫిను ముక్కు (Dolphin's nose) అంటారు. నేటివరకూ ఓడలు సముద్రములో,—పటంలో కనబడుతూ వున్న రెండు ఓడలవలె—నిలిచి సరుకులు ఎగుమతి దిగుమతులు చేస్తూవున్నవి. ఇకముందు ఓడలు సముద్రములో నిలవ నవసర ముండదు. సరుకుల ఎగుమతులు దిగుమతులు ఎక్కువసులువు కాగలవు.



౨. హార్బరు తయారవుతూవున్న పద్ధతి. ఇప్పు జలమయంగా కనబడుతూవున్న యీ ప్రదేశమం ౮ మాసాలక్రితం ఘట్టినేల. పటంమధ్యను కనబడుతూ వున్న "విశాఖపట్టణం" అనే పేరుగల డ్రెడ్జ (dredger) ఈపనినంతా చేసినది. ఈ ఓడఖరీదు లక్షల రూపాయీలు. నాలుగు మాసాలక్రితం మర తులపాలైతే ఖర్చులు ౬ లక్షలయినవి. ఇప్పుడు నిలిచినచోటినుంచి ఎడమప్రక్క మోటారుబోటు బడుతూవున్నవరకూ వీడు డాకులు (docks) కట్ట నని యత్నము. ఒక్కొక్క డాకులో రెండేసి ఓ

నిలవవచ్చును. అనగా ఒకేసారి ౧౪ ఓడలనుంచి సరుకూ జనమూ ఎగుమతి దిగుమతి కావచ్చును.

ఇప్పటికి ఒక డాకు పూర్తిగా కట్టడమైనది. ఇంకా రెండు డాకులు పూర్తికాగానే హార్బరు తెరిచి ఉపయోగపరుస్తారు.



3. "డ్రైడాకు" (dry dock) చాలావరకూ కట్టడమైనది. దీనికి తక్కిన ౧౪ డాకులతో సంబంధము లేదు. ఓడలు మరమ్మత్తుకు వచ్చినప్పుడు దీనిలో మరమ్మత్తుచేస్తారు. కాలవ లాకులలోవలె దీనినిండా నీరుపట్టి ఓడవచ్చిన తరువాత, కుడిచేతిప్రక్క ౫౯ గురు కూలీలు నిలిచినచోట కనబడుతూవున్న రంధ్రం ద్వారా నీరు బయటకు తీసివేసి పొడిడాకులో మరమ్మత్తులు చేస్తారు.

౪. ఈ చెక్కనిలోయ ఊరిలోనుంచి హార్బరులోనికి ప్రవేశించడానికి కొండను బద్దలుగొట్టి తయారు చేసినారు. కాని, వదులుగా సడలిపోయిన పెద్దరాళ్లు, పట్టి ఉండేలు ఒక ఉడుత కదిలినా పడుతూవుండడము



చెక్కని లోయ

వల్ల అపాయకరమని త్యజించినారు. ఈ అందమైన ఏర్పాటు వృధగా విడిచిపెట్టవలసి వచ్చినది.

ముద్దుకృష్ణ.

---

## గ్రుడ్డివారికి 'టైపురైటరు'



గ్రుడ్డివారు చదువుకొనుటకు వీలగునట్లు ఉబ్బెత్తు అక్షరముల ముద్రించు అచ్చును ఇదివరకు కనిపెట్టి

యుంచిరి. అట్టి అచ్చుపుస్తకములును, పత్రికలును గలవు. గ్రుడ్డివారికి చదువు నేర్పెడు విద్యాలయములు గలవు. వీనివలన ఎందరో లాభము నొందిరి. ఈ అచ్చునకు Braille type అందురు. అట్టి అక్షరములనే ముద్రించు టైపురైటరు యంత్రము గ్రుడ్డివారికొఱకు కనిపెట్టబడినది. దానిచిత్ర మిం దున్నది.

---

## వింత కవ!



ఈ చిత్రమునందు మధ్యనున్న పురుషు లిద్దరును కవలలు. ఒకరి వీపున కొకరు అంటుకొని యుందురు. సయామ్ దేశమున వీరే మగకవ. వీరిపేర్లు లూసియో, సింప్లిసియో గోడినో. ఈ సంవత్సరము జులై నెలలో మనీలా యను ప్రదేశమున వీ రిద్దరును పెండ్లిండ్లు చేసికొనిరి. వారి భార్యలు నిందు గలరు. ఈ కవ వయస్సు 27. వీరు మోటారుసైకిలునెక్కి నడుపగలరు. యంత్రాగారములయందు పనిచేయగలరు. కసరత్తు విద్యలను చేయగలరు. జోళ్లకు కీలకమును తగిలించుకొని మంచుపై వింతగ జారగలరు. మనీలా బాలభటసంఘమునందు వీరిరువురును స్కౌట్ సహాయ ఉపాధ్యాయులుగ నున్నారు.

---

## రెండేండ్ల బిడ్డ యీదుట!



మేజోరీ వెస్ట్ అను 2 యేండ్ల రెండు నెలల
గ్రిఫ్స్ సైన్యూక్ల్ బాత్స్ అనుచోట ఈదుల
యీ చిత్రమునందు చూడనగును. ఫ్లోరిడా య
ఈత ఉపాధ్యాయుడుగనున్న యీమె తండ్రి
విలియమ్స్ వెస్ట్ యిటనే ఈదనేర్పియుండెను.



కుటుంబమువారు అమెరికానుండి 'బెరెన్ గెరియా

తను దేశమునకు తిరిగివచ్చుచుండినప్పుడు. ఈ బిడ్డ ఆ రోడ్లలోని జలాశయమున చక్కగ నీదులాడి ప్రయాణి కుల కందరకును ఆశ్చర్యము గలిగించెను.

---

## 53 యేండ్లు ఖైదులో నుండినవాడు



ఇత డమెరికాదేశస్థుడు. పేరు జెస్సి హాద్ పోమిరాయ్. ఇప్పటి వయస్సు 71 యేండ్లు. మరణాం తము శిక్ష విధింపబడినవాడు. మాసాచుసెట్స ప్రభుత్వ చెరసాలలో 53 యేండ్లు గడచిన తరువాత నిప్పు డితనిని 'బ్రిడ్జ్ వాటర్ స్టేట్ ఫార్మ్'కు బదలాయింపు చేసిరి. గవ ర్నరును, కార్యనిర్వాహక సభవారును యీ మార్పును చేయించిరి. ఈ 53 యేండ్ల కాలములో నితను 41 యేండ్ల పాటు చీకటిగదిలో ఒక్కడే తక్కిన మనుష్యు లందర కును దూరముగా విడిఖైదు ననుభవించెను. ఇట్టిది ప్రపం చమున నిం కెవ్వరివిషయములను జరుగలేదు. బ్రిడ్జ్ వాటర్ నకు ఇతనిని మోటారుకారుపై గొంపోయిరి. మోటారు కారులు మొదలగువాని నితడు ఇప్పుడే మొదటిసారి చూచెను! ఇతనికి మొదట శిక్ష విధింపబడినప్పటికి మోటారులు సృష్టింపబడలేదు. ఒక సహవాసగాని హత్యకై, యితనికి 17 యేండ్ల యీడున 1876 సం. న శిక్ష విధించియుండిరి.

---



నవరస ప్రదర్శిని

శ్రీ యం. వి. రఘురామయ్య గారు.

శ్రీ బళ్లారి నారాయణరావు గారి ఛాయాచిత్రము.



## గ్రామపునర్నిర్మాణపు తరగతుల ఉపన్యాసములు

ప్రకాశకులు: శనివారపు సుబ్బారావుగారు, ఆర్గ నైజరు అండు ఏజంటు, ఆంధ్ర ఇన్సూ్యరెన్సు కంపెనీ కొవ్వూరు, పశ్చిమగోదావరి జిల్లా. క్రౌను 472 పుటలు వెల రూ. 1-8-0

తాడేపల్లి గూడెం తాలూకాబోర్డు వారిచే నేర్పాటుచేయబడిన వసంతఋతు విద్యాలయమునందు, పలువురు ఆంధ్రప్రముఖులచే వివిధవిషయములను గూర్చి యొసంగబడిన ఉపన్యాసములన్నియు, ఈ పుస్తకరూపమున ప్రకటితము లయినవి. ఈపనిసేయుటలో, శ్రీయుత శనివారపు సుబ్బారావుగారు, మిగుల శ్రద్ధవహించి, చాల కష్టపడి, దీనిని నిర్వహించినారు.

ఈ మాదిరిగ గ్రామపాఠశాలోపాధ్యాయుల లాభముకొఱకు, సుప్రసిద్ధులచే నుపన్యాసము లిప్పించు పద్ధతిని తలపోసి, ఆచరణలోనికి దెచ్చినవారు, ఆంధ్రదేశములో ఒక్క తాడేపల్లిగూడెం తాలూకాబోర్డు వారే. ఆ బోర్డు ప్రెసిడెంటుగా నైన మ-రా-రా-శ్రీ కలిదిండి సంగరాజుగారి ప్రారంభోపన్యాసము, ఈ వసంతఋతు విద్యాలయము ఎట్టి సదుద్దేశములతో నారంభింపఁబడినది, ఎట్టి మహదాశయముల ముందిడుకొని కార్యమునకు గడంగెనది, స్పష్టీకరించుచున్నది.

ఈ వసంతఋతు విద్యాలయమం దుపన్యాసము లిచ్చిన మహాశయు లెల్లరును అనుభవము గలవారును, గ్రామ పునర్నిర్మాణకార్యములకు సంబంధించిన వివిధ విషయములను బాగుగా సుశ్రుతించిన వారును నయియున్నారు. ఏయే విషయములను గూర్చి ఉపన్యాసము లొసంగబడినవో, అయ్యవి ఆ యుపన్యాసకులకు, అభిమానవిషయములై యున్నవి. కావుననే, ఈ ఉపన్యాసము లన్నియు, చక్కగను, విద్యార్థులకు జ్ఞానబోధకములు నై యున్నవనుటకు సందేహములేదు. వీనిలోని చర్చితాం... ములు, గ్రామపాఠశాలోపాధ్యాయుల కత్యంతోపయో... గకరములగుటం జేసి, ఈ ఉపన్యాసములు, విద్యార్థులుగా నున్న యుపాధ్యాయులను జక్కగా తరిబీతుచే... వారలచే గ్రామపునర్నిర్మాణకార్యక్రమ మారంభిం... జేయుటకు తగినట్లు ఒప్పియున్నవి.

15 వ మే మొదలుకొని, 5 వ జూన్ వర... జరుపబడిన వసంతఋతు విద్యాలయము తరఫున నొస... గబడి, ఈ పుస్తకములో ప్రచురింపబడిన వన్నియు... గలసి సుమారు 75 ఉపన్యాసములు. వీనిలో ప్రతిపా... దింపబడిన వివిధవిషయములు గూడ మొత్తముమీ... గ్రామపునర్నిర్మాణ కార్యమునకు సంబంధించినవే అం... నను, సౌకర్యార్థము, ఒకమాదిరిగా, ఆర్థికము, సాం... కము, విద్యావిషయకము అను మూడు భాగము... క్రింద విభజించుటవచ్చును.

ఈ 75 ఉపన్యాసములలో సెక్కువభాగ... ఆర్థికవిషయము క్రిందనే గ్రహింపవచ్చును. దీనిలో ముఖ్యమయినది సహకారము (cooperation). ఈవిష... మును గురించియే పలువురు పెద్ద లుపన్యసించిరి. ఉప... న్యాసములలో, సహకారోద్యమము సంపూర్ణము... నిర్వచింపబడినది. ఈ యుద్యమముయొక్క ప్రయోజ... ములు, దీని ఆవశ్యకత, గ్రామాభివృద్ధి కిదియెట్లు తో... డగలదు?—ఈ మొదలైన విషయము లన్నియు తే... తెల్లముగా వివరింపబడినవి.

ఆర్థికవిషయ సందర్భములో సహకారము ... పాటు భీమాపద్ధతికూడ గ్రామాభివృద్ధికి ముఖ్యావ...

మయినదే. ఈ అంశమునుగూర్చి కొన్ని ఉపన్యాసములుగలవు. వానియందు భీమాపద్ధతి యేవిధమున నవసరమయియున్నదో, గ్రామపునర్నిర్మాణ కార్యముతో భీమాపద్ధతి కెట్టి సంబంధము కలదో చక్కగా విశదపరుపబడినది.

కొన్ని యుపన్యాసములలో, ఆర్థికసంబంధము కలిగిన మరికొన్ని విషయములు చర్చింపబడినవి. దేశాభ్యుదయము గ్రామాభివృద్ధి మూలకము. అట్టి గ్రామాభివృద్ధికి ముఖ్యకారణములలో నొకటి మన గృహపరిశ్రమల పునరుద్ధరించుటయే యని సోదాహరణముగ నొక్కి చెప్పబడినది.

మిగిలిన ఉపన్యాసములలో చాలభాగము సాంఘికాభివృద్ధినిగూర్చిన విషయములు చర్చింపబడినవి. ఇట్లు చర్చింపబడిన విషయములలో ముఖ్యముగా గ్రామపంచాయతీలు, వాని అభివృద్ధి, త్రాగుడు మొదలగు దురభ్యాసములు, అవి మానవసంఘము నెట్లు పీల్చి పిప్పి చేయుచున్నవో అనునవి వివరింపబడినవి. సంఘధర్మముల గురించి ఉపన్యసించుచు మానవునికి, నైసర్గికమయిన సాంఘికభావము (Group instinct) కలదనియు, అందుచేత సంఘాభివృద్ధియే మానవాభివృద్ధికి ముఖ్యకారణమనియు చెప్పబడినది. అస్పృశ్యత యను మహాఘోరపాతకమును మనము చేయుచున్నాము. అది తొలగిననే కాని మనము వృద్ధిగాంచజాలము. మానవకళ్యాణమునకు, సర్వసౌభ్రాత్రము ఆవశ్యకము అని పై ఉపన్యాసములలో సారాంశము తేలుచున్నది.

గ్రామ పంచాయతీలను గురించి చెప్పుచు, ముఖ్యవిషయములను ఉపన్యాసకు లిట్లు నిరూపించిరి. స్యానిటేషన్-హెల్తు-(ఆరోగ్యము) విద్య, నీటిపారుదల అను నీనాల్గు గ్రామనిర్మాణమున కావశ్యకములు.

మూడవ ముఖ్యవిషయము విద్యను సంబంధించినది. ఈ సందర్భమున సుమారు 10 ఉపన్యాసము లొసంగబడినవి. వీనిలో, ప్రధానాంశములుగ పరిగణింపబడినవి విద్యావిధానము, ఉపాధ్యాయుడు, యువకులకు విద్యనేర్పుట, గ్రంథాలయములు- అనునవి ముఖ్యముగా, ఉపాధ్యాయుడు అనుదానిమీద చక్కని సంగతులు తెల్పబడినవి. నిజమైన ఉపాధ్యాయు డెవరు? అను ప్రశ్నకు సరియైనసమాధాన మొసంగబడినది. నేటికాలపు ఉపాధ్యాయులకును, ఉపాధ్యాయసార్థక నామమునకును భేదము విశదీకరింపబడినది. ఉపాధ్యాయ లక్షణములు, ఉపాధ్యాయుని కావశ్యకములైన విషయములు సంఘమునం దాతనికి గల గౌరవబాధ్యతలు మొదలగు విషయములు చక్కగ విమర్శింపబడినవి.

ఇవియేగాక, సంతాననిరోధము, ఉపన్యాసనైపుణి, మొదలగు ప్రకృతకాలమందు తెలిసికొనదగిన విషయములను గూర్చి చక్కని ఉపన్యాసము లొసంగబడినవి.

మొత్తముమీద, ఈ 75 ఉపన్యాసములతోను యీగ్రంథము తయారయినది. వీనిలో ప్రతిపాదింపబడిన ప్రతివిషయము దేశాభ్యుదయమునకు ముఖ్యావసరమయినది. గ్రామనిర్మాణము దేశాభ్యుదయమునకు హేతుభూతము. అట్టి గ్రామపునర్నిర్మాణ కార్యమున కత్యావశ్యకమయినవి, ఆర్థికాభివృద్ధి, సాంఘికాభివృద్ధి, విద్యాభివృద్ధి. ఇదియే ఈ ఉపన్యాసముల యొక్క సారాంశమని చెప్పవచ్చును. ఈ వృద్ధిత్రయమునకు సాధనభూతమయినవాడు ఒక్క గ్రామోపాధ్యాయుడే. ఉపాధ్యాయుడే నిజముగా గ్రామోద్ధారకుడు; తన్మూలముగ దేశోద్ధారకుడు గూడను. భావిపౌరలోకమును తయారుచేయు ఉపాధ్యాయ మహాశయుడే గదా దేశాభ్యుదయమునకేని, దేశానర్థమునకేని ఉత్తరవాది కాగలవాడు! కావున, ఆదర్శభూతులయిన గ్రామోపాధ్యాయుల నేర్పాటుచేయుట మిక్కిలి ఆవశ్యకమయిన పని.

ఈ విషయము లన్నియు నీ పుస్తకములో విపులముగాను విస్పష్టముగాను వివరింపబడినవి. ఉపన్యాసకులందరు ఆరి తేరినవారే. జగమెరిగిన బ్రాహ్మణులే. వీరందరి చిత్రపటములను మిగుల కష్టపడి సేకరించి ఈ పుస్తకములో ముద్రించినారు ప్రకాశకులు. ఈ పుస్తకము ప్రతి ఉపాధ్యాయుని హస్త

మలంకరింపదగియున్నది. దీనిలో నచ్చటచ్చట అచ్చు తప్పులున్నను, అవి పునర్ముద్రణమందు సవరింపబడ గలవు. ఉపన్యాసకుల ముఖతః ఈ ఉపన్యాసములు వినిన గ్రామోపాధ్యాయులు కృతార్థులు. అట్టిలాభము పొందియుండనేరని వారీగ్రంథమును దప్పక చదివి తీర వలయును. వీరలకొరకేర్పడిన ఉపన్యాసములే కావున, వీనిలో ప్రయోగింపబడిన భాష, నిత్యవ్యవహారములలో ప్రయోగింపబడు నట్టిదే అయియున్నది. స్వేచ్ఛగలిగినది, సులభబోధక మయినది కావున ఇట్టి ఉపన్యాసముల కిట్టి భాషను వాడుటయే యుక్తము.

ఈ పుస్తకము ప్రతి గ్రామపాఠశాలా గ్రంథాలయములోను ముఖ్యస్థానము వహింపవలసి యున్నది. ప్రతి తాలూకాబోర్డువారికిని ఇది గమనింపదగిన విషయము. ఈ యుపన్యాసము లన్నిటిని పుస్తకరూపమున ప్రకటించినందులకు, ముఖ్యముగా గ్రామపాఠశాలోపాధ్యాయ లోకము శ్రీ శనివారపు సుబ్బారావుగారికి వందనము లర్పింపవలసి యున్నది. ఇట్టిమాదిరి వసంత ఋతు విద్యాలయ మేర్పరిచి, ఉపాధ్యాయుల ప్రయోజనార్థము, ఉపన్యాసముల నిప్పించినందులకు, తాడేపల్లిగూడెం తాలూకాబోర్డువా రెంతయు ప్రశంసనీయులు. వీరినిజూచి తక్కిన తాలూకాబోర్డుల వారుగూడ ఈ కార్యమునకు గడంగుదురు గాక యని కోరుచున్నాము.

అమరవాది హనుమచ్ఛాస్త్రి

---

## విషాదసంసారము

గ్రంథకర్త:—ఆదిభట్ల తిరిణయ్య సిద్ధాంతిగారు. డెమ్మీ కాగితములు, కాగితపు బైండు, ౧౭౨ పుటలు, ధ. ౧-౮-౦.

ఇది ఒక చిన్న సాంఘిక విషాదనవల. సురేంద్రమోహన భట్టాచార్యుని 'నారీబలి' అను బంగాళీ నవలకు కేవలము అనువాదముగాక, ఆంధ్రానుకరణము (Adaptation). అసలు అనుకరణపద్ధతియొక్క తత్త్వమెట్టిదనః ఇది మనదేశభాషలకు క్రొత్తదిగాని నాగరికతోన్నతిని వలచు విదేశభాషలకు క్రొందియుండలేదు. అనగా మన మేయితరభాషయందలి గ్రంథమునను వదించికొన దలచినను, గ్రంథనామమును మార్చియు, పాత్రనామము లకు మన తెలుగుపేర్లను సృష్టించియు, అందున్న విదే విషయములను తీసివేసి స్వదేశవిషయముల జొప్పించియు, విదేశాచారములకు స్వదేశాచారములనేర్పరచియు, ఇట్లా పాదమస్తకమును సంస్కరించి విజాతిరూపమున కొక స్వజాతిరూపమును గల్పించుచున్నాము. ఈ పద్ధతిలో— ఒక్కముక్కలో తేల్చివేయవలెనన్న—సుగుణముల కంటె దుర్గుణములే హెచ్చుగలవనవలెను. ఈపద్ధతినిహాపస్థ మం డూకపుపద్ధతియని చెప్పవచ్చును. ఏలయనదీనివలనమన బు విస్తృతిగాంచక సంకుచితమగుచున్నది. ఇతర దేశములను గూర్చియు, ఇతర జాతులనుగూర్చియు, ఇతర ఆచారము లనుగూర్చియు తెలిసికొనవలెనను అభిలాషను రూపు మాపి ప్రపంచమంతయు 'మనతోసరి' యనునట్టి దురహంకార వేదాంతమును బుట్టించుచున్నది. జ్ఞానవిస్తృతి కవసర మగు కౌతూహలమును అణగద్రొక్కుచున్నది. మరియొక టేమన, ఈ అనుకరణానువాదములందు మూలగ్రంథ విధానమంతయు మూలబడుచున్నది. గ్రంథమందలివిషయ ములు మూలగ్రంథకర్తలేక అనుకరణానువాదకుని స్వంత కవిత్వమా యను శంకపొడమి రసాస్వాదన నాటంకపఱచి నిరుత్సాహమును గలిగించుచున్నది. ఇక సరియైనపద్ధతియే దనః—సు నతప్పకుండ కావ్యవస్తువెల్లను ఏమాత్రమును విడిచి పెట్టక లేక మార్పుచేయక యున్నదున్నట్టుగా రసవంత ముగా తర్జుమా చేసినప్పుడే మనము మూలగ్రంథకర్త యొక్క పజ్ఞాప్రజ్ఞలను పరామర్శింప గలిగెదము. అను వాదకుని నిపుణతయు అందే తేటతెల్లమగును. ఇట్టి పరి వర్తన జరిగినగాని అనువాద వాఙ్మయమునకు సంపూర్ణ గౌరవము గలుగనేరదు.

గ్రంథవిషయము:— ఈ గ్రంథమందు హిందూ హిందూమతములోను, హిందూసంఘములోను గల దుర తముల కాహుతియైన 'వైద్యశాస్త్రి' కుటుంబ చరి వర్ణింపబడినది. హిందూసంఘములో ఆడపుట్టుకపాప పోయినది. బాల్యవివాహములు, వరశుల్కములు, లాం నములు, పెండ్లిఖర్చులు, ఋణములు, అల్లునకు పండు కట్నములు, మామగారి దివాలా, స్త్రీవిద్యాలవను స్త్రీ యుద్యోగములనను సంఘబహిష్కరణము, తల్లులము

మరణములు, కుటుంబనాశనము మొదలగునవి యిందు చిత్రింపబడినవి. అనగా యిందలివిషాదము మతసంఘ అర్థిక క్రౌర్యములవల్ల గలిగినది. దీనికి నివారణోపాయము లేక పోలేదు. ఇట్టి క్రౌర్యమున కాలవాలమైన హిందూ ధర్మశాస్త్రములను త్యజించుట, దురాచారము రూపు మాపుట, దేశమును ధనవంతముగ జేసికొనుట అత్యవసరము. లోకజ్ఞానము, విమర్శశక్తి పురుషకారము లభివృద్ధియైనచో నిట్టికష్టములు, సులభముగ నిర్మూలములగును.

పాత్రలవిషయము:— ఈ నవలలో ముఖ్యపాత్రలలో నొకడగు రామభద్రనయ్యను డెట్టివాడన: నిలువెల్ల విషముగల ఖలుడు; పరమవిద్రోహి; అతినీచచరిత్రుడు; స్వార్థముతప్ప వేరెరుగనివాడు; వైద్యశాస్త్రి కుటుంబమును దుంపనాశనముచేయ కంకణము కట్టుకొన్నవాడు. శంకరపీఠాధిపతి ననియు, హిందూధర్మసంరక్షణార్థము వెలసితిననియు చాటించికొని, స్త్రీవిద్యయు స్త్రీయుద్యోగమును పాపములని సిద్ధాంతీకరించి వైద్యశాస్త్రిని, వాని కుమార్తెలను హత్యగావించినవాడు. ఇట్టి వీనిని సజీవముగా దహనముచేసినను, చీల్చి కాకులకువేసినను పాపేము రాదు.

ఇంకొకపాత్రయగు గోపాలరావు ఆధునిక నాగరికతలోని సుగుణములను విడిచి దుర్గుణములనుమాత్రమే చేపట్టిన మహానుభావుడు. వీని చరిత్ర చదివిన జాలిగలుగుచున్నది.

శైలి—గ్రాంథికశైలి వాడబడియున్నది. కాని సాంఘీకరచనలకు వ్యావహారికము పెట్టినపేరు. ఇది లేకుండుట గ్రంథకర్తలో నొకలోపమే. శైలిసులభముగను, సరసముగనున్నది. నవలయందు మనకు గల్గుకౌతూహలమునుగూర్చి వేరుగా చెప్పనవసరము లేదు.

ఈగ్రంథమును జదివిన పూర్వాచారపరులు సంఘసంస్కర్తలుగా మారుదురనుటకు సందియము లేదు.

వలయువారు:— గ్రంథకర్త, భారతీ ముద్రణాలయము, బరంపురమని వ్రాయవలయును. టే. కా.

---

## గీర్వాణ వాక్ప్రపంచ చరిత్రము

వైదికకాలికము: లౌకికకాలికము అని రెండుభాగములు, క్రౌను పు. ౧౩౫+౧౭౯=౩౧౪.

సాహిత్యశిరోమణి పిన్నంరాజు వేంకట సుబ్రహ్మణ్యశర్మగారు-వాయునందన ముద్రాయంత్రము—కావలి— వెల 1-4-0.

ఇది ఆంధ్రవిశ్వవిద్యాలయము నుండియు, మదరాసు విశ్వవిద్యాలయమునుండియు ప్రాచ్యభాషాపరీక్షలకుఁబోవు విద్యార్థుల కత్యంతోపయుక్తమైనది. గ్రంథకర్తగారు ప్రాచ్యప్రతీచ్యవిమర్శనములను సంశోధించి యీచరిత్రమును తేటతెలుగున వ్రాయుటచే నిది విద్యార్థులుకానివారికిని ఉపకరించును. ఇందలి ప్రథమభాగము వైదికకాలికము. రెండవ భాగము లౌకికకాలికము. ప్రథమభాగమునందు వేదముల కాలమును గూర్చియు, నందలివిషయములనుగూర్చియు సూత్రములనుగూర్చియు, రామాయణాది పురాణములనుగూర్చియు, దర్శనములను గూర్చియు ననేకములైన చర్చలుగలవు. రెండవ భాగమున మహాకావ్యములను గూర్చియు, నాటకములను గూర్చియు, కవులనుగూర్చియు జాలవిషయములు కలవు. ప్రాచ్యభాషాపరీక్షలకుఁబోవు విద్యార్థులెల్లరును నీగ్రంథమును దప్పక చదువవలయునని మాయాశయము.

తేకుమళ్ల - రాజగోపాలరావు.

---

## భీమావ్యాపారము

క్రౌను పు. ౯౬. వెల రు. ౦-౪-౦. కర్త: శనివారపు సుబ్బారావు గారు, ఆర్గనైజరు అండ్ ఏజెంటు ఆంధ్ర ఇన్సూర్యెన్సు కంపెని లిమిటెడ్, కొవ్వూరు, పశ్చిమ గోదావరి జిల్లా. ఈ పుస్తకములో భీమావ్యాపారమునుగూర్చి తెలిసికొనగోరువారికి, కావలసిన విషయములన్నియు జేర్చబడియున్నవి. శ్రీయుత సుబ్బారావుగారు, ఎంతటిప్రయాసమునకైనను సహించి, శ్రమపడి, దేశీయ నాయకులు, రాష్ట్రీయ నాయకులు, అర్థశాస్త్రరాజకీయాదిశాస్త్రవేత్తలు మున్నగుసుప్రసిద్ధ మహాశయులను గలిసికొని, భీమాపద్ధతిపై వారి వారి

అభిప్రాయములగ్రహించి పాఠకుని ఉపయోగార్థమై ఈ గ్రంథమున ముద్రింపించి యున్నారు.

ముఖ్యముగా, ఆంధ్రదేశములో భీమాపద్ధతి అన నేమో ఎరుగనివారనేకులున్నారు. ఎరిగినవారున్నను, వారికి, ఈపద్ధతిపై నిరసనభావము ప్రబలియుండుటచే, మన ఆంధ్రరాష్ట్రమున భీమావ్యాపారము చాల వెనుక బడియున్నది. రెండు కోట్ల ఆంధ్రులకుగాను, ౧౩వేలర మంది మాత్రమే జీవితములను భీమాచేసిరన్నచో, ఈ విషయమున, మనమెంత వెనుకబడి యున్నామో విశద మగుచున్నదిగదా!

ఇతరదేశములతోఁ బోల్చిచూచిన, మన భారత దేశమే, ఈవిషయమున నెంతయో వెనుకబడియున్నది. గ్రేటుబ్రిటనులో ౪౫౧ భీమాకంపెనీలును, అమెరికా దేశమందు ౧౯౯౪ కంపెనీలునుగలవు. ఆదేశములకంటె పెద్దదయిన మన భారతదేశమందు ౭౬ భీమాకంపెనీలు మాత్రమే కలవనుట మిక్కిలి విచారకరము. ప్రపంచ మందున్న దేశములన్నిటిలోను మొత్తము మీద ౫౨౨౩ భీమాకంపెనీలున్నవి. మనము నిజముగా, మన దేశముగూడ ప్రపంచమందు ముఖ్యస్థానము నాక్రమించ వలయునని, అభిలషించుచో, ఈభీమాపద్ధతి విషయమై మన మెంతశ్రద్ధచేయవలయునో వేరుగ చెప్పనవసరము లేదు.

ఇట్లుండ, ౩౩ కోట్ల జనులకు నివాసభూమియైన భారతవర్షమందు ౭౬ భీమాకంపెనీలు మాత్రమే కలవు. ఇందులో ౨౬ కంపెనీలు విదేశీయులవే. ఈ కంపెనీల మూలమున, మనదేశమందున్న ధనము విదేశములలోని కెట్లు ప్రవహించుచున్నదో వేరుగ జెప్పనక్కరలేదు. ఇన్నిటికి మనదేశమున మనభారతీయ సోదరులేగదా ఏజెంట్లు! ఈపైవిషయమును వారు గమనించిన పిమ్మట గూడ, ఏజెన్సీల నింకను విడువకున్నారనుటకంటె విచారకరమైన విషయము మఱియొకటి యుండఁబోదు. మనదేశములో మొట్టమొదటి స్వదేశీభీమాకంపెనీ నేర్పాటుకావించినవారు కీర్తిశేషులగులాలాలజపతిరాయిగారు, వీరు స్థాపించిన లక్ష్మీఇన్సూరెన్సుకంపెనీని గాంచిరే, స్వదేశీ భీమాపద్ధతి అభివృద్ధిగాంచినది. నేటికా కంపె నీలసంఖ్య ౬౧వరకు పెరిగినది. ఇదిచాలదు. ప్రతిభారతీ యుఁడును తన జీవితమును భీమాచేయించవలయును. ఇం దుచే, స్వార్థమునకేగాక, దేశమునకుగూడ మహోప కారము గావించినవాఁ డగుచున్నాఁడు.

ఈ గ్రంథములో, ఆంధ్రభీమాకంపెనిలో భీమా చేయుపద్ధతిని సూచించు అనుబంధములు గూడ చేర్ప బడియున్నవి. ఇవి గాంచిన ఆంధ్రభీమాకంపెనీ లాభదా యకమయిన దనియు, అందులోని షరతులు సౌలభ్యము కలిగినవనియు తోపకమానదు.

అప్పుడప్పుడు, కృష్ణా, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలలో వ్రాసిన వ్యాసములలోని అంశములనే యెత్తి ఈ పుస్తకరూపమున రచించివారు. ఈ భీమా వ్యాపారము అనుగ్రంథము సుబ్బారావుగారికి దేశసే యందు గల అనురక్తిని జాటుచున్నది. పుస్తకము షుమారు 100 పేజీల గ్రంథమే అయినను, విషయబాహుళ్యము కలదిగనే యగుచున్నది.

ఈ గ్రంథమును రచించి శనివారపు సుబ్బారా గారు, ఆంధ్రుల కుపకారము సలిపినారు. ఈగ్రంథమును ప్రతి ఆంధ్రుడును జదివి, భీమావలన తన సొంతమునకును దేశమునకును, ఎట్టి మహోపకారము కలుగుచున్నది గ్రహించి, ఈ యుద్యమమును ప్రోత్సాహపరుప గో చున్నాము. శ్రీసుబ్బారావు గారు ఇట్టి ఉపయో కరములైన గ్రంథములను పెక్కిటిని ఆంధ్రభాషల రచించి దేశసేవయొనర్తురు గాక యని కోరుచున్నా

అమరవాది హనుమచ్ఛా

---

## దశావతారదండకము

గ్రంథకర్త: కలవకుంట శేషాచార్యులు, ఉం రము మునిసిపల్ హైస్కూలు ఉపాధ్యాయులు. చి పుస్తకము. పుటలు ౭౧. వెల ౦-౦-౯.

పేరునుబట్టి పుస్తకమునందలి విషయము యును. దండకరచనాసామర్థ్యము వీరికుండుట పుట తప్ప దీనివలన నిక నెట్టి ప్రయోజనము కానరా

ఇందు వీరి విచిత్రపదప్రయోగములు చూడదగును:

"హామ్నావశౌరంబు ప్రేమంబుతో దాల్చి"
"ధూమాశ్యంతరికేంబులన్"
"రహామహాద్య పాదంబుచే"
"క్షత్రియ శ్రేణిజినిన్ గొట్టి"
"శ్రీమైథిలీ పట్టణంబున్"
"రక్షాహాసీకమున్"
"శీర్ణంబులౌ చేలధారుఁడ్"

ఇట్టివి నిండుకు ఉన్నవి.

---

## చిప్పగిరిమాహాత్మ్యము, వచనము

(మూడవ కూర్పు)

గ్రంథకర్త: ప్రొద్దుటూరి నరసింగరావు గారు, బి. ఏ. గురుప్రసాద (లచ్చిరాజువీధి) వర్ల్పారావుపేట, కాకినాడ. ఫూల్ స్కేప్ ౨౦ పుటలు. వెల రు. ౦-౩-౦.

ఈ పుస్తకమునకు విజయదాసుల చరిత్ర అని నామాంతరము. ఈవిజయదాసు పురందరాది మాధ్వ మహానుభావులలో నొకరు. వీరిచరిత్ర, మాహాత్మ్యము ఇందు వివరింపబడినవి. చిప్పగిరి గుంటకల్లు జంక్షనుకు 3 మైళ్ళదూరమున నున్నది. మధ్వమతమువారి గ్రంథము జదువదగుదురు.

---

## బ్రహ్మచర్యము: వచనము

గ్రంథకర్త: కొమాండూరి సంపత్కుమారాచార్యులుగారు. క్రౌను పుటలు ౫౬. వెల రు. ౦-౪-౦.

విలాసము: బ్రహ్మచర్యాశ్రమము, పొన్నూరు, గుంటూరుజిల్లా. బ్రహ్మచర్యమును ప్రతిమానవుడును అవలంబింపవలెను. అందువలన మనశ్శరీరముల కారోగ్యము శోభగును, బుద్ధివికసించును. అప్పుడు మానవుడు ఆత్మకల్యాణమునకును, లోకకల్యాణమునకును ఉపకరింపగలడు. కావున బ్రహ్మచర్యమన నేమియో, దాని నెట్లు లాచరింపవలెనో తెలుసుకొను టావశ్యకము. అందుకీ గ్రంథము కొంత యుపయోగించును. శాస్త్రమును, అనుభవమును పురస్కరించుకొని పుట్టిన దీపుస్తకము.

---

## My Master. (నాగురువు)

దివాన్‌బహద్దూర్ డాక్టర్ సర్ రఘుపతి వెంకటరత్నమునాయుడు (కెటి, ఎం. ఏ., ఎల్. టి., డి. లిట్) గారి ౬౭వ జన్మదినోత్సవ సందర్భమున అతని శిష్యు డొకడు ౧౧-౧౦-౨౯ నాడు తన మిత్రులందరకును పంచిపెట్టుటకుగాను ఇంగ్లీషున ప్రచురించిన క్రౌన్ ౧౫ పుటల చిన్న పుస్తకమిది. మచిలీబందరునజన్మించి నోబుల్ కళాశాలయం దుపాధ్యాయులుగ నుండి ప్రశంసను బడసి, పిఠాపురము రాజావారి కళాశాలాధ్యక్షులుగ నుండి ప్రసిద్ధినొంది, చెన్నపుర విశ్వవిద్యాలయమునకు మొదట ఎన్నుకొనబడిన ఉపాధ్యక్షులుగనుండి కీర్తిగాంచిన శ్రీనాయుడుగారి నెరుగనివా రుండరు. మఱియు ఆదర్శ బ్రహ్మజీవనమును గడపుచు, సత్యనిరతికి, ధర్మకాంక్షకు, ఔదార్యమునకు, దానమునకు, భక్తిభావమునకు, వినయమునకు, సంఘసంస్కర్తృనాయకత్వమునకు వీరి నందరును గుర్తించి కీర్తింతురు. వీరి ఉపన్యాసములు, ఉపాసనలు, ధర్మప్రసంగములును ఎక్కడనో ఎప్పుడో అందరును వినియుండవలెను; అట్టి వీరి వ్యక్తిజీవనములోని కొన్ని ముఖ్యాంశములను, జనసామాన్యమునకు అల్పాంశములుగ కనబడువానిని కొన్నిటి నీ చిన్ని పుస్తకమునందు వివరించి వాని వలన వీరి గొప్పగుణములను గ్రంథకర్త మరియు స్పష్టీకరించెను. సాధారణముగ నందఱెరుఁగని చిన్ని చిన్ని విషయములు, వారి దుస్తుల మాదిరి, గృహజీవనమున సాధుపు మెలఁకువ సంగతులు తెలుసుకొనుటకు శ్రద్ధయు, ఆతురమును కలుగుచుండును. ఈ పొత్తము చిన్నదైనను దానియం దిమిడియుండు భావములు గొప్పవి. ఆదర్శపురుషుల జీవితవిశేషములు అవశ్యపఠనీయములు గదా! జ. బ్ర.

---

## The Next Rung (పైమెట్టు)

గ్రంథకర్త: కే. యస్. వెంకటరమణిగారు, 'శ్వేతారణ్యాశ్రమము, మైలాపూర్, మద్రాస్. క్రౌన్ 155పుటల గ్రంథము, ఫెదర్ వెయిట్ కాగితములపై చక్కని యచ్చు, అందమైన గట్టిబైండు, రేపరుకవరు, వెల రూ. 1-8-0.



(శ్రీ) కాళహస్తినగర దృశ్యము



(శ్రీ) కాళహస్తీశ్వర దేవాలయము





జనవరిలో గోదావరి అనకట్టమీదికి షికారు

ఈ మూడును శ్రీ యం. వి. సుబ్బారావుగారి ఛాయాచిత్ర

# ప్రకృతిచిత్రములు



ఉదకమండలమున 'బొటానికల్' తోట (Botanical Gardens)_పెరువు



పైకారా 'డేము' (Dam)



పైకారా జలపాతము

శ్రీ ముద్దుకృష్ణగారి చిత్రములు

వశీనవానిని విడిచిపుత్తము. జీవనముయొక్క బాహ్య అధికారమునుగాక అంతశ్శక్తులపై యధికారమును సంపాదించుకొనవలెను; క్షణభంగుర మగువానిని విడిచి శాశ్వతమగువానిని, గ్రహింపవలెను. ఆచరణాభ్యాసములలోనికి వస్యమగు దానిని, ఆత్మయుతమగుదానిని, స్వార్థదూరమగుదానిని, మహనీయమగు దానిని జీర్ణించుకొనుడు—ఈ మొదలగునవి గ్రంథకర్త మొదటిభాగములో వ్రాసిన కొన్ని అభిప్రాయములు మాత్రము.

64 పుటలుగల రెండవభాగమున అభ్యుదయ భారతదేశముయొక్క ప్రబోధమునుగూర్చి వ్రాయబడినది. భారతవర్షముయొక్క స్థానము-కర్తవ్యము, భారతదేశమున కిప్పుడున్న లోప మేది, సాంఘూతికాధిపత్యమా, ఏకచ్ఛత్రాధిపత్యమా, భారతీయసంస్థానములు-బ్రిటిషు ఇండియా, భారతీయగ్రామము, స్వరాజ్యభరతవర్షముయొక్క కొన్ని సమస్యలు, ఆశయసాఫల్యము, భారతదేశమునకు స్వరాజ్యవిధానము అనుశీర్షికల క్రింద 8 అధ్యాయములుకలవు. నేటి ప్రపంచమంతయు రాజకీయైక్యమే పరమావధిగ ప్రాపించుటకు వాంఛించుటలేదు. జీవనసంస్కృతి యొక్క జ్ఞానవిషయమైన-ఆధ్యాత్మికవిషయమైన ఐక్యము ఏకీభావము - అద్వైతము - నెలకొనుటకు ఆశించుచున్నదియని ఈభాగము తొలుత ప్రస్తావింపబడినది. భారతదేశసంప్రదాయమున నెప్పుడును రాజకీయప్రాభవముకంటె వేదాంతతత్త్వజ్ఞానమునందలి వాంఛయే ఎక్కువగనుండుట యొక్క మహత్తునుగూర్చి వివరింపబడినది. ప్రపంచమున నెప్పుడును ఏకవ్యక్తి పాలనము, ఏకచ్ఛత్రాధిపత్యమును మేలుచేయజాలి యుండలేదనియు భారతీయతత్వమున కది యసలేసరిపడదనియు సాంఘూతికపద్ధతినే రాజ్యము జరుగవలెననియు బోధింపబడినది. మొత్తము భారతదేశలాభము కొఱకు సంస్థానాధిపతులు కొంతత్యాగముచేసి పైకిరావలెననియు ఆంగ్లప్రభుత్వమువారి చేతి కీలుబొమ్మలుగాక దేశసౌభాగ్యమునెంచి జాతీయతను పెంపొందించువారుగాక యనియు కోరబడినది. భారతీయగ్రామములోని-కార్యనిర్వహణమున్ను, పౌరజీవనమునే [illegible] ప్రభుత్వమునకు సాదర్శప్రాయముగ నుండవలెనని చెప్పబడినది. గ్రామమే దేశమున కాయువుపట్టు, పంటల గాదియని మరల మరల పేర్కొనబడినది. వ్యవసాయ సంబంధమైన ఋణములను వదలించుట, జనసామాన్యమునకు విద్య, సైనికదళవ్యయము బాగుగా తగ్గించుట లేక మానుట, ప్రభుత్వ నిర్వహణ వ్యయమును పెక్కురెట్లు తగ్గించుట, అత్యంత-ఉన్నతోద్యోగికి నెలకు వేయిరూపాయిలకంటె నధికమీయకుండుట—ముఖ్యమని తెలుపబడినది. గ్రామసంఘము, పంచాయతీ, జిల్లాకార్యనిర్వాహకసంఘము, రాష్ట్రీయసంఘములు, కార్యనిర్వహణము, భారతీయ సమాఖ్యసభ-ఇవి ఒకటిపై నొకటిమెట్లుగా ప్రభుత్వము జరుగవలెననియు, క్రమముగ మధ్యమెట్లు నెమ్మదిగ తొలగిపోయి గ్రామపంచాయతీ గ్రామమును నిర్వహించుచు నానారాజ్యసమితి రాజ్యములను నిర్వహించుచు నుండవలెనని-ఒకరిపై నొకరు రాజ్యమేలు పద్ధతి పోవనే వలయుననియు నొక్కి చెప్పబడినది. స్వతంత్రభావము అందరు వ్యక్తులలోను అన్ని గ్రామములలోను కలిగి ఉన్నశాస్త్రపరిశోధనల వలన చేర్పడిన పరికరములను పనుముట్లను పోష్యమున కుపయోగించుకొనుచుండియు యంత్రసాధనల నాగరికతయందు వ్యామోహము తొలగి బ్రహ్మానందము నిచ్చు పరమశాశ్వతవస్తువును గూర్చిన వాంఛను వృద్ధిచేసికొను నవకాశములను గూర్చి చెప్పుటతో నీగ్రంథము ముగింపబడినది. అనుబంధముగ చేర్చిన ప్రపంచములోని 42 ముఖ్యదేశముల వైశాల్యమును, జనసంఖ్యయు, ప్రభుత్వాదాయమును తెలుపు పట్టిక రాజకీయలోకజ్ఞానమునకెంతయు తోడ్పడును. చివరమునకు తలకొకటికి 6 ఆకాలపుంతు ప్రపంచమంతటను గల మానవశక్తి దుర్వినియోగమును పట్టి ప్రభుత్వముల వలని నష్టము మాపించుకొనుడు అని యీ అనుబంధము తుదిని స్పష్టీకరింపబడినది.

మొత్తమున ప్రపంచముయొక్కయు, భారతదేశముయొక్కయు ఆది చరిత్రమునుండి ఆధునిక నాగరికతా చరిత్రమువరకు నుండు పరిస్థితుల పరిణామముల వర్ణించుచు నవీననాగరికతను గూర్చిన నిర్మాణాత్మకమైన ఆలోచనను కావించు నీగ్రంథము ఆదర్శ సారస్వత, ఆర్థిక రాజ

, ఆధ్యాత్మిక విషయాలయొక్క ఆదర్శ పరిస్థితుల నూ టకుతో వ్వడుచున్నది. ఋషులును, దీర్ఘదర్శులును తీయ సంప్రదాయములపై నిర్మించిన విధానమును పుర రించుకొని ప్రపంచశాంతికిని, అంతర్జాతీయ సౌమ స్యమునకును దారిచూపు నీ 'పై మెట్టు' నందికొని బుద్ధి లు లందరును మీదికి పోగలరు. జ. బ్ర.

## ముత్యాల సరములు—చిన్నకథలు

గ్రంథకర్త: (కీ. శే.) గురజాడ వెంకటఅప్పా గారు, బి. ఏ., ఎఫ్. ఎమ్. యు; ప్రకాశకులు: గురజాడ వెంకట రామదాసుగారు, విజయనగరము. డెమ్మీ ౧౬ సైజు. ౧౧౧ పుటలు. వెల తెలియదు.

చాలకాలము క్రిందటే ప్రకటితములైన ఈసంపుట ములోని కొన్ని ఖండకావ్యాలద్వారా శ్రీఅప్పారావు గారు తమసంస్కార ప్రియతకు ఒకవంక కొంత వాదరాలను, వేఱొకవంక కొంతనిరసనను సంపా దించుకొన్నారు. నేటి తెలుగువాఙ్మయపు క్రొత్తపో కడ బీజాలు, మూలనలు వీరికవిత ధరించి ఉన్నది. నేటి సారస్వత పరివర్తనానికి వీరిఆకాంక్ష వీరికవితలో స్పష్టము.

యాదృచ్ఛికమైన స్వప్నోల్లేఖనముచేత గాక, ఆవేశవిస్ఫోటనముచేత గాక, బుద్ధిపూర్వకముగా విప్ల వము, పరివర్తనము అవలంబిస్తుంది వీరి సారస్వత రచనోద్యమము. కనుకనే కాబోలు, ఈకావ్యాలలో తేజము, సారము అపూర్ణములు.

శక్తిచేతగాని, పరిమాణముచేతగాని ఈకావ్య ములు—అన్నికావ్యాలూ తొలుతనే ప్రకటింప బడి నా—ఆధునికవాఙ్మయానికి అధినాయకత్వము వహింపలేదు. అయితే ప్రకటితములైన 'లవణరాజుకల' మొదలైనకావ్యాలు తమ ప్రోద్బలముచేత ఒకనూత నమైన అభిరుచి వాఙ్మయములో రేకెత్తింపక పోలేదు. నూత్నకవితకు పథప్రదర్శనమే చేసినవి. వీరి తేజస్వి అయిన ప్రతిభ 'ముత్యాలసరము' అనే క్రొత్త ఛందస్సు ప్రవర్తింపజేసి శాశ్వతఖ్యాతి గడించుకొన్నది. ఈఛందస్సు వీరు చేర్పుతో—ముఖ్యముగా కథనకావ్యా లకు— వినియోగించి దీనిఅందమునూ, ఆమూల్యమునూ ప్రదర్శించినారు. తరువాతి యువకవులచేత పోలుపులు దిద్దిన ఈ 'ముత్యాలసరము' తొలుత వీరిచేతమాత్రము నియమాగపుసౌందర్యము కొంత కొఱవడినమాట నిజము. అయితే చిరకాలమునుండి వాఙ్మయములో అవలంబన ము పొంది ఉన్న ఉత్కటనియమాల నిరంకుశతకు ఎదు రొడ్డి నిలిచి వీరు తమనుడికి 'ఒక విప్పులవిడిఅయిన, సున్నితమైన ఛందస్సు లలితసంగీతములో కలయించు కోవలెనని పూనిన సంకల్పమే ఈయతినియతికి బాధ్యము కావలెను. ఇంక, 'పాటివా రోదార్చ' వంటి వాక్య దోషాలుకూడా రచయిత లక్ష్యపెట్టలేదు. శైలిలో అసం స్కృతి వీరి సంస్కారలాలసకు ఒప్పినది— జాతీయత తీసి విలసిల్లి వంతనలకు—ఉత్సుకతలో కొంత అతిక్ర మించినకూడా. ఈ ఉల్లంఘనానికి అతిగా ప్రేరేచిన ఒక స్వాతంత్ర్యము వీరికి సహజమై, పులకరించే కవితాలో కనపటిమలోని కొఱతల నాక్రమించి, ఇంచుమించు వీకా వ్యానికే సమగ్రత పూర్చుకొనేనిట్టు కుదురనీయలేదు కాబోలు.

అయినా, 'లవణరాజుకల', 'కన్యక'; 'డామన్ పితియస్' మొదలైన కథన కావ్యాలలో స్వల్పమై భాషానియమాలచేత సహజమధురమైనవీరి శైలి మధుర తరమయినది తరుచు. దీనికి తోడు, వాడుకభాష అన్నందులకు, చక్కని నుడికారము, జా యలు, స్వాభావికత ఒప్పిఉన్నవి. సంభాషణ భా లలో నాటకాచిత్య సౌందర్యాలు తులకిస్తవి. వాడు పట్టు సహజముగా, సమ్మతముగా విలసిల్లుతుంది. క ములో జీవము పొంగుతూ ఉంటుంది. 'పూర్ణమ్మ'ల ఆడపిల్లల పాట మన మధురకవితల పోకడలలో తీక చిలికి, సందర్భ మెఱిగిన నుడితో, కన్నెవలె పవిత్ర జాలికథతో పాఠకుల సానుభూతిని చూఱకొంటున

క్రొత్తభావాలతో సుకుమారముగా సత్యా త్యనిరూపణచేసే భాగాలు రచయిత కళారహస్యా ర్యానుభవము వెల్లడిస్తూ ఉన్నవి.

